# కాలకన్య

రచన:

నండూరి విఠల్

పబ్లిషర్స్:

వైజయంతీ పబ్లికేషన్స్

5579 చార్లెస్ స్ట్రీట్, సికింద్రాబాదు.

స్వర్గీయ

బుచ్చిబాబుకు

భక్తితో

# పాఠకునికి రచయిత లేఖ

ప్రియమైన చదువరీ!

ఈ నవల వ్రాయడానికి ఓ కథ వుంది.

గడచిన సంవత్సరం నేను 'సీతాపతి' అనే సీరియల్ నాటికను పది భాగాలుగా వ్రాసి ఆకాశవాణి - హైదరాబాద్, విజయవాడ కేంద్రాల ద్వారా ప్రసారం చేయడం జరిగింది.

ఉద్యోగరీత్యా అనేక పనుల తొందరవల్ల, ఒక పథకం ప్రకారం కథ రూపొందించి, నాటకాన్ని తయారుచేయడం జరగలేదు. ఏ వారానికి ఆ వారం అప్పటికప్పుడు తోచిన విధంగా, ఆ భాగం వ్రాసి, ప్రసారం చేస్తూ వచ్చాం.

ఏమైనా ఆ సీరియల్ నాటకం శ్రోతల్ని విశేషంగా ఆకర్షించింది. వేల సంఖ్యలో దేశం నలుమూలలనుండీ శ్రోతల అభిప్రాయాలు అందుకోవడం జరిగింది.

అప్పుడనిపించింది.

ఒక ప్లాను ప్రకారం కథ రూపొందించి నాటకాన్ని తయారుచేస్తే యింకా బాగుండేదని. అందుకు కథ వ్రాయడం మొదలుపెట్టాను. అది అలా అలా పెరిగి ఒక పెద్ద నవలై కూర్చుంది?

ఎలాగూ వ్రాయడం జరిగింది గనక, అచ్చువేయడం కూడా జరిగింది.

'మన తెలుగు దేశం చాలా గొప్పది.'

తెలుగు వాళ్ళం గనక అలా అనుకోవడం మర్యాద. 'రచనా వ్యాసంగం ఏ రచయితకూ తెలుగుదేశంలో అన్నం పెట్టదు' అని ఎవరన్నా అంటున్నా, వినీ విననట్టు చాలామంది వ్రాస్తూనే వున్నారు.

ఈ సంగతి ఎలాగైనా, పదిమంది పాఠకులతో ఆలోచనలూ, ఆశలూ, ఉద్రేకాలూ, ఉద్వేగాలూ పంచుకోవడంలో ఏ రచయితకైనా, నిస్సంశ

యంగా అనిర్వచనీయమైన ఒక ఆత్మ సంతృప్తి మిగులుతుంది. దాని విలువ తూకం వేయగల, పడికట్టురాళ్ళు ఏ బజారులోనూ మనకు దొరికేవి కావు.

అటువంటి సంతృప్తికోసమే ఈ నవల మీ ముందుంచుతున్నాను.

'కాలకన్య' అని పేరుపెట్టాను దీనికి. కాలాన్ని కన్యగా రూపక సమాసం చేయడం సంప్రదాయం కాదన్నారు కొందరు మిత్రులు.

'ఫర్వాలేదు, ఆచార్య దండి అంగీకరించాడు' అన్నారు శాస్త్రిగారు.

మన సిద్ధాంతం ప్రకారం 'కాలం' అఖండం, అవిభాజ్యం, అనంతం. కాలాన్ని మహాపురుషుడుగానూ, సర్వజ్ఞుడైన శంకరుడు మహాకాల స్వరూపుడుగానూ చెప్తున్నది మన ప్రాచీన సంప్రదాయం.

కాని—

పెద్దలు చెప్పిన మరొక మాటకూడా వుంది.

సర్వ చరాచరజగత్తూ, దేవతలూ, స్త్రీమూర్తియైన ఆదిశక్తి యొక్క లీలావిలసితంగా, ఆమె కనుసన్నలలో మెలగుతున్నట్లు కూడా చెప్పారు. 'ఆ పరాశక్తి యొక్క సామర్థ్యం ఎవరికైనా అజేయమే' అన్నారు.

'కాలం' కూడా అటువంటిదే గదా!

మనిషి జీవితం మీద కాలానికున్న తిరుగులేని అధికారం ఎటువంటిదో ఈ కథలో చెప్పటానికి ప్రయత్నించాను. ఆ అభిప్రాయంలోనే పరాశక్తి సామ్యంగల స్త్రీమూర్తితో కాలాన్ని పోల్చటం న్యాయమనిపించి దీనికి 'కాలకన్య' అని పేరు పెట్టాను.

కాగా—

పాఠకులకు ఒక మనవి.

చదివిం తర్వాత – మీ అభిప్రాయాలను నిర్మొహమాటంగా నాకు తెలియజేస్తే – హృదయపూర్వకమైన కృతజ్ఞతలతో అందుకోగలనని విన్నవించుకుంటున్నాను.

1-8-1967
ఆకాశవాణి
హైదరాబాద్.

మీ వాడు,
నందూరి విఠల్

# ఒకటి

కరుణాకరానికి ఆనాడు లభించిన స్వాగతం చాలా చిత్రమైందనే చెప్పాలి. ఆ ఊరు అతని స్వగ్రామం. ఒకనాడు అక్కడ నిలవటానికి నీడలేకనే కట్టుగుడ్డలతో లేచిపోయాడు. పది సంవత్సరాల తర్వాత ఆ ఊళ్ళో అడుగు పెట్టాడు. ఊరు ఊరంతా కదలివచ్చి అతనికి స్వాగతం చెప్పింది. ఆ ఊరికి అంతకుముందు పెద్దవాళ్ళు చాలామంది వచ్చారు. స్వాతంత్ర్యం వచ్చాక అడపా దడపా మంత్రులు రావడం, పూలదండలు వేసి స్వాగత వాక్యాలు చెప్పడం ఆ ఊరికి బాగా అలవాటైపోయిందికూడా. నిజానికి స్వాతంత్ర్యం రావడానికి పధ్నాలుగు సంవత్సరాల క్రితం గాంధీగారు కూడా ఆ ఊరు వచ్చారట. అప్పుడు నూలుదండలు వేసి, చేతితో వ్రాసిన సన్మానపత్రాలు సమర్పించారు. ఏమైనా అంతకుముందు ఆ ఊళ్ళో జరిగిన స్వాగత సభలు వేరు. కరుణాకరానికి లభించిన ఆదరణ వేరు. అనేకమంది గొప్పవాళ్ళకు బ్రతికుండగా గౌరవం లభించకపోవచ్చు. అంతకుమించి బ్రతికిన రోజుల్లో అతగాణ్ణి ప్రపంచం చీదరించి, అవమానించి, అనుమానించి చిత్రహింసలకు గురిచేయవచ్చు. అతడు మరణించాక శిలావిగ్రహాలు వేయించనూవచ్చు. కాని కరుణాకరానికి బ్రతికుండగానే అటువంటి ఆదరణ లభించింది. ఇందులో ఇంకా ప్రత్యేకతలున్నాయి. చాలామంది మహాత్ములకు ఉన్న ఊళ్ళో గౌరవం దొరకదు. ఇదొక చిత్రమైన మనస్తత్వ మంటారు. పెరటి మొక్క మందుకు పనికిరాదనీ, పొరుగింటి పుల్లకూర రుచి ఎక్కువనీ చాలా సామెతలున్నాయి. చాలామంది మహాత్ములు ఉన్న ఊళ్ళో చవటలనే పిలవబడ్డారు. బయటి ప్రపంచం అతగాడి గొప్పతనాన్ని మొదట గుర్తించి, తమ పొగడ్తలతో అతనికి పనిలేదనే నమ్మకం కుదిరిన తర్వాతనే, ఉన్న వూరివారు ఆయన్ను గుర్తించి బ్రహ్మరథం

పట్టటం జరగవచ్చు. కాని కరుణాకరం విషయంలో ఇదికూడా నిజం కాదు. అతనికి ఉన్న ఊళ్ళోనే అటువంటి గౌరవం లభించింది.

కరుణాకరం విషయంలో మరొక ప్రత్యేకతగూడా వుంది. తల నెరసినవాళ్ళను గౌరవించినట్లు లోకం కుర్రకారును గౌరవించదు. ఎంత గొప్పపని చేసినా, "అ! ఏదో కుర్రాడు పైకొస్తాడు, ఫర్వా లేదు" అంటూ ఆశీర్వదిస్తారు కొందరు తలలు నెరసిన పెద్దలు. తమ ఆశీర్వచనాలతో అతనికి మేలుజరిగే ప్రమాదంలేదనే సంతృప్తి కలిగిన తర్వాతనే వారు తమ అవ్యాజానురాగాన్ని ఆ కుర్రవాడి నెత్తిమీద కుండలకొద్దీ వర్షించడం జరుగుతుంది.

కాని—

అతని స్వగ్రామం అది.

అతనింకా చచ్చిపోలేదు. యిప్పట్లో యిహలోకం వదలి పోయే వయస్సుగూడా కాదు. "ఇంకా కుర్రవాడు పాపం"!

ఊళ్ళో కాలుపెట్టగానే వరదాచార్యులుగారు ఆ విషయం గుర్తుచేస్తూ మహాజనాన్ని ఉద్దేసించి "కరుణాకరం నిన్నటివాడు కదూ! మా వసంతా ఇతనూ అరుగులమీద ఆడుకుంటూ వుండేవారు" అన్నాడు.

కరుణాకరానికి బాల్యం గుర్తుకువచ్చింది. తనకు వసంత గుర్తే. కాని ఆమెతో కలిసి, ఆయనగారింటి అరుగులమీద ఆడుకున్న గుర్తు మాత్రం లేదు. వరదాచార్యులవారి మాటలు విని తెల్లమొహం వేశాడు కరుణాకరం. "ఎప్పుడు మీ వసంతతో ఆడుకుంది మీ అరుగులమీద ?" అన్న ప్రశ్న ఆ చూపుల్లో ఉందని కంగారుపడి, "ఏదే ళ్ళయిందిగా మర్చిపోయి ఉంటావులే" అన్నాడు ఆచార్యులవారు. 'కాబోలు' అనుకున్నాడు కరుణాకరం. నిజానికి తను అరుగులమీద

ఆడుకుంది విశ్వపతిగారి పెద్దమ్మాయి కళ్యాణితో. కళ్యాణిని గురించిన ఆలోచన రాగానే అతడు త్రుళ్ళిపడ్డాడు. విశ్వపతి మాష్టారు కనిపించలేదు. ఆయన లేకపోతే అంతా వెలితిగానే వుంది. బయట కోలాహలంగా ఉంది. హైదరాబాద్‌లో రవీంద్రభారతి ఎలాగో ఆ కానుకొలను గ్రామంలో రావిచెట్టు అలాగ. దానిముందు మంటపం కట్టించారు వరదాచార్యులుగారి తాతగారు. సభలకూ, సమావేశాలకూ అదే ప్రధానవేదిక ఆ గ్రామానికి. అటువంటి దయకూ, గౌరవానికీ అలవాటుపడ్డ ప్రాణంకాదు కరుణాకరానిది. తనకు తెలియకుండానే కళ్ళవెంట నీళ్ళు వస్తున్నాయి. పూలదండలు మోయలేనంత బరువుతో పడ్తున్నాయి. కళ్ళల్లోని నీటిపొరతో అందరూ మసక మసకగా కనిపిస్తున్నారు. మనుష్యులు ఎదుటమనిషిని ఇంత ప్రేమించగలరా ? అనే అనుమానం కలిగింది. కాని తాను కంటున్నది కలగాదు. అంతా ప్రత్యక్షంగా కళ్ళముందు జరుగుతూంది. మునసబుగారు అధ్యక్షత వహించారు ఆ సభకు. ఎవరికివారే ఉపన్యాసాలివ్వాలనే ఉత్సాహంతో ముందుకు వస్తున్నారు. "పాపం ! ప్రయాణంచేసి వచ్చాడు హైదరాబాద్‌నుంచి. త్వరగా సభ ముగిద్దాం. యింక విశ్రాంతి అవసరం" అంటూ ఆయన హెచ్చరిస్తూనే వున్నాడు. విశ్వపతి మాష్టారేమైనట్లు ? ఎందుకు రాలేదు సభకు ?" ఆలోచిస్తున్నాడు కరుణాకరం.

రాఘవయ్య ఒక వెండి మరచెంబునిండా చల్లతెచ్చి గ్లాసులో పోసి అందించాడు కరుణాకరానికి. అంతమంది పెద్దలముందు—కుర్చీలో కూర్చొని చల్లత్రాగడం తప్పనిపించి వద్దన్నాడు. తలోక మాటా అన్నారు. "తాగు బాబూ!" అన్నారు వరదాచార్యులవారు. "పోనీ కొబ్బరి బొండాలు కొట్టించనా?" అన్నాడు మున్సబుగారు. తాను సమాధానంచెప్పే పరిస్థితిలో లేడు. కాని తన సమాధానం ఎవరికి కావాలి ? పరిగెత్తాడు మున్సబుగారి పాలేరు ముత్తయ్య.

కాలప్రభావానికి లొంగని మనిషి లేడంటారు. ఈ పదేళ్ళల్లో అందరూ కాస్తో కూస్తో మారారు. కాని ముత్తయ్యలో రవ్వంతమార్పు కని పించలేదు. అదే బక్కపల్చటి శరీరం. అవే మీసాలు. అదే క్రాఫు. అదే పిలక. కొత్తపాతల మేలి కలయికలా ముందు క్రాపునూ, వెనకాల పిలకనూ పోషిస్తున్న నాగరికతల వంతెన ముత్తయ్య. విశ్వపతి మాష్టారిలో ఎటువంటి మార్పొచ్చిందో? రాఘవయ్యమాత్రం బాగా మారిపోయాడు. అంతకుముందు ఊరికి కరణం - మునసబులున్నా, రాఘవయ్యే నిజమైన నాయకుడు. ఆయన మాటకు తిరుగుండేదికాదు. "అన్న మాట నిలబెట్టుకునేవాడు" అనే పేరుకూడా వుండేది. ఆ ఊళ్ళో మొదట మిడిల్ స్కూలు పెట్టించిన ఉదారుడు రాఘవయ్యే. అందు లోనే తాను థర్డ్ ఫారంవరకూ చదువుకున్నాడు. అంతటితో ఆ ఊరితో తన ఋణం తీరిపోయింది.

'నా స్కూలులో చదువుకుని యింత పెద్దవాడివయ్యావంటే నాకెంత బ్రహ్మానందంగా వుందని?' అంటూ కౌగలించుకుని మజ్జిగ గ్లాసందించాడు రాఘవయ్య. విశ్వపతి మాష్టారేరి ? అని ఎవర్నో అడిగాడు కరుణాకరం. "ఆరోగ్యం బాగాలేదు. పెద్దవాడై పోయాడు పాపం—" అన్నారు.

"ఆ స్కూలుమీద అభిమానం నిలిపి కరుణాకరం హైస్కూలు చేయించడానికి యాభై వేలు విరాళ మిచ్చాడంటే— అదీ రాఘ వయ్య చలవే" అన్నాడు వరదాచార్యులుగారు.

ఉపన్యాసకులు ఏం చెబుతున్నారో కరుణాకరానికి పూర్తిగా అర్థంకావడంలేదు. సగం సగం వినిపిస్తున్నాయి. కళ్యాణికోసం వెతుకుతున్నాయి అతని కళ్ళు. కళ్యాణి వచ్చిందా ఈనాటి సభకు ? తనకు జరుగుతున్న గౌరవం చూస్తే ఏమనుకుంటుంది ? కనిపించదేం ? ఆడవాళ్ళంతా ఒకప్రక్కన కూర్చున్నారు. ఒకటికి పదిసార్లు అటు

చూడటం మర్యాదు కాదు  కాని మనస్సు ఆగటంలేదు. ఇంతకీ అసలు వూళ్ళోవుందా కళ్యాణి ? ఉంటే కనిపించదేం ? మున్సబుగారి పాలేరు కొబ్బరినీళ్ళు గ్లాసుల్లో పోసుకొచ్చాడు. సభకు విశ్వపతి మాష్టారూ రాలేదు, ఆయన కూతురు కళ్యాణీ రాలేదు.

''తీసుకో కరుణాకరం" అని మున్సబుగారు పిలిచేదాకా అతనీ లోకంలోకి వూడిపడలేదు. ''వద్దండీ! మజ్జిగ తాగానుగా'' అన్నాడు పరధ్యాన్నంగా. "తాగుబాబూ! ప్రయాణంచేసి అలసిపోయి వచ్చావు'' అన్నాడు గ్లాసు అందిస్తూ మున్సబుగారు.

అవసరం లేకపోయినా మొహమాటంకొద్దీ తాగేశాడు. సభలో దూరంగా ముత్తెం కనిపించాడు. మనిషి బాగా మారిపోయాడు. అప్పటి తన ప్రాణస్నేహితుల్లో ముత్తెం ఒకడు. కాలవలో పడి ఈతలు కొట్టటంలో చాలా చురుకైనవాడు. బాగా ఎదిగాడు. ఏం చేస్తున్నాడో ? తండ్రిలా పాలేరై ఈ దిక్కుమాలిన దేశానికి పట్టిన ఆహారపు కొరతను నివారిస్తున్నాడేమో! చిన్నప్పుడు కల్యాణిని చెరువులోకి తోసింది వాడే. మళ్ళీ మునిగిపోతుంటే, దూకి జడ పుచ్చుకు లాక్కొచ్చి గట్టున పడేసిందీ వాడే, ఆనాటి పోట్లాట గుర్తుకొచ్చింది.

ఆడపిల్లలంతా అట్లతద్దికి అన్నా బువ్వాలాట ఆడుతున్నారు. తాటాకు బొమ్మలు చేసి పేర్లుపెట్టి పెళ్ళిళ్లు చేస్తున్నారు.

"ఈ పెళ్ళికొడుకెవరు ?" అంది ఒక అమ్మాయి.

"నీ పెళ్ళికూతురుకు తగినవాడేలే" – మరో గొంతు.

"నా పెళ్ళికూతురు రంభలావుంది."

"నా పెళ్ళికొడుకు మన్మథుడులా వున్నాడు."

"కాదు కోతిలా."

"కాదు ముత్తెంలా ?"

"ఏ ముత్తెం ?" అంది ముత్తెం చెల్లెలు లచ్చి.

"మీ అన్నయ్యే అనుకో—చీమిడి ముక్కు కనిపించడంలా?" అంది మరో గొంతు.

ఆ మరో గొంతు కల్యాణిది.

"అవసరమొస్తే ఆ చీమిడిముక్కు వాణ్ణే చేసుకుంటావ్" అంది లచ్చి.

"నాకా గతేం పట్టలా ?" అంది కల్యాణి.

"మా కల్యాణి కావాలనుకుంటే కరుణాకరాన్నే చేసుకుంటుంది తెలుసా ?" అంది కరణంగారి కూతురు కామాక్షి.

"అ కరుణాకరంగాణ్ణి తన్ని గద్దలా కల్యాణిని ఎత్తుకుపోయి సముద్రంలో పారేస్తాడు మా ముత్తెమన్నయ్య తల్చుకుంటే" అంటూ తాటాకు బొమ్మని లాక్కుని యింటికి పారిపోయి అన్నకు చెప్పిందట లచ్చి. ముత్తెంకు చిన్నప్పటినుంచీ తన్నులాటలంటే సరదా. మర్నాడు చెరువుగట్టుకు బంకమన్ను తెచ్చుకుంటానికి కల్యాణి వెళ్ళింది. ముత్తెం వస్తూనే కల్యాణిని చెర్లోకి తోశాడు. చచ్చిపోవలసింది. నాలుగు గుటకలు వేశాక బయటకు లాగాడు ముత్తెం. జరిగిన కథంతా తర్వాత తెలిసింది అందరికీ. కల్యాణిని చచ్చేలా చింతబెత్తంతో బాదారట విశ్వపతి మాష్టారు.

"ఏం పోయేకాలం ఈ కుర్రకారుకి. యింకా వోణీలు సరిగ్గా వేసుకోటం తెలియదు. పెళ్ళి కబుర్లెందుకు ఈ పాడుముండలికి" అంటూ అందరినీ తిట్టాడు పంచాయితీ చేసిన రాఘవయ్య. ఏ తీర్పు చెప్పాలో తెలియనప్పుడు అందరినీ తిట్టి పంపటం అతని కలవాటు. ఆనాటి కచ్చట ఆడపిల్లల్లో చాలాకాలం పోలేదు. కల్యాణిని అందరూ "కరుణాకరం" అంటూ ఏడిపిస్తూండేవారు.

పెద్దపెట్టున చప్పట్లు వినిపించాయి. సభ అయిపోయింది. ముత్తెందగ్గరకు బెదురుతూ బెదురుతూ వచ్చాడు. "ఏరా బావున్నావా ?" అన్నాడు కరుణాకరం.

"మీ దయండి బాబుగారూ ?" అన్నాడు ముత్తెం.

ఇంత మర్యాదగా మాట్లాడటం ముత్తేనికి ఎప్పుడలవాటయిందో అంతు చిక్కలేదు కరుణాకరానికి. చిన్నప్పుడు ఇద్దరూ ఏరా అంటే ఏరా అనుకునేవారు. "పాలేరు వెధవతో ఆ సావాసమేమిటి" అంటూ అమ్మ తిట్టేది. కాని ముత్తెమంటే అతని భుజ బలం చూసి కుర్రకారంతా గౌరవించేవారు.

"పద బాబూ" అన్నాడు మున్సబుగారు.

"మా యింట్లో అందరూ ఎదురు చూస్తున్నారు. వంటలయ్యాయి" అంటూ రెక్కపుచ్చుకు లాగుతున్నారు వరదాచార్యులుగారు.

"ముత్తెం ఒకసారి అలారా ? రాజారావేడీ ?" అన్నాడు బాల్యస్నేహితుడి భుజంమీద చేయివేసి కరుణాకరం. రాజారావూ, ముత్తెం, కరుణాకరం ఒక జట్టుగా ఉండేవారు. తెలుగు సాహిత్యంలో కవిత్రయాని కున్నంత గాఢ బాంధవ్యం వారిది.

ఆనాటి వరదాచార్యులగారింట్లో కరుణాకరం బస. వసంత వచ్చి నమస్కరించి "గుర్తున్నానా కరుణాకరం" అంది.

"అదేమిటమ్మా. ఆ రోజుల్లో అస్తమానం అరుగులమీద ఆడుకునేవారూ" అన్నాడు వరదాచార్యులు.

"ఏ రోజుల్లో నాన్నా" అంది చిలిపిగా వసంత.

కరుణాకరం నవ్వుకున్నాడు. వసంత పాదరసంలాంటిదని తెలుసు. కాని యింకా పదునెక్కింది.

"అదేమిటి వసంతా! ఎలా మర్చిపోతాను!"

వసంత చాలా మారింది; నాగరికత అంతదూరం ప్రయాణం చేసి, ఆ కుగ్రామం కూడా ప్రవేశించి భరతనాట్యం ప్రారంభించిందని ఊహించలేకపోయాడు. దోవలో టూరింగ్ సినిమాహాలు కనిపించింది. "ఈ సృష్టిలో ప్రతిదానికీ ఒక ప్రయోజనం ఉంది" అంటారు పెద్దలు. రెండు జడలు వేసింది వసంత. వళ్ళు సగం కనిపించే నైలాను చీర కట్టింది. భుజాలు కనిపించే చోళీ. ఇంట్లోగూడా చెప్పులతో కనిపించింది. జుట్టు కొంచెం రేగింది. ఆ ముంగురుల చిందర వందరలో ఓ క్రమంవుంది.

"చాలా గొప్పవాడి వయ్యావట? గుర్తున్నామా అని" అంది పెదవి కొరుక్కుంటూ.

వరదాచార్యులగారి గొంతు, దేముడి గదిలోంచి శ్లోకాలు చదువుతూ బిగ్గరగా వినిపిస్తూంది.

"గొప్పంటే ఏమిటి వసంతా?"

"నీకు చెప్పేటంత పెద్దదాన్ని కాదు నేను. నేను చెపితేగాని తెలుసుకోలేనంత బుజ్జిబాబువూ కాదు నువ్వు" అంటూ పకపక నవ్వింది.

"కాళ్ళు కడుక్కో నాయనా" అంది ఆచార్యులవారి భార్య చెల్లాయమ్మగారు.

భోజనాలు వడ్డిస్తున్నంతసేపూ చెల్లాయమ్మగారు చెబుతూనే వుంది. "మీ అమ్మా నేనూ కవలపిల్లల్లా తిరిగేవాళ్ళం నాయనా. నువ్వు పుట్టినప్పు డేమయిం దనుకున్నావ్? ఏడుపు రాలేదు. అమ్మ భయపడిపోయింది. నేనేం చేశానని? పులిహోర పళ్ళెం ఒకటి తెచ్చి మోగించా ఖంగున. అంతే. ఆ చప్పుడుకు ఒక్క

సారి గుక్కపట్టి ఏడుపు ప్రారంభించావు." ఇలాగే ఎన్నో కథలూ, గాథలూ చెప్పింది చెల్లాయమ్మగారు.

భోజనాలయాక చేతులు కడుక్కుంటున్నప్పుడు ముత్తెం వీధి వాకిట్లోంచి కేక పెట్టాడు. "రాజారావు సాయంత్రం మిమ్మల్నే అక్కడకు రమ్మన్నాడండీ" అంటూ.

"అఁడీ ఏమిటి ముత్తెం, మనం అలా ఎప్పుడన్నా పిల్చుకు న్నామా ?" అంటూ మందలించాడు కరుణాకరం.

"ఏమిటో ! చిన్నతనంలో తెలియక అలా అనుకున్నాంలెండి. సాయంత్రం నేనొచ్చి తీసుకెళ్తా రాజారావు దగ్గరకు."

"ఎక్కడున్నాడు రాజారావు?"

"మీకు తెలిదాండి. గూడెంలో."

"నే చెప్తా రాబ్బాయి" అంటూ లోపలికి పిలిచారు వరదాచార్యులుగారు. ముత్తెం సాయంత్రం వస్తానని వెళ్లిపోయాడు. వసంత తమలపాకుల పళ్ళెం తెచ్చి కచేరీగదిలో పెట్టింది.

# రెండు

వరండాలో రెండు మంచాలు వేయించారు వరదాచార్యుల వారు. భుక్తాయాసంతో ఆయాసపడుతూ "పంకా వేయమ్మా" అంటూ కేక పెట్టారు. వసంతవచ్చి పంకా వేసి పోయింది. ఈ పదే ళ్ళల్లో ఊరు ఎంతో మారింది. కరెంటుగూడా వచ్చిందన్నమాట. తను హైదరాబాద్‌నుంచి కారులో వచ్చాడు. ఆచార్యులవారింటి ముందున్న పందిరిక్రింద పెట్టాడు డ్రైవరు కారుని. ఆచార్యులవారి చిన్న పిల్లలు ముగ్గురూ అందులో ఎక్కి కూర్చుని హారన్ కొడు తున్నారు.

"కాసేపు నడుంవాల్చు నాయనా" అన్నారు ఆప్యాయంగా ఆచార్యులవారు.

"రాజారావు గూడెంలో ఎందుకున్నాడండీ"

వరదాచార్యులగారు నిర్లిప్తంగా నవ్వారు. "బాబూ! కరుణాకరం! ఏం దిక్కుమాలినరోజు లొచ్చాయనుకున్నావ్ ఈ ఊరికి. బ్రాహ్మణ జన్మెత్తాడా ఆ రాజారావు? పది పందుల్ని—సీమ పందుల్ని తెచ్చి పెంచుతున్నాడు."

"ఇక్కడ అన్నారంలో ఓ పందిమాంసం ఫ్యాక్టరీ పెట్టార్లే. అక్కడికి ఎగుమతి చేయడానికన్నమాట. నాకు తెలియక అడుగు తాను, నాలుగు డబ్బులొస్తాయని అడ్డమైన పనులూ చేయడమేనా అంట? నాలుగు డబ్బులు ఆ ఓక్కుమాలిన వ్యాపారంలో చేతి కంద గానే, వాడు-ఆ రాజారావుగాడు పెద్ద నాయకుడై పోయాడంటే నమ్ము. క్రితంసారి పంచాయితీ ఎన్నికల్లో గూడెంవాళ్ళందరినీ రెచ్చ గొట్టి మాయింటిమీదికి దొమ్మీకొచ్చాడయ్యా. తలలు పగలాల్సింది."

"పగలలేదుగా ?"

"ఆc అంత గాజులు తొడుక్కు కూర్చున్న దెవరులే. డి యస్. పి.ని పిలిపించి, నూట నలభయ్యోనాలుగు సెక్షన్ పెట్టించి ఆట కట్టించాం. కాని వాడికి బుద్ధిరాలేదయ్యా. వాడి నోరు మూయించ డానికి గట్టి మార్గం ఆలోచిస్తున్నాం. నువ్వొచ్చావ్. ఇదీ నీ వల్లనే జరగాలి బాబూ. అదేదో శివసేన అంటున్నారే అలాగ అలగా వెధవ లందర్నీ జేర్చి, ఓ సైన్యాన్ని తయారు చేశాడు. వాళ్ళచేత ఆస నాలు వేయిస్తాడు. కర్ర గరిడీలు పట్టిస్తాడు. కదిలితే తంతామంటు న్నారు పొగరమోతు వెధవలు. అందుకేగా మున్సబుగారు కలెక్టరు గార్ని పట్టుకొని తుపాకీ లైసెన్సు తెప్పిస్త."

కరుణాకరానికి ఈ మాటలన్నీ ఏమంత రుచికరంగాలేవు. పదేళ్ళనాటి స్వగ్రామం గుర్తుకొచ్చింది. అప్పుడూ తగాదాలుండేవి గాని అవి వ్యక్తులకు సంబంధించినవి, ఇప్పుడు ఊరంతా పార్టీల క్రింద చీలిపోయిందని అర్థమయింది. ఇంకా ఎక్కువసేపు ఆ మాటలు వినడానికి యిష్టం లేకపోయింది.

"విశ్వపతిగారు ఎలా వున్నారండీ? గోవిందు ఏంచేస్తున్నాడు?"

ఈ ప్రశ్న అడగగానే ఆచార్యులవారు అంతటి శరీరంతోనూ లేచి కూర్చున్నారు.

"నీకు తెలియదా బాబూ! విశ్వపతి సంసారం పూర్తిగా చితికి పోయింది. మీ నాన్నకు నాలుగువేలు అప్పుపెట్టి మీ యిల్లుకాస్తా రాయించుకున్నాడా? యిప్పుడు తింటానికి తిండిలేక చస్తున్నాడు. కళ్యాణి— ఆయన కూతురు వసంతకంటె మూడేళ్ళు పెద్దది. గజ్జల గుర్రంలా ఎదిగికూర్చుంది. పెద్దమనిషై ఆరేళ్ళు దాటింది. దాని కన్నె చెర విడిపించటానికిగూడా అతగాడికి తికానా లేకపోయింది. ఈ

రోజుల్లో వయసొచ్చిన పిల్లను యింట్లో పెట్టుకు కూర్చుంటే ఉంటుందీ ?''

వరదాచార్యులవారి సుభాషితాలలో, ఒక్క మాటలోగూడా సౌజన్యం కనిపించడంలేదు. ఊళ్ళో అందరినీ తిడుతున్నాడు. ఆయనకు మహాపండితుడనే పేరువుంది. చాలాకాలం ఆవూరి దేవాలయానికి ధర్మకర్తగా వుండి ఎన్నో ధర్మకార్యాలు చేయించాడు. పర్వదినాల్లో దేవాలయం కళ్యాణమంటపంలా వెలిగిపోయేది.

"దేవాలయం ఎలా ఉందండీ ?''

''నా బొంద !'' ఈ గవర్నమెంటువాళ్ళు ఓ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ని వేశారు. అతగాడు గర్భగుడిలో కూర్చుని సిగరెట్లు కాల్చే రకం. పోయాయి నాయనా— ఆ రోజులు పోయాయి. స్వామివారికి ఆ భోగాలూ పోయాయి. అంతా మంగలమయిపోయిందిబాబూ వూరు. ఆ రోజుల్లో ఎలావుండేదో నీకు తెలియదూ ? ఇప్పుడు పెద్దా చిన్నా మంచీ చెడ్డా తేడా కనిపిస్తుందా ? ఊరికి ఒక నాయకుడంటూ వున్నాడా ? ఎవడికి వాడే నాయకుడు. మొన్నమటుకు మొన్న రథోత్సవం ఎందు కాగిందంటావ్ ? ఆ రథం ముందు మనింటి దగ్గర ఆగటమనే ఆచారం తరతరాలనుంచీ వస్తూవుందా ? తీరా రథం బయలుదేరేసరికి ఆ రాజారావు - రౌడీవెధవ జబ్బలు చరుచుకుంటూ వచ్చాడు. వచ్చి ఒక మాటా ఒక వాగుడా ? దేముడు నీబాబు సొత్తా అంటాడూ? నీయింటికే ముందు రావాలని ఏ రాజ్యాంగంలో వుందీ అంటాడూ ? బోడియింగ్లీషూ వీడూను—''

ఈ విధంగా వరదాచార్యులుగారు ఏవేవో సంగతులు చెపుతూనే వున్నారు. ఆ ఊరినిగురించీ, రాజారావుని గురించీ, కళ్యాణిని గురించీ చాలా సంగతులు తెలుసుకోవాలనుకున్నాడు. కాని వరదా

చార్యులవారి నోటికి విషయానికి పదిరెట్లు వ్యాఖ్యానం చెప్పడం అలవాటైపోయింది.

"ఉంకో రహస్యం చెప్పనా ?" అంటూ పొడుంపట్టు దిట్టంగా పట్టించి చేతులు దులుపుకుంటూ అడిగారు ఆచార్యులవారు.

ఆ రహస్యం ఎవర్ని గురించో అర్థంకాలేదు.

"చెప్పండి" అన్నాడు.

"విశ్వపతి కూతురు కల్యాణి వుంది చూశావ్ ?" తక్కింది విన డానికి భయం వేసింది. ఎక్సురే పరీక్షచేసి ఫలితం చెప్పబోతున్న డాక్టర్‌లా కనిపించాడు ఆచార్యులవారు.

"ఏమయింది కల్యాణి ?'

"పాడుకాలం నాయనా ? అసలు నీతీ నిజాయితీ - ధర్మం భక్తీ మంటగలసి పోయాయనుకో - కాకపోతే-"

"కరుణాకరంగారూ" మళ్ళీ కేక వినిపించింది.

"అలా బయటకు వెళ్ళివస్తానండీ" అంటూ లేచాడు కరుణాకరం.

"వెందరాడేరా నాయనా ! వసంత నీకోసం ఏవేవో వంట కాలు తయారుచేస్తూంది".

"ఆచార్లుగారూ ! విశ్వపతిగారు తిరిగి మాయిల్లు మాకు అమ్ముతారేమో. కావాలంటే మరో రెండువేలు ఎక్కువైనాసరే".

"కనుక్కుందాం. ఆఁ అమ్మకేం చేస్తాడు అప్పులపాలై కూర్చు న్నాడు. రెండువేలు ఎక్కువిస్తానంటూ నోరు జారేవ్. నే కుదురుస్తాగా."

ముఖం కడుక్కుని పై జమా లాల్చీ వేసుకొని బయలుదేరాడు. కారు బయటకుతీసి సిద్ధంగా పెట్టాడు డ్రైవరు. అవసరంలేదంటూ

ముత్తెంతో కలిసి కాలి నడకనే బయలుదేరాడు కరుణాకరం. రాజారావు అన్నారం వెళ్ళాడట. రేపొస్తాడట. షికారు బయలుదేరారు స్నేహితులిద్దరూ.

ఆ ఊళ్ళో నడవడంగూడా కష్టమనిపించింది. కనిపించిన ప్రతి వాళ్ళూ కౌగిలించుకున్నంత పనిచేసి ఆప్యాయంగా పరామర్శిస్తున్నారు. రెండు చెరువులున్నాయి. ఒకటి బ్రాహ్మలచెరువు. రెండోది అందరికీని. వీటిమధ్య ఎంతోదూరం నడిస్తేగాని గూడెంరాదు.

తలవంచుకు ఊరుదాటి చెరువుగట్టుమీద నడుస్తున్నారు ఇద్దరూ. ముత్తెం నీరుకాయ పంచ ఎగకట్టి, చేతికర్ర పుచ్చుకొని కిర్రుచెప్పులతో బాటదిగి ఓ అడుగుదూరంగా కరుణాకరాన్ని అనుసరిస్తున్నాడు.

"ముత్తెం! రాజా అలా ఊరికి దూరంగా గూడెంలో ఎందుకుంటున్నాడు?"

'అదో పెద్ద కథలెండి. రాజా పెద్దన్న మీ అమ్మాయిని మా తమ్ముడి కిమ్మంటూ విశ్వపతిగారి నడిగారంట. ఆరు అప్పుడు అణాకానీ ఇలువలేని మనిషికి నాబిడ్డకి నెందుకిస్తానంటూ దులిపేసినారంట. రాజా కీమాట తెలిసి అణాకానీ కాదు - లక్షలు సంపాదిస్తా తలుచుకుంటే అంటూ పట్నంపోయి ఆరితోనూ ఈరితోనూ ఆలోచించి, యాపారం పెడ్తానని అన్నగారితో చెప్పినాడంట.'

'ఏ యాపారం అనడిగినాడంట ఆయన. పందుల ఏపారమన్నాట్ట. చిర్రెక్కి తిట్టినాడంట. ఈయనా పట్టుదలకిపోయి నా వాటా నాకు పంచిమ్మని, ఏరుబడి, ఒచ్చిన రెండెకరాలూ తెగనమి పది సీమపందుల్ని తెచ్చి దొడ్లో పెట్టాడు. ఊళ్ళో పెద్దలు పంచాయితీపెట్టి - ఊరపందులైనా సీమపందులైనా పందులు పందులే - ఊళ్ళో మధ్య పందుల్నెట్టటాని కీల్లేదు. కావాలంటే గూడెంలోకి ఫో - అంటూ తీర్పు చెప్పారు. రాజా అలాగే చేశాడు.'

"వ్యాపారం బాగా సాగుతూందా ?"

"బ్రహ్మాండంగా ఉందంట. నాలుగుడబ్బు లెనకేసి బాంకు పుస్తకాన్నిచ్చి మళ్ళీ రాజారావు యిశ్వపతి దగ్గరకు బిడ్డనిమ్మంటూ రాయబారం పంపినాడు - డబ్బుంటేమాత్రం పందుల్ని పెంచే ఉప్ప రాడికి బిడ్డనిస్తానా - అంటూ యిశ్వపతిగారు మళ్ళీ ఆ మధ్యవర్తుల్ని చీవాట్లేసినారంట. ఆ తర్వాత కళ్యాణమ్మగోర్ని గురించీ, రాజాను గురించి చాలా పుకార్లులేచినై. అందులో సత్తెమెంతో ఆ భగవంతుడికి తెలియాలి."

"ఈ పుకార్లెలా పుట్టాయంటావ్ ?"

"లోకులు కాకులు బాబూ! ఆ కాకులకు ఈ యిషయంలో నాయకుడు మన ఆచార్లుగోరు."

"వరదాచార్లుగారా ?"

"ఔనుండీ! పాడుజన్మ. ఆయనగారికి ఊళ్ళోవాళ్ళందరి ఆరాలూ కావాలండీ. ఒంటినిండా పెడ్తాడు మళ్ళీ పంగనామాలు. కడుపు పట్టినంత తినడం వీధరుగులమీద కూకొని అదరిగేదాకా వాగుతూ కూకోటం-"

వరదాచార్లుగారిని గురించి ముత్తెం అంటున్న మాటల్ని అర్థంచేసుకుంటానికి ప్రయత్నిస్తున్నాడు కరుణాకరం. ఇలాగే చాలా సంగతులు చెపుతూ నడుస్తున్నాడు ముత్తెం. కొంతదూరం పోయాక కాలవ తగిలింది. "కాసేపలా గట్టుమీద కూచుందామా ముత్తెం" అన్నాడు. ఆ కాలవ తనకు కొత్తదేమీకాదు. కల్యాణి గురించి ఏవో ఆలోచనలు. పది సంవత్సరాలక్రితం చూశాడు. అందులోనూ ఆడపిల్లలు రోజురోజుకూ మారిపోయే వయస్సు. 'ఇప్పుడెలా ఉంటుంది ?' ఆ మూర్తి ఊహకు కూడా అందటంలేదు. చిన్ననాటి స్వరూపమే కళ్ళముందు కదిలింది.

కస్తూరి తిలకంతో, మల్లెపూలు తురుముకున్న పొడుగాటి జడతో, కాటుక వత్తుగా దిద్దుకున్న మెరుస్తున్న కళ్ళతో, కోల ముఖంతో, పట్టుపరికిణీ పైన జరీ అంచులు చేతిమీద కొచ్చిన చోళీ తొడుక్కుని శైశవాన్ని విసర్జించి, యౌవనాన్ని కౌగలించుకోవా లనే సన్నాహంలో పదునెక్కుతున్న పల్చటి శరీరంలో - ఎంత నిలక డైన మనస్సు! అతి నిమ్మదిగా మాట్లాడుతూ, భూమి కందుతుందని భయపడుతున్నట్లు నడుస్తూ, సృష్టిలో ఎవరి అవసరం తనకు లేనట్లు నిండుకుండలా కనిపించే కల్యాణి పన్నెండేళ్ల పసిడిబొమ్మ. కాని ఎంత సూటిగా మాట్లాడేది?

"ఈ కాలువలో ఆడిన ఆటలు గుర్తున్నాయా బాబు గారూ?" ముత్తెం మాటలకు ఒక ఊహాలోకాన్ని వదిలివచ్చి, మరొక ఊహాలోకానికి ఎగిరిపోయాడు. ఆనాటి ఆటలు. ఎంత ధైర్యం?— ఎంత అమాయకత్వం? ఎటువంటి ఆకతాయితనం? ఎంత నిర్లక్ష్యం? ఎంతటి తెగింపు. జరిగిపోయిన కాలాన్ని గురించి బరువులు లేకుండా జరగబోయే రోజుల్ని గురించిన భయాలు రాకుండా అనిపించి నప్పుడల్లా పరగబడి మనసారా నవ్వుతూ, అనుకున్నప్పుడల్లా విలవిలా కడుపారా ఏడుస్తూ అలసిపోయి అన్నీ మరచిపోయి, ఆకాశంలో నక్షత్రాలను చూస్తూ హాయిగా నిద్రపోయిన శైశవ మాధుర్యం అది. ఆ కాలవ - తన అదృష్టంలా మెలికలు తిరిగిన సజీవ స్రవంతి! చుట్టూ చూస్తున్నాడు. ప్రతి చెట్టూ, ప్రతి పుట్టా, మలుపులు డొంకలు, దొడ్లు, పిల్లకాలువలు, అన్నీ అతనితో మాట్లాడు తున్నాయి. ఆ చిన్న వంతెన - దాని దిగువలో ఆ మెరకదిబ్బ - దాని మీద కిరీటంలా ఆ పోలేరమ్మ గుడి - క్రింద చెరువు - సాయం సంధ్యం- యిండ్లకు గుంపులుగా పోతున్న పశువులు - అవి రేపుతున్న దుమ్ము - దూరంగా ఎవరో పాడుతున్న అల్లాయి పదాలు - కాళ్ళ ముందే జరజర పాకిపోతున్న పాములు - కొత్తగా వేసిన పైద్ద

ఎలక్ట్రిక్ స్తంభాలు, మెరకదిబ్బ దిగువలో పాడుబడిన సత్రంలో గంజాయి కాలుస్తూ ఆ బ్రహ్మానందంలో తత్వాలు పాడుతున్న బైరాగులు-కోతికొమ్మచ్చు లాడించిన చింతచెట్లు, బండ వీరయ్యా ఇనప కార్ఖానా,కదలిపోతున్నాయి స్మృతిపథంలో. ప్రవహిస్తున్న కాలువలో ప్రతిఫలిస్తున్న సంజవెలుగు నీడల్లో కనిపిస్తున్నాయి మసకమసకగా తననుచూసి కాలవపొంగింది. ఆనందోద్వేగంతో తొలినాటి పచ్చి అనుభవాన్ని గుర్తుకు తెచ్చుకుని పులకరించిన ప్రౌఢలా... మరచి పోయిన సిగ్గుతెరలను మరొకసారి కప్పుకున్న జారిణిలా... బల్లకట్టు మీద నిలబడి కాలువలోకి చూశాడు. కదులుతూంది నీడ. కళ్ళల్లోంచి నీటిచుక్కలు రాలి నీటి అలలమీద కురిసినై. గుప్పెడు గుండెల్లో కొండల్లాంటి అనుభూతులు - ముత్తెం నాయకుడై బాలకృష్ణుల బృందాన్ని నడిపించడం... బట్టలన్నీ విప్పి కాలువగట్టున పొదలమీద విసిరి పైన ఆకాశం క్రింద భూమీ గాక అన్ని బంధాలనూ వర్జించిన పరిత్యాగుల్లా ఆ బృందంలోని వారంతా ఒండలిమట్టిని ఒంటినిండా పూసుకొని, తలలకు బురదకిరీటాలు పెట్టుకొని విచిత్ర వేషాలు ధరిస్తూ బురదపాముల్ని తోకలు పుచ్చుకు లాగి గిరగిరాత్రిప్పి నేలకు కొట్టడం, వాటి ప్రాణవాయువులు రెక్కలుగట్టుకు ఎగిరిపోతున్నప్పుడు అజ్ఞానామృతంలో మత్తెక్కి ఉన్మత్తులై తామంతా చప్పెట్లు కొట్టడం, గట్టులమీద పచ్చికమేస్తున్న గేదెలను కాలవలోకి తోలి పైకెక్కి స్వారీచేయడం,గట్టుపై రావిచెట్టెక్కి 'రమారమణ గోవిందా' అంటూ భజనలు చేస్తూ అంత యెత్తునుండీ కాలువలోకి దూకడం, పోతున్న పడవల్లోంచి ముత్తెం దొంగిలించిన కొబ్బరికాయలను పోలేరమ్మ గుడిలో కొట్టి చేసినతప్పులకు లెంపలేసుకుంటూ ఆ కొబ్బరి, ముక్కలు తినడం, వెంటపడుతున్న పడవాసామీని చూసి గుడ్డలు చేతబట్టుకొని దిశమొలలతో పొలాలవెంట పరుగులుతీసి యిళ్ళకు చేరటం - ఇవన్నీ కనిపించాయి. అన్ని స్మృతులూ, అన్ని దృశ్యాలూ

తన...జీవితంలో భాగాలు. విడదీయరాని రక్తకణాలు. ఎలా వదిలి పోయాడావూరు? ఎలా ఉండగలిగా డింతకాలం? కాని తాను పోయినందుకు ఎవరేడ్చారు? వచ్చినందు కీ సంతోష మెందుకు? డబ్బు - తుపాకీమందు...అంత తమాషా చేసిందా?ఏమైనా ఎటువంటి ఆప్యాయత కనిపిస్తూం'దీనాడు మనుష్యుల్లో. మనిషి కీటకం - మనిషి దేముడు...అమృతాన్ని వర్జిస్తాడు... గడ్డి తింటాడు...

"చీకటిపడింది బాబుగారూ...!"

ఇంటికి నడుస్తున్నారిద్దరూ మౌనంగా. కాని అది మౌనమా? మాటకున్న అర్థం ఒక్కటే. కాని మౌనానికి? వేయిగొంతు లున్నాయి... మౌనంలో వేయి అనుభూతులు ఆవేశాలు దాచుకో గల నిండు చూలాలవంటి మౌనంకంటెఎక్కడుంది చైతన్యం?

కాలుజారింది. పొలంగట్లమీద నడిచే అలవాటు తప్పింది. బుర దయింది ఎంబాసిడర్ బూటుకు. ముత్తెం ఎప్పుడూ తొడుక్కున్నవాడు కాదు అంత ఖరీదైన బూటు. వాడికా బూటుతొడిగి, నైలాన్ శ్లాక్ వేసి, టైట్ పాంటుకట్టి, బ్యాక్ కారులో హైదరాబాద్ గుర్రప్పందా లకు తీసుకెడితే వాడి గుండె ఎలా కొట్టుకుంటుంది? వరదాచార్యుల్ని అడగాలి. అసలు వరదాచార్యులవారినే ఒకసారి హైదరాబాద్ తీసుకెళ్ళి పిలకతీయించి, ఫ్రెంచికటింగ్ పెట్టించి, గిరజాల క్రాపు పెట్టించి, సూటువేయించి ఈ వూరు తీసుకొచ్చి ఊరేగిస్తే? మహా చిరాకు ముంచుకొస్తూంది ఆయన్ను తలుచుకుంటే. కొంతదూరం నడి చారు. చీకటి చిలకరింపు ముదురుతూంది. తలెత్తి చూశాడు. తాటి వనాలమీదుగా నక్షత్రంమాదిరి మెరుస్తున్నది ఆకాశదీపం... అది కార్తీకమాసమని గుర్తొచ్చింది. సీతారాముల ఆలయప్రాంగణంలోని ధ్వజస్తంభం మీద వెలుగుతున్న ఆకాశదీపమది. గాలికి రెపరెప లాడుతూ గుమ్మటం మధ్య దాక్కున్న బేలలా కనిపించింది.

ఆలయశిఖరం మాత్రం నిశ్చలంగా కథల్లోని మహోదాత్తనాయకుని మనస్సులా నిలిచింది. ఆలయం కట్టించిన నూజివీడు జమీందార్లు పోయారు. ఆలయం మిగిలింది.

"ముత్తెం! మా యిల్లు మళ్ళీ కొందామనుకుంటున్నానోయ్" అన్నాడు ఆ యింటిదగ్గరకు రాగానే. ఆ ఊళ్లో మొట్ట మొదట కట్టబడిన డాబా అది. అనుకోకుండానే ఆ యింటిముందుకు లాగాయి కాళ్ళు.

"విశ్వపతిగారిని చూస్తారా?"

కల్యాణి కనిపించింది... గుమ్మంముందు కొబ్బరిచెట్టుక్రింద మంచాలు వేస్తూంది... ఆమెను చూడగానే ఆగిపోయాయి కాళ్ళు...మనస్సు జిగిబిగిగావుంది... "పోనీ రేపు చూద్దాంలే" అనుకుంటూ వెనక్కు తిరిగాడు.

"బాబుగారూ! యిల్లు మళ్ళీ కొనదలుచుకుంటే మీరే సరాసరి యిశ్వపతిగారితో మాట్లాడండి. ఈ మధ్య చాలామంది మధ్యవర్తులు తయారయ్యారు అటూ యిటూ నాలుగు పిక్కలు లాగడానికి".

వరదాచార్యులవారు గుర్తుకొచ్చారు.

మళ్ళీ నడుస్తున్నారిద్దరూ.

బాగా చీకటిపడింది.

ముత్తెం ఎన్నో కబుర్లు చెపుతున్నాడు.

"ముత్తెం..."

'బాబూ!"

"కల్యాణిని గురించి నీ అభిప్రాయమేమిటి ?"

"మంచిగానే కనిపిస్తుందండి. యిందాక రాఘవయ్యగారంటు న్నారండీ.... యిశ్వపతిగా రమ్మాయిని మన కరుణాకరానికిస్తే బావుంటుందని..."

"ఎవరితో ?"

"మున్సబుగారితోనండి".

"మున్సబుగా రేమన్నారు ?"

"కరుణాకరం చేసుకోవాలేగాని కళ్ళకద్దుకిస్తాడు విశ్వపతి" అన్నారండీ. అయినా బాబుగారూ! "మీరింకా పెళ్ళెందుకు చేసు కోలా ?"

నవ్వాడు కరుణాకరం.

సమాధానం రాకపోయినా మరొకసారి ప్రశ్నించలేదు ముత్తెం. వరదాచార్యులగారిల్లు వచ్చింది. "ముత్తెం! రేపురా. అలా విశ్వపతిగారింటి కెళ్ళి ఆ యింటిబేరం సెటిల్ చేసుకొద్దాం."

"రాఘవయ్యగారిని కూడా తెమ్మంటారా ?"

"ఆయనెందుకు ?"

"యింటి విషయంతోపాటు, యిల్లాలి విషయం గూడా మాట్లాడెయ్యటానికి."

"నువ్వు ఒక్కడివే రా" అన్నాడు నవ్వుతూ కరుణాకరం ముత్తెం భుజం తట్టి.

# మూడు

"రావోయ్ రా!" అంటూ సాదరంగా ఆహ్వానించారు వరదాచార్యులవారు. "వేడినీళ్ళు తోడింది నాయనా వసంత... పోసుకురా, భోజనాలు వడ్డిస్తా-వసంతా సబ్బూ తుండుగుడ్డా పెట్టావా దొడ్లో!" అంటూ కుమార్తెను కేక పెట్టి పిలిచింది చెల్లాయమ్మగారు ఈ మర్యాదలతో, ఆప్యాయతతో నిండిన మాటలతో భోజనాలు ముగిశాయి. భోజనం చేస్తున్నంతసేపూ వరదాచార్యులవారు భగవద్గీత దగ్గర్నుంచి బొబ్బట్లదాకా రకరకాల విషయాలమీదా భాష్యాలు చెపుతూనే ఉన్నారు. గాంధీజీ తత్వం దగ్గర్నుంచి ముత్తెం అమాయకత్వందాకా- అనేక రంగాల్లో తనకున్న అభిప్రాయాలను వివరిస్తూనే వున్నారు. ఆయన పండితుడు కాదని అనుమానించేవా రెవరూ లేరు. వేదాలూ, ఉపనిషత్తులూ, పురాణాలూ ఇతిహాసాలూ అన్నీ పుక్కిటబట్టిన బుర్ర. ఇంగ్లీషేగనుక వచ్చివుంటే ఇండియాకు ప్రధానమంత్రి కావలసినవాడు. ఆ విషయం ఆయనే కనిపెట్టాడు మొదట తనవిషయంలోనే కాదు, వాళ్ళమ్మాయి వసంతనుగురించి కూడా ఆయనకు అంతటి అభిప్రాయమూ వుంది

"అమ్మాయిని లేడీడాక్టరు చదివిద్దామనుకున్నా. కాని చిత్రం కరుణాకరం - తెలివున్న వాళ్ళకు అవకాశాలు రావోయ్. ఎం బీ బీ యస్సంటే మాటలా" పట్నం జేరాలా - అయిదారేళ్ళు చదవాలా? అగ్రహారాలు హరించిపోయాక మన మెందుకూ పనికిరాకుండా పోయామనుకో - కాని వసంతను చూసినపుడల్లా అదే జాలేస్తుంది. అంత తెలివైన బుర్ర ఎందుకూ కొరగాకుండా పోతూందే అని. అయితే ఒకటి - ఇంతకీ దానికి కాబోయే భర్త యెవరోగాని -

అతనిదీ అదృష్టం. చాలామంది తిరిగిపోతున్నారు. అమలాపురం దగ్గర బొబ్బర్లంకట...పుల్లెలవారబ్బాయిట...వైదీకులే అనుకో,మా యింటావిడ - మనం వైష్ణవులంగదా బ్రాహ్మలతో ఎలా సంబంధం కుదురుతూందీ అంటూ సణిగింది. ఈ రోజుల్లో ఆ పట్టింపు లేమిటి చెప్పు. వైష్ణవులూ బ్రాహ్మణులూ అనే పట్టింపులు నాకు లేవనుకో. మొదటినుంచీ మన కుటుంబాలు అలా కలిశాయి. మీనాన్న బావా అంటూ వచ్చేవాడు. ఇంతకీ ఆ పుల్లెలవారబ్బాయి ఎంత పట్టుపట్టా డని?- "చేసుకుంటే వరదాచార్యులవారి అమ్మాయినే చేసుకుంటా... లేకపోతే కాషాయిగుడ్డలు కట్టుకుని పాంకోళ్ళు తొడుక్కుని బైరా గుల్లో కలిసిపోతా అంటూ ఒకటేగోల..."

గోలగానే చెప్తున్నారు అచార్యులవారు—

"మరి ఆ సంబంధానికి అంగీకరించారా ?"

"మనసొప్పలేదోయ్..."

"ఎందుకని ?"

"వాళ్ళ వంశాన్నిగురించి చాలా పుకార్లున్నాయోయ్. కులం, గోత్రం, డబ్బు. హోదా వీటన్నిటికంటె ముఖ్యమైనది గుణం- సంప్రదాయం. అన్నన్నా -? మచ్చంటూ ఓ కుటుంబానికి రాగూ డదే గానీ వస్తే పోతుందీ ? తరతరాలదాకా వెంబడిస్తుంది. ఆ విశ్వపతి సంగతేచూడు... వాళ్ళమ్మాయి కళ్యాణి కేంతీపరం చెప్పు ? పిల్ల అందంగానే వుంటుంది. తండ్రి కొంపాగోడూ తెగనమ్మి అయినా నాలుగువేలు కట్నంయిస్తానంటూ కాళ్ళకు బలపాలు కట్టుకు తిరుగు తున్నాడు. కాని ఎవరు ముందుకొస్తున్నారు చెప్పు ? పెళ్ళయితే ఈపాటికి అరడజనుమంది పిల్లల్ని కనేది..."

తింటున్న అన్నం వాంతి చేసుకుంటున్నట్లుంది ఆ మాటలు

వింటుంటే. భరించలేక మాట మార్చుద్దామని "విశ్వపతి మాష్టారికి వంట్లో బావుండటం లేదట ! ఏమిటండీ సుస్తీ" అన్నాడు.

"నన్నడగకు బాబూ. పిల్లలు పుట్టగానే సరిపోయిందా ? ఆ కొడుకు కొడుకే, కూతురు కూతురే; వాడొక కొరివి, ఇదొక కొరకంచు. పోనీ మొగపిల్లాడు ఎంత చెడు తిరిగినా అంత కొంప మునిగిందేంలేదు. కాని ఈ కళ్యాణి మటుకు..."

"ఎలా వుందండీ విశ్వపతిగారి కిప్పుడు ?"

"ఎలావుంటుందీ, మతిపోయి చస్తున్నాడు. తిన్నది అరగదు. కంటికి కునుకురాదు... కొడుకా దేశాలు తెగించిపోయాడు. కూతురంటావా కొరకంచై మండుతోంది నిప్పు లేకుండా. అసలు రహస్యమేమిటంటే - "అదేమిటి నాయనా చెయ్యి కడుక్కుంటున్నావ్ అన్నం తినకుండా ? వంటకాలు సయించటంలేదా యేమిటి ? పాపం మనసుపడి చేసింది వసంత - నువ్వు లేస్తే నేనూ లేస్తానుసుమా ?"

"నాకు వాంతి వస్తూందండీ మీరు భోంచేసి రండి, అలా బయటకు వెళ్ళి వస్తాను" అంటూ లేచాడు కరుణాకరం. వరదాచార్యులుగారుకూడా లేచి "ఎక్కడికి బాబూ!" అంటూ వెంబడించపోయారు - కరుణాకరానికి సహనం నీరసించింది. "వస్తా ! మీరుండండి" అంటూ కఠినంగా మందలించి బయటకు నడిచాడు. "చెప్పులు లేకుండా" అంటూ ఆచార్యులవారంటున్న మాటలు వినిపించనేలేదు.

విశ్వపతిమాష్టారు తనను చూడటానికి ఎందుకురాలేదో ఇప్పుడర్థమయింది. ఆయన్ను చూడాలనిపించింది. కోతిలాంటిది మనిషి మనస్సు. మాష్టారు రాలేదని ఎన్నిరకాలుగా అనుకున్నాడతను ?

విశ్వపతిమాష్టారింటికి బయలుదేరాడు.

పదిసంవత్సరాలనాడే ఆ వూరితోపాటు ఆయన్నుకూడా వదిలి పోయాడు. మళ్ళీ ఆ ఊరు రావలసి వస్తుందని ఎన్నడూ అనుకోలేదు. ఆ ఊరిలో అతన్ని కట్టిపడేసిన బంధం యింకా ఉందనే ఆలోచన అతనికి ఎన్నడూ కలిగిందికాదు. నిజానికి ప్రపంచంలో యింకా తన కున్న బంధం అదొక్కటే.

విశ్వపతి మాష్టారు!

అప్పటికింకా ఆ వూరు హైస్కూలు రాలేదు. ఆనాడు విశ్వపతి మాష్టారి పాకబడే ఆ వూరికి విశ్వవిద్యాలయం - దాని అధిపతి విశ్వపతి మాష్టారు. అది గవర్నమెంటు బడి కాదు. కనీసం జిల్లా బోర్డుదికూడా కాదు. నూటికి నూరుపాళ్ళు విశ్వపతి మాష్టారిదే. ఎక్కాలు రాలేదని ఎంతమంది వీపులమీద చింతబరికలు విరగ్గొట్టా రాయన? గుంజీలు తీయించి, తొడపాశాలు వడ్డించి, మొట్టికాయలు మొట్టి, గుణింతాలు నేర్పిన విశ్వపతిమాష్టారు - ఈ పది సంవత్సరాలూ ఆయన ప్రసక్తిలేకుండానే తన జీవితం గడిచిపోయింది. గడచిపోతున్న జీవితం ఒక్కసారి ఆగింది. దారి కనిపించక, ఆవరించిన అంధకారాన్ని భరించలేక, జీవిత పథంలో తెలియని గమ్యాన్ని వెతుక్కుంటూ ఒంటరిగా పయనిస్తున్న బాటసారినని సంతృప్తిపడలేక, తనవా రెవరని మనస్సు కళవళపడినప్పుడు - అప్పుడు కనిపించారు విశ్వపతిమాష్టారు. ఎక్కడో దూరంగా అంతులేని అగాథంలోంచి మృత్యుదేవి కౌగిట్లో నలిగిపోతున్న ఏదో దీనకంఠం "ఈ దిక్కుమాలిన ప్రపంచంలో అందరూ ఏకాకులే...ఎవరి ఏకాంతాలు వారివి" అని మూలుగుతున్నట్లనిపించినప్పుడు- అప్పుడు కనిపించారు విశ్వపతిమాష్టారు. ఏదోఅపస్వరంవినిపించింది. హృదయాన్నీ శరీరాన్నీ పిండివేస్తున్నది. ఏకాంతంలోని విషాదాన్ని భరించలేని ప్రాణి ఏడుపు తన గుండెల్లో అపశృతిలా వినిపించింది. చీకటి కురుస్తూంది. విశ్వ

పతిమాస్టారింటికెళ్ళి, ఆయన పాదాలను కన్నీటితో కడిగి, ఆయన వాత్సల్యామృతాన్ని వర్షించగా తడిసి కరిగిపోవాలనే ఉద్వేగంతో తడబడుతున్న కాళ్ళతో తందరిస్తున్న గుండెలతో నడుస్తూ మాస్టా రింటిని సమీపించాడు.

చావిడిలో పిల్లలు తలో లాంతరముందూ కూర్చుని ఎవరిశక్తి కొద్దీ వారు ఎక్కాలు వల్లెవేస్తూ ఘజనీ మహమ్మదు దండయాత్రల గురించీ, కరటక దమనకుల దుర్మార్గాన్ని గురించీ బిగ్గరగా చదువు తున్నారు. తెలియకుండానే తన కళ్ళు కల్యాణికోసం వెతికినై. బయట మంచాలు రెండూ ఖాళీగా కనిపించాయి... కొందరు పిల్లలు నిద్రమత్తుతో తూలుతూ, గాడివిరిగిన గ్రాంఫోను ప్లేటులా "విశ్వదా భిరామ వినుర వేమ" అనే పాదాన్ని పదేపదే కళ్ళుమూసుకు వల్లెవేస్తు న్నారు. కొందరు మాస్టారితో నేరాలు చెపుతున్నారు. ఊరికి మిడిల్‌స్కూలువచ్చినా విశ్వపతిమాస్టారి శిష్యబృందం సంఖ్య తగ్గింది కాదు. ఎవరు ఎంత గొడవచేస్తున్నా పడకకుర్చీలో పడుకున్న మాస్టారి ముఖంలో కదలిక లేదు. రైల్వేప్లాట్‌ఫారంమీద తపస్సు చేసుకుంటున్న యోగిలా కనిపించారు. మరో నాలుగడుగులు ముం దుకువేసి ఆగాడు. కళ్ళుతెరచి చూస్తున్నాడు! ఎవరిని? ఆకాశాన్ని. తనను ఏకాకినిచేసి ఈ లోకం విడిచిపోయిన తల్లిదండ్రులిద్దరూ మాస్టారి ముఖంలో కనిపించారు. తన ప్రశ్నకు ఏదో సమాధానం దొరికింది. తనకు అక్షరాభ్యాసంచేసి, ఎత్తుకుమోసి, చదువుచెప్పారు. ఆయన పాదాలదగ్గరే తాను కళ్ళు తెరిచాడు. ఆయన చల్లనినీడలోనే శైశవం గడిపాడు. ఆయన్ని పది సంవత్సరాలలో వృద్ధాప్యం బాగా ఆవరించింది... రోగం పీడిస్తూంది. మృత్యుదేవి వాకిట్లో కూర్చుంది. రోగాన్నీ ముసలితనాన్నీ మృత్యువునూ జయించాలని తపస్సు చేశా డట బుద్ధుడు. ఏం జయించాడో ఆ విశ్వపతిమాస్టారికిగూడా తెలి యదు. అందుకే పిల్లలు అంత భయభక్తులు లేకుండా విజృంభించారు.

నడుం విరిగిన ముసలి సింహంమీద కుప్పిగంతులు వేస్తున్న ఎలుకల్లా కనిపించారు పిల్లలు. కన్నెర్రచేసి ఎంతటి ఆకతాయిలనూ, ఆట కట్టించిన విశ్వపతిమాష్టారే తనకు గుర్తు... ఆయన ఖోంచేసి దగ్గే వారు బయటకువచ్చేముందు...అదొకసిగ్నల్ - మహారాజులు వచ్చే ముందు వంది మాగధులు చదివే హెచ్చరిక...మహాప్రవక్తలు విచ్చేసే ముందు పండితులు చదివే వక్కాణం - సింహగర్జన విన్న అల్పజీవుల్లా, పిల్లలందరూ గంగిగోవులై, పిల్లికూనలై, ఎండిన తోటకూరకాడలై, వంగిపోయేవారు... జబ్బుపడిలేచిన మనుష్యుల గొంతుల్లా కంఠస్వ రాలు నీరసించేవి. పిల్లలేకాదు పెద్దలుకూడా ఆయన్నంత గౌర వించేవారు. గడపదాటి పోవడం ఆయన కలవాటులేదు. ఊరి రాజ కీయాలతో జోక్యముండేదికాదు. ఎన్ని కథలున్నా యిరుకక్షుల వారికీ ఆయన అప్తుడే. అందరూ సలహాలడిగేవారు. ఆయన చేయగలిగిన మరొక సహాయం లేదు. కాని అదెక్కడా దొరక నప్పుడు ఆ ఊళ్ళో ప్రతి మనిషికీ ఆయనే గుర్తుకువచ్చేవాడు. ఎవరు కష్టంలో వెళ్ళినా "ఏంబాబూ!" అంటూ అప్యాయంగా పలక రించేవారు. ఆయన దగ్గర చదువుకున్న ఏ మనిషీ ఆయన్ను జీవి తంలో మరిచిపోలేడేమో. తల్లితండ్రుల తర్వాత గురువును దైవంతో పోల్చారు. స్టూడెంట్లతోకలిసి ఒకరి నొకరు "ఏం గురూ" అను కుంటూ పేకాటలాడే లెక్చరర్లు గుర్తుకొచ్చారు. మనం చాలా గొప్ప వాళ్ళమయ్యామనడానికి యింతకంటె నిదర్శనం యేంకావాలి? విశ్వపతిమాష్టారి ముఖం కరెంటుదీపపు వెలుగులో స్పష్టంగా కనిపి స్తూంది...ముఖం ముడతలుపడింది...గడ్డం తెల్లపడింది..."ఈ మనిషికీ జన్మలో వృద్ధాప్యంరాదు" అనిపిస్తుంది కొంతమందినిచూస్తే. అలా వుండేవారాయన పదేళ్ళక్రితం. "పాకబడి" అనే ఒక మహా సామ్రా జ్యాన్ని ప్రచండమైన దక్షతతో పాలిస్తున్న మహోదాత్తుడైన మహా నియంతలా వుండేవారానాడు. తాను చదువుకున్న రోజులు కళ్ళ

ముందు మెదిలాయి...ఎటువంటి మొద్దు మెదడైనా ఆయన చేతిక్రింద బాగా పదునెక్కేది. ఎంతటి పెంకిఘటమైనా, రెండురోజుల్లో మచ్చిక చేసుకునేవారు. వీపు చిట్లేలా చింత బరికతో బాది, ఏడుస్తున్న పిల్లవాణ్ణి ఎత్తుకొని ముద్దెట్టుకొని, ఏ బెల్లంముక్కో నోట్లోకుక్కి సముదాయించేవారు. ఎంత మారిపోయారు మాష్టారు !

కల్యాణి అలికిడి లేదు. లోపలికి అడుగుపెట్టటానికి మనస్సెందుకో ముందుకు సాగలేదు. అలాగే నివ్వెరపోయి చూస్తూ పది క్షణాలు నిలబడ్డాడు. మాష్టారి భార్య గౌరమ్మగారు బయటకు వచ్చి "యింక చదువు చాలు లేవండి" అంది. పిల్లలందరూ లేడి పిల్లల్లా గంతులువేస్తూ వెళ్ళిపోయారు. గౌరమ్మగారు-కరుణాకరాన్ని చూసినట్టులేదు. తిరిగి లోపలకు వెళ్ళిపోయింది. ఇంక లోపల అడుగుపెట్టే సమయంలో కేక వినిపించింది. వసంత - వరదాచార్యులగారికి ఏదో ప్రాణం మీదికి వచ్చిందట, అంతవరకూ బాగానే వున్నారట, ఆకస్మికంగా గుండెల్లో దడంటూ కుప్పలా కూలిపోయారట. హుటాహుటిన పరుగుతీస్తూ యింటికి జేరుకున్నారిద్దరూ. వరదాచార్యులవారు మంచం మీదపడి రొప్పుతున్నారు. గుండెజబ్బట. అది చాలా ప్రాణాంతకమైనదని అంతకుముందు విన్నాడు. చెల్లాయమ్మగారు మంచం పక్కనే కూర్చుని చీదుకుంటూ ఏడుస్తున్నారు. కరుణాకరం గుండె తరుక్కుపోయింది. పలకరించాడు. మన తెలివిలో ఉన్నట్టు లేరు. కళ్ళు తెరిచేవున్నాయి. కాని వాటిలో చైతన్యం కనిపించటం లేదు. ఇలాగే అప్పుడప్పుడాయన అయిపోతూంటారట. వసంత కన్నీళ్ళొపుకుంటూ నిలబడింది. డ్రైవర్ని పిలిచాడు. డాక్టరు గురించి అడిగాడు. ఆ వూళ్ళో గుళ్ళో అర్చకత్వం చేస్తున్న నంబాచార్లుగారొక్కడే వైద్యుడు. కారు తీసుకుపోయి పిలుచుకురమ్మని డ్రైవర్ని పంపాడు. తన దగ్గరున్న గ్లూకోసు కాస్త తీసిపట్టాడు. చెల్లాయమ్మగారిని ఓదార్చటం తన వశం కావడంలేదు. తనకు కంగారు పుట్టింది.

వరదాచార్యులవారు మూలిగారు. కొంత ప్రాణం లేచొచ్చింది. పలకరించాడు. "బాబూ కరుణాకరం!" ఆయన కనుకొలకులనుండి నీరు కారుతోంది - తుడిచాడు. ఒకర్ని సముదాయించడంలో అనుభవంలేని జీవితం. "దాన్నీ వసంతనూ గంగలో దించిపోతున్నా, వాళ్ళని అనాథులను చేస్తున్నా, నువ్వే నాయనా - బిడ్డలాంటి వాడివి, దానికి పెళ్ళిచేసి ఒకింటిదాన్ని చేయకుండానే వెళ్ళిపోతున్నా. బాబూ, నీ చేతుల్లో పెడుతున్నా, అల్లుడివైనా కొడుకువైనా అన్నీ నీవే." అంటూ మరొకసారి పెద్దగా మూలిగి కన్నులు మూశారు ఆచార్యులవారు. కరుణాకరం గుండె పగిలినట్లయింది. చెల్లాయమ్మగారి శోకాలతో ఆకాశం పగులుతూంది. కాని ఇది ఊరా వల్లకాడా? ఇరుగు పొరుగు లెవరూ ఈ గొడవ పట్టించుకుంటున్నట్లు లేదు. ఇంకా పదిగంటలు కాలేదు. ఏడుపులు ఎవరికీ వినిపించలేదనడానికి వీల్లేదు. వైద్యుడొచ్చాడు నంబాచార్లుగారిని వెంటబెట్టుకొని కనుబొమ్మలు ముడివేసి నాడి చూశాడు. ఆయన ముఖాన్ని ఊపిరి బిగబట్టి పరిశీలిస్తున్నాడు కరుణాకరం. కనుబొమలు విడివడినై. రవ్వంత మందహాసం మెరిసింది. కొంత ధైర్యం చిక్కింది. "నా దేముణ్ణి బ్రతికించండయ్యా, చచ్చి మీ కడుపున పుడతాను" అంటూ చెల్లాయమ్మగారు ఏడుస్తూనేవుంది. వసంతను చూశాడు, జాలివేసింది. విషాదం పూసుకున్న సౌందర్యం - అంతా కలలావుంది. 'ఏమండీ' అన్నాడు-

"ఉస్" అన్నారు నంబాచార్లుగారు.

అరికాళ్ళూ అరిచేతులూ పరీక్ష చేశాడు. కనురెప్పలు తెరిచి దీపం దగ్గరపెట్టి చూశాడు, "టార్చిలైటు అక్కగారూ!" పిలిచారు వైద్యులు. అందరూ ఉగ్గబట్టుకు ఆయన నోటినుండి వెలువడే ఆ మాటలకోసం ఆగారు. "ఫర్వాలేదు. కస్తూరి పడాలి, వేడెక్కించాలి" అంటూ నస్యం పీల్చి - సంచి తెరిచారు. కొంత ప్రాణం తేలిక

పడింది. మందువేసి, మరో నాలుగు మోతాదులిచ్చి, రెండు గంటల కొకసారి త్రాగించమని చెప్పారు. అవసరమొస్తే కబురు చేయమన్నారు. ఆ గది అతిప్రశాంతంగా వుండాలన్నారు. ఒకవేళ రోగి నిద్రలేవకపోతే మందు వాడవద్దన్నారు. వెళ్ళిపోయారు. ఆ రాత్రి ఎలా గడిచిందో కరుణాకరం మరిచిపోలేదు. చెల్లాయమ్మగారినీ వసంతనూ పడుకోమని తాను వాలుకుర్చీ వేసుకుని మంచందగ్గర కూర్చున్నాడు. గడియారం అంత పెద్ద సవ్వడి చేయగలదని మొదటిసారి అర్థమయింది. ఇంగ్లీషు మాగ్జైన్లు ఎంత తిరగ వేస్తున్నా గంటలు భారంగానే కరుగుతున్నాయి. కాసేపు కళ్ళు మూసుకుపోయాయి నిద్రతో. ఆపుకున్నాడు. మరో పదిపేజీలు తిరగవేశాడు. ఆచార్యుల వారు అలాగే కదలకుండా నిద్రపోతున్నారు. ఏదన్నా జరిగితే? వసంతను...తనకి అప్పగించిపోయిన ప్రాణికోసం-ఏంచేయాలి-ఏదో ఉప్పెనలో మెరపులా జరగబోయేది కళ్ళముందు మెదలింది. ఒక్కసారి లేచి ఆయన నాడి పరీక్షచేశాడు. కొట్టుకుంటూంది. అరచేతులు నిమిరాడు - వెచ్చగానే వున్నాయి. గడియారం రెండు గంటలు కొట్టింది. గాలివేగం ఎక్కువై కిటికీ తలుపు దభాలున కొట్టుకుంది. ఉలిక్కిపడ్డాడు. ఆచార్లుగారి ముఖంలోకి చూశాడు. నామాలు చెరిగిపోయాయి. నామాలు లేకపోతే ఆయన ముఖం చాలా మారిపోతుంది. కిటికీ తలుపు మళ్ళీ కొట్టుకుంది. తలుపులు వేయడానికి లేచాడు. రావిచెట్టు ఘోరమైన తపస్సుచేస్తున్న రాక్షసుడిలా కనిపించింది కదులుతూ. గాలివాన ముదిరింది. ఆ రావిచెట్టు క్రింద విశ్వపతి మాష్టారు పురాణం చెపితే నోరు తెరుచుకు వింటున్న రాఘవయ్య గుర్తుకొచ్చాడు. తలుపువేసి వస్తుంటే వరండాలో ఏదో నీడ కదిలింది. భయమెరుగని మనస్సు కంపించింది - ఆ నీడ కదిలింది ఏడుస్తూ "భయంగా ఉంది కరుణాకరం" అంటూ కౌగలించుకుంది. ఓదార్చాడు మౌనంగా స్పర్శతో - ఆ మౌనంలో ఎంత ఘర్షణ.

"పడుకో"

"భయంగా ఉంది"

"అమ్మదగ్గర పడుకో."

"........."

"వెళ్ళు ఇలా మనం ఉండగూడదు వంటరిగా"

"వెళ్ళు"

"భయంగా వుంది"

"పోనీ రా - అలా కూర్చుందాం నాన్నగారిదగ్గర"

కూర్చున్నారు. స్టూలుమీద ఒకరు, కుర్చీలో ఒకరు. గడియారం మూడు కొట్టింది.

"ఇలా ఎప్పుడూ నా కలవాటులేదు"

"నా కలవాటే"

"మా అమ్మ పోయినప్పుడు కూడా నే దగ్గర లేను. మామయ్యవాళ్ళ ఊరి నుంచి వచ్చేసరికి అంతా అయిపోయింది - పడుకో"

"నిద్ర రావడంలేదు"

పిడుగుపడింది — వణికిపోయింది వసంత.

"భయంగా ఉంది"

"నేనున్నాగా"

"ఉన్నావనే ధైర్యం"

"పద - పడుకో"

"నువ్వు"

"నాన్నగారిని చూస్తూ కూర్చుంటా"

"భయంగా వుంది"

"ఫర్వాలేదు పడుకో - పోనీ ఈ కుర్చీలో పడుకో."

చెల్లాయమ్మగారి అలికిడయింది పిడుగు శబ్దానికి. "బాబూ! ఇంక నువ్వు పడుకో." ఆచార్యులవారికి బాగా నిద్రపట్టింది. ముందు గదిలోకిపోయి తలుపులన్నీ బిడాయించుకు పడుకున్నాడు. పడుకో గానే నిద్రపట్టింది. బాగా పొద్దుపోయి లేచాడు. అదైనా ఎవరో లేపారు. హుటాహుటిన బయటకువచ్చి చూశాడు ఆచార్యుల వారు పడుకున్న మంచంకేసి. మంచం ఖాళీగావుంది. దొడ్లో బావి దగ్గర నీళ్ళుతోడుతున్న చెల్లాయమ్మగారు కనిపించింది. తన్ను తలుపు తట్టి లేపిందెవరు? గాజుల చప్పిడి వినిపించింది. వీధిలో మాటలు - కాదు - పెద్ద కేకలు వినిపించాయి. వరదాచార్యులవారి గొంతు. నడిచాడు. రాఘవయ్యతో మిడిల్‌స్కూల్ హెడ్‌మాష్టార్ని గురించి చెపుతూ కేకలుపెడుతున్నాడు వరదాచార్యులవారు. ఏమయింది అంతటి రోగం! చేతులో పొడుగాటి చేతికర్ర వుంది. యజ్ఞోప వీతాన్ని చెవికి చుట్టి, గోచీ ఎగగట్టి, తలకు తుండుగుడ్డ చుట్టి చేతులు చాచుకుంటూ బిగ్గరగా కేకలుపెడుతున్నారు. ఆయన్ని అప్పుడు చూసి రాత్రి అంత జబ్బుచేసిందని ఎవరూ అనుకోరు. చిత్రమని పించింది కరుణాకరానికి.

# నాలుగు

కరుణాకరానికి ఆ ఊళ్ళో మొదట కొన్నిరోజులపాటు ప్రతి విషయం చిత్రంగానే కనిపించింది. మర్నాడు కాఫీ తాగి బయలు దేరాడు. విశ్వపతి మాష్టారింటికి వెళ్దామనుకున్నాడు. అందుకే ముత్తేన్ని రమ్మన్నాడు. నాలుగడుగులు వేసేసరికి తెలిసింది రాజా రావు వచ్చాడని. అతనికోసం బయలుదేరి వెళ్ళాడు. ఊరికి కొంచెం వెలుపలగా ఉంది ఉప్పరిగూడెం. చింతచెట్లపుంత దాటిపోవాలి. ఆ పుంతలో దయ్యాలుంటాయనేవారు. చిన్నతనంలో ఆడుకుంటున్న ప్పుడు తనకూ ఏదో దయ్యం కనిపించినట్లు గుర్తు. వెళ్ళాడు.

ఉప్పరిగూడెంకు కొంచెం ఆవలగా పెద్దదొడ్డి. ఒక చివరగా రెల్లుగడ్డి కప్పిన పాక. ఆ గుడిసెలతో పోలిస్తే అది రాజభవనం. రాజారావు పందులతో సతమతమౌతున్నాడు. పిలిచేదాకా తలెత్తి చూడలేదు. ఆప్యాయంగా కౌగలించుకున్నాడు. వరండాలాంటి జాగాలో రెండు పేముకుర్చీలు కనిపించాయి. కేన్ కొంత అక్క డక్కడ ఊడిపోయి వ్రేలాడుతున్నాయి ముక్కలు. కుర్చీలో కూర్చో మన్నాడు రాజారావు. "అన్నారం వెళ్దామని బయలుదేరానురా. కాని అమ్మకు వంట్లో బావుండటంలా. సగందూరం వెళ్ళాక తిరిగి రావాలనిపించింది. నువ్వొచ్చావని ముత్తెం చెప్పాడు."

లోపలనుంచి మూలుగు వినిపిస్తూంది. "మీ అమ్మ యిక్కడ వుందా?" అన్నాను.

"ఇక్కడే వుంటూంది."

"అన్నయ్య?"

"అన్నయ్యకూ అమ్మకూ ఎప్పుడూ పడటమంటూ లేదు. ఆమె పెద్దదై పోయాక కాలు విరిగింది. నన్ను వదిలి వుండలేసి నేది. నే వెళ్తే అన్నయ్య తిట్టేవాడు. ఆయన బాధ ఆయనది. నాలాంటి కులంచెడిన వాడితో సంబంధాలు పెట్టుకుంటే కూతుళ్ళకు పెళ్ళిళ్ళు కావని భయమట. వరదాచార్యులుగారూ, అన్నప్పశాస్త్రిగారూ హెచ్చరించారట. అందుకని నన్ను గడప తొక్కవద్దని శాసించాడు అన్నయ్య. అమ్మ పడ్చింది. మంచంపట్టింది. దానికితోడు రోటిమీద పడి కాలు విరగ్గొట్టుకుంది. నే నేదో పాడైపోయానని ఆమె బాధ."

"ఇంతకీ నువ్వు చేసిన తప్పేమిటి?"

"చాలా చేశాంలే. ఆ విషయంకాదు నే నంటూంది. తప్పులు చేసినందుకూ ధర్మం తప్పినందుకూ ఏ మనిషినీ లోకం హింసించదు. కాని అర్హత లేనివాడు చేసిన తప్పును మాత్రం లోకం సహించదంతే-"

"అర్హతంటే?"

"అధికారముండాలి, హోదా కావాలి, డబ్బుండాలి - అటువంటివాడు అనాకారైనా మన్మథునిగా భావించి ఆరాధిస్తుంది లోకం. ఎంతటి లోభైనా దానకర్ణుణ్ణి గౌరవించినట్లు పూజిస్తుంది. పొరపాటున ఎంగిలిచేయి విదిలించకపోతాడా అనే ఆశ చావదు."

"నువ్వు బాగానే సంపాదిస్తున్నావట?"

"బాగానే సంపాదిస్తున్నా. కాని యింకా స్థిరపడనిలదొక్కుకునే దాకా నా ప్రయోజకత్వాన్ని అంగీకరించదీ వూరు." చూస్తూండు, ఈ బిజినెస్ యిలాగే కలిసొస్తే రెండేళ్ళల్లో ఈ అయ్యవార్లంగార్లకూ, పెద్దలకూ ఈ పందులతోపాటు పంక్తిభోజనాలు పెట్టిస్తా. నన్ను రావిచెట్టు క్రింద పదిమందిలో తిట్టిన వెధవలంతా దొంగచాటుగావచ్చి పదీ పాతికా అప్పులంటూ తీసుకుపోతూనే వుంటారు. ఎవరూ లేనప్పుడు

రహస్యంగా పొగిడిపోతారు. అప్పు తీసుకునేటప్పుడే తిరిగి యివ్వ మని వాళ్ళకి తెలుసు. నేను అడగననీ తెలుసు. ఛీ - ఛీ - వీళ్ళు మనుష్యులంటావా ? మొన్నేం జరిగిందో తెలుసా !"

మూలుగు వినిపించింది. లోపలికి వెళ్ళాడు రాజారావు. కరుణాకరం అతన్ని అనుసరించాడు. చావుబ్రతుకుల మధ్య కొట్టు మిట్టాడుతున్న ప్రాణం ఆ ఎముకల గూడులో మూలుగుతోంది. మందు తెచ్చాడు కిటికీలోంచి. ఆమె తాగదు. చంటిపిల్లలా మూతి బిగించింది. "అమ్మా - తాగమ్మా! మా అమ్మవు కాదూ!" అంటూ ప్రాథేయపడుతున్నాడు.

"ఎందుకురా నన్నిలా ఏడిపిస్తావ్ ? - నాకెందుకురా ఈ మందులు ? కళ్ళముందు కనిపిస్తావని యిక్కడకొచ్చాగానీ నీ ముష్టి మందులకోసంటరా పక్షీ..." అంటూ ముఖం తిప్పుకుంది ముసలమ్మ. లోకానికి ముసలమ్మ. అతనికి అమ్మ.

"అమ్మా! నేను ఎప్పుడూ కళ్ళముందు కనిపించాలని నీ కుందం టున్నావు. కాని, అమ్మా! నాకు నువ్వు ఎప్పుడూ కళ్ళముందు కని పించాలనిఉండటం తప్పంటావా! నిన్ను బ్రతికించుకోవద్దా...అమ్మా!" అంటూ మళ్ళీ ప్రయత్నించాడు మందు పోయటానికి. ఆమె అతని మాటలు వినడంలేదు. తల అటు తిప్పింది. ఎంతో ప్రయత్నంమీద చివరకు రాజారావు బలవంతంగా తల మళ్ళీ యిటు త్రిప్పి బుగ్గల మీద బలంగా చిటికవేశాడు. ఆ దెబ్బను భరించలేని జీర్ణ శరీరం బాధతో గిలగిల లాడటానికి ప్రయత్నించి శక్తి లేక నోరుతెరచి మందు తాగింది. భయోత్పాతంతో ఆమె కళ్ళు నీరసించాయి. ఆ ఎండిపోయిన శరీరంలోంచి రవ్వంత నీటిపొర పైకుబికి దీనంగా- "రాజా—నువ్వా కొడుతున్నావానన్ను. అన్నయ్యలా నీకూ నరకం రా - ఒరేయ్ నన్ను కొడ్తావుట్రా పక్షీ - పెద్దమ్మాయి దగ్గరకు పోతా -" అంటూ పడవటానికి ప్రయత్నిస్తోంది.

"లేదమ్మా! నిన్ను కొట్టలేదు. నిన్నెందుకు కొడతానమ్మా!"

"కాదు. కొట్టావు నువ్వు..."

తల్లి చెవికి నోరు దగ్గరపెట్టి, 'అమ్మ' తల నిమురుతూ, తల క్రిందకు దిండు సర్ది "అమ్మా! చిన్నప్పుడు జబ్బుచేసి నేను మందు త్రాగనని మారాం చేస్తుంటే నువ్వా యిలాగే నా బుగ్గలమీద చిటిక వేసి, ఏడవటానికి తెరిచిన నోటిలో మందు పోసేదానివి గుర్తుందామ్మా! అది - ఆ రోజు నువ్వు నన్ను కోపంతో కొట్టావా? అసలది కొట్టడమంటావా? అంతే అమ్మా. యిప్పుడు నువ్వు నా బిడ్డలాంటిదానివి. ఏడవకమ్మా-" అంటూ దుప్పటి మెడదాకా కప్పి, ఈవలకొచ్చి గోడనున్న ఏసుక్రీస్తు పటంముందు తల వంచి పదిక్షణాలు మౌనంగా నిలబడ్డాడు. కరుణాకరం కళ్ళు చెమర్చినై. "ఈ రాజారావును గురించి ఎన్ని అపనిందలు? తనూ అనుమానించాడేమో".

ఆనాడు మధ్యాహ్నంవరకూ మిత్రులిద్దరూ మనసారా మాట్లాడుకుంటూ కూర్చున్నారు. మధ్యలో రెండుసార్లు కాఫీ తెచ్చి యిచ్చాడు రాజారావు.

కరుణాకరం - "రాజా! నాకు ఒక్కటే చిత్రంగావుంది. అనుకోకుండా ఆకస్మికంగా ఇన్ని లక్షలు వచ్చిపడ్డాయి. దాన్ని గురించి హైదరాబాదులో రకరకాల అనుమానాలూ అపవాదులూ బయిలుదేరాయి. ఎవరి బుద్ధిబలాన్ని అనుసరించి వారు నా అదృష్ట రహస్యాన్ని తెలుసుకుంటానికి ప్రయత్నించారు. కాని ఈ ఊరొచ్చాక ఎవరూ నన్ను ఆ విషయం అడిగిన పాపాన పోలేదు. అసలు పుట్టుకతోనే కర్ణుడి కవచకుండలాల మాదిరి ఈ డబ్బుకూడా నా వెంటనే వచ్చిందని వారెలా భ్రమపడుతున్నారో నాకరం కావడంలా..." అన్నాడు.

"కరుణా! ఇదొక తమాషా. అందరికీ తెలుసు నీ అదృష్ట రహస్యం. కనీసం తెలుసుననుకుంటున్నారు. అదొక తృప్తి. కాని డబ్బుకు ఎంగిలిలేదు కరుణా! మురికి పెంటలో కనిపించినా బంగారం బంగారమే..."

"ఏమనుకుంటున్నారు నా అదృష్టంగురించి?"

"ఇందాక చెప్పావే—ఎవరి బుద్ధిబలం వారిది. కొందరు దొంగ నోట్ల వ్యాపారంలో సంపాదించావంటున్నారు. కొందరు మరేదో చీకటి తప్పుచేసి - దోచుకున్నావంటున్నారు. హత్యలాంటి నేరం ఏదో ఇందులో వుందని అనుమానించేవారూ ఉన్నారు. ఇటువంటి అభిప్రాయ భేదాలు చాలావున్నా, నీ అదృష్టం అన్యాయార్జిత విత్తం అనే విషయంలో మాత్రం అందరిదీ ఏకాభిప్రాయమే."

దీనంగా నవ్వాడు కరుణాకరం. మిత్రుడి ముఖంలోకి చూసి "మరి నీ అభిప్రాయ మేమిటీ?" అన్నాడు.

"దాన్నిగురించి నేను ఆలోచించలేదు. నాకు ఒక అభిప్రాయ మంటూ లేదు. కాని ఒక విషయం మాత్రం నాకు చాలా బాగా తెలుసు. కొందరు పాపం చెయ్యలేరు. చెయ్యాలనే కోరిక పుట్టినా చేయలేరు. పొరపాటున వారి శక్తికిమించి పాపం జరిగినా దాన్ని జీర్ణం చేసుకోలేరు. నువ్వు ఆ తరగతి మనిషివని నా నమ్మకం."

"మా యిల్లు విశ్వపతి దగ్గరనుంచి మళ్ళీ కొనుక్కుందామను కుంటున్నాను..."

"ఏం, ఈ వూళ్ళోనే ఉండిపోదామనా?"

"ఉండాలనే వుంది."

కరుణాకరం నిర్ణయం సరియైనది కాదని అభిప్రాయపడ్డాడు రాజారావు ఈ విషయంలో ఇద్దరూ చాలాసేపు తర్జనభర్జన పడ్డారు

చివరకు రాజారావు "కరుణా ! నీ అభిప్రాయాలు నీవి, నా అభిప్రాయాలు నావి. దానికి కారణం మన అనుభవాలు వేరు కావడమే. తర్కంతోనూ చర్చలతోనూ తీరే సమస్యలు కావివి - సరే తర్వాత మాట్లాడుకుందాం. నే అర్జంటుగా అన్నారం వెళ్ళి రావాలి...."

కరుణాకరం తిరిగి వరదాచార్యులగారింటికి వచ్చాడు. వసంత మొదటిసారి తన్ని చూసి సిగ్గుపడింది. పమిట వళ్ళంతా కప్పుకుంది. మున్సబుగారు పిలిపిస్తే వెళ్ళారట వరదాచార్యులవారు. ముత్తెం వచ్చిపోయేట్టు. "స్నానానికి నీళ్ళుతోడనా కరుణాకరం" అంది వసంత. "వద్దు, యిప్పుడేవస్తా" అంటూ వెనక్కు తిరిగి విశ్వపతి మాష్టారింటికి బయలుదేరాడు.

వరండాలో అయిదారుగురు పిల్లలు కనిపించారు. వాళ్ళ కాయన చదువు చెప్పటంలేదు. పగటి వెలుగులో ఆయన ముఖం మరీ పేలవంగా కనిపించింది. ఈశ్వరునికైనా లొంగక అనంత దిగంతాలను వెతుక్కుంటూ కనిపించకుండా కదిలిపోయే కాలం ఎంత చిత్రమైంది ? ఆయన పాఠాలు చెప్పటంలేదు. అల్లరిచేస్తున్న పిల్లల్ని గదమాయించడంలేదు. అసలీ ప్రపంచంలో బ్రతుకుతున్న మనిషిలా కనిపించటంలేదు. విశాలమైన ఫాలభాగం ముడుతలతో వికృతమైంది. గుంటలు పడిన కళ్ళు - మాసిన గడ్డం - మరోలోకాన్ని చూస్తూ మైమరచిన ఏదో పరధ్యానం-నిర్లిప్తత-విషాద నీరదచ్ఛాయలతో పునీతమైన తేజోమూర్తి —

"ఏం చదువిది పంతులుగారూ ? తేరగా పందుం వడ్లు పట్టించుకు తెగతినగానే సరిపోయిందా ?" అంటూ ఉరిమాడొక ఆసామి పన్నెండేళ్ళ కుర్రాణ్ణి రెక్కపుచ్చుకు లాక్కొచ్చి. ఆగాడు

కరుణాకరం. ఆ ఆసామిని గుర్తుపట్టాడు. అతడు రంగదాసు. ఆ కుర్రాడి నెత్తిమీదనుంచి రక్తంచిమ్మి బుగ్గలమీద కారుతోంది.

రంగదాసు గర్జనకు మాష్టారు త్రుళ్ళిపడి "నువ్వా సాంబయ్యా! వంట్లో సుస్తీచేసిందట ఎట్టా వుందిప్పుడు ?" అన్నారు.

ఆ పరామర్శకు రంగదాసు వళ్ళు భగ్గుమంది. "నీ కళ్ళకు బయర్లు కమ్మాయి పంతులూ. ఎవరు సాంబయ్యో ఎవరు రంగదాసో గూడా నీక్కనిపించటంలేదు. ఏం చూసుకొని పంతులూ యింత పొగరు ?"

కేకలువిని ఆ యింట్లోంచి ఒక స్త్రీమూర్తి బయటకు వచ్చింది. కల్యాణికాదు. మాష్టారిభార్య గౌరమ్మగారు. వస్తూ "నువ్వా రంగదాసూ! కేకలు వినిపిస్తే యెవరో అనుకున్నాను. ఏం జరిగింది నాయనా?" అంది సమాధానం చెప్పటానికి ప్రయత్నిస్తూ.

"ఆ సాంబయ్య కొడుకు కంకర్రాయిపెట్టి మా మేనల్లుడి తల చితక్కొట్టాడట. అదిచూస్తూ పంతులు పకపకా నవ్వి, ఎవరుచేసిన కర్మ వారనుభవించాలి బాబూ - అంటూ వేదాంతం వలకపోశాట్ట. ఇదేనాంట చదువుచెప్పే యవ్వారం? మా పిల్లల్ని చంపటాని కాంటా యిక్కడకు పంపిస్తే..."

మరో నాలుగడుగులు ముందుకువేసి రంగదాసు భుజంమీద చెయ్యివేసి "గుర్తున్నానటోయ్ !" అన్నాడు కరుణాకరం.

"గుర్తులు అంతగా మర్చిపోవడానికి మేమేమన్నా లక్షలు సంపాదించామా కరుణాకరం!"

ముళ్ళకంచలా మీదపడ్డాయి ఆ మాటలు. ఆ తర్వాత రంగదాసు మరికొంతసేపు మాష్టార్ని తిట్టి వెళ్ళిపోయాడు.

"ఎవరు బాబూ?" అంది గౌరమ్మగారు.

"గుర్తుపట్టలేదా గౌరమ్మగారూ...!"

"చెప్పు బాబూ...?"

"గోపాలంగారబ్బాయిని కరుణాకరాన్ని."

"ఆఁ! నువ్వా బాబూ. ఎక్కడున్నావిన్నాళ్ళూ? పాపం! చిన్నతనంలోనే కష్టా లొచ్చిపడ్డాయి - నీ గురించి ఏదో అనుకున్నారు, బాగానే వున్నావన్నమాట. కూర్చోబాబూ. ఎసట్లో బియ్యం పోసివస్తా. ఈపూట కిక్కడ భోంచేద్దుగాని" అంటూ లోపలికి వెళ్ళింది. తలెత్తిచూశాడు. పచ్చటి చీర కట్టుకున్న కల్యాణి లోపల మసలుతూ క్షణకాలం కనిపించింది. కల్యాణి భోజనం వడ్డిస్తుందేమో. దగ్గారు మాష్టారు. తానింతవరకూ మరిచిపోలేని దగ్గు.

"మాష్టారూ ?"

కళ్ళు మూసుకున్నారు పడక కుర్చీలో అలాగే నడుంవాల్చి. మళ్ళీ పిల్చాడు బిగ్గరగా. కళ్ళుతెరిచి "ఎవరు ?" అన్నట్లు కనుబొమలు ముడివేసి పోల్చుకుంటానికి ప్రయత్నించారు.

"నేనండీ! కరుణాకరాన్ని, గోపాలంగారబ్బాయిని, గుర్తులేదూ ?"

అలాగే నిర్లిప్తంగా చూశారు మాష్టారు.

"మీదగ్గర చదువుకున్నాను. మిమ్మల్ని చూడాలని వచ్చాను."

"ఎందుకు?" మాష్టారు కళ్ళు మూసుకున్నా రా మాటంటూ.

"నేనెవరినో గుర్తించారా అసలు మాష్టారూ ?"

"కరుణాకరానివి కదూ!"

" మీ ఆరోగ్యం బొత్తిగా పాడై పోయిందట పాపం...! "

"ఆరోగ్యమా! ఏం జబ్బుమనిషిలా వున్నానా ?"

నవ్వారు మాష్టారు. ఆయనదగ్గరకు తానెందుకొచ్చాడు ? ఎన్నో చెప్పాలని, ఎంతో దగ్గరనుంచి చెప్పాలని సలసల కాగింది మనస్సు. ఆ అర్థంలేని ఆర్ద్రితలేని పరామర్శ మండుతున్న ఆ మనస్సుకు ఊరట కలిగించలేదు.

కొంచెంసేపు నిశ్శబ్దం.

ఉన్నట్టుండి "మనిషి అదృష్టవంతుడో కాదో దేన్నిబట్టి నిర్ణయిస్తావు కరుణాకరం ?" అన్నారు మాష్టారు.

"బావున్నావా కరుణాకరం ?"

ఆ గొంతు - ఆ ప్రశ్న వినగానే త్రుళ్ళిపడి తలెత్తి చూశాడు. కల్యాణి క్షణకాలం నివ్వెరపాటు చెందాడు. మాష్టారు దగ్గారు మళ్ళీ. కుర్చీలోంచి లేవడానికి ప్రయత్నించి తూలిపడ్డారు. "ఖడవ కానా! లోపలికిపో. పాడుబుద్ధి - గుమ్మంలోకి మగుపురుగును రానీయదు. లేచిపోవటానికి ఎవడు దొరుకుతాడా అని ఎంతసేపూ-" కరుణాకరం మేష్టారి మాటలకు దిగ్భ్రమ చెందాడు.

కల్యాణి బుసలు కొడుతూ చెంగుతో కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయింది. తర్వాత మరికొంతసేపు ఆయాసంతో ఉక్కిరిబిక్కిరై "ఇలాంటివాళ్ళు బ్రతకటం అవసరమంటావా ? అసలు మనిషి ఎందుకు బ్రతుకుతాడో నువ్వుకాస్త చెప్పగలవా ?"

"అలా ఎందు కడుగుతారు మాష్టారూ? మీ దగ్గర కళ్ళు తెరచిన నేను ఏ విషయమైనా మీ కెలా చెప్పగలను చెప్పండి...?"

"ఏం - రంగదాసూ నాదగ్గరే కళ్ళు తెరిచాడు. ఇప్పుడు బలవంతంగా నా కళ్ళు తెరిచిపోలేదూ ! ఈ వయస్సులో నేనేం

చూసుకొని బ్రతుకుతున్నానంటావ్? అన్నీ ఉడిగిపోయాక, ఏ పని చేయటానికీ శక్తి లేకపోయాక ఏమనిషైనా ఎందుకు చావడంటావ్? బిడ్డలకోసం! - కన్నబిడ్డల్ని చూసుకొని కడుపు నింపుకుంటానికి, వాళ్ళ సుఖాన్ని తన సుఖమనుకొని జుర్రుకుంటానికి -నేనూ అందుకే బ్రతుకుతున్నా. కాని ఈ ప్రాణం ఎప్పుడు పోతుందా - ఎప్పుడు రెక్కలు విప్పుకు ఎగిరిపోదామా అని అది చూస్తోంది."

గౌరమ్మగారు భోజనానికి లెమ్మంది. మాష్టారి పరిస్థితి చూశాక మనస్కరించలేదు. కాని ఆమె బలవంతంమీద నాలుగు మెతుకులు ఎలాగో తిన్నాడు. భోజనంచేసి మాష్టారు మళ్ళీ వరండా లోకి పోయి పడకకుర్చీలో పడుకుని కళ్ళు మూసుకున్నారు.

గౌరమ్మగారు నడవలో కూర్చోబెట్టి తన బాధలన్నీ కరుణా కరానికి చెప్పుకు ఏడ్చింది. పెద్దకొడుకు గోవిందుకు పెళ్ళయిందట. బాగుపడతాడని గుంటూరు యిల్లరిక మిచ్చారట. అంతే - అతను కొడుకనే విషయం మర్చిపోయారట. డాక్టర్ పరీక్ష చదివి గుంటూరు లోనే ఉద్యోగం చేస్తున్నాడట. తల్లిదండ్రు లున్నారనే విషయం అతనూ మరిచిపోయాడట. వచ్చి చూసి నాలుగేళ్ళయిందట. తాము వెళ్ళినా మాట్లాడడట. యిల్లు గడవటం కష్టంగావున్నా, పొరపాటు నన్నా పదిరూపాయలు పంపి ఎరుగడట. యిల్లు కూడా తాకట్టు పెట్టుకున్నారట రెండువేలకు, కల్యాణి పెళ్ళికోసం. కానీ, ఊళ్ళో వాళ్ళంతా అమ్మాయిమీద అపవాదులువేసి పెళ్ళి చెడగొట్టారట. ఆ బెంగతో మాష్టారి ఆరోగ్యం చెడి వైద్యానికంటూ ఆ డబ్బంతా హరించుకుపోయిందట. యిల్లు అమ్మేదామంటే కొనేవారు కని పించటం లేదట. ఒకరిద్దరు ముందుకొస్తే వరదాచార్యులవారు చెడ గొట్టారట.

ఇలాగే ఈ పదేళ్ళల్లో జరిగిన కథంతా చెప్పింది గౌరమ్మ గారు. మౌనంగా విన్నాడు కరుణాకరం.

పదేళ్ళక్రితం నాలుగెకరాల మాగాణీ చూసుకుంటూ, పాతిక మంది పిల్లలకు పాఠాలు చెప్పుకుంటూ సుఖంగా బ్రతుకుతున్న కుటుంబం అది. అందులో రెండెకరాలమ్మి, గౌరమ్మగారి నగలమ్మి, తమ యిల్లు కొనుక్కున్నారు. ఆ తర్వాత జరిగిన మార్పులివన్నీ. చివరికి కరుణాకరం చెప్పిన మాటల సారాంశం : "మాయిల్లు మళ్ళీ నే కొనుక్కుంటాను. మీ తాకట్టు డబ్బుకూడా నేనే కడతాను. మీ కుటుంబానికి చేయగలిగిన సహాయమంతా చేస్తాను."

"అమ్మీ !" కేకపెట్టారు మాష్టారు.

బయటకు నడిచారిద్దరూ.

"ఎవరితో మాట్లాడుతున్నావ్ ?"

"గోపాలంగారబ్బాయి కరుణాకరం."

"అంటే ?"

కరుణాకరాన్ని చూసి కళ్ళు తుడుచుకుంది గౌరమ్మగారు.

"ఓహో- నువ్వటోయ్ ! మా గోవిందనుకున్నా ! వాడి రూపం ఎలావుంటుందోకూడా గుర్తుకు రావడంలేదుసుమా!"

"మీరేవెళ్ళి చూసిరండి మాష్టారూ ఒకసారి...."

"ఆఁ! అదే అనుకుంటున్నా, ఒక్కగానొక్క కొడుకుగదా, వాడిదగ్గరే వుండటం న్యాయం. రేపు మాఘమాసంలో కళ్యాణి పెళ్ళిచేసి ఏకంగా అబ్బాయిదగ్గరికే వెళ్ళిపోదామని..."

"కళ్యాణికి సంబంధం కుదిరిందాండీ ?"

"ఆహా! నీకు తెలియదూ ! ఈపాటికి వరదాచార్యులవారు చెప్పేవుండాలే.ఇరగవరపువారనీ...విశాఖపట్నంలే...పిచ్చాస్పత్రిలో

పోలీసు సూపరింటెండెంటు. వెయ్యిరూపాయలు జీతం. అమ్మాయి కంటె ఓ గుప్పెడు పొట్టనుకో. అయితేనేం ఫర్వాలేదని పెళ్ళికొడుకే వప్పేసుకున్నాడు. కరుణాకరం! పుట్టాక పెళ్ళికాకుండా ఎండి పోయి ఎవరూ చచ్చిపోరుగా! ఈ సంగతి వరదాచార్యులవారిని అడిగి తిరిగొచ్చి నాక్కాస్త చెప్తావ్?" అంటూ కళ్ళు మూసుకున్నారు మాష్టారు. మళ్ళీవస్తానని చెప్పి వరదాచార్యులుగారింటికి బయలుదేరాడు కరుణాకరం.

వరదాచార్యులవారి ఆవరణలో కోలాహలంగా వుంది. గోవింద యతీంద్రులవారు వేంచేశారు. వారు ఎప్పుడు ఎక్కడకు వచ్చినా కాషాయాంబరధారులైన శిష్యబృందం ఓ పదిమందిదాకా వెంట వుంటారు. ఆధ్యాత్మిక ప్రచారం చేసుకుంటూ ఒకోవూరు పోయి పదేసిరోజులుంటూ ముముక్షువులకు ముక్తిమార్గం చూపెడుతూ పర్యటిస్తూంటారు. వారు పర్యటించే ప్రతివూళ్ళోనూ శ్రీవారి బృందానికి భోజనవసతి సౌకర్యాలు ఏర్పాటుచేయడానికి ఒకరిద్దరు పెద్ద మనుష్యులు సిద్ధంగానే వుంటారు. ఆ ఊళ్ళో సాధారణంగా శ్రీవారికి అటువంటి ఏర్పాట్లు చేసేది రాఘవయ్యే. డబ్బు ఆయన పెట్టుకుంటాడు. దాన్ని సద్వినియోగం చేసేది వరదాచార్యులవారు.

కరుణాకరాన్ని చూడగానే శ్రీవారి పాదాలదగ్గర కూర్చున్న వరదాచార్యులవారు లేచి ఎదురొచ్చి తీసుకువెళ్ళి శ్రీవారికి పరిచయం చేశారు. అరుగుమీద శ్రీ వారు ఒక్కరూ అతి ప్రశాంతంగా కూర్చున్నారు. ఓ పాతికమంది భక్తులు క్రింద కూర్చున్నారు. శ్రీవారికి మామూలుగా చేతులెత్తి నమస్కరించాడు కరుణాకరం. చిరుమందహాసంతో ఆశీర్వదించారు శ్రీవారు. "కూర్చో బాబూ!" అంటూ పక్కకు జరిగారు వరధాచార్యులవారు.

"నాయనా కరుణాకరం! నీగురించి చాలా విని, ఎంతో సంతోషించాను బాబూ. భగవంతుడు నీకు సిరిసంపద లిచ్చాడు. తెలివితేట లిచ్చాడు. శక్తియుక్తు లిచ్చాడు. వాటిని సద్వినియోగం చేసుకోవడమే తరువాయి. మానవ జీవితానికి పరమార్థం ఏమిటను కున్నావ్? ఈ భూమండలంమీద సృష్ట్యాదినుండి ఎందరు పుట్టడంలేదు? ఎందరు గిట్టడంలేదు ? కాని అందులో కొన్ని జన్మలు మాత్రమే సార్థకాలు కాగలవు. మానవసేవయే మాధవసేవ అన్నారు. నీకున్నది నువ్వు తినడమేకాదు. పదిమందికి పెట్టాలి. ఎదుటివారికంట నీటిని తుడిచే అదృష్టం నీకిచ్చాడు భగవంతుడు. నీకూ అటువంటి సంకల్పమే గలిగి ఈ వూరొచ్చావని చెప్పారు ఆచార్యులవారు. చాలా సంతోషం కలిగింది-".

ఈవిధంగా జీవితధర్మాలనూ, మోక్ష రహస్యాలనూ మధురాతి మధురంగా వివరిస్తూ గంటన్నరసేపు మహోపన్యాసం గావించారు శ్రీవారు. భోజనాలవేళ కాగానే రాఘవయ్యగారింటికి సపరివారంగా తరలిపోయారు. శ్రీవారి బృందానికి వంటలు తయారుచేసే భారం ఎప్పటిమాదిరి దేవాలయ అర్చకులైన నంబాచార్లుగారిమీద పడింది. వారంరోజు లుంటారట శ్రీవారు. ఈవారం రోజులూ భజనలతో, ప్రార్థనలతో, ఆధ్యాత్మిక చర్చలతో ఎంతో దివ్యంగా వుంటుందట. వరదాచార్యులవారుగూడా శ్రీవారితో తరలి వెళ్ళారు.

# ఐదు

వసంత—

కరుణాకరం ఆ వూరు తిరిగిరావడం, అందులోనూ అంతులేని ఐశ్వర్యాన్ని మూటగట్టుకు రావడం, ఆ ప్రాంతాల్లో గొప్ప సంచలనాన్ని కలిగించినమాట నిజం. కాని ఆ సంచలనమంతా ఒక యెత్తు, వసంతలో కలిగిన మార్పు మరొక యెత్తు. కరుణాకరం తనవాడనే నమ్మకం ఆమెకు కలిగింది. తల్లి దండ్రుల ప్రోత్సాహం కూడా లభించటంతో ఆమె ఆశలు రెక్కలు తొడుక్కున్నాయి.

వసంత—

పదిహేడు సంవత్సరాలలో యౌవనాన్ని కూడబెట్టి పీటముడి వేసుకున్న సౌందర్యం - ఈ జగన్నాటకంలో పాల్గొనటానికి గజ్జకట్టి తుది మెరుగులు దిద్దుకుంటున్న స్త్రీ - సృష్టి నిర్మాణంలో భాగమైన అద్భుత పరివర్తన యింకా ఆమెలో జరుగుతూంది. తొలిసారి రెక్కలు విప్పుకున్న పక్షిలా ఆమె మనస్సు అంతు తెలియని మార్గాలకు పరుగులిడి ఉద్రిక్తమైపోతున్నది. శరీరంలో కోర్కెలు ప్రవేశించి, ఘనీభవించి, హృదయంలో నిండి, గూళ్ళు కట్టుకొని పైపైకి పొంగుతున్నాయి. కరుణాకరం రాకతో ఆమెలో చిత్రమైన సంచలనం బంధులు తేరింది. హృదయం క్షణక్షణం నిష్కారణంగా తంద్రిస్తున్నది, కళ్ళు దేనికోసమో వెతుకుతున్నట్లు కదులుతున్నాయి. స్పష్టంగా కనిపించని అనుభవాల ఆశలు పిలుస్తూ, రంగు రంగులతో నాట్యం చేస్తున్నాయి. కళ్ళు తెరిచి కలలు కంటున్నది మనస్సు.

అవి అలలై ఉవ్వెత్తున పొంగి ఆమెను అద్భుత లోకాలకు గుంజుకు పోతున్నాయి.

వయసొచ్చిన పిల్ల - ఎటువంటిదా వయస్సు? సహారావంటి జీవితంలో ఒయాసిస్సు లాంటిది. ప్రాణికి భగవంతుడు ప్రసాదించిన అద్భుతం—దివిని భువిమీదకు దించి అల్పప్రాణి కౌగిట్లో కరగింప చేసే దివ్యశక్తి. లోకమంతా తనదని, వెన్నెలంతా తనకని, తన జీవితపు వెలుగు నీడల్లోనే ప్రపంచం పడి లేస్తున్నదని, గతాన్నీ భవిష్యత్తునూ జయించి వర్తమానాన్ని జీవితానికి మహార్థంగా చెప్ప గల మనోహర వ్యాఖ్యానం ఈ వయసు పొంగుల రవళిలో ధ్వని స్తూంది. ఈ రవళికి అర్థం తెలుసుకోవాలని కలవరపడుతున్న స్త్రీ వసంత. కరుణాకరం రాకతో ఒక్కసారి ఆమె నిద్రలేచింది. నరాలు వింటినారిలా బిగిసినట్లు వ్యథలేని బాధతో మత్తుగా మూల్గిన వళ్ళు విరుచుకుంటూ, నఖశిఖపర్యంతం పులకలీని కంపిస్తూ బీరువా అద్దంలో తన మూర్తిని చూసుకుంటుంది.

ఆ రాత్రి జబ్బుచేసి ప్రాణం పోతున్న దనుకున్నప్పుడు తన చేతిని అతనిచేతి కందించాడు తండ్రి. తన కర్థమయింది, తను అతనిది. నిజానికి అతనూ అదృష్టవంతుడే అనిపించింది. ఆ క్షణంలో అతని స్పర్శతో వెచ్చబడింది వళ్ళు. అతని అనుభవం ఎటువంటిదో? తన క్రీగంటి చూపులకోసం రాజులు, రారాజులు తపించరా? తన సౌందర్యం చూసి రాణులు, రారాణులు తలలువంచి విలపించరా? తన మేని లావణ్యం త్రాగాలని, వదన సౌందర్యం గుండెలకు పులుముకోవాలని యువలోకం తపస్సు చేయడంలేదా? ఆనాడు రంగదాసు ఆలయ ప్రాంగణంలో ధ్వజస్తంభం దగ్గర ఎవరూ లేకుండా చూసి చేయి పుచ్చుకులాగిన ఉదంతం గుర్తుకు వచ్చింది.

పాపం! రంగదాసు!! అందని ద్రాక్షపళ్ళకోసం అర్రులు చాస్తున్న అల్పజీవిలా కనిపించాడు.

తాను సౌందర్యం కప్పుకున్న యౌవన మాధురి. బంగారానికి పరిమళాలు పూసి, ప్రపంచాన్ని స్వర్గధామంగా చేసి, జీవితాన్ని స్వప్నమందిరంగా మార్చి, శరీరాన్ని కాంక్షామధువుతో మత్తెక్కించి ప్రాణికి అర్థం చెప్పే సృష్టిశక్తి ఆమెను ఆవహించింది. ఆశక్తి చైతన్యస్రవంతియై సాగిసాగి అనంతయాత్రను కాసేపు ఆపి, ఆమె శరీరంలో ప్రవేశించి లోన నిలవలేక ముందుకు సాగలేక ఆమె కళ్ళ ల్లోంచి తొంగి చూస్తున్నది.

ఆ రోజు భోజనాలయాక కరుణాకరానికి వక్కపొడి యిచ్చి రమ్మని తల్లి చెల్లాయమ్మగారు పంపినప్పుడు తానేంచేసింది? చేతికి చేయి తాకేలా అరచేతిలోగిల్లి తుర్రున పరుగెత్తింది. ఏమనుకున్నాడు కరుణాకరం? ఏదో ఉద్వేగం తోస్తున్నది మనిషిని. తన స్నేహితు రాలు శాంత వచ్చేసరికి ప్రాణం లేచివచ్చింది. ఏదో సంబరంతో కౌగిలించుకుంది నెచ్చెలిని. నంబాచార్లు కూతురు శాంత – యతీం ద్రులవారు వచ్చారని తెలిసి భర్తతో కలిసి వచ్చింది. శాంతను చూస్తే తనకెప్పుడూ జాలిగానే వుండేది. ఎంత మంచిపిల్ల! కుంద నపు బొమ్మలా వుండేది. తనకంటె ఆరునెల్లు చిన్న. పధ్నాలుగేళ్ళ ప్పుడే ప్రపంచాన్ని ఉద్ధరించటాని కన్నట్లు పెళ్ళిచేసుకుని అప్పుడే ముగ్గురు పిల్లల్ని కని పెద్దముత్తయిదువై కూచుంది. కరుణాకరం గురించి చెప్పింది. శాంత చేతిని రెండుచేతుల్లోకి తీసుకొని నిమురుతూ, జీవిత రహస్యం చెప్తున్నట్లు, తనలో తానే మాట్లాడుకుంటున్న ఉన్మాదిలా తమ వివాహం గురించీ, భవిష్యత్తును గురించీ, వైవా హిక జీవితాన్ని గురించీ, తనకున్న అభిప్రాయాల గురించీ, ఇష్టా యిష్టాల గురించీ ఎంతో చెప్పింది. పరధ్యాన్నంగా వింటూంది శాంత.

"మీరు వైష్ణవులు, తనేమో బ్రాహ్మణులు - ఇదీ చివరకు శాంత వెలిబుచ్చిన అనుమానం.

వసంతకు మరో పదినిముషాలు మాట్లాడే అవకాశం లభించింది. "ఈ రోజుల్లో ఎవరు చూస్తున్నారోయ్ అవన్నీ. మన రంగదాసు మేనకోడలు గుంటూరులో డాక్టరు పరీక్ష చదువుతుందనుకున్నారే - గుర్తులేదుటోయ్ క్రితం దసరాకు వచ్చింది గుర్రంతోక జడ ఎగరేసుకుంటూ! సాయిబ్బు లచ్చాయిని పెళ్ళి చేసుకుందిట! ఎన్ని జరగటం లేదు ? అదీగాక నాన్నగారికీ అదే అభిప్రాయం వుంది..."

"చెప్పారా నీకు ?"

"నాకు చెప్పారనికాదు. చెప్పకుండా చాలా విషయాలు అర్థంచేసుకోవచ్చు" అంటూ తల్లికీ తండ్రికీ ఒకనాటి రాత్రి జరిగిన సంభాషణంతా చెప్పి "ఏమంటావ్ శాంత ?" అంది వసంత.

"మంచిదే. అదృష్టవంతురాలివే నోయ్. అన్నట్లు కల్యాణి ఎలావుంది ?"

"నీకుతెలియదా ?" అంది ఆశ్చర్యంగా వసంత.

"ఏమిటి ?"

"ఆ రాజారావుతో - ఏమిటో చాలా గొడవగా వుంది."

"పాడులోకం వసంతా. అదుగో పులి అంటే యిదుగో తోక అంటారు. చిన్నప్పటినుంచీ మనకు తెలుసుగదుటోయ్ దాని బుద్ధి."

ఇంతసేపూ వసంత తన గొడవేమో తాను చెప్పుక పోయింది గాని శాంత యోగక్షేమాలను గురించి అడగనే లేదు.

"ఎలావుందోయ్ కాపురం?" అంది చివరకు వసంత.

"ఏం చెప్పమంటావ్, ఆయన ఉద్యోగం పోయింది, గడవటానికి చాలా యిబ్బందిగా వుంది."

నిజమే - శాంత భర్త బుచ్చిరామయ్య వుద్యోగం వూడిపోయింది. జొన్నపాడులో ఓ ప్రయివేటు స్కూల్లో మాష్టరీ ఉద్యోగం చేస్తూ, ఓ డెబ్భై రూపాయలు తెచ్చుకుంటున్నాడు గదా అని సంబరపడి నంబాచార్లుగారు అతగాడికి పిల్లనిచ్చి పెళ్ళిచేశారు. ఇంతకూ జరిగిందేమిటంటే, అతగాడు చెప్పేది నాలుగైదు క్లాసులకే అయినా సర్వదా జీవితం క్షణభంగురమనీ, మాంస రక్త కండరమయమైన మానవ శరీరం జుగుప్సాకరమైన పాపభాండారమనీ - హితోపదేశాలు చేస్తూవుంటే, పిల్లలకు చదువు రాకుండా వారిని జోగులుగా బైరాగులుగా చేస్తున్నాడనే నేరంమీద మేనేజిమెంటువారు ఆయనను బర్తరఫ్ చేశారు. బుచ్చిరామయ్య అతి సాదాగా మాటవరసకు ఆవార్త భార్యకు చెప్పి "ఎప్పటికైనా వదలించుకోవలసిన బంధాలే యివి. యిప్పటికి మరొక బంధం విడింది." అంటూ నిర్లిప్తంగా నవ్వాడట.

శాంత గుండె పగిలి కన్నీరు తుడుచుకుంటూ "మరి రోజులు గడిచే మార్గ మేమిటండీ? ఏంచేద్దాం ఈ ముగ్గురు పిల్లల్నీ?" అని అడిగిందట.

ఆయన మరొకసారి భార్య అజ్ఞానాంధకారంచూసి జాలిగా నవ్వి "పిచ్చిదానా! నారుపోసినవాడు నీరు పోయడా?" అంటూ ఓదార్చి వాకిట్లోకి లేచ్చక్కాపోయాడట.

శాంత కన్నీరు తుడిచింది వసంత. "నా అదృష్టం నీదనుకో. అంతా అనుకున్నట్లు జరగాలే గానీ నీకేంలోటు?" అంటూ ప్రశ్ని

చింది. ఒక మెతుకున్నా నీకు సగంపెట్టి మిగిలిన సగం నేను తింటాను, సరా?" అంటూ హామీయిచ్చింది. ఆ ఓదార్పు మాటలు శాంతకు ఎంత ఊరట కలిగించాయో ఆ పరాత్పరునికి తెలియాలి.

అంతటితో ఊరుకుంటే బావుండేది. "ఎటువంటి వాజమ్మ మొగుడయ్యాడే తల్లీ నీకు?" అంది జాలిగా. ఆ మాట శాంత మనస్సును తడిగుడ్డలా పిండింది. "ఇటువంటి దరిద్రుల్ని కట్టుకోవడం కంటె ఏ బండరాతినో మెడకు కట్టుకుని బావిలోపడి చావడం మేలు" అంటూ మరోమాటు వోదార్చింది. స్నేహితురాలి సానుభూతి తనకు ఊరట కలిగిస్తున్నదో, గుండెల్లో బాకులు గుచ్చుతున్నదో అర్థంచేసుకోలేక "యింక వస్తా" అంటూ లేచింది శాంత.

"అప్పుడే ఏంతొందరోయ్...!"

"కల్యాణిని కూడా చూసి వెళ్తా యింటికి. నువ్వూ వస్తావా?" అంది శాంత.

"అతనొస్తాడు... వెతుక్కుంటాడు నాకోసం." వసంతకూ నిజంగా తెలియదు అతను తనకోసం వెతుక్కుంటాడో లేదో...!

శాంత వెళ్ళగానే మరోకసారి అద్దం ముందు నిలబడి రెప్పలార్పకుండా రెండు నిమిషాలు నిలబడింది వసంత. అతనింకా రాలేదు. విశ్వపతి మాష్టారిల్లు కొనడం వ్యవహారం ఈపాటికి పూర్తయి వుండాలి. అంత డబ్బుండీ, ఆ పల్లెటూరు వచ్చి స్థిరపడటంలో కరుణాకరం అంతర్యం అర్థం కాలేదు వసంతకు. వెర్రివాడనుకుంది. నిన్న ఆ మాటే చూచాయగా అంది -

"మనబోటివాళ్ళం యిటువంటి దిక్కుమాలిన వూళ్ళల్లో వుండలేం కరుణాకరం" అని.

"ఉండగలగడం, ఉండలేకపోవడం మన మనుకోపనంలో వుంది వసంతా..."! అన్నాడు తమాషాగా చూస్తూ.

ఎంత లోతైన మనిషి !

తనను గురించి అంత తక్కువగా మాట్లాడతాడు! అతని మనస్సు మార్చగలననే ధైర్యం తనకుంది. తను అందరిలాంటిదీ కాదు. పుట్టినప్పుడే నంబాచార్లుగారు జాతకం చూసి చెప్పారు - "అందరిలా బ్రతకదు. అయితే మహారాణి ఔతుంది. లేకపోతే మహాయోగిని కాగలదు" అంటూ. బుద్ధుడి కథ గుర్తుకొచ్చింది. యతీంద్రులవారి ఉపన్యాసం గుర్తు కొచ్చింది. ఎంత వారలైనా కాంత దాసులే అంటారు. ముప్పై యేళ్ళ వయస్సుల్లో ఎలా జయించాడు మోహాన్ని? పదునున్న పడుచుపిల్ల ఎదురై వుండదు. తనే తల్చుకుంటే? విప్రదాసంతటి వాడు ఏమయ్యాడు? అటువంటి పట్టుదలవస్తే యతీంద్రులనే వివాహమాడి బుష్‌కోటు తొడిగించి, పప్పు రుబ్బించలేదూ...?

నవ్వుకుంది!

అద్దంలో నీడ నవ్వింది.

కొందరు స్త్రీలుంటారు - వారి జీవితాలను నడిపించే ప్రధానశక్తి యౌవనపు వేడిలో - కాలి మండుతున్న సౌందర్యం- ఆ సౌందర్యమే చివరకు వారిని మ్రింగి, రక్తం త్రాగి చైతన్య హీన మైన రస రహితమైన శరీరాన్ని - చెరుకు పిప్పిలా, పగిలిన రబ్బరు బెలూన్‌లా, కొడిగట్టిన దీపంలా, ఎండిన సెలయేటిలా, మోడై నిలిచిన చెట్టులా, వాడివత్తలైన పూవులా వదిలి అదృశ్యమై పోతుంది.

వరదాచార్యులవారు తిట్టుకుంటూ వచ్చారు. ఆయనకు కోపం వచ్చింది కరుణాకరం మీద. తన రాయబారం లేకుండా విశ్వపతిగారి యిల్లు కొన్నందుకు.

"ఆ విశ్వపతికి మతి లేదంటూరు. అంతా నాటకం. వాడు కొంపలుతీసేరకం. చాపక్రింద నీటిలాంటి దుర్మార్గుడు. ఈ కరుణాకరానికి బాగానే వేశాడు టోపీ. ఎనిమిదివేలా ఆ పాడుబడిన కొంప ! నాలుగువేల కిస్తానని తిరిగా డిన్నాళ్ళూ, ఎవరు కొన్నారు? అయినా ఒకళ్ళనని లాభమేముందీ? ఎవడి కొంపో తీసి లతలు కొట్టు కొచ్చాడు. నడమంత్రపు సిరి అంటారు చూడు - ఆ ముత్తెంగాడిచేత పొలం కొనిపిస్తున్నాడు. జాయింటు వ్యవసాయంట! వీడు బాగు పడతా డంటావా?"

వరదాచార్యులవారు వంటింట్లో పీటమీద కూర్చొని, భార్య చెల్లాయమ్మగారితో ఏవేవో మాటలు చెప్తున్నాడు. కరుణాకరం వచ్చి వింటాడని భయంవేసింది వసంతకు. వాకిట్లో కేక వినిపించింది. అది ముత్తెం గొంతు. ఆచార్యులవారు బయటకొచ్చారు.

"కరుణాకరం యింకా అక్కడే వున్నాడా?" ఆచార్యుల వారు అడిగారు.

"ఉన్నారండి యిప్పటిదాక. వ్యవహారం పూర్తయిపోయాక రాజారావుగారింటి కెళ్ళారు" అన్నాడు ముత్తెం.

"డబ్బంతా యిచ్చేశాడా?"

"యిచ్చేశారండి. యిల్లు తాకట్టు మొత్తంగూడా వడ్డీతో చెల్లుబెట్టారండి..."

"మరి విశ్వపతి యిల్లు ఖాళీచేయడూ?"

"కొన్నాళ్ళపాటు సగబాగంలో ఉండమని చెప్పారండి కరుణాకరంగారు. ఆరొక్కరికీ ఎంత కావాలండీ...! మరి సామానూ అదీ అక్కడకు తీసుకురమ్మన్నారండి...!"

కథ యిలా అడ్డం తిరుగుతుందనుకోలేదు వరదాచార్యుల వారు. తనతో సంప్రదించకుండానే వ్యవహారాలు చక్కబెడ్తున్నాడు కరుణాకరం. ముత్తెం మంత్రిలా మారిపోయాడు. కడుపు మండి నట్లయింది. ఆ వ్యథ బైటకు కనిపించనీయకుండా "ముత్తెం! ఏదో పొలం కొంటున్నారట పాతికెకరాలు! ఎంతవరకొచ్చిందేమిటి?" అన్నారు ఆచార్యులవారు.

"పాతికేం ఖర్మండీ! కాలవకు ఎగువను నాలుగొందల ఎక రాలు కొనాలని బేరం సెటిల్ చేశారు".

"ఆఁ! ఆ చవిటిపఱ్ఱ ఎందుకు పనికొస్తుందోయ్?"

"బర్మానుంచో యెక్కడ్నించో ఇంజనీర్లని పిలిపిస్తున్నారండి. ఆళ్ళు చవిటిభూముల్నిగూడా సాగుచేసే పద్ధతులు, చేసి చూపిస్తా రటండీ!"

"మరి సాగుబడికి నీళ్ళెలాగోయ్ ?"

"ఇంజన్లు పెడతారుటండీ! కృష్ణా కాలవలోంచి ఎగువకు నీరు లాగుతారుటండీ! అందుకే మద్రాసెళ్లా లంటున్నారు - కానీ ఆచార్లు గారూ! కరుణాకరంగోరు మనూరు తిరిగి రావడం, యిక్కడ ఉండా లనుకోటం, ఊరును బాగుచేద్దామనుకోటం - అంతా మన అదృష్ట మండీ. ఏమంటారు?" అంటూ చుట్ట ముట్టించాడు ముత్తెం.

కాని ఆచార్యులవారికి ఏమనాలో తెలియలా. "ఔను, మంచిదే. అయితే సామాన్లు ఇప్పుడే తీసుకురమ్మన్నాడా ?"

"ఔనండీ, కార్లో పెట్టుకు రమ్మన్నారు."

వసంత ఈ సంభాషణ అంతా వింది కిటికీదగ్గర నిలబడి. మనస్సు ఏదో కీడు శంకించింది. అంతటితో సరిపెట్టుకుంది.

# ఆరు

అంతా చిటికెలమీద జరిగిపోయింది. కరుణాకరం వాళ్ల యిల్లు తిరిగి కొనుక్కోవడం, దాన్ని భారీయెత్తున పునరుద్ధరించటానికి పనులు ప్రారంభించడం, వందల సంఖ్యలో కూలీలు రంగంలోకి దూకడం, గారడీవాడు మంత్రదండం తిప్పినట్లు కొద్దిరోజులలోనే ఆ యింటిస్వరూపం మారిపోవడం - యిదంతా ఆ ప్రాంతంలో పెద్ద సంచలనమే కలగజేసింది. ఆ యింటి పడమటగల ముత్తయ్యా జాగానూ, తూర్పునగల వియ్యన్న శాస్త్రిలుగారి స్థలాన్నీ కూడా కొన్నాడు కరుణాకరం. ఎంత పెద్ద బేరమైనా పిల్లల బొమ్మల పెళ్ళిళ్ళలా జరిగిపోతున్నాయి. కరుణాకరం స్థలంసంగతి అడగగానే "అంతకంటె ఏంకావాలి బాబూ! మీకు కావాలంటే - మీ యిష్టమొచ్చినట్లు కానీండి" అన్నాడు ముత్తయ్యా.

"ఎంత కావాలి ?" అని అడిగాడు కరుణాకరం.

"మీ దయ" అన్నాడు ముత్తయ్యా.

"ఆరువందల నలభై గజాలు. కోమటి రత్తయ్యా ఆ మధ్య ఏడురూపాయలుచేసి అమ్మాడుట. పది తీసుకో. ఆరువేల నాలుగొందలు. యింటిక్రింద మిగిలిన పదహారువందలూనూ. మొత్తం ఎనిమిది వేలు సరేనా?" అన్నాడు కరుణాకరం.

ముత్తయ్యా ఆశ్చర్యపోయాడు. తనను తనే నమ్మలేకపోయాడు. "సరేబాబూ ! మీదయ. కానీ, ఎక్కువిస్తున్నారేమో" అన్నాడు. బేరం సెటిలైపోయింది. ఈవార్త అడవి మంటలా వ్యాపించింది. "ఆయన చేతికి ఎముక లేదు" అన్నారు కొందరు.

"పిచ్చి మారాజు" అన్నారు కొందరు. వరదాచార్యులవారి గుండె మండిపోయింది. వియ్యన్న శాస్త్రిల స్థలంకూడా కరుణాకరం కొనా లనుకుంటున్నాడని తెలుసుకున్నాడు. శాస్త్రిలవారిని కలుసుకొని, ఓ గంట హితోపదేశం చేసి "నీకు తెలియదు బావా! వాడికి ముద నష్టపు డబ్బు వచ్చిపడింది. ఎవరికందింది వాళ్ళు కాజేస్తున్నారు. నువ్వుమాత్రం ఈ అవకాశం ఎందు కుపయోగించుకో కూడదు ? పిల్లలుగలవాడివి, నీది వెయ్యిగజాల స్థలమా ? దానికి ఇరవై వేలూ, పెంకుటింటికి పదివేలూ కావాలని కూర్చో. ఎందుకివ్వడో నే చూస్తా" అంటూ రెచ్చగొట్టాడు.

"బేరంకాస్తా చెడితే బావగారూ?"అన్నాడు వియ్యన్న శాస్త్రి.

"నేనున్నాగా" అంటూ హామీ యిచ్చాడు ఆచార్యులవారు. వెంటనే కరుణాకరం దగ్గరకు బయలుదేరాడు. కరుణాకరం యింట్లో లేడు. యిల్లు బాగుచేయడమేగాదు, మడమట దిక్కున మరో అయిదారు గదులు కడుతున్నారు. ఒకప్రక్కనుంచి బ్రహ్మాండమైన ప్రహారీగోడ లేస్తూంది. పాతయింట్లో రెండు గదుల్లో విశ్వపతి మాష్టారి కుటుంబ ముంటూంది.

"గౌరమ్మా! కరుణాకరమేడీ?" అంటూ లోపల ప్రవేశిం చారు ఆచార్యులవారు.

"ఏవో భూములు చూట్టానికని ముత్తెం, అతనూ కాలవ దగ్గర కెళ్ళారండీ!" అంది గౌరమ్మగారు.

"కారు బయటే వుందే ?"

"మరో జీపుకారుట్ట. వచ్చింది - దాంట్లో వెళ్ళారు."

చుట్టూ పరామర్శగా చూశారు యిల్లంతా ఆచార్యులవారు. ఒక ఆకారం మంచంమీద పడుకొని వుంది. "ఎవరూ ఆ పడుకుంట?" అన్నారు కళ్ళు చిట్లించి చూస్తూ.

"అమ్మాయి..."

"ఏం, వట్లో బావుండలేదా?"

"ఏమిటోనండీ ! కలత పట్టుకుంది. మనిషి చూడండి ఎలా చిక్కిపోయిందో!" అంటూ చల్లార్చిన జావ గ్లాసులో పోసి కళ్యాణిని లేపి కూర్చోబెట్టి అందించింది గౌరమ్మగారు.

కళ్యాణి త్రాగనంది. నాలిక చేదుగా వుందంది. తల్లి బ్రతిమ లాడింది. తల అటుత్రిప్పి పడుకుంది మళ్ళీ కల్యాణి. గౌరమ్మగారి ప్రాణం విసిగిపోయింది. "ఏం కొరకంచు వయ్యావే. దిక్కుమాలిన దానా? పుట్టెడురోగం కడుపున పెట్టుకొని మందు తినవ్. దారకం తేకపోయె. ఏమేడిపిస్తున్నావే నా ప్రాణానికి..." అంటూ తిట్టడం మొదలుపెట్టింది.

వరదాచార్యులుగారు పీట వంటింటికి దగ్గరగా లాక్కుని కూర్చుంటూ "గౌరమ్మా! అమ్మాయికి పెళ్ళి సంబంధాలు ఏమన్నా చూస్తున్నారా ? ఆ జబ్బులూ చికాకులూ గొడవలూ అన్నింటికీ కారణ మేమిటంటావ్? ఏ వయసులో జరగవలసినవి ఆ వయసులో జరక్కపోవడమే" అంటూ మొదలుపెట్టాడు.

"ఏం చెప్పమంటా రన్నగారూ! మగదిక్కుండీ లేనిదా న్నయ్యాను. ఇంతకూ దానికర్మ" అంటూ చీది కొంగుతో ముక్కు తుడుచుకుంది గౌరమ్మగారు.

"కర్మేమరి! మా వసంతకంటె నాలుగైదేళ్ళు పెద్దదిగదా? (నిజానికి వసంతకంటె కళ్యాణి మూడేళ్ళు పెద్దది. ఆ విషయం

ఆచార్లుగారికీ తెలుసు.) పెళ్ళయితే ఈపాటికి నలుగురు పిల్లల్నికనేది. కాని చెల్లెమ్మా! మీ ఆయనకు మతిపోయిందే అనుకో!.... నాలాంటి వాళ్ళ నెవర్నన్నా కాస్త సాయం చేయమంటే చేయలేక పోయామా! ఎలాగో అలా అమ్మాయికి పెళ్ళి చేసెయ్యలేక పోయామా ?"

"మీ ఎరుకలో ఏమన్నా సంబంధాలున్నాయా అన్నగారూ?"

"దేశం గొడ్డుపోయిందిటమ్మా! అయితే ఒకటి - ఓ రాజ కుమారుడిలాంటి కుబేరుణ్ణో మన్మథుణ్ణో, ఆఫీసర్నో చేసుకోవాలని, ప్రతి పిల్లకూ వుంటుంది. తల్లిదండ్రు లనుకోవడంలోనూ తప్పులేద నుకో. కాని ఉన్నపరిస్థితుల్ని అర్థం చేసుకోవాలి. మరోమాట చెప్తా, జొన్నపాడులో ఓ నిక్షేపంలాటి సంబంధముంది. ఈ మాఘ మాసంలో ఆ కాస్త అయిందనిపించవచ్చు. ఏమంటావ్ ?"

"కుర్రవాడు ఏంచేస్తున్నాడు అన్నగారూ ?"

"భుక్తికి లోటులేదనుకో. పాడికుండలాటి నౌఖరీ. తను తినాగలడు, పదిమందికి పెట్టాగలడు."

గౌరమ్మగారి ప్రాణం లేచొచ్చింది. "అన్నగారూ! కల్యాణి మీ బిడ్డనుకోండి. మీరే ఆ పుణ్యం కట్టుకొని దాన్ని ఒక యింటి దాన్ని చేయండి బాబూ. యింతకూ పెళ్ళికొడుక్కి ఏమిటీ ఉద్యోగం? బడిపంతులా... ?"

"అదేం కాదులే. శివాలయంలో అర్చకుడు. ఆ జొన్నపాడు ఆలయముంది చూశావ్! ఎంతో స్తోమత గలది. అర్చకులు వంశ పారంపర్యా అనుభవించడానికి సుక్షేత్రంలాటి మాగాణీ నూట పాతిక సెంట్లుంది. నెలకు పాతిక రూపాయలు జీతం వస్తుంది. ఉండ

టానికీ యిల్లుంది. మరోసంగతి ! అతగాడెంతో బుద్ధిమంతుడు.- ఈ నాటి కుర్రకారుకున్న పోకిరీ వేషాలు లేవనుకో !"

గౌరమ్మగారి ఉత్సాహం కొంత చచ్చిపోయింది. "ఏమం టావు చెల్లమ్మా ? నువ్వు సరేనంటే ఈ సంబంధం కుదిర్చే భారం నాది. అతడు కూడా ఎంతో దైవభక్తుడు. పిల్లల్ని నడిసముద్రంలో ముంచి మొదటి భార్య గతించిందా ! ఇంక నాకు పెళ్ళి వద్దంటూ ఐహిక బంధాలన్నీ తెంచుకుని ఏ ఆశ్రమానికో పోవాలనే తలంపుతో ఉన్నాడు ఇన్నాళ్ళూ. ఎందరో చెప్పారు. వినలేదు. మొన్న యతీంద్రులవారి దర్శనంకోసం వస్తే కల్యాణి సంగతి చెప్పి వప్పిం చాను. పిల్లను చూశాడులే. ఎంత దురదృష్టంలోనూ ఏదో అదృష్టం పెడతాడమ్మా భగవంతుడు. లక్ష్మీదేవిలాంటి పిల్ల, కల్యాణిని చూస్తే ఏ మహాయోగి మనస్సు చలించదు చెప్పు. తలనిండా స్నానం చేసి తడిగుడ్డలతో చెరువునుంచి మంచి నీళ్ళు తెస్తూంటా నాడు కల్యాణి."

"చూడు బాబూ ! పిల్లలో ఎంత పొందిక వుందో ?"

"ఏ ఐశ్వర్యాన్ని ఎవరు అనుభవించాలని పరమేశ్వరుడు నిర్ణ యిస్తాడో చెప్పలేం గదా ? లేకపోతే ఎవరో కోటీశ్వరుడు కష్టపడి లక్షలకు లక్షలు సంపాదించడ మేమిటి ? ఏదో నాలుగు నెలలు ఆయ నకు ముష్టి సేవలు చేశాడని ఆ ఆస్తినంతా ఈ దిక్కుమాలిన కరుణా కరానికి రాసి పోవడ మేమిటి అతగాడు ? చెప్పు చెల్లమ్మా... "

ఈ మాటలు వింటున్న కల్యాణి చెక్కిళ్ళు లజ్జాభారంతో అవ మానోద్వేగంతో ఎర్రబడ్డాయి. పడుకున్నది. బలం తెచ్చుకుని లేచి కూర్చుంది. ఆమెను తేరిపార జూస్తూ ఆచార్యులు "చక్కనిది చిక్కినా అందమేనని..." అంటూ మరొక ఉపన్యాసం ప్రారం భించాడు.

" మీ వసంతకు కూడా ఓ రెండో పెళ్ళి అన్నుకుణ్ణి చూడరాదు టండీ - ఇద్దరం ఒకేసారి చేసుకుంటాం పెళ్ళి!" అంది తీక్షణంగా.

ఆచార్యులవారి ముఖాన కొరడా చరిచినట్లయింది. కాని సంబాళించుకుని అతి శాపీగా "అదేమిటి తల్లీ! బిడ్డలాంటిదానివని సహాయం చేయాలనుకుంటే... ?" అని ఆమె ముఖంలోని తీవ్రతను చూసి ఆగాడు.

"బిడ్డలాంటిదాన్ని గనకనే చెప్తున్నానండీ - మీ బిడ్డలానే నన్నూ చూసుకోమని... "

"అందుకేగా ఈ ప్రయత్నం !"

"అంతకంటె మంచి ఉపాయం చెప్పనా ?"

"చెప్పు తల్లీ చెప్పు ! నువ్వు చెప్పేదానినయ్యావని తెలియక, తెలివితక్కువతనంకొద్దీ ఏదో చెప్పబోయాను."

"మీ దగ్గరో నాలుగు రూపాయలున్నాయా ?"

"ఏమిటి నువ్వనేది ?"

"కాస్త విషం కొని తెచ్చిపెట్టండి."

"చూస్తున్నావా చెల్లమ్మా దీని మాటలు ?"

"నేనే అందామనుకుని అనలేకపోయిన మాటలు అది అంది. అందులో తప్పేముంది అన్నగారూ! మీ అమ్మాయికే అయితే అటువంటి సంబంధం చేస్తారా ? అసలు ఆలోచిస్తారా ? మీ బిడ్డ కాదనేగా మీ కంత వెగటయింది ? మీ సహాయం అడిగామనేగా మీ కంత అలుసయిందీ ? ఎందుకండీ! తాటిచెట్లకు వచ్చినట్లు వయ సొచ్చి ? మీకేం ద్రోహం చేసామని మా మీద కత్తిగట్టారు అన్న

గారూ!" అంటూ ముఖం వాచేలా నానా చీవాట్లూ పెట్టింది. ఆచార్యులవారికి ఆశాభంగం కలిగింది. కాని ఎవరినో ఎవరో తిడుతున్నట్లు నిర్లిప్తంగా చూస్తూ "చెల్లమ్మా! ఈ దిక్కుమాలిన ప్రపంచంలో మనుష్యుల్ని మనుష్యులు అర్థం చేసుకోలేరనుకో. మీ అమ్మాయిని గురించి ఊళ్ళో చెలరేగిన పుకార్లు భరించలేక సహాయం చేద్దామనుకున్నాగాని - మొన్నమటుకు మొన్న యతీంద్రులవారు ఏకాహం చేస్తుంటే, కృష్ణా రామా అనుకుందామని వెళ్తే ఎవరినోట విన్నా ఇదేనా గొడవని? ఆ రాజారావు అయిపోయాడు - ఈ కరుణాకరాన్ని పట్టుకుంది. విశ్వపతి కూతురంటే తలుచుకుంటే విశ్వాన్నే జయించగలదు-అంటూ ఒక వాగుడా ఒక గోలా! ఈ మాట అలా అలా యతీంద్రులవారి చెవులదాకా వెళ్ళింది."

కల్యాణి కళ్ళల్లోంచి మనసులోని వెర్రిబాధ కరిగి పొంగింది. "భగవాన్! ఏం పాపం చేసాను - ఎందుకీ శిక్ష?" అంటూ దిండులో ముఖం దాచుకొని ఏడవలేక వెర్రిగా మూలిగింది. గౌరమ్మగారు భరించలేక "అన్నగారూ! దయుంచి వెళ్ళండి. మీ కెవరికీ ఎటువంటి అపకారం చేయలేదు మేము. మా మానాన మమ్మల్నిలా బ్రతకనీండి. అమ్మాయికి పెళ్ళికాకపోతే ఏ బండరాయో కట్టి బావిలో పారేసుకుంటాం. మీ సహాయం మాత్రం అర్థించం. వెళ్ళండి దయుంచి" అంటూ చేతులెత్తి నమస్కారం చేసింది.

వరదాచార్యులవారు యజ్ఞోపవీతాన్ని గిరగిరా తిప్పుకుంటూ "దిక్కుమాలిన లోకం, భగవద్గీతలో అన్నట్లు-అవ్వః! 'శ్రీరామా' అంటే బూతుమాటైపోయిందే! సానిదాన్ని ఉన్నమాటంటే ఏడుతరాలెత్తిందట. ఇన్నిచేస్తున్నా దాన్ని మీరుగనక యింట్లో పెట్టుకున్నారు. నేనయితే నిలువునా చీరేసేవాణ్ణి". అంటూ బిగ్గరగా కేకలుపెడుతూ వెళ్ళిపోయారు.

అక్కడే పడక కుర్చీలో పడుకున్న విశ్వపతిమాష్టారు కళ్ళు తెరిచారు. ఇంతసేపటికి ఆ కేకలు విని - "ఎవరూ ఆ వెళ్తున్నది! సాంబయ్యేనా!" అంటూ ఆవలించి లేచి కూర్చున్నారు.

గౌరమ్మగారు మాట్లాడలేదు.

మాష్టారికి కోపమొచ్చింది.

"అమ్మో! నేను అసమర్థుణ్ణనీ, అప్రయోజకుణ్ణనీ నాకూ తెలుసు ఏమనుకున్నావో! కాని క్షణ క్షణం లోకులందరితో పాటు నువ్వుగూడా నాకా విషయం గుర్తుచేయాలంటావా? ఎంత వెధవైనా భార్యకు దేముడే అన్నారు, నీ గొప్పతనం తెలియని అజ్ఞానులు పూర్వం - కనీసం యింటికి ఎవరు వచ్చేదీ ఎవరు పోయేదీ తెలుసుకునే అధికారం గూడా నాకు లేదన్నమాట! ఎటువంటి బోగం కొంపలో గూడా మొగాడికి ఆ అధికారం ఎప్పుడూ వుంటుంది తెలుసా?" అంటూ పదిమందీ వినాలనే కసితో పొలికేకలు పెట్టారు మాష్టారు.

గౌరమ్మగారు ఆ నిందాభారాన్ని భరించలేక కుమిలి పోయింది. ఆయన గుడ్లురుముతున్నాడు. ఆమె అవమానాగ్నిలో కాలిపోతూ "ఎందుకండీ అంతేసిమాటలంటారు? ఏం పాపం చేశామని ఇలా కడుగట్టి సాధిస్తున్నారు?"

"మరి ఆ కరుణాకరాన్ని తెచ్చి యింట్లో ఎందుకు పెట్టుకున్నావ్?"

"మీరేనా అంతేసి మాట లంటూంట!"

"నేనుకాదే పాపిష్టిదానా! మొన్న చెరువుగట్టు దగ్గర వరదాచార్లుగారే అన్నారు రంగదాసుతో!"

ఈ మాటలు వినటం కల్యాణికి కొత్తకాదు. ఒక విధంగా మొద్దుబారిపోయిన మనస్సది. కాని నాలుగు రోజులనుంచీ తిండిలేక బాగా నీరసించి, చీకాకు ఎక్కువై, మనోదౌర్బల్యం ఏర్పడి, వినలేక, నెత్తిమీద దిండు వేసుకుంది. గౌరమ్మగారు కుళ్ళికుళ్ళి ఏడుంది. విశ్వపతి మాష్టారు మళ్ళీ కుర్చీలో కూలబడి కళ్ళుమూసి "అమ్మీ! చచ్చిపోయిన మనిషిని చూశావా ఎప్పుడన్నా! ఎందుకేడుస్తావు? మన ముత్తయ్య పెళ్ళాం బ్రతికినన్నాళ్ళూ నీలాగానే ఏడ్చింది. సంసారం బరువంతా, ప్రపంచ భారమంతా తనమీదున్నట్లే గిలగిల లాడిపోయేది. ఇదంతా మాయ అంటే అజ్ఞానంలో నమ్మలేం - అది పోయింది. ఏమయ్యాయి ఆ బాధలన్నీ? అందరం అంతేనే పిచ్చిదానా! అద్దెకొంపలాంటిది జీవితం. ఉన్నంతకాలం అంతా మనదే అనిపిస్తుంది. మరోసంగతి మరచిపోబోకు. నీకీ ఏడుపెందుకో చెప్పనా? ఈ సంసారం బరువంతా నువ్వే మోస్తున్నావని భ్రమ పడుతున్నావ్. కాదుసుమా! భర్తను నేను. భర్త అనే మాటకు ఉత్పత్తి అర్థం తెలుసా? భరించువాడు భర్త అన్నారు. మరో చిత్రం! ఈ ప్రపంచానికంతటికీ మరో భర్త వున్నాడు. వాడి పేరు భగవంతుడు. కనిపిస్తే బావుండును. ఈ విణ్ణి ఓదార్చటం నాకు చేత కావటంలా, కాస్త ఊరట కలిగించరాబాబూ అని గడ్డం పుచ్చుకు బ్రతిమాలేవాణ్ణి."

"పడుకోండి మీరు దయుంచి!" అంది పగిలిన కంఠం.

"వెర్రిదానా! అజ్ఞానులం. యతీంద్రులవారేం చెప్పారు? అంతా నీ చేతిలో వుందని విర్రవీగకోయ్ వెర్రినాగమ్మా, నేనంటూ వున్నాను. "కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషుకదాచన-" అన్నాడంటే శ్రీకృష్ణపరమాత్మ - ఏమిటి అర్థం? కర్మచేసే అధికారమే నీకుంది. ఫలితం భగవంతుడికి వదిలిపెట్టు - అన్నాడు అమాయకుడు.

అంటే తాత్పర్యం! - 'కాపురంచేసి పిల్లల్ని కనడం నీ చేతుల్లో వుందిరా చిట్టితండ్రీ! కాని వాళ్ళు ఏమవుతారో అని ఏడవటానికి నువ్వెవరివి?' అని. ఇదుగో అమ్మీ, మనం నిమిత్తమాత్రులం. అమ్మా యికి పెళ్ళికాలేదని అంతగా కుమిలిపోకు. ఆయేగీక వుంటే, ఆ ఘడియ వస్తే - విష్ణుమూర్తి సాక్షాత్తూ ఆ కరుణాకరంలా గరుడ వాహనమెక్కి వచ్చి, రుక్మిణిని ఎత్తుకుపోయినట్లు ఏ లాకీమీదనో ఎగనెత్తుకు పోతాడు.

భరించలేక కల్యాణి - "నాన్నా! యింక పడుకో - ఉక్కు-మాలినదాన్ని పుట్టకపోయినా బావుండేది. నీ మతిపోగొట్టాను. అమ్మ ఏమౌతుందో తెలియదు నీవిలా అంటూంటే" అంది దుఃఖాన్ని ఆపుకుంటూ.

"ఏం ఫర్వాలేదమ్మా. నారు పోసినవాడు నీరు పోయడూ-భర్తృహరి ఏమన్నాడు?"

"బియ్యంలేవు యింట్లో" అంది గౌరమ్మగారు.

"బిందెలున్నాయా అయిపోయాయా?"

"లేవు."

"మనకు బిందెలే ఆస్తి! పోనీ చెంబులు మిగిలాయిగా! తాతగారి నాటిది ఆ తామ్రపాత్ర. దాన్ని పంపించు రంగదాసు దగ్గరకు.

పట్టరాని కోపంతో అసహ్యంతో వంటగదిలోకి వెళ్ళిపోయింది గౌరమ్మగారు. వెంకటేశ్వరస్వామి విగ్రహంముందు పడుకొని ఏడుస్తూ "స్వామీ! ఏడుకొండలవాడా! ఇంత దుర్మార్గం నాలో ఎందుకు పెట్టావు తండ్రీ! కన్నబిడ్డల్ని ద్వేషిస్తున్నాను. కట్టు

కున్న భర్తను హింసిస్తున్నాను. ఈ జీవితాలకు ఏమిటి బాబూ పరిష్కారం... ?"

వెచ్చని చేయి తగిలింది. కన్నీరు తుడిచింది. "అమ్మా! ఎవరన్నారమ్మా నువ్వు బిడ్డల్ని ద్వేషిస్తున్నావని? ఎవరు చెప్పారమ్మా నాన్నను హింసిస్తున్నావని? కన్నబిడ్డల్ని ద్వేషించే తల్లి యీ భూమి మీద పుడితే ఈ గోళం పగిలిపోదా అమ్మా?" అంటూ కౌగలించుకుంది అమ్మను. కన్నీరు పంచుకోటంలో ఎంత సుఖముంది? ఆత్మీయులతో పంచుకున్న బాధ అదృశ్యమైపోతుందంటారు! ఎంత గాఢమైన ఆత్మీయత అది. తన రక్త కండరాలను చీల్చి, శరీరంలో భాగాన్ని పంచి, రూపకల్పనచేసి పెంచి సాకుతూ బిడ్డసుఖాన్ని తన సుఖంగా జుర్రుకుంటున్న మాతృమూర్తి. తన నీడను, కన్నీటిని, సుఖాలను, భవిష్యత్తును తన కంఠానికి ప్రతిధ్వనిని తల్లి ప్రాణస్పందనలో అనుభవిస్తూ కళ్ళు తెరిచిన పసిగ్రుడ్డు— శైశవాన్ని దాటి యౌవనపు మేలిముసుగును కప్పుకుంటున్న కల్యాణి.

ఎవరో పిలిచారు.

సంచి పుచ్చుకు వచ్చారు నంబాచార్లుగారు.

కళ్యాణి చేయి చూసి, ఏదో భస్మం పొట్లాలు కట్టియిచ్చి "యింకా రెండురోజులు" అంటూ లేచారు, కాని కదలలేదు. "శాంత వచ్చిందట గదండీ !" అంది కళ్యాణి.

"ఔనమ్మా! అల్లుడికి ఆ బడిపంతు లుద్యోగంకాస్తా వూడింది. మొగుణ్ణీ పిల్లల్నీ వెంటబెట్టుకొచ్చింది. ధరలు మండిపోతున్నాయి. ఎలా చెప్పమ్మా ఒక కుటుంబం కుటుంబం వచ్చి మరో కుటుంబంమీద పడితే ? రోజు గడవటం కష్టంగా వుంది. అవసరమొచ్చినప్పుడు

అందరూ వైద్యం చేయించుకొనేవారే. డబ్బుమాత్రం రాగిదమ్మిడీ రాల్చరు."

తన ఫీజుకోసం నిలబడ్డాడు నంబాచార్లు. ఆయనకు పెద్ద ఆశ లంటూ లేవు. ఎంతటి వ్యాధికైనా అయిదూ పదీ. ఎన్నడో నాలు గేళ్ళనాడు మున్సబుగారి అల్లుడికి టైఫాయిడ్ జ్వరం వచ్చినప్పుడు వైద్యం చేస్తే పదిహేనురూపాయలుపెట్టి పంచలచాపు కొనిపెట్టా రట. రాష్ట్రపతి బంగారు పతకంలా ఆ బట్టలు విశేషసమయాల్లో కట్టుకుంటూ ఏదోవిధంగా సంభాషణతెచ్చి ఆ మున్సబుగారి ఘనతను గురించీ, వైద్యంలో తనకున్న పాండిత్యం గురించీ యిప్పటికీ చెప్పు కుంటూ వుంటాడు.

"అమ్మా గౌరమ్మతల్లీ! అయిదురూపాయలిప్పిస్తే"అన్నాడు నసుగుతూ అడగలేక.

గౌరమ్మగారు మాటాడకుండా ఓ తామ్రపాత్ర తెచ్చియిచ్చి "ఇది ఆ రంగదాసుదగ్గరపెట్టి వచ్చిందాంట్లో సగం మీరు తీసుకోండి. సగానికి బియ్యంకొని పంపించండి" అంది.

నంబాచారుగారు తెల్లబోయారు.

"అమ్మా! మొన్ననే యిల్లమ్మినట్టున్నారు?"

"ఆ రోజుల్లో అప్పులు పుట్టాయిగదా అని ఊరంతా తెచ్చారు. అణా పైసలతో తీర్చారాయన. యింకా ఆ మున్సబు గారి రెండువందలూ అలాగే వుంది."

నిజమే! ఆ రోజుల్లో మాస్టారికంత పరపతి వుండేది. చెంబు చేతబట్టుకు వెళ్ళిపోయాడు నంబాచార్లు. పొట్లం విప్పి గౌరమ్మ గారు "అమ్మా! మందువేసుకో" అంది.

"ఎందుకు?" అంది పల్చగా నవ్వి కళ్యాణి.

"వేసుకోమ్మా. భగవంతు డిచ్చిన ప్రాణాన్ని చేజేతులా తీసుకునే అధికారం మనకు లేదమ్మా."

"అమ్మా! ఈ కరుణాకరం ఎందుకొచ్చిన ట్లీవూరు?"

"నాకేం తెలుసమ్మా!"

"ఈ మండుతున్న అగ్నిగుండంలో యింకా నూనె పోయటానికి వచ్చాడమ్మా. మనం అతని చేతులమీదుగానే సర్వనాశనమై పోతామని భయంగా వుందమ్మా".

"పొరపాటు పడకు తల్లీ. అతని మనస్సు అమృతం."

"జబ్బుపడి హితవు తప్పిన నోటికి అమృతం విషంలాగా ఉండదామ్మా ?"

అడుగుల చప్పుడు వినిపించింది.

కరుణాకరం. వస్తూనే తలవంచుకు పరధ్యానంగా ముందు గది లోకి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళినవైపు చూస్తూ కళ్ళు తుడుచుకుంది కళ్యాణి.

# ఏడు

కాలవకు ఎగువనున్న పొలాలు కొనడానికై తిరిగి తిరిగి కరుణాకరం యింటికి చేరేసరికి చీకటిపడింది. ఎనిమిదిగంటలు దాటిం దేమోకూడా. వరదాచార్యులుగారు జలవంతంగా కారేజీలో భోజనం పంపిస్తూనే వున్నారు. వంటవాణ్ణి పంపించమన్నాడు యింకా రాలేదు విజయవాడనుంచి. ఆకలి వేయలేదు. చెరువుగట్టు మీద మర్రిచెట్లు - వాటికి వ్రేలాడుతున్న ఊడలు- దూరంగా దీపాల తోరణం కట్టుకున్న వింతజంతువులా పరుగులు తీస్తున్న రైలుబండి - "అమ్మా మాధాకవళం" అంటూ చావుకేకను పోలిన ఆకలి కేక- ఏదో పుస్తకం చదువుతూ అలాగే కూర్చుండిపోయాడు కుర్చీలో. నిద్రకాని మత్తు కమ్మింది. ముత్తెం మధ్య రెండుమూడుసార్లు హెచ్చరించాడు భోజనం చేయమని - వద్దన్నాడు. నిష్కారణంగా కసురుకున్నాడు. ఏదో కుక్క మొరిగింది. కదిలాడు. ఆవులించి వళ్ళు విరుచుకొని లేచాడు. తనకు తెలియకుండానే కాళ్ళు నడిచాయి. విశ్వపతి మాష్టారు పడకకుర్చీలో అలాగే నిద్రపోతున్నారు. లైటు వెలుగుతూనే వుంది. రెండవగది చీకటిగా వుంది. లైటు వేశాడు. నులకమంచంమీద పడుకుని నిద్రపోతూంది కళ్యాణి. ఆ గది వెలుతురు వంటింట్లో పడుతూంది. గౌరమ్మగారు కొంగు పరచుకొని నిద్రపోతున్నారు.

ఆ రోజు ఆ యింట్లో ఎవరూ తిండి తినలేదని ఎవరికి తెలుసు. నంబాచార్లుగారు మళ్ళీ కనిపించలేదు గౌరమ్మగారికి. ఎదురు చూసి చూసి శోషవచ్చి పడిపోయింది. మంచందగ్గర అలాగే నిలబడి తదేకంగా కల్యాణినిచూస్తూ నిలబడ్డాడు. నిద్రలో ఏదో విచిత్రమైన

లక్షణం ఉంది. ఎంతటి భీకరుడైనా నిద్రాదేవి స్పర్శతో సౌమ్య మూర్తిగా కనిపించటం జరుగుతుంది. చిత్రమైన పసితనం అమాయకత్వం నిద్రాంకితమైన ముఖంమీద మేలిముసుగులు కప్పివేస్తాయి. ఆమెతో మాట్లాడలేని మాటలు అతని చూపులై, రక్తవిహీనమై పాలిపోయిన ఆమె చెక్కిళ్ళనూ, ప్రేమరాహిత్యంతో ఎండిపోయిన పెదిమలనూ, అవమానాల వడగాల్పులకు వడిలిపోయిన హృదయ కుసుమాన్ని, చీర తొలగి మెరుస్తున్న కాలి అందెలనూ స్పృశించాయి. ఆమె పెదిమలు చిగురుటాకుల్లా నిద్రామైకాన్ని జయించిన స్మృతుల ప్రభావానికి వణుకుతున్నట్లున్నాయి. కల్యాణి! ఎంత చిత్రమైన పేరు. అప్రయత్నంగా అతని కనులు చెమర్చాయి. అడుగు ముందుకు వేయబోయాడు. దగ్గు వినిపించింది. నిద్రతెరలను తొలగించుకున్న ముసలి సింహం. తప్పుచేసిన పాపిలా, పడగెత్తిన నాగుపాము తలతొక్కిన అల్పమానవునిలా కదిలి తొట్రుపడి - కంపించి, క్రుంగి వెనకకు మరిలాడు.

"ఎవరు వారు? సాంబయ్యా?" అన్నారు విశ్వపతిమాస్టారు. మారుమాటాడకుండా వెళ్ళిపోతున్న కరుణాకరాన్ని కళ్ళు తెరచి చూసింది కల్యాణి.

"అమ్మీ! ఆ పోతూందెవరు సాంబయ్యేనా?" అన్నారు మాస్టారు బిగ్గరగా.

"కాదు" అంది హీనస్వరంతో కల్యాణి.

"మరెవరు? రాజారావా?" ఆయన కంఠం హెచ్చింది. కల్యాణి మాట్లాడలేదు. మాట్లాడేశక్తి నశించింది. మాస్టారికి కోపం పెరిగి; రోషం హెచ్చి తన అశక్తతను తెలుసుకొని అది ద్వేషంగా మారింది. ఆయన లేచి తూలుకుంటూ కల్యాణిదగ్గరకొచ్చి జుట్టు

పుచ్చుకు లాగుతూ "పాపిష్ఠిదానా చెప్పు ఆ వచ్చిందెవరు? ఇవాళ నీ ప్రాణం తీస్తాను. అందరూ అంటుంటే ఏమిటో అనుకున్నాను. ఇవాళ కంటబడ్డావు. నీ బ్రతుకిలా బ్రద్దలయింది." అంటూ రెండు గుద్దులు వేశారు. పూవుమీద బండరాయి పడినట్లయింది. మూలగ టానికి గూడా ఓపిక లేక మంచంమీద వాలిపోయింది. మాష్టారు అలాగే తూలుకుంటూవచ్చి కుర్చీలో వ్రాలిపోయారు.

అలా ఎంతసేపు ఎవరి మనస్సులలో ఎటువంటి ఉప్పెనలు విజృంభించి జీవితాలను తృణాలమాదిరి కదిలించి కంపింపజేశాయో ఆ పరమేశ్వరునికే తెలియాలి. ఊరు మాటుమణిగింది. కల్యాణి కన్నులు మూతలు పడలేదు. లైటు వెలుగుతూంది. పిచ్చి ఆలోచ నలు. ఎప్పుడూ రాత్రే ఎందుకు కాగూడదు? తెల్లవారకబోతే ఏంకొంప మునిగింది? చీకటిని ప్రేమించేది పాపం ఒక్కటే కాదు, దురదృష్టంకూడా. అవమానాలు, బాధలు, ఆశల భయాలు, మెలు కువ వస్తుందనే భయంతో రాని నిద్ర. నక్కకూత వినిపించింది. నాన్న దగ్గు వినిపించలేదు. వినిపిస్తే బావుండేది. ఒంటరితనంతో విసిగిపోయింది. చేయని పాపానికి దూషించిన ప్రపంచం, పాపంచేస్తే అంతకంటె ఏంచేస్తుంది?

కల్యాణి లేచింది. ఏనుగుబలం వచ్చింది. కరుణాకరం మంచం మీద పడుకున్నాడేగానీ అతనికీ నిద్ర రాలేదు. ఆమె నెమ్మదిగా ఏమాత్రం సవ్వడి చేయకుండా అడుగులో అడుగు వేసుకుంటూ కరుణాకరం గదిలోకి వచ్చింది. కాని శబ్దాన్ని మించి, స్పర్శను మించి, బాధను మించి, కష్టసుఖాలను మించి - దేనికీ అందని జ్ఞానం మనిషి కుందేమో. "ఎవరు?" అంటూ లేచాడు కరుణాకరం. ఎదుటనున్న మూర్తిని చూసి అతని హృదయం ఎలా తండరించిందో, మనస్సెలా భ్రమించిందో అంతుచిక్కలేదు.

"కల్యాణీ ?"

"నేనే."

తూలుతూంది. భయపడ్డాడు పడుతుందని. కాని దగ్గరకు రాలేక "కల్యాణీ ! ఈ స్థితిలో నువ్వా - ఇంత రాత్రివేళ - కల్యాణీ ఏమిటిది ? పడతావు" అంటూ గొణుగుతున్నాడు.

"ఫర్వాలేదు" అంటూ టేబిల్ ప్రక్కన కుర్చీలో కూలబడింది.

మౌనం —

ఎన్ని క్షణాలు ?

ఎవరూ లేరక్కడ సాక్ష్యం చెప్పటానికి.

తర్వాత —

"కల్యాణీ !"

"ఊఁ"

"ఒంట్లో బాగా లేదట ?"

"ఔను.

" ఎందుకొచ్చావ్ ?"

పల్చటి నవ్వు —

"నేను రానూ రమ్మంటే !"

"రమ్మనకుండానే వచ్చావ్."

"నే వచ్చినసంగతి నీకు తెలుసా ?"

"అదే నా దురదృష్టం కరుణా. అజ్ఞానంలోవున్న సుఖం నాకు తెలుసు. ఆత్మీయుల మనస్సు తెలుసుకోవడంలో సుఖంలేదు కరుణా. కానీ నీవు చేయగూడనిపని చేశావు. ఒక్కొక్క మనిషి గురించి కొన్ని

అభిప్రాయాలుంటాయి. మహోన్నతమైన హిమగిరి శిఖరాలను కుంటాం. కాని ఒక్కసారిగా ఏదో దురదృష్టకరమైన పరిస్థితిలో - అద మరచి నిద్రపోతున్న సమయంలో ఆ తెర తొలిగి ఆ భ్రమ విరిగి వికృతమైన నగ్నస్వరూపం కంటబడితే? దైవమని పూజించిన దేవత కీటకంలా నాట్యం చేస్తే?"

"కాదు కల్యాణీ, నే చెప్పే మాట విను?"

"వద్దు."

"ఏం నిజం చెప్తానని నమ్మకం లేదా?"

"ఆ నమ్మకం లేకపోతే అర్ధరాత్రి, ఈ సమయంలో ఒంటరిగా నీ గదికి రాను కరుణా. నిన్ను నమ్మకపోతే ఎవరిని నమ్మగలను చెప్పు? అందుకే నీతో ఓ విషయం చెప్పాలని వచ్చాను."

"కళ్యాణీ! నిజంచెప్తున్నా. నేనసలు వచ్చినప్పటినుంచీ నిన్ను కలుసుకోని..."

"కరుణా! నిజం నాకు తెలుసు. నువ్వూ నాకు తెలుసు. కాని నిజాలను ఎవరు భరించగలరు? నువ్వు చెప్పేది వినీ ప్రయోజనం లేదు. కాని నే చెప్పేది నువ్వు వినాలి?"

నీరసంగా చెప్పింది కల్యాణి. శిథిలాలను చూసి మహా నిర్మాణాల వైభవాన్ని పోల్చుకోవచ్చు.

"కల్యాణీ! నీవంట్లో బావుండలేదు. నీకు మంచి వైద్యంలేదు నిన్ను హైదరాబాద్ తీసుకువెళ్ళి వైద్యం చేయిస్తా. రేపెలాగూ వెళ్ళాలి. వస్తావా?"

"రాను."

"ఎందుకని?"

"ప్రతిదానికీ ఒక అధికారమంటూ ఉంటుంది కరుణా ! నా శక్తి ఉన్నంతవరకూ, నా అజ్ఞానం తెలివీ అనుమతించినంతవరకూ దిగజారాను. ఇంక దిగజారే శక్తీ లేదు, కోరికాలేదు."

కరుణాకరం ఆమె గొంతులోని అశక్తతను పోల్చుకుని ఓవల్టిన్ కలిపి తెచ్చి యిచ్చాడు. అతడు ఎలక్ట్రిక్ స్టౌ అంటించటం, పాలు కలపటం, అందించటం రెప్ప లార్పకుండా చూస్తూ, "కరుణా !" అంది నవ్వి. తలెత్తి చూశాడు. "నేను చేయాల్సిన పని నువ్వు చేస్తున్నావ్." అంది.

ఆమెకు నోటికి పట్టాలనిపించింది. కాని ఆమె త్రాగింది స్వయంగా.

"నీ దగ్గరకు రహస్యంగా వచ్చాను తెలుసా ?"

"తెలుసు."

"ఎందుకొచ్చానంటావ్ ?"

"చెప్పు నువ్వే ?"

ఒక క్షణం మాట్లాడలేదు కల్యాణి. బొటనవ్రేలితో నేలను రాస్తూ, ఊపిరాడని మనిషిలా గాలి పీల్చింది.

"నేను యింట్లోంచి బయటకు రావడంలేదు తెలుసా ?"

"అన్నీ చూస్తున్నాను."

"ఇలా నేను వస్తానని నువ్వనుకోలేదు కదూ ?"

"అనుకోలేదు."

"తప్పు చేశానంటావా ?"

ఒక క్షణం కల్యాణి ముఖంలోకి చూశాడు కరుణాకరం. ఏదో అనబోయి ఆగి "కల్యాణీ - ఏమో. ప్రతి మనిషీ అంటాడు

ఉప్పూకారం. అలాగే అందరూ చేస్తారు తప్పూ వప్పూ" అన్నాడు.

"అది సరే—నేను చేసింది తప్పేనంటావా ?"

"ఒక్కొక్కసారి తప్పుకీ ఒప్పుకీ మధ్య తేడా కనిపించదు కల్యాణీ !"

"ఇలా వచ్చానని బాధపడుతున్నావా ?"

"లేదు. ఎందుకనుకుంటావలా ?"

"నేనొక పనిమీద వచ్చాను."

"ఏమిటి కల్యాణీ ?"

"చెప్తాను. ముందీమాట చెప్పు. ఎంతో అదృష్టం కలిసొచ్చిందట నీకు. అంత డబ్బు మూటగట్టుకొని ఈవూరే ఎందుకొచ్చావ్ ? ఐశ్వర్యాన్ని అనుభవించటానికి ఈ దిక్కుమాలిన ఊరుగాక మరొక తావు దొరక్కపోయిందా నీకు ?"

"ఇందులో ఆశ్చర్య మేముంది కల్యాణీ? జనని - జన్మభూమి - అంతకంటె ఆత్మీయమైన వస్తువు లున్నాయంటావా మనిషికి జీవితంలో ? హైదరాబాదులోనే స్థిరపడిపోవాలనుకున్నా. కాని ఒక కారణం వలన అక్కడ వుండలేకపోయాను. ఎక్కడికి వెళ్ళాలి ? అని ఆలోచించినప్పుడు సహజంగా స్వగ్రామం గనక ఈవూరు గుర్తుకొచ్చింది. వచ్చాను."

"వచ్చి మా యిల్లు న్యాయమైన ధరకు రెండురెట్లిచ్చి కొన్నావు ? దానికీ కారణం చెప్పగలవు. మా నాన్నగారిల్లు గనుక ఆ మమకారంకొద్దీ కొన్నానంటావు. యింటిమీద మాకు ఎటువంటి అధికారం లేకపోయినా, మమ్మల్ని ఓ ప్రక్కగా వుండమనీ తావిచ్చావు. మా మీద ఇంతదయ చూపించటానికి గూడా కారణం కని పెట్టే వుంటావు. గురుభక్తి అని చెప్పినా సరిపోతుంది."

"నీ మాటలు నా కర్థంకావటంలేదు కల్యాణీ - నేను చేస్తున్న పనులన్నీ నీకు తప్పులుగా కనిపించటం ఆశ్చర్యకరమైన విషయం-"

"అదే అడుగుతున్నాను. వీటన్నింటికీ కారణాలున్నాయి. కాని ఆ చీరపొట్లం ఎందుకు పంపావు నాకు లచ్చితో ?"

కరుణాకరాన్ని ముఖంలోకి సూటిగా చూస్తూ అడిగింది కల్యాణి.

"దానికి కారణంచెపితే చాలా సంతోషిస్తాను కరుణా."

"మనసులో ఉన్నమాట చెప్పటానికి ఎందుకు సందేహిస్తావు?"

"మనసున్న ప్రతి మనిషికీ ఆలోచనలుంటాయి. కాని కొన్ని ఆలోచనలు ఆలోచనలుగానే వుండిపోతాయి కల్యాణీ. కొన్నింటిని పసితనంలోనే పీకనులిమి చంపుకుంటాం. కొన్నింటిని కొంతకాలం పెంచి, పోషించి బాగా మదించిన పశువుల్ని కసాయిశాలకు పంపినట్లు హత్య చేయిస్తాం."

"ఒక విషయం నువ్వు మర్చిపోతున్నావు కరుణా."

"ఏమిటది ?"

"నువ్వు మగవాడివి. నీ పురుషత్వానికి పదునుపెట్టే డబ్బుంది. బలముంది. ఆలోచనల్ని చంపుకునే దౌర్భాగ్యం నీ కెందుకుండాలి. ఆ చీర నువ్వు ఎప్పుడు కొన్నావ్ ?"

"హైదరాబాద్‌లో బయలుదేరే ముందు."

"ఎవరికిద్దామని మూటకట్టుకొచ్చావ్ ?"

"......"

"కానీ అంత ఖరీదైన చీరకొని చాటుగా ప్రజెంటుచేసే శక్తి నీకుంది. కాని కట్టుకునే అధికారం నాకుందంటావా? మనసుపడి యిచ్చావని కట్టుకుంటే, ఈ ఊళ్ళో వెంటనే ప్రళయ భయంకరంగా విజృంభించే దుమారాన్ని ఈ అల్పప్రాణి తట్టుకోగలదంటావా? అగ్నిగుండంలా మండుతున్న నీ బహుమానాన్ని పాతగుడ్డలమధ్య ఎంతకాలం దాచుకోమంటావ్? ఆ శక్తి నాకులేదని నీకు తెలియదా కరుణా?"

"నేను చేసింది పొరపాటంటావా?"

"నీ మనస్సు నడుగు చెపుతుంది."

"దీనికి పరిష్కార మేమిటంటావ్?"

"నీకు తెలియదా?"

"నువ్వు చెప్పు?"

"నే చెప్పలేను కరుణా. ఆ అర్హత ఎప్పుడో పోగొట్టుకున్నాను." అంటూ గోడకేసి చూస్తూ పరధ్యానంలో పడిపోయింది కల్యాణి. నెత్తిమీద చేయి తగిలింది. చల్లటి స్పర్శ. ఆమె కదలలేదు. కాని మండుతున్న గాజుకుండలాంటి గుండెలు చల్లని చిలకరింపును భరించలేకపోయాయి. జ్వరతీవ్రతలో కాగుతున్న నెత్తురులో కాలుతున్న చెక్కిళ్ళు ఆ స్పర్శకు నల్లబడ్డాయి. అయినా ఆమె కదలలేదు. ఆ చేతుల్ని తప్పించటానికి ప్రయత్నించలేదు. ఆ స్పర్శా మాధుర్యంలో ఎంతటి అసహానం? కరుణాకరం తిరిగి వెళ్ళి మంచం మీద కూర్చున్నాడు. ఒక గాలిపటానికి దారం తెగింది. ఒక ప్రాణి ఆత్మహత్య చేసుకుందామని కొండశిఖరంమీద నుంచి క్రిందకు రాలినా నేల తగలలేదు ఎంతసేపటికీ. తల పగలటంలేదు ఎంత పతనమౌతున్నా.

"ఒక చిన్న సహాయం చేస్తావని వచ్చా కరుణా?"

"ఏమిటి?"

"ఈ యిల్లు నీది. యిల్లు వదిలి పొమ్మనీ, ఊరువదిలి పొమ్మనీ చెప్పే అధికారం నాకు లేదు. కాని యీ యింట్లో ఉండే అధికారం కూడా నాకులేదని నీకూ తెలుసు. మమ్మల్ని ఈ యింట్లోంచి పొమ్మన లేవా కరుణా?"

"ఈ నిష్కారణ నిందల్ని ఎంతని భరించగలను చెప్పు? నువ్వు గాక నన్నెవరు అర్థంచేసుకుంటారని? పోయిన పరు వెలాగూ పోయింది.మిగిలింది నువ్వు నిలబెట్టకపోతే ఎవరు నిలబెడ్తారు కరుణా?"

"మాట్లాడవా?"

"ఈ యిల్లు వదిలిపెట్టి ఎక్కడికి పోతారు?"

"నువ్వు పొమ్మనేదాక ఈ ప్రశ్నకు సమాధానం మాకూ తెలియదు. నే చెప్పినా అమ్మా నాన్నా వినరు."

"కానీ - కల్యాణీ - ఇంత కఠినంగా ఎందుకు మాట్లాడు తున్నావో చెప్పు. ఈ యింట్లో ఉండటానికి బ్రతికినంతకాలం నీకు అధికారం లేదంటావా? అది ఒకళ్ళిచ్చిన అధికారంకూడా కాదు. ఒకరిమీద ఒకరికి విశ్వాసమున్నప్పుడు ఒక విషయాన్ని నమ్మించ టానికి ప్రమాణాలు చేస్తూ తర్కించుకోవా లంటావా? అసలివి తర్కించుకోవలసిన విషయాలంటావా?"

"అధికార ముందో లేదో నాకూ కాస్త తెలుసు కరుణా. మనిషి ఎంత కీట్టకంగా మారినా ఆ మనిషి ఊపిరి పీలుస్తున్నంత

కాలం మనసంటూ వుంటుంది. ఎంత విసికపోయినా మంచీ చెడ్డా అది చెపుతూనే వుంటుంది."

"వద్దు కల్యాణీ. మీ రెక్కడికీ వెళ్ళరు. చేతికందిన అదృష్టాన్ని వదులుకునేటంత తెలివితక్కువవాణ్ణి కాదు నేను. నీ ప్రశ్నకు సమాధానం చెపుతాను. ఈ చిక్కును విడదీస్తాను. కాని..."

"కాని ?"

"కొంచెం వ్యవధికావాలి."

"వ్యవధి ! ప్రతిదానికీ మించిపోవడమంటూ కూడా వుంటుంది తెలుసా ? నీ కెలాచెప్పను ? వాడి రాలిన పిచ్చిపువ్వుకు అత్తరు రాస్తావా ? పగిలి చితికిన పచ్చికుండకు అతుకులు పెడ్తావా ? కళ్ళు మూసుకున్నంత మాత్రాన మనసు నిద్రపోతుందా కరుణా. నీకీ విషయం చెప్పాలనుకొని రావాలనుకున్నాను చాలాసార్లు. కాని పంజరంలో చిలకకు రెక్కలుండి ఏంలాభం ? అమ్మా నాన్నా యిక్కణ్ణుంచి వెళ్ళరు. వెళ్ళలేరు. నాసుమాత్రం నువ్వు ఈ వూళ్ళో ఈ యింట్లో అడుగు పెట్టినప్పటినుంచి ఊపిరి ఆడటంలేదు."

"అంత బాధ పడుతున్నావా ?"

"ఔను" అంటూ పెనుగాలికి కదిలిన తృణంలా వణికింది కల్యాణి.

కరుణాకరం యింక మాట్లాడలేకపోయాడు. విషాదం నింపుకున్న వ్యధాభారంతో మూతపడ్డాయి కనురెప్పలు. కల్యాణి జాలిగా నవ్వి "కరుణా! ఒక్కమాట నిజం - ఆశ్చర్యాల సంపుటి జీవితం. రైలుపట్టాలు చూడు. దూరంగా కలిసిపోయినట్లు కనిపిస్తాయి. మొదట కూడా కలిసే బయలుదేరిపోయినట్లు భ్రమ

కలుగుతుంది. కాని అది ఉత్త భ్రమే. అవి ఎన్నడూ కలిసిలేవు. ఎన్నడూ కలవవు."

"కాని ప్రక్క-ప్రక్కనే ఉంటాయి ఎంతదూరం పోయినా?"

"ఏమో."

"సరే! రేపు నేను ఊరు వెళ్తున్నాను - వచ్చింతర్వాత -" ఆగిపోయాడు కరుణాకరం. తూలింది కల్యాణి.

"కరుణా యింక కూర్చోలేను." లేచి వెళ్ళిపోయింది. వెనక్కు పిలుద్దామనుకున్నాడు. పిలవలేకపోయాడు.

తెల్లవారుఝామయింది. ఎడ్లబళ్ళు నడుస్తున్నాయి. కోడి దూరంగా కూతపెడ్తూంది. గడియారం నాలుగుగంటలు కొట్టింది. కరుణాకరం లేచాడు ఎదురుగుండా గోడలమీద ఫోటోలు. చిన్ననాటి కరుణాకరం.పసితనంలో ఏదో వుంది? అజ్ఞానంలో అమృతముంది. ఆ ఫోటో దగ్గరకు వెళ్ళాడు. నవ్వింది బొమ్మ - జీవితంలో విలువైన వెన్నో పోగొట్టుకోవడం - ఎంతటి అదృష్టమున్నా మనిషి జీవితంలో సహజంగా ఉండే లక్షణం. వాటిలో మొదటిది పసితనం! పాప పుణ్యాల నీడ సోకని, ప్రపంచపు మాలిన్యం తాకని పసితనం !!.

# ఎనిమిది

తెల్లవారింది. కరుణాకరం లేవలేదు. ముత్తెం వచ్చి లేపటం యిష్టంలేక వాకిట్లో కూర్చున్నాడు. మున్సబుగారూ, వరదాచార్యులుగారూ, రాఘవయ్యా ఒకరొకరే వచ్చి తిరిగిపోయారు. సూర్యకుటుంబానికి సూర్యుడెలాగో ఆ వూరికి కరుణాకరం తనకు తెలియకుండానే అలా అయ్యాడు. ఒక రంగదాసు తప్ప అతని గొప్పతనం అందరూ గుర్తించారు. రంగదాసులో కూడా కరుణాకరం రాక - ఉనికి అంతులేని సంచలనం కలిగించింది. ఊళ్ళో అందరిలో కలిగిన సంచలనంకంటె వసంతలో కలిగిన సంచలనం తీవ్రతరమైంది. ఏమాత్రం పట్టించుకోని మనిషి ఒక్కడే. రాజారావు.

రాజారావు ప్రవర్తనకు చాలా బాధపడ్డాడు కరుణాకరం. అర్థంకాలేదు. అతని ప్రపంచం వేరు. అతని గొడవ వేరు. అతని జీవితం వేరు. ఊళ్ళో అతన్నిగురించి మంచిగా మాట్లాడిన మనిషి కనిపించలేదు ఒక్క ముత్తెంగాక.

తొమ్మిదిగంటలకు లేచాడు. తగువు తీర్చమంటూ ఎవరో వచ్చారు. తన పెద్దరికానికి అర్థం కనిపించలేదు. వంట్లో బాగుండలేదని చెప్పి పంపించాడు. పల్లెటూళ్ళో కారు తుప్పుపట్టేలావుంది. ఎక్కడికి వెళ్ళాలి కారెక్కి? విజయవాడనుంచి వంటవాడొచ్చాడు. పేరు నందిట. వరదాచార్యులగారి భోజనం గొడవ తప్పింది. మధ్యాహ్నం భోజనంచేసి మరొకసారి కాలువ ఎగువకు బయలుదేరాడు ముత్తెంతో కలిసి. కొంతదూరం పోతుంది కారు. ఇద్దరూ కారులో పోతుంటే వసంత కిటికీలోంచిచూసి నవ్వింది. వరదాచార్యులగారు రావిచెట్టుక్రింద రాఘవయ్యతో కబుర్లు చెప్తున్నవాడు

కారు చప్పిడికి లేచి, అది దాటిపోగానే "పూటకు ఠికానాలేని ఈ వెధవ ఎక్కడ దొరికాడు వాడికి ?" అన్నాడు నోరు తెరిచి.

"ఏమిటి ?" అన్నాడు రాఘవయ్య.

"ఈ ముత్తెంగాడు ఆ కరుణాకరాన్ని వలలో వేసుకు అంట కాగుతున్నాడు. చివరికి ముంచడుగదా ?" అంటూ ముక్కుమీద వ్రేలేసుకున్నారు ఆచార్యులుగారు.

కరుణాకరం ముఖంచూసి భయపడ్డాడు ముత్తెం. కారు దిగే దాకా ఎవరూ మాట్లాడలేదు. దిగినతర్వాత "ఏమిటి అలా వున్నారు బాబూ ?" అన్నాడు.

కరుణాకరం మాట్లాడలేదు.

మరోకసారి ప్రశ్నించాడు.

"విశ్వపతి మాష్టారింట్లో వస్తులుంటున్నారు ముత్తెం" అన్నాడు చివరకు కరుణాకరం.

"వెర్రిబాగులోళ్ళండీ - బియ్యం మీరు చెప్పాక అరమూట ఏసుకెళ్తే తిరగ్గొట్టారుగదా? మనమేం చేస్తాం చెప్పండి" అన్నాడు.

మళ్ళీ మౌనంగా ఆ చవిటిపఱ్ఱలో కొంతదూరం నడిచారు. కాలవగట్టున తుమ్మచెట్టు నీడలో కూర్చున్నారు.

"ఎందుకొచ్చాం మన మిక్కడికి ముత్తెం ?"

"ఏమో బాబూ! మీరు రమ్మన్నారు, వచ్చా".

"చాలా జీవితాలుగూడా ఇంతే ముత్తెం. ఎందుకో తెలియకుండానే బ్రతకడం జరుగుతుంది."

"బాబూ !"

"? ?"

"ఒక్క మాటడిగేదా?"

"అడుగు."

"మీరు ఆచార్లుగారమ్మాయి వసంతమ్మగోర్ని పెళ్ళి చేసుకుంటారట?"

"ఎవరన్నారు?"

"ఎవరేమిటి బాబూ!" ఊళ్ళో అందరూ అనుకుంటున్నారు. మొన్న రావిచెట్టుకాడ పదిమందుండగా సంబాచార్లుగారు చెప్పారు. నిజమేనా బాబూ?"

కరుణాకరం మాట్లాడలేదు.

"చెప్పండి బాబూ మీ మనసులోని మాట. నేను పనిపూర్తయేటట్టు చూస్తా"

"ముత్తెం! నిజంచెప్తున్నా- నేనలా అనలేదు. అనుకోలేదు."

"మరి ?"

"ఎవరో ఏదో అంటేనే బాధ్యుణ్ణా చెప్పు? అసలు ఈ వూరు తిరిగిరావడంలో నేను పెద్ద పొరపాటుచేశానా అనిపిస్తుంది. కాని ఎందుకు వచ్చానంటావ్ ? జీవితంలో అదే చిత్రం ముత్తెం. మనం ఎవరికి దగ్గరగా పోవాలనుకుంటామో వారు దూరంగా పారిపోతారు. ఎవరినుండి దూరంగా తొలిగిపోవాలనుకుంటామో వారు దగ్గరకొచ్చి మీదపడతారు. పిశాచాల నీడల్లా పట్టుకు పీడిస్తారు. ఈ వూరు తిరిగి వస్తాననుకోలేదు. రాగూడదనుకున్నాను. కాని వచ్చాను. ఏ అదృశ్యశక్తి నన్ను అయస్కాంతంలా లాగిందంటావ్ ?"

"ఏమిటి బాబూ ! మీకేమిటి తక్కువ ? ఊళ్ళో దొంగనా యాళ్ళందరూ మీ అదృష్టాన్ని చూసి ఏడుస్తుంటే - మీకేం తక్కువయిందని ఈ దిగులు ? మీ మనసు చెప్పండి. వసంతమ్మగోర్ని యివ్వడానికి వరదాచార్యులు సిద్ధంగానే వున్నారు. మాట్టాడమంటారా ?"

"ఆగు ముత్తెం. నేను హైదరాబాద్ వెళ్తానివాళ. రాగానే చెప్తాను."

సాయంత్రం అయిదు గంటలకు హైదరాబాద్ బయలుదేరాడు కరుణాకరం. వరదాచార్యులవారు కౌగలించుకుని కంట తడిపెట్టి "ఏమిటో - బిడ్డలా వున్నావు. పెద్ద ముండావాణ్ణయ్యానా- వెళ్తున్నావంటే-" అంటూ మాటలు నమిలేశారు. గొంతు బొంగురుపోయి పగిలింది. ఈ కబురు తెలిసి వసంత దొడ్డిదోవన పరుగు పరుగున విశ్వపతి మాష్టారింటికి వచ్చింది. అప్పటికే కదిలింది కారు. నివ్వెరపోతూ నిలబడింది. కారు కనుచూపుమేర దాటిపోయేదాకా నిలబడింది.

"ఏటి వసంతమ్మగోరూ యిటొచ్చారు ?" అన్నాడు ముత్తెం వెనుకకు వచ్చి.

"ఏం లేదు. కల్యాణికి వంట్లో బావుండలేదంటే చూసి పోదామని" అంటూ గిరుక్కున వెనక్కు తిరిగి లోపలికి వెళ్ళింది. గౌరమ్మగారు చేటలో బియ్యం చెరుగుతూంది. కల్యాణి నులక మంచంమీద పడుకుంది.

"ఏమే ఎలావుంది ?" అంది వసంత.

"బాగానే వుంది."

"జ్వరంట ?"

"తగ్గిందిలే."

"బాగా చిక్కిపోయావే నాలుగురోజుల్లో!"

పల్చగా పేలవంగా నవ్వింది కల్యాణి.

మంచంమీద తనూ కూర్చొని "మొన్న నే సంభాచార్లుగారు చెప్పారు. వద్దామనుకుంటే నాన్న తిట్టాడు. ఏమిటో నే ఖర్మ—కానీ కల్యాణీ! క్షమిస్తానంటే ఒక్కమాట చెప్తా. ఏమీ అనుకోవు గదా ?"

"అడుగు."

"ఆ రాజారావుతో నువ్వు—అది అంత మంచిపని కాదనుకో. నాకంటె పెద్దదానివి. నీకు చెప్పవలసిన వయస్సు లేదనుకో. అయినా—అందుకే నీకు అయిన సంబంధాలు రావడం కూడా కష్టంగా వుంది. రాజారావు ఈ మధ్య మరీ పాడైపోయాట్ట తెలుసా ? ఎన్ని కథలని ? విన్నావా ?"

కల్యాణి ఓపిక తెచ్చుకుని, లేచి కూర్చుని, నవ్వి "ఎవరు చెప్తారే నాకు కథలు. నీలాంటివాళ్ళ పుణ్యమా అని ఆ చెవిన ఈ చెవినా పడి" అంటూ ఆగింది.

"తెగ తాగుతున్నాట్ట. పెంచుతున్న పందుల్ని కోసుకు తింటాడట. ఈ మధ్య అన్నారంలో ఓ దొమ్మరిదాంతో మరో పెద్ద గొడవట. మొన్న మా యింటిమీదుగా వెళ్తుంటే చూశా. అప్పులట. ఊళ్ళో కానీ పుట్టదుగదా ? దానికి దోచిపెడ్తున్నాడట. మొన్న ? కళ్లెలా వున్నాయని ? జ్యోతులనుకో. భయం వేసింది బాబూ. తలుపులు దభాలున మూసుకొని పరిగెత్తా. అప్పుడేంచేశాడను కున్నావ్ ? తలుపు కొట్టాడు. దొడ్లో నాన్నగారొచ్చి తీశారు—"మీ అమ్మాయికేం భయంలేదు నా వల్ల—తలుపులు నిమ్మదిగా వేసుకో

మనండి. అలా గెంతుతూ కాలు జారిపడితే పెళ్ళికాదు. కనీసం నాలాంటి పనికిమాలినవాడు కూడా చేసుకుంటానికి ముందరకురాడు" అంటూ ఆ మైకంలో ఏవేవో మాట్లాడి వెళ్ళిపోయాట్ట తూలుకుంటూ.

అంతలో నంబాచార్లు కూతురు శాంత వచ్చింది. ప్రక్కనున్న స్టూలు లాక్కొని కూర్చుంది. మామూలు మాటలయాక అంది శాంత - "కల్యాణీ ! మన వసంత పెళ్ళిట తెలుసా ?"

"ఎప్పుడు ?"

"ఏమే వసంతా చెప్పు ! సిగ్గెందుకే ?" అంది శాంత.

"సిగ్గేముంది యిందులో. మాఘమాసంలో చేస్తామంటు న్నారు ఆయనతో మాట్లాడి."

పమిట కప్పుకుంది.

"అంత సిగ్గెందుకే బాబూ ! 'ఆయన' లేరులే యిక్కడ. ఇదుగో కల్యాణీ - యింతకీ ఆ 'ఆయన' ఎవరో తెలుసా?"

"కొంత తెలుసు."

"కొంతంటే !"

"నువ్వే చెప్పు ?"

"కరుణాకరం."

దీనంగా చూసింది కల్యాణి.

"మన వసంత అదృష్టవంతురాలు కాదుటే."

"ఔను."

"అదేనోయ్ చిత్రం. చిన్నప్పుడు అందరం ఒకేలా పెరిగాం. అందరి ఆశలూ ఆలోచనలూ అలాగేవుండేవి. చూడు. ఈ మూడు

నాలుగేళ్ళల్లో ఎన్నిమార్పులో - నా పెళ్ళి సంబరం అయింది. మా ఆయన ఉద్యోగం రభస పూర్తయింది. పిల్లలికి అన్నంపెట్టే వేళాగా భగవంతుడా అంటూ చతికిలబడ్డాను."

" ఎవరూ ఆ వచ్చింది సాంబయ్యేనా ?" అంటూ కుర్చీలోంచి లేచి వచ్చి మంచంమీద 'నీడల్ని' కళ్ళుకోడు లేకుండా పరీక్షిస్తు న్నారు విశ్వపతి మాష్టారు.

" నేను వసంతని మామయ్యగారూ ! "

" వా రెవరు ?"

" శాంత - మన శాంత."

" మీ అందరికీ పెళ్ళిళ్ళయ్యాయా తల్లులూ? అయ్యేవుంటా యిలే. మొగుడు దొరికాడుగదా అని అదేపనిగా తపస్సుచేసి ఆడ పిల్లల్నికంటూ కూర్చోకండి."

" పడుకో నాన్నా!"

"చూడు వసంతమ్మా - మీ ఆయనతో చెప్పి సిఫార్సుచేసి మా అమ్మాయికో సంబంధంచూద్దూ. అమ్మాయి పెళ్ళి చేస్తేనేగాని నీ ప్రాణం తీసుకుపోనంటున్నాడు దేముడు."

" పడుకో నాన్నా !"

గౌరమ్మగారు తనను తిట్టుకుంటూ, ప్రపంచాన్నీ భగవంతుణ్ణీ తిడుతూ మాష్టారిని రెక్కపుచ్చుకు గుంజుకుపోయి కుర్చీలో కూలేసింది.

" నువ్వు ఝాన్సీరాణీవే గౌరమ్మా !" అంటూ ఆవలించారు మాష్టారు.

కొంచెంసేపయాక "ఆయనెప్పుడొస్తారట కల్యాణీ?" అంది వసంత. శాంత పకపక నవ్వింది. 'ఆయన' అనటంలో ఒక ధ్వని వినిపించింది. నవ్వి" ఏం? శ్రీమతిగారి ఆజ్ఞతీసుకోకుండానే వెళ్ళిపోయారా ?" అంది.

"పోవే" అంటూ బుగ్గ గిల్లింది వసంత.

"నీరసంగావుంది, పడుకుంటా" అంది కల్యాణి. స్నేహితురాండ్రిద్దరూ లేచి పోతుంటే "శాంతా!" అని పిలిచింది. ఆగారిద్దరూ. "నువ్వు పద వసంతా - శాంత వస్తుంది లే."

"ఏమిటి కల్యాణీ?"

"నాకో సహాయం చేయగలవా ?"

"చెప్పు."

"నాకో పది రూపాయలు కావాలే."

శాంత మాట్లాడలేదు.

"చాలా యిబ్బందిగావుంది. నాన్నకు నల్లమందు లేందే నిద్ర పట్టదు. తెల్లవార్లూ అలా చూస్తూ కూర్చుంటున్నారు. ఆ కళ్ళల్లోంచి ఉబుకుతున్న దుఃఖాన్ని చూడలేకపోతున్నానే. దిక్కుమాలిన బ్రతుకైపోయిందనుకో." ఏం ? నీ దగ్గరా లేనట్టుంది ?"

"వసంతను అడిగితే ?"

"వద్దు."

స్నానోయ్... నా పరిస్థితీ అధ్వాన్నంగావుంది. నాన్నగారి దగ్గర కొచ్చినా ఆయనా మమ్మల్ని ఆదుకునే స్థితిలో లేరు.

వచ్చాక ఆయన సంసారాన్ని మేమే చూసుకోవలసి వచ్చింది. చివరి గాజులు, బేసరి దగ్గర్నుంచి అన్నీ వెళ్ళిపోయాయి."

గౌరమ్మగారొచ్చింది. భోజనం ఇస్తర్లో వడ్డించి, మాష్టారు ఎంత పిలిచినా పలకలేదు. పరిపరి విధాల భగవంతుణ్ణి తిట్టుకుంటూ "చావన్నా తెచ్చిపెట్టాడుకాదు" అంటూ గొణుక్కుంటూ వెళ్ళి భుజం తాకి పిలిచింది.

అయిపోయింది.

శూన్యంలోకి చూడటానికి అలవాటుపడ్డ కళ్ళు అలా చూస్తూనే వున్నాయి. ప్రాణజ్యోతి ఆరిపోయింది. యిన్నాళ్ళుగా అనుభవించిన కష్టాలనుండీ, కన్నీటినుండీ, వ్యధలనుండీ, బాధలనుండీ ఆ జీవునికి విముక్తి కలిగింది. గౌరమ్మగారు గుండెలు బాదుకు ఏడ్చింది. కల్యాణి తేలికగా నిట్టూర్పు విడిచింది.

"బ్రతికి ఏం అనుభవిస్తున్నారమ్మా. నరకంనుండి అదృష్టం కలిసి వచ్చి ఆయనకు విముక్తి కలిగింది. ఎందు కేడుస్తావ్? జరగవలసింది ఆలోచించు" అంటూ తల్లిని ఓదార్చింది. ఏడుస్తున్న శాంతను వోదార్చింది. చివరకు "శాంతా—పదిరూపాయలు చాలవు. రేపెంత కావాలో నాకేం తెలుసు?"

వరదాచార్యులవా రొచ్చారు. రాఘవయ్య, మున్సబు, ముత్తయ్య, నంబాచార్లు, చెల్లాయమ్మగారు, శాంత, వసంత, యిరుగు పొరుగు అమ్మలక్కలు ఎందరో వచ్చారు.

పదిగంట లయేసరికి ఎవరి దారిన వారు చక్కా పోయారు. "జీవితం బుద్బుదం తల్లీ. ఏమిటో బ్రతికినంతకాలం అంతా మనదే నని వెంపర్లాడిపోతాం. ఆ గుక్కెడు ప్రాణాలూ పోయిుంతర్వాత

ఏముంది - కట్టె. ఇది కేవలం అజ్ఞానం" అంటూ తీర్పుచెప్పి చీదుకుంటూ వెళ్ళిపోయారు వరదాచార్యులవారు.

"నే నుండేదాన్నే కల్యాణీ రాత్రంతా—కానీ భయం నాకు. శవాన్ని చూస్తేనే—అదీగాక నాన్న తిడ్తారు" అంటూ వెళ్ళిపోయింది శాంత. గౌరమ్మగారు ఏడ్చిఏడ్చి సొమ్మసిలి పడిపోయింది. గాడాంధకారం. ఏవో పిచ్చి శబ్దాలు వినిపిస్తున్నట్లు భ్రమ. దీపపు కాంతిలో మెరుస్తున్న తండ్రి శరీరం—కాలు మడిచి మోకాలిమీద తల ఆనించి తండ్రి ముఖంలోకి అలాగే చూస్తూ కూర్చుంది కల్యాణి. చెరువుగట్టుమీద మర్రిచెట్టుపైనుండి ఏదో కాకి గావుకేక పెట్టింది. అదొక అల్పప్రాణి తనలాగే. అమ్మకేసి చూసింది. నిద్ర! ఎటువంటి నిద్ర? మృత్యుదేవికీ నిద్రాదేవికీ ఏమిటి తేడా? తండ్రి శరీరం నిమిరింది మెత్తగా - చల్లని వళ్ళు. కాగికాగి చల్లబడిన గుండెలు. తలుపులు తెరిచే వున్నాయి. తోకాడించుకుంటూ కుక్క వంటింట్లో విస్తరిలోని భోజనం ఆరగిస్తూంది. ఆయన తినటానికి నోచుకోని చివరి భోజనం. ఆ కుక్కనే చూస్తూ కూర్చుంది మరికాసేపు. ఆ యింట్లో మెళుకువగానున్న మరొక ప్రాణి అది. అడుగుల చప్పుడయింది. తలెత్తి చూసింది. రాజారావు.

"లోపలికి రావచ్చా?"

"నువ్వా!"

"నేనే - ఈ సమయంలో రాగూడదు నిజమే. కాని మాష్టారు పోయారని ఎవరో అన్నారు. ఆపదలో వున్నావని వచ్చాను. ఎందుకూ కాదు. సహాయం చేద్దామని."

తూలుతున్నాడు మనిషి. మండుతున్న కళ్ళు.

"కూర్చో."

"ఎవరన్నా చూస్తే?"

"ఫర్వాలేదు."

"రావద్దన్నావసలు?"

"ఇది వరకు."

"ఇప్పుడు?"

"కూర్చో."

"అమ్మో - ఏ వరదాచార్లో చూస్తే యింకేమన్నావుందా? నిన్నూ గెంటేస్తారు ఊళ్ళోనుంచి. అప్పుడు నువ్వూ నాతోపాటు ఉప్పరిగూడెంలో కాపురం పెట్టాలి. అది జరిగితే మీ అమ్మ నూతిలో దూకుతుంది."

"పడతావు కూర్చో ఆ జల్లమీద."

"నీకు భయంగాలేదూ?"

"ఎందుకు?"

"ఒంటరిగా అలా శవాన్ని పెట్టుకు కూర్చోటానికి?"

"భయమెందుకు?"

"నాకు భయం" అంటూ పడ్డాడు రాజారావు.

లేవదీసి కుర్చీలో కూర్చోపెట్టింది కల్యాణి.

"డబ్బు తెచ్చా నీకోసం. మూడు పందులు మిగిలాయి. అమ్మేశా? దానికిచ్చా. మళ్ళీ తన్ని లాక్కొచ్చా." జేబులోంచి నోట్లు తీశాడు ఆరు.

"ఎందుకిస్తున్నా వీ డబ్బు?"

"నీ కోసం?"

"అదే, నాకోసం ఎందుకని?"

ఏముంది - కష్టైం. ఇది కేవలం అజ్ఞానం" అంటూ తీర్పు చెప్పి చీదు కుంటూ వెళ్ళిపోయారు వరదాచార్యులవారు.

"నే నుండేదాన్నే కల్యాణీ రాత్రంతా—కానీ భయం నాకు. శవాన్ని చూస్తేనే—అదీగాక నాన్న తిడ్తారు" అంటూ వెళ్ళిపోయింది శాంత. గౌరమ్మగారు ఏడ్చిఏడ్చి సొమ్మసిలి పడి పోయింది. గాఢాంధకారం. ఎవో పిచ్చి శబ్దాలు వినిపిస్తున్నట్లు భ్రమ. దీపపు కాంతిలో మెరుస్తున్న తండ్రి శరీరం—కాలు మడిచి మోకాలిమీద తల ఆనించి తండ్రి ముఖంలోకి అలాగే చూస్తూ కూర్చుంది కల్యాణి. చెరువుగట్టుమీద మర్రిచెట్టుపైనుండి ఏదో కాకి గావుకేక పెట్టింది. అదొక అల్పప్రాణి తనలాగే. అమ్మకేసి చూసింది. నిద్ర! ఎటువంటి నిద్ర? మృత్యుదేవికీ నిద్రాదేవికీ ఏమిటి తేడా? తండ్రి శరీరం నిమిరింది మెత్తగా - చల్లని వళ్ళు. కాగికాగి చల్లబడిన గుండెలు. తలుపులు తెరిచే వున్నాయి. తోకాడించు కుంటూ కుక్క వంటింట్లో విస్తరిలోని భోజనం ఆరగిస్తూంది. ఆయన తినటానికి నోచుకోని చివరి భోజనం. ఆ కుక్కనే చూస్తూ కూర్చుంది మరికాసేపు. ఆ యింట్లో మెళుకువగానున్న మరొక ప్రాణి అది. అడుగుల చప్పుడయింది. తలెత్తి చూసింది. రాజారావు.

"లోపలికి రావచ్చా?"

"నువ్వా!"

"నేనే - ఈ సమయంలో రాగూడదు నిజమే. కాని మాష్టారు పోయారని ఎవరో అన్నారు. ఆపదలో వున్నావని వచ్చాను. ఎందుకూ కాదు. సహాయం చేద్దామని."

తూలుతున్నాడు మనిషి. మండుతున్న కళ్ళు.

"కూర్చో."

"ఎవరన్నా చూస్తే ?"

"ఫర్వాలేదు."

"రావద్దన్నావసలు ?"

"ఇది వరకు."

"ఇప్పుడు ?"

"కూర్చో."

"అమ్మో - ఏ వరదాచార్లో చూస్తే యింకేమన్నా వుందా ? నిన్నూ గెంటేస్తారు ఊళ్ళోనుంచి. అప్పుడు నువ్వూ నాతోపాటు ఉప్పరిగూడెంలో కాపురం పెట్టాలి. అది జరిగితే మీ అమ్మ నూతిలో దూకుతుంది."

"పడతావు కూర్చో ఆ జల్లమీద."

"నీకు భయంగాలేదూ ?"

"ఎందుకు ?"

"ఒంటరిగా అలా శవాన్ని పెట్టుకు కూర్చోటానికి ?"

"భయమెందుకు ?"

"నాకు భయం" అంటూ పడ్డాడు రాజారావు.

లేవదీసి కుర్చీలో కూర్చోపెట్టింది కల్యాణి.

"డబ్బు తెచ్చా నీకోసం. మూడు వందలు మిగిలాయి. అమ్మేశా ? దానికిచ్చా. మళ్ళీ తన్ని లాక్కొచ్చా." జేబులోంచి నోట్లు తీశాడు ఆరు.

"ఎందుకిస్తున్నా వీ డబ్బు ?"

"నీ కోసం ?"

"అదే, నాకోసం ఎందుకని ?"

"చేసిన పాపానికి ?"

"పాపంచేసింది నువ్వొక్కడివే కాదుగా ?"

"మరెవరు ?"

"నాకూ భాగముంది. డబ్బిచ్చి నీ పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నావ్. నేనేమిచ్చి కడుక్కోగలను ?"

"ప్రశ్నలడగబోకు. నా బుర్ర పనిచేయడంలా ? ఏం చేయమంటావ్ చెప్పు ? వెళ్ళమంటావా ?"

"నన్నడిగే వచ్చావా వెళ్ళమంటే వెళ్ళటానికి ?"

"మళ్ళీ ప్రశ్న."

"నాబ్రతుకే ఒక ప్రశ్న రాజా ! కాదంటావా ?"

"ప్రశ్నలంటే నాకు చిరాకు."

"నన్నేం చెయ్యమంటావ్ ?"

"ఈ డబ్బు తీసుకోమంటున్నా" అంటూ గిరవాటుపెట్టి వెళ్ళబోతున్నాడు.

"రాజా!"

ఆగాడు.

"నీ డబ్బు నాకొద్దు."

"ఎందుకని ?"

"ప్రశ్నలంటే చిరాకన్నావ్ ? మళ్ళీ నువ్వే అడుగుతున్నావ్ ప్రశ్న."

"నువ్వు తీసుకోకపోతే..."

"ఎందుకు తన్నావామెను ?"

"డబ్బివ్వనంది."

"ఆమె తిరిగి తంతే ?"

"తన్న లేదు. మెడలు విరుస్తా. నా బలం...?"

"బలముందని తన్నావా ?"

"దాన్ని తన్నుకుంటా, ప్రేమించుకుంటా, చంపుకుంటా - నీ కెందుకు ? నీకేం సంబంధం ?"

"ఏ సంబంధముందని డబ్బిస్తున్నావ్ నాకు ?"

"తీసుకోవా ?"

"తీసుకోను."

"రేపు మీకు చాలా ఖర్చుంది తెలుసా ?"

"తెలుసు."

"ఎక్కణ్ణుంచి తెస్తావ్ డబ్బు ?

"ఎక్కణ్ణుంచి తెచ్చుకుతిన్నాం యిన్నాళ్ళూ ?"

"నువ్వు తీసుకోకపోతే" చేయెత్తాడు.

"కొడ్తావా ?"

"కొట్టను...చింపుతా...తగలబెడ్తా..." అంటూ చేతికందిన రెండునోట్లు తీసుకు ముక్కలుగా చింపాడు.

"డబ్బు విలువైంది. రేపు నీకెవ్వరూ యివ్వరు పాడుచేసుకోకు. ఇలాచేసి నన్ను సంతోషపెట్టలేవు రాజా ! దయుంచి తీసుకెళ్ళు."

"వద్దు ! వద్దు !" అంటూ వెళ్ళిపోయాడు రాజారావు.

ఆ డబ్బుతీసి పదిలంగా పొట్లంకట్టి పెట్టెలో పెట్టింది కల్యాణి. ఒక రాత్రివేళ లేచింది గౌరమ్మగారు. మళ్ళీ శోకాలు ప్రారంభించింది. ఓదార్చే ఓపికలేక పడుకుని వింటూంది కల్యాణి. ఎవరికోసం, ఎందుకోసం. ఆగనికాలం పోరతికర్పూరంలా హరించుకు పోతూంది. తెల్లవారింది.

# తొమ్మిది

కల్యాణి యింటిదగ్గర్నుంచి రాజారావు బయలుదేరి తిన్నగా యింటికి వచ్చాడు. పంతులమ్మ ప్రసూన తలుపు తీసింది.

"ఎవరూ ?" మూలిగింది ముసలమ్మ.

"నేనేనమ్మా."

"రాజా!"

"నేనే" అంటూ తల్లి మంచం దగ్గరకు వెళ్ళాడు.

"యింట్లో ఆడపిల్ల ఎవరురా ?"

"నీ కోడలమ్మా ?"

"కోడలా ? పెళ్ళయిందా నీకు?"

"సాయింత్రం చేసుకుందామనుకున్నా. రేపు చేసుకోవచ్చని తీసుకొచ్చా. చూస్తావా కోడల్ని - ప్రసూనా - ప్రసూనా" పిల్చాడు పదిసార్లు. ప్రసూన పలకలేదు. కోపంవచ్చి వెళ్ళి "నువ్వు రాక పోతే చూసుకో - ఈ చెయ్యి చూశావా.? ఉక్కు - ఆఁ ఏమిటను కున్నావో!"

భయపడి లేచింది. ఇద్దరూ ముసలమ్మ మంచం దగ్గరకు నడిచారు. మంచంకోడు తగిలి పడ్డాడు రాజారావు. "ఏదీ దీపం తీసుకురా ! ఎవరు ? కల్యాణేనా ?" అంది ముసలమ్మ చూడటానికి ప్రయత్నిస్తూ.

"కల్యాణిగాక మరెవరనుకున్నావ్ ? సాధించానా లేదా చెప్పు ?"

నవ్వింది ముసలమ్మ తేలికగా. "రాజా! నీ సంగతి నాకు తెలుసురా! పట్టుకుంటే వదిలిపెట్టవు. చిన్నప్పటినుంచీ అంతే అనుకో. ఆ దుడుకుతనం తగ్గించుకోరా బాగుపడతావ్. చివరకు విశ్వపతి చచ్చినట్టు ఒప్పుకున్నాడన్న మాట" అంది.

ప్రసూన కాసేపు నిలబడి, పోయి పడుకుంది.

రాజారావు వచ్చాక "కల్యాణి ఎవరు?"

"నువ్వే?"

"సిగులేకపోతేసరి."

"సిగ్గెందుకు?"

"ఎందుకో తెలిస్తే బాగానే వుండేది. ఛీ - పాడుబ్రతుకు. నే విన్నది నిజమేనన్నమాట. ఎంతమంది నిలా నాశనం చేద్దామను కుంటున్నారు? ఎందుకు తీసుకొచ్చారు నన్ను?" ఏడ్చింది.

"ఇప్పుడేం జరిగిందని ఆ యేడుపు?"

"ఆ డబ్బేంచేశారు?"

"కల్యాణి కిచ్చాను?"

"ఎందుకు?"

"అదుగో ప్రశ్నలెవరడిగినా నాకు మహా చెడ్డ కోపం. ఇదుగో - కొంచెం జరుగు. చలిగావుంది. కోళ్ళు కూస్తున్నాయి. కొత్త కోడలు నిద్రపోగూడదు - తెలుసా - ఇది నా యింట్లో నీ మొదటి రాత్రి. జరుగు మరి."

ఏడ్చింది మళ్ళీ.

"నిన్ను ఏడ్పించాలని తీసుకురాలా?"

"ఉరివేసి చంపుదామని తెచ్చారా? చావకొట్టి చెర్లో గిర వాటు పెడ్తామని తెచ్చారా? పొండి. మీరంటే అసహ్యం వేస్తు

న్నది - దయుంచి నన్నిలా పడుకోనీండి. చాలా పొరపాటు చేశాను. ఇటువంటి దౌర్భాగ్యపు జీవితంకంటె గుక్కెడు విషం త్రాగి చావడం మేలు - వెళ్ళండి. వెళ్ళండి, వెళ్ళండి" పెద్దగా అరుస్తూ ఏడ్చింది ప్రసూన.

సరే ప్రసూనా! బయట చావడిలో పడుకుంటా. ఇలా జరుగుతుందనుకోలేదు ఈ రోజు. ఎంతో ఆశపడ్డాను. కావాలను కున్నప్పుడు నాకేదీ దొరకదు ప్రసూనా - అదొక దురదృష్టం" అంటూ చాప దిండు తీసుకు బయలుదేరాడు. రెండడుగులు వేశాక ప్రసూన - "ఆగండి - రండి - యిలా పడుకుందురుగాని" అంది దీనంగా.

మంచంమీద కూర్చున్నాడు.

పొట్ట తడిమి "అన్నం తిన్నారా ?" అంది.

"లేదు."

"ఎందుకిలా ఆరోగ్యం పాడుచేసుకుంటారు ? ఎవరిమీద సాధించాలని పగ ? మీరిలా అయిపోతే ఎవరుచూసారు మిమ్మల్ని ?"

"నువ్వు చూడవా ?

"మనిషిని నమ్మలేనన్నారు. బ్రతికున్న మనిషిని బ్రతి కుండగా నమ్మనన్నారు ?"

"నువ్వు మనిషివని ఎవరన్నారు ?"

"మరెవరిని ?"

"దేవతవు."

ఆమె పెదవులపై వెల్చటి నవ్వు చీకట్లో మెరిసింది. చెక్కిళ్ళను నిమిరింది. అరచేతులకు తడి తగిలింది.

"ఏడ్చారా ?"

" ఏమో!"

" ఎందుకని ?"

" నా మీద నీకు కోపమొచ్చిందా ?"

" లేదే..."

"వచ్చింది."

" ఎందు కంటారు ?"

" ఇందాక కొట్టానని -"

" అధికారముందికనక నే కొట్టారు. అందరూ అందర్నీ కొడ తారా - పడుకోండి."

కొలిమిలోంచి వస్తున్న గాలిలాంటి వూపిరి. కోడికూసింది. " తెల్లవారుఝామయింది. పసులకు మేతవేయాల్సిన టైము. పందులకోసం ఉప్పరిగూడెం రావాల్సివచ్చింది. యిప్పుడు పందులు లేవు. ఉప్పరిగూడెం మిగిలింది. ప్రసూనా? హైదరాబాద్ పోయి పదన్నా బిజినెస్ చేద్దాం. సంపాదించలేమంటావా ? పెట్టుబడి కావాలనుకో. కరుణాకరాన్ని అడుగుతా. "ప్రాణస్నేహితుడులే. ఏమిటో ఈ మధ్య వాణ్ణికూడా మరిచిపోయా ? నే అడిగితే కాదనడు. ఏమంటావ్ - ?"

'మాట్లాడకండి. తెల్లవారుతూంది. పడుకోండి. పాడు మాటలు చెప్పకండి. ఎంతో ఆశపడ్డానన్నారు నన్ను మీయింటికి తెస్తూ? ఆ ఆశల రహస్యం కాస్త చెవిలో చెపుదురూ - ఛీ - మరీ చంటిపిల్లాడి తంతు—'

"ఇది మా ఊళ్ళో తయారైన కంబళీ."

"ఏం పాడో - యిటు తిరగండి."

తెల్లవారింది - ఎనిమిదయింది రాఘారావు తేచేసరికి ముస

అమ్మ కేకలతో. పక్కలో ప్రసూన లేదు. దొడ్డి వాకిలి చూశాడు. లేదు. మంచంమీద దిండు ప్రక్కన ఉత్తరం కనిపించింది.

"రాజా

నాకోసం వెతక్కండి. వెతికినా దొరకను. మీ రెటువంటి వారైనా కావాలనుకున్నాను. నావారైతే చాలనుకున్నాను. కాని భ్రమపడ్డాను. సొంతం క్రింద పడకముందే లేచాను. మరిచి పొండి, మీరు మరిచిపోగలరని నాకు తెలుసు. మీ వస్తువు మీ కళ్ళ ముందే వుంది. కళ్ళు తెరచి వెతుక్కోండి.

మీ—

మీదికాని—

ప్రసూన"

పిడుగు పడినట్లు, నేల పగిలి పాతాళానికి పతనమై పోతున్నట్లు కనిపించాడు రాజారావు. అలాగే కూలబడిపోయాడు. విశ్వపతి మాష్టారి అంత్యక్రియలు పూర్తిచేసి తిరిగివస్తున్న జనం కనిపించారు.

ముత్తెం వచ్చి పడ్డాడు. ఊళ్ళో అందరూ చందాలువేసి కర్మకాండలు చేయవలసి వచ్చిందట. రాజారావు గుక్కలుపట్టి పడుస్తున్న ముత్తెన్ని ఓదారుస్తూ "భగవాన్ నన్ను ఓదార్చే దెవరు?" అంటూ నిట్టూర్చాడు.

"బాబూ! మంచోళ్ళకివి రోజులు కావు. ధర్మరాజులాంటి విశ్వపతి మాష్టారు వెళ్ళిపోయారు పుట్టెడు దిగులుతో. కల్లా కపటం తెలియని మీలాంటోరు ప్రపంచానికి పనికిరాకపోయారు."

"ముత్తెం? ఎందుకురా నేనంటే నీకింత అభిమానం?"

"మీమీదకాక ఎవరిమీదుంటాదండీ? మిమ్మలి మరోలా ఎలా అనుకుంటారండీ ఎవరైనా."

"ఊళ్ళో అందరూ అనుకోటంలా చెప్పు ?"

"అదే చిత్రం బాబూ."

"కరుణాకరం ఎప్పుడొస్తాడు?"

"పదిరోజులదాకా రానని పోయారండి. ఎంకటరత్నంగారి సత్తెంతో హైదరాబాద్ ఉత్తరం మిప్పించా విశ్వపతి మాష్టారు పోయినారని. రేపటికొస్తారేమో ?"

"కరుణాకరం పెళ్లెందుకు చేసుకోలా ? నాలాంటి పనికిమాలినవాడు ఎవరికీ అవసరంలేదు. అతను కావాలనుకుంటే . . ."

"బాసండి. సెటిలయిపోతాడండి కాని బాబుగారెందుకో తటపటాయిస్తున్నారుమరి - వరదాచార్లుగా రమ్మాయి వసంతమ్మగోర్నిస్తారటండీ !"

"కరుణాకరం ఒప్పుకున్నాడా ?

"ఏమిటోనండి. ఆయన చాలా లోతైన మనిషి. మనసులో ఏముందో ఆ బ్రహ్మదేముడికే తెలియాలి."

"నీతోకూడా చెప్పలేదా ?"

"ఇంతవరకూ ఆ ఆలోచన లేదన్నారండి అడిగితే."

"కల్యాణీ వాళ్ళు ఏమైపోతారు ?"

"ఏమోనండి. ఆరికి ఆ భగవంతుడే దిక్కు. రేపెలా గడుస్తుందో ఎరికీ తెలియదండీ. మొన్న రాగిచెంబుకూడా ఎల్లిపోయిందండి. అన్నట్టు" అంటూ బొడ్లోంచి ఒక పొట్లంతీసి "కళ్యాణమ్మగారిది మీకిమ్మానరండీ" అన్నాడు.

"ఏమిటది ?"

"ఇప్పి చూడలేదండి."

పొట్లం చూడగానే అర్థమయింది అందులో ఏముందో రాజారావుకి. దాన్ని మంచంమీద పడేసి తదేకంగా కొన్నిక్షణాలు చూశాడు. హరించుకు పోతున్న అదృష్టంలో చివరిలేశం.

ముత్తెం వెళ్ళిపోయాడు.

ముసలమ్మ కేకపెట్టింది. మూలిగింది. "కోడలుపిల్లా" అంటూ పిలిచింది. రాజారావు వెళ్ళాడు.

"కోడలుపిల్ల ఏదిరా రాజా ?" అంది.

"వెళ్ళిపోయిందమ్మా."

ముసలమ్మ వణికింది.

"ఎక్కడికిరా ?"

"ఎక్కడనుంచి వచ్చిందో అక్కడికే."

"మళ్ళీ ఎప్పుడు వస్తుంది ?"

"యింకరాదమ్మా" రాజారావు గొంతు జీరపోయింది. తల్లికి కాఫీకాచి యిచ్చాడు.

"పోట్లాడుకున్నారా ?" అంది బలవంతంమీద కాఫీత్రాగి.

రాజారావు మాట్లాడలేదు.

"ఆలూమొగలన్నాక వస్తూనేవుంటాయి, బాబూ - కాని పాలపొంగులాంటి దా కోపం. అంతగా నిలవదు. మీ నాన్నగారు మాత్రం కొత్తల్లో ఎంత దూకుడుగా వుండేవారనీ ? 'ఊఁ' అంటే కోపం 'ఆఁ' అంటే కోపం. మాట్లాడితే కాశీ పోతానని జందెం తెంపుకునేవారు. పోనిచ్చానా ? కాలూ గడ్డం పట్టుకు బ్రతిమలాడేదాన్ని. తాటాకుమంటలాంటి కోపం క్షణాలమీద చల్లారి పోయేది - పోయి బ్రతిమిలాడి తీసుకురా పో."

"పడుకోమ్మా, అలాగే."

"ఇదుగో! కొత్తగా కాపరాని కొచ్చిన పిల్ల మరీ అంత మూర్ఖత్వం పనికిరాదు."

"సర్లే పడుకో పనుంది."

"వచ్చే ఏడాదికి పంశులాంటి బిడ్డని కనాలి మనమణ్ణి ఎత్తుకొని కన్ను మూయాలని వుందిరా రాజా."

రాజారావు కళ్ళు చెమ్మగిల్లాయి. తల్లి - బిడ్డ సుఖంకోసం తందరిస్తున్న హృదయం - ఈ ప్రపంచానికి తనను కట్టిపారేసిన చివరి లంకె. అది తెగిపోతే ? - దారం తెగిన గాలిపటం. జీవితం. ఎక్కడ ఎగురుతుంది ? ఎక్కడ రాలుతుంది ? విశ్వపతి మాష్టారు గుర్తొచ్చారు. తల్లికీ తండ్రికీ ఏమిటి తేడా ? ఆయన మతి చెడింది. పిచ్చివాడన్నారు. తన తల్లినీ అంటున్నారు. కాని ఎటువంటిదా పిచ్చి ? పిచ్చికి అర్థమేమిటి ? బిడ్డ సుఖంకోసం పలవరించి భ్రమించిన మనస్సు పిచ్చిదా ?

"ఎంత వెర్రిదానివమ్మా ?" అంటూ గొణుక్కున్నాడు. కళ్ళు చెమ్మగిల్లాయి.

"అమ్మా !" అన్నాడు.

"ఏం బాబూ ?"

"నన్నెందుకు కన్నావమ్మా ? ఎవరు కావాలన్నారు యిటువంటి జీవితాన్ని ? ఏం చేసుకోనమ్మా దీన్ని. పారేసుకోలేని, దాచుకోలేని, విలువలేని పిచ్చి వస్తువై పోయిందే -" గొణుగుతున్నాడు.

"ఏమిట్రా అంటున్నావు ?"

"కొంచెం జరుగమ్మా."

"నా దగ్గర పడుకుంటావా పిచ్చి తండ్రీ."

పడుకున్నాడు. ఎముకలపోగు. బిడ్డకు రక్తాన్నీ ఆశలనూ భవిష్యత్తునూ చనుబాలలో రంగరించి త్రాగించిన తల్లి గుండె ఎండి

పోయి నీరసించి ఆగిపోలేక మూలుగుతూంది. ఇంతసేపు మాట్లాడ లేక లేని శక్తిని కూడగట్టుకొని మాట్లాడింది. మాతృవాత్సల్యా బలంతో లేవలేని చేయి లేచి బిడ్డ చెక్కిళ్ళను నిమిరి ముంగురులను సవరించింది.

"బాబూ! ఇన్నాళ్ళ తర్వాత నా దగ్గర పడుకున్నావు. చంటినాన్నగా వున్న రోజులు గుర్తొస్తున్నాయిరా. కానీ, బాబూ! నా దగ్గర నువ్వు పడుకోగూడదు. ఈ దిక్కుమాలిన క్షయరోగం అంటువ్యాధి నాన్నా - పో లేచిపో. ఈ శరీరమంతా విషం."

"అమ్మా! తల్లి విషం బిడ్డకు అమృతమే లే."

గూడెంలో కేకలు వినిపించాయి. కొన్ని రోజులుగ్గా కలరా బాగా వ్యాపించింది. పిట్టల మాదిరి రాలిపోతున్నా రెందరో. పక్కింటి వీరాస్వామికి రాత్రి కలరా తగిలింది. పోయాడు. మళ్ళీ ఏడుపులు. అంతటితో ఆగలేదు. వాళ్ళమ్మాయి సీతకి వాంతులు విరోచనాలూట. పరుగెత్తాడు రాజారావు.

# పది

కరుణాకరం హైదరాబాద్‌నుంచి తిరిగి వచ్చేసరికి మర్నాడు సాయంత్రం అయిదు గంటలయింది. వస్తూనే గౌరమ్మగారిని పలకరించటానికి వెళ్ళాడు. ఉదయంనుంచీ ఆవిడ సోకాలు పెట్టి శోషవచ్చి పడుకుంది. కల్యాణి జావ కాస్తున్నది. కరుణాకరాన్ని చూసి "పనులు పాడుచేసుకుని ఎందుకు వచ్చావు కరుణా? నువ్వు వచ్చి మాత్రం చేసేదేముంది? అంతా అయిపోయింది గదా? అంది నిర్లిప్తంగా.

కరుణాకరం మాట్లాడలేదు. మౌనంగా తలవంచుకు కూర్చున్నాడు. అతని కన్నుల్లో పొంగిన నీరు చూసి కల్యాణి "ఎందుకలా బాధపడ్తావు కరుణా? అదృష్టవంతుడు గనక ఆయన వెళ్ళిపోయారు. సుఖాన్నిస్తున్న జీవితం పోయిందంటే భయంగాని, బండరాయిలా మోయలేని భారమైన జీవితం తొలగిపోతే విచారమెందుకు చెప్పు. పాపం అలిసిపోయి వచ్చావు. స్నానంచేసి బట్టలు మార్చుకో. నేనూ వంటచేయాలి." దుఃఖభారాన్ని అంత అవలీలగా మోస్తున్న కల్యాణిమీద అస్పష్టమైన గౌరవభావం కలిగింది. లేచాడు. రెండడుగులు వేసి ఆగి "కల్యాణీ! నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి. ఎప్పుడు వీలుంటుంది?" అన్నాడు.

"ఇందుకు పెద్ద వీలంటూ ఏముంది కరుణా చెప్పు."

"అలాకాదు. తీరుబడిగా మాట్లాడాలి. చాలా ముఖ్యమైన సంగతులు."

"అంత ముఖ్యమైన సంగతులున్నాయా మనం మాట్లాడుకుంటానికి?"

"ఏం నీకు నమ్మకంలేదా ఉన్నాయని ?"

"లేదు కరుణా."

విస్తుపోయాడు కరుణాకరం. ఎంతో నిర్లిప్తంగా, నిబ్బరంగా చెప్పింది కల్యాణి ఈ మాటలు. కొంచెంసేపు అలాగే నిలబడి ఆమె ముఖంలోకి చూశాడు. మూర్తీభవించిన ఆత్మవిశ్వాసం కనిపించింది.

"కరుణా ! కోపం వచ్చిందా ?"

"లేదు."

"మరి ?"

"ఆశ్చర్య మనిపించింది. నేను ఏదో ముఖ్య విషయమన్నాను. కనీసం అది ఏమిటో తెలుసుకోవాలన్న కుతూహలంగూడా నీకు లేకపోయింది కదూ ?"

"ఒక బండిచక్రంలో ఆకులా బిగుసుకుపోయిన బ్రతుకుకు ఏం కుతూహలమున్నా ఏం ప్రయోజనం కరుణా? తెలుసుకునిమాత్రం చేసేదేముంది ? అదీగాక నువ్వు చెప్పబోయేదేమిటో నాకు తెలుసు."

"నీకు తెలియదు కల్యాణీ. తెలిస్తే నువ్వు ఎగిరి గంతేస్తావు. నీ ఎదుటి ప్రపంచాన్నికూడా నమ్మలేనంత నివ్వెరపాటు చెందగలవు-భరించలేని అదృష్టం ఒక్కసారి బ్రతుకులో విరియబూస్తుంది. నామాట నమ్ము. నామీద విశ్వాసంలేదా కల్యాణీ ?"

కల్యాణి నవ్వింది తేలికగా.

"కరుణా ! ఇంకా పరుగెత్తే ఆదర్శాల గుర్రాలమీద ఉరకలు తీస్తున్న మనస్సు నీది. నీమీద విశ్వాసం లేదనికాదు. ముందు నా మీద నాకు నమ్మకం వుండాలి గదా ? పోన్లే. నిన్నెందుకు మభ్య పెట్టాలి. వస్తాను కరుణా. సరదాగా కాసేపు కూర్చునే ఓపిక

కూడా యిప్పుడు నాకు లేదు. రేపో ఎల్లుండో వస్తా. నువ్వేం చెప్పినా వింటా" అంది.

కరుణాకరం తన గదికి వచ్చాడు. ఊళ్ళో గొడవలన్నీ క్రమం వరసా లేకుండా చెప్పుకుపోతున్నాడు ముత్తెం. అంతలో వరదాచార్యులుగా రొచ్చారు మున్సబును వెంటబెట్టుకొని. "ఈ యేడాది రథోత్సవం సక్రమంగా జరిపించాలి. ఆ రాజారావు ఆటలు సాగనీయగూడదు. పూటకు ఠికానాలేని ఆ వెధవల మాటలు చెల్లనీయగూడదు. ఇందుకు నువ్వే నడుంకట్టుకుని ఊరి గౌరవం నిలబెట్టాలి కరుణాకరం" అన్నారు ఆచార్యులవారు. అంతలో మున్సబుగారి పాలేరు ముత్తయ్యా వచ్చాడు. "అయ్యా, తలలు పగిలినాసరే, చావటానికి సిద్ధంగా వున్నాం. మీరు 'ఊఁ' అనండి. రథానికి ఎవరు అడ్డం తగులుతారో చూద్దాం" అంటూ కర్ర వాటంచేసుకుని గొంతు కూర్చున్నాడు.

"ఏమంటావు కరుణాకరం?" అన్నాడు మున్సబుగారు.

కరుణాకరం వారి మాటలు వినటంలేదు. ఏదో పరధ్యాన్నం. "నీ మీదే కొండంత ఆశ పెట్టుకున్నాం బాబూ" అంటూ ఎలుగెత్తి అరిచారు వరదాచార్యులవారు. రాఘవయ్యా వచ్చి, రథోత్సవాలకు గోవింద యతీంద్రులవారు స్వయంగా వచ్చి సప్తాహ కార్యక్రమం నిర్వహించటానికి అంగీకరించారని చెప్పాడు. వరదాచార్యులగారింక రెచ్చిపోయారు. "బాబూ, ఇది గ్రామ గౌరవ మర్యాదలకు సంబంధించిన విషయం. ఇందులో వ్యక్తుల ప్రసక్తి లేనేలేదు. శ్రీకృష్ణపరమాత్మ చెప్పినట్లు తన మన అనే ప్రమేయం లేకుండా కర్తవ్యం నిర్వహించవలసిన తరుణం నాయనా–" అంటూ యతీంద్రుల ఫక్కీలో పెద్దయెత్తున ఒక చిన్న ఉపన్యాసం యిచ్చారు.

" ఏమిటో ఆలోచిస్తున్నాడు కరుణాకరం" అన్నాడు రాఘవయ్య.

" నువ్వంత మధనపడాల్సిందేం లేదుబాబూ ! నీ ఆజ్ఞపాలించి నెత్తురు ధారపోయడానికి కావలసినంత బలగం సిద్ధంగా వుంది. ఏమంటావ్ ?"

" అయ్యా ! తలనొప్పిగావుంది. రేపు మాట్లాడదాం " అంటూ లేచాడు కరుణాకరం.

" ఔను పాపం ! తిరిగితిరిగొచ్చావా — రేపే కలుస్తాంలే. అన్నట్లు ఈ సంవత్సరం సప్తాహం నీ ఆజమాయిషీ క్రింద జరగాలని మా కోరికయ్యా. సర్లే, రేపొస్తాం" అంటూ లేచారు వరదాచార్యుల వారు.

ఆ రాత్రి - ఎనిమిది దాటింది. ముత్తెంవచ్చి ఒక కవరు కరుణాకరం చేతికిచ్చాడు.

" ఏమిటిది ముత్తెం ?"

" వసంతమ్మగోరు మీ కిమ్మన్నారండి రహస్యంగా."

దాన్ని చదవకుండా ముక్కలుగా చించి ఆవల గిరవాటు పెట్టాడు కరుణాకరం.

"అలా చేశారేం బాబూ !"

"ఏం చెయ్యాలి అంతకంటే ?"

"సదివితే ఏం పోయిదండీ ?"

"నాకు చదవాలనిపించలేదు ముత్తెం. తలనొప్పిగా వుంది. ఇప్పటిదాకా ఊరి పెద్దలంతావచ్చి పఖతీర్చి పోయారు."

"అన్నట్టు మరిచా కరుణాకరంగోరూ సెప్పటం - ఆ యతీంద్రులగారినంట ఈ రథోత్సవానికంట ఆహ్వానిస్తారంట. మీ యింట్లో

విడిది సేయిస్తారంట. మీ రొప్పుకోబోకండి. ఈ ఆచార్లూ ఆ మున్సబూ కలిసి ముంచేస్తారు. రాఘవయ్య అట్టాగే దివాలాతీశాడు గదండీ. సాములారంట యాత్రేమందో పందమందో శిష్యులొస్తారు. వారంనుండి నెలలదాకా వీలునుబట్టి మకాం వేస్తారు అరంతా. భజనలు చేసీచేసీ గెలాకల్తో ఒకోళ్ళు మూడేసి కంచాలు తింటారు. కుబేరుడైనా దివాలాతీసే యవ్వారమది. మీరుమాత్రం నెత్తిన పెట్టుకోబోకండి"

"ముత్తెం! రాజారావుని ఓసారి పిల్చుకొస్తావే ?"

"అలాగే నండి."

నడుం వాల్చాడు మంచంమీద. వసంత వచ్చింది. తెల్లటి చీర-పొడుగాటి వాలుజడ - చెంపలు వలయాకారంలో తీర్చి దిద్దింది. క్రమంలో వింతగా రేపుకున్న ముంగురులు. పౌడరువాసన - మెరుస్తున్న తిలకం-

"ఏంచేస్తున్నావు కరుణా ?"

లేచి కూర్చున్నాడు. ఆమెను తదేకంగా చూశాడు.

"ఏమిటలా చూస్తున్నావు?"

రెండుచేతులతో తల పట్టుకున్నాడు.

"తలనొప్పిగా వుందా ?"

బరువుగా నిట్టూర్చాడు.

"అమృతాంజనం రాయనా. ఎక్కడుంది ?" లేచింది.

"నే రాసుకుంటాలే" అంటూ బీర్వాలోంచి విక్స్‌డబ్బా తీశాడు. దగ్గరకొచ్చింది. అత్తరుపరిమళం-వళ్ళు జలదరించింది. వంగింది డబ్బాకోసం - పమిట తొలగింది. పకపకనవ్వి కప్పుకుంది గట్టిగా.

"అదిట్లాతే వసంతా, నే రాసుకుంటా".

"ఏం నేను రాయకూడదా ?"

" ఎందుకు, అంత దిగజారి పోలేదుగా పరిస్థితి."

" అంటే ?"

" అంటే - ఏంలేదు. మంచంమీదనుంచి లేవలేని స్థితిలో నీలాంటివాళ్ళ సహాయం ఎంతో అవసరం ?"

" పరాయివాళ్ళు చేసేదాన్ని సహాయమంటారు..."

పట్టుపట్టి బలవంతంగా రాసింది విక్స్ కణతలకు. తలకు తల తగిలింది. కాలుతున్న స్త్రీ స్పర్శ !

" చాలు వసంతా."

" ఊఁ"

" యింక లే."

" ఊఁ"

" మంటగా వుంది అలా నొక్కి రుద్దుతూంటే."

" ఊఁ"

" తలనొప్పి సంగతి దేముడెరుగు నువ్వలా చేస్తుంటే..."

"ఎలావుంది ?"

" ఉండు లేవనీ."

బలంగా ఆమెనుంచి తప్పుకుని లేచి, తుండుగుడ్డ కణతలకు బిగించాడు. మంచంమీద కూర్చుంది. ఆవలించింది. వళ్ళు విరుచుకుంది. కుర్చీలో కూర్చుని " వసంతా ! చీకటి పడింది యింక ఇంటికి వెళ్ళ రాదూ ?"

" అబ్బ! ఆ పంజరంలోంచి కాస్త గాలి పీలుద్దామని రెక్కలు విప్పుకు బయట పడ్డాను. వెడతానులే..."

" మీ నాన్న గారికి తెలుసా నువ్విలా వచ్చావని."

" అమ్మకు తెలుసు."

"ఏమంది ?"

" ఇందులో అంటానికేముంది కరుణా ? మనమేం తప్పు చేశామని ?"

" నాన్నగారికి కోపం వస్తుంది వెళ్ళు "

" ఏం ఫర్వాలేదు. అదీగాక ఒకరేమనుకుంటారో నని భయ పడుతూ ఎంతకాలం బ్రతుకుతాం చెప్పు ? తప్పు చేయడంలేదని మన మనస్సులకు తృప్తి కలిగినప్పుడు ఎవరేమనుకున్నా భయంలేదు - నా కనిపిస్తుంది కరుణా ఒకోసారి ! నువ్వనేవాడివి లేకపోతే ఈ వూరు రాకపోతే నేనేమైపోయేదాన్నా అనిపిస్తుంది. భూమి గుండ్రంగా వుందన్నట్లు నువ్వుకూడా తిరిగితిరిగి యిక్కడికే వచ్చావు. తీగకే వెతకబోయిన మనిషి కనిపించాడు."

కరుణాకరం మనస్సు మెలికలు తిరిగిపోతున్నది. "పొరపాటు పడుతున్నావు వసంతా - చేతులు కాలకముందే ఆకులు పట్టుకోవడం మంచిది. జీవితం గురించీ భవిష్యత్తును గురించీ, ఆశలూ ఆలోచనలూ నీకే కాదు వసంతా - నాకూ వున్నాయి. బ్రతికున్న ప్రతిమనిషికీ. వుంటాయి. నీ ఆలోచనలు వేరు. నా ఆలోచనలు వేరు, నువ్వీ విషయంలో భ్రమపడుతున్నావని చెప్పక తప్పదు." అన్నాడు కఠినంగా.

" ఈ విషయంలో నేను భ్రమపడటమంటూ జరిగితే నాకు జీవితమేలేదు కరుణా. చాలా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను. నేను పుట్టినప్పుడే జాతకం వ్రాశారు. అది అబద్ధం కావడానికి వీలులేదు."

" నువ్వు ఆలోచించలేదని నేనడంలేదు. కాని నాకుగూడా ఆలోచనలున్నాయనే విషయం గుర్తించమంటున్నాను. అదే నే

కోశేది. ఇదుగో చూడు కావాలంటే..." అంటూ ఆవలిగదిలోకి పోయి పెట్టెలోంచి ఒక కనర్లకట్ట తీసుకొచ్చాడు.

"ఏమిటవి ?" అంది కల్యాణి.

"బాబూ! కరుణాకరం" బయట నుంచి కేక వినిపించింది.

"తర్వాత మాట్లాడుదాం వెళ్ళు వసంతా - ఎవరో వచ్చారు. ఈ దొడ్డిదోవన వెళ్ళు."

"ఆడదాన్ని - నాకున్నంత గుండె నీకు లేదు" అంటూ పకపక నవ్వుకుంటూ ముందుగదిలోంచి అతఃపురంనుండి ఠీవగా బయట కొస్తున్న మహారాణిలా నిష్క్రమించింది వసంత.

"ఆడదాని గుండెలు! నిజమే అల్పజీవి మగాడు..." గొణుక్కుంటూ కరుణాకరం బయట కొచ్చాడు.

రాఘవయ్య-"బాబూ! కరుణాకరం - ఊరి సత్రం పాడుబడి పోయిందయ్యా. మనం ఒక కుటుంబాన్ని తెచ్చి అందులో పెట్టి దాన్ని పునరుద్ధరించాలి. నీకు తెలుసుగా మా తాతగారు కట్టించిన దా సత్రం. ఎన్నడూ యిలా పాడుపడి లేదు."

ఊరికి పెద్దరికం నెరపుతున్న వారంతా, తన్ను పెద్దగా గుర్తించి సలహా సంప్రదింపులకు రావడం కరుణాకరానికి యిబ్బందిగా ఉంది. తన కెందుకీ గొడవలు ?

"అయ్యా! రాఘవయ్యగారూ, మీరు పెద్దలు. ఇన్నాళ్ళుగా గ్రామం మీ పరిపాలనలోనే బ్రతికింది. ఇవాళ డబ్బు వచ్చినంత మాత్రాన నేను పెద్దవాణ్ణి ఔతానంటారా ? మీ యిష్టం. మీ యిష్టం వచ్చినట్లు చేయండి. మొన్న సిద్దవటం గ్రామ పెద్దలంతా వచ్చి వారి గొడవలన్నీ చెప్పి మీ సలహా కావాలంటారు. నే నెవరిని చెప్పండి మధ్య. ఇంత పెద్దరికమూ నాకు లేదు; ఇంతటి బరువు బాధ్యతలు మోసే శక్తిలేదు" అన్నాడు కరుణాకరం విసుగ్గా.

"నువ్వలా అంటే యెలా కరుణాకరం? ఈ వూరి సత్రానికి ధర్మకర్తను నేనే అనుకో. అక్కడ పనిచేయటానికి ఎవరినైనా వేసే అధికారం నాకుందనుకో. కానీ ఎందుకనో నీ సలహా అడగటం మంచిదనిపించింది. మన గౌరమ్మగారు లేదూ విశ్వపతి మాష్టారి భార్య - ఆవిడకు సత్రంలో కొలువు కావాలట."

కరుణాకరంలో నిర్లిప్తత నశించి "ఎవరు? మాష్టారి భార్య? అంటే సత్రంలో?"

"ఔను బాబూ! వచ్చే పోయే వాళ్ళకి - ఊరంటూ అన్నాక ఎవరో ఒకరు వస్తూంటారు గదా? ఇదేమన్నా బస్తీనా హోటళ్ళున్నాయని నాలుగు మెతుకులు తినటానికి? వచ్చిన వాళ్ళకి తిండి యింత పెట్టే దిక్కుండాలిగదా? పూట కింతని తీసుకున్నా? సత్రానికని కుంటపొలం రాసిచ్చి పోయాడు మా తాతగారు. అందులో పనిచేసే వారికి ఆ ఫలసాయం కూడా దక్కుతుంది. మాష్టారు పోయాక వాళ్ళూ అనాథలై పోయారా? ఏమంటావ్ నీ కే మభ్యంతరం లేదుగా బాబూ..."

కరుణాకరం శరీరం వణికింది. "రాఘవయ్యా? ఈ సత్రంలో ఉద్యోగం కావాలని ఎవరడిగారు నిన్ను?"

"మాష్టారమ్మాయి. కల్యాణమ్మగారు."

"ఎప్పుడు?"

"ఇందాక. పాపం అడగలేక అడగలేక అడిగింది. దరిద్రం చాలా భయంకరమైంది బాబూ! కష్టాల్ని పదింతలు చేస్తుంది. పూట గడవటం కష్టంగా వుందట. కానీ బాబూ, మనిషంటే ఆ కల్యాణమ్మగారేనయ్యా. ఏం నిబ్బరం? ఏం ధైర్యం?"

"రాఘవయ్యా! నన్ను సలహా అడిగావు. నా అభిప్రాయమ్ చెప్తాను. సత్రంలో కొలువు వాళ్ళకి ఇవ్వటానికి వీలులేదు."

రాఘవయ్య తెల్లబోయాడు. కొంచెం సేపాగి "ఎందుకని బాబూ ? ఏమిటి మీ అభ్యంతరం ?" అన్నాడు.

"సమయం వచ్చినప్పుడు చెప్తాను. కానీ ఇది మాత్రం జరగటానికి వీలు లేదు. నేను ఒప్పుకోను."

కరుణాకరం కంఠం చాలా తీవ్రంగా ధ్వనించింది. పగిలి జీర పోయింది. రాఘవయ్య నిరుత్తరు డయ్యాడు.

"సరే బాబూ. నిన్ను కాదని ఏం చేస్తాను. మీ యిష్టం." అంటూ వెళ్ళిపోయాడు.

అలాగే కూర్చున్నాడు కుర్చీలో. ముత్తెం పిలిచేదాకా ఈ ప్రపంచంలోకి రాలేదు. "ముత్తెం! నీ వొకసారి నన్నో ప్రశ్న అడిగావు గుర్తుందా ?"

"దేన్ని గురించి బాబూ ?"

"నా వివాహం గురించి."

"ఔను! వరదాచార్లుగారంటే అడిగాను."

"కాదు. ఆ ప్రశ్నకు సమాధానం చెప్తా నీవాళ."

"ఏమిటి బాబూ ?"

టేబిల్ మీదున్న కవరులోంచి అచ్చయిన శుభలేఖ తీసి చూపించాడు. ముత్తెం చదివాడు. ఆ కొద్ది క్షణాలకాలంలో ముత్తెం ముఖం పలురకాల భంగిమలతో మెలికలు తిరిగింది. అతని ముఖాన్నే రెప్పలార్పకుండా చూస్తూ కూర్చుండిపోయాడు కరుణాకరం.

"బాబూ" అన్నాడు చివరకు ముత్తెం.

"ఏమిటి ముత్తెం ?"

"చిత్రంగా వుందండి. యిలా జరగటం..."

"ఆగిపోయావే ? చెప్పు ముత్తెం – ఏమిటి నీ అభిప్రాయం?"

గోణిగాడు ముత్తెం.

"ఫర్వాలేదు చెప్పు ముత్తెం - విన్నావా?"

"తప్పేముందండి. చిత్రం బాబూ. ఎవరికి ఎక్కడ రాసి పెట్టుందో ఎవరికీ తెలియదు గదా? వసంతమ్మగార్ని మీకిస్తున్నా రనుకుంటున్నారు ఊరంతా. మీరిలా నిర్ణయించారు. అయితే బాబూ ముహూర్తంగూడా పెట్టించేశారు గదా? గౌరమ్మగార్ని అడిగారా?"

"లేదు. ఇప్పుడు చెప్తా. ముందు కల్యాణితో చెప్పి - ఇప్పుడే వస్తా - కల్యాణితో మాట్లాడాలి. వస్తానంది. రాలేదు -" అంటూ లేచాడు.

కరుణాకరం గదిలో అడుగుపెట్టగానే గౌరమ్మగారు "కల్యాణి యింట్లోలేదు కరుణాకరం" అంది.

ఏదో కొరడాతో ముఖాన చరిచినట్లనిపించింది. "నేను వచ్చింది - మీతో మాట్లాడాలని" అన్నాడు. ఒక క్షణం ఆగి "కూర్చో బాబూ!" అంది గౌరమ్మగారు.

'ఏమిటి చెప్పు?' అన్నట్లు చూసింది.

"కల్యాణి ఏదండి?"

గౌరమ్మగారు తల వంచుకుంది.

"యింట్లో లేదా?"

"ఏం చెప్పను బాబూ! ఇదొక ఖర్మ. వినాశకాలానికి విపరీత బుద్ధులు పుడతాయంటారు." అంటూ చీకి చీర కొంగుతో ముక్కు తుడుచుకుంది.

"ఏమయిందండీ?"

"పెళ్ళి కావలసిన పిల్లగదా? వాడెవడో కలరా తగిలి చస్తుంటే దీనికెందుకు బాబూ. వాడు కబురు చేశాట్ట. ఈవిడ

రెక్కలు కట్టుకు ఎగిరిపోయింది. అవి నిలిచే రెక్కలనుకున్నావా? అవి విరగకా తప్పదు, ఆ దిక్కుమాలిన జీవితం నెత్తురు కక్కుకుంటూ నేలకు రాలిపోకా తప్పదు. ఎవరి ఖర్మకు ఎవరు కర్తలు బాబూ."

"కలరా ఎవరికండి?"

"ఆ రాజారావుకిట. వాడొక దౌర్భాగ్యుడు దాపురించాడు మా కొంప నాశనం చేయటానికి. ఏ జన్మలో వాడికి ఏ అపకారం చేశామో తెలియదు. దయ్యం పట్టినట్టు పట్టాడు బాబూ. వాడి తల బ్రద్దలు కొట్టాలనుంది. ఊరంతా హడలి చస్తున్నారు వాడంటే నే నేంచెయ్యగలను చెప్పు."

ఏడ్చింది గౌరమ్మగారు. కరుణాకరం చకచకా అడుగులు వేసుకుంటూ ఉప్పరిగూడెంకు నడిచాడు. దోవలో ముత్తెం కనిపించి అనుసరించాడు. కలరా రోగం వచ్చిందంటే ఎవరూ ఇంటి ఛాయలకు రారు. అందులో సంఘంచేత వెలివేయబడిన మనిషి రాజారావు. చుట్టుపట్ల మనిషి అలికిడి లేదు. ముసలమ్మ మూలుగు మాత్రం విని పించింది.

తన అడుగుల సవ్వడికి తానే భయపడుతున్నట్లు మెల్లగా నడుస్తూ లోపల కాలుపెట్టాడు కరుణాకరం. ఎట్టి పరిస్థితులలోనూ సంభవిస్తుందని ఊహించని దృశ్యం కరుణాకరం ముందు కనిపించింది. గాలి వెలుతురు రాని ఆ చీకటిగదిలో మంచంమీద చైతన్యహీనంగా పడుకున్న రాజారావు గుండెలమీద తలవాల్చి పడుకుంది కల్యాణి. తల అటు తిరిగి వుంది. మరొకరు గదిలో ప్రవేశించిన విషయం ఆమె గమనించలేదు. వెక్కి వెక్కి ఏడుస్తున్నది. అతని తల నిమురు తూంది. క్షణకాలం నిర్జీవంగా నిలబడ్డాడు కరుణాకరం. ముత్తెం లోంచి ఓ సవ్వడి వచ్చింది. అది దగ్గో, తుమ్మో, ఏడుపో ఎవరికీ తెలియదు. కల్యాణి తలెత్తి చూసి లేచి "కరుణా! రాజాని

బ్రతికించాలి కరుణా. బ్రతికేటట్లు లేదు. మందు లేదు. సంబాచార్లు కూడా కట్టుగట్టి రానన్నాడు చచ్చిపోతున్న మనిషికి కులమేంటి కరుణా - నువ్వే, నువ్వే చెయ్యాలి - ఏం చేద్దాం చెప్పు ?"

కల్యాణి ఉద్వేగం చూసి కంపించాడు కరుణాకరం. చెదిరిపో తున్న మనస్సును కూడదెట్టుకొని "పట్నంనుంచి పిలిపిస్తా డాక్టర్ని. యిప్పుడే కారు పంపుతా" అంటూ వెళ్ళిపోయాడు అక్కణ్ణుంచి - తన శరీరం - మనస్సూ - గతం - భవిష్యత్తూ ఆవిరిలా మారి అనంత విశ్వంలో అదృశ్యమైపోవాలనిపించింది. తన శరీరమే తనకు నీడలా కనిపించింది.

"ఏం పొందాను ముత్తెం ఈ పూరొచ్చి ? ఏం పోగొట్టు కున్నాను ? ఏ పాపానికంటావు ఈ శిక్ష" అస్పష్టంగా వెలువడు తున్న మాటలు.

"మీరేం సేయలేదు బాబూ. ఏదన్నా పోగొట్టుకుంటే కల్యాణమ్మగోరే పోగొట్టుకుంది-" అన్నాడు ముత్తెం.

"నీకు తెలియదు"

"ఏటి బాబూ ?"

"నాకు తెలుసు."

కరుణాకరం కళ్ళనుండి పొంగిన నీరు చెంపలమీద కారుతూంది. హైదరాబాద్‌లో అచ్చొత్తించిన శుభలేఖలు టేబిల్‌మీద వికటాట్ట హాసం చేస్తున్నాయి - అతని జీవితంలో ఒక మలుపు విడిపోయింది. ఎందుకీ మలుపుల విలాసలాస్యాలీ జీవితంలో. 'రేపు' - అదేమిటో తెలుసుకోగలిగితే ? ఆశల హద్దులూ ఆలోచనల పరిమితులూ తెలు సుకోగలిగితే ? ఆత్మీయుల ఆత్మీయతలోని బరువెంతో తెలుసుకో గలిగితే ? మలుపు కావల ఏముందో - చూపుకందని జీవితం ! ఎంతటి వక్రమైందీ జీవితపథం - ఎక్కడికక్కడే మలుపులు - మలుపుల కావల

జీవితపథం ఎలా నడుస్తుందంటే సమాధానం రాని అజ్ఞానం - ఆవ లున్నది భయంకర క్రూరమృగాలు విశృంఖల విహారంచేసే మహా రణ్యమా ? సౌందర్య పరిమళాలను విరజిమ్మే ఫలపుష్పాదులతో విక సించిన నందనోద్యానవనమా ? పండు వెన్నెల దోవ చూపుతుందా ? చిమ్మచీకటి దారులు మూస్తుందా ?

# పదకొండు

ఎంతటి గాయమైనా కాలప్రవాహంలో కరిగిపోతుందంటారు. గాయం మానిపోవచ్చు. కాని ఆ గాయం సృష్టించిన మచ్చ మాత్రం మాసిపోక జీవితాంతంవరకూ గతాన్ని గుర్తుకు తెస్తూ నిలిచిపోవచ్చు.

ఆకస్మికంగా కరుణాకరం హైద్రాబాద్ వెళ్ళిపోవటం ఆ వూళ్ళో చాలా మందికి ఆశ్చర్యం కలిగించింది. ఒక్క ముత్తెంకు మాత్రం తెలుసు. "మనస్సు బావుండలేదు ముత్తెం! అలా పది రోజులు తిరిగివస్తా" అంటూ వెళ్ళాడు. కరుణాకరం తిరిగి రావ డానికి నెలరోజులు పట్టింది. ఈ నాలుగు వారాల్లో అతన్ని గురించి అడివి మంటల్లాంటి పుకార్లు బయలుదేరాయి. "దొంగనోట్ల వ్యాపా రంలో కాకపోతే యింతడబ్బు ఎక్కణ్ణుంచి వస్తుంది? ఏదో రహస్యం బయటపడి వుంటుంది పారిపోయాడు." అంటూ కథ ప్రారంభించాడు రంగదాసు. పదిమంది వంతలు బయలుదేరారు. ఒకనాడు రావి చెట్టుక్రింద పెద్ద చర్చ జరిగిందిగూడా. ఓ మహాసభకు అధ్యక్షత వహి స్తున్న అధ్యక్షులమాదిరి మధ్యగా బాసిపట్లవేసుకున్న వరదాచార్యుల వారు అందరు చెప్పిందీ విని "మునసబుగారేమంటారో?" అన్నారు.

"తొందరపడి నోరు జారడం మంచిదికాదు." అన్నారు మునసబుగారు.

"ఔను! నిజమే ఏ పుట్టలో ఏ పాముందో చెప్పలేం" అంటూ వేదాంతం చెప్పారు ఆచార్యులవారు. కరుణాకరం ఆతిథ్యమిస్తాడని నమ్ముకొని గోవింద యతీంద్రులవారిని సప్తాహానికి రమ్మంటూ ఆహ్వానించాడు రాఘవయ్య. యతీంద్రులవారు ఎక్కడికి వెళ్ళినా సపరివారంగా వెళ్తారు. వారి పరివారమంటే మాటలా? ఒక్కొక్క

సారి నూరు మంది శిష్యులు ఆయన్ను అనుసరించి వస్తారు. అంత మందికీ అంతకుముందు కేవలం పారమార్థిక చింతతో రాఘవయ్య ఆతిథ్యమిచ్చేవాడు. ఇపుడు చితికిపోయాడు.

ముత్తెం రెండు మూడు ఉత్తరాలు రాసిచూశాడు. సమాధానంలేదు. వసంత రహస్యంగా ముత్తెం దగ్గరకు కరుణాకరం అడ్రసు తీసుకొని అయిదారు వుత్తరాలు రాసింది. వాటికీ జవాబు లేదు. ఆ ఉత్తరాల్లో ఒకదాన్ని పోస్టుమాస్టారు రమాకాంతంగారు పసిగట్టి తీసి దాచి చదివి, గీతాపారాయణంలా అనేక మందికి విడి విడిగా రహస్యంగా చదివి వినిపించాడట. ఏదో పోట్లాటవచ్చి మున్సబుగారి పాలేరు ముత్తయ్య "మీ అమ్మాయి అడ్డమైనోళ్ళకీ ఎలా ఉత్తరాలు రాస్తుందో ఆ పోస్టుమాస్టారుగారిని కూసంత అడిగి తెలుసుకోండి." అంటూ వరదాచార్యుల వారికి చురక తగిలించాడు. ఆచార్యులవారు క్షణకాలం బిక్కవోయి, మరుక్షణం సంబాళించుకొని "రోజులు మారాయి. కాబోయే భార్యాభర్తలు ఉత్తరాలు రాసుకుంటే తప్పా ఏమిటి?" అంటూ ధర్మనిర్ణయం ప్రకటించి, ముత్తయ్యమీద పితూరీ చెప్పటానికి మున్సబుగారింటికి దారితీశా రానాడు. విశ్వపతిమాష్టారి యిల్లు కొన్నాక వేలకువేలు వ్యయంచేసి ఆ యింటిని దేవేంద్ర భవనంగా మార్చిన కరుణాకరం, కాలవకు ఎగువన చవిటినేలలు కొని, భారీయెత్తున వ్యవసాయం సాగించటానికి బ్రహ్మాండమైన పథకం తయారుచేసిన కరుణాకరం, అంతూ పొంతూ లేకుండా అదృశ్యమై పోవటం ఆ ఊళ్ళో మరొకసారి పెద్ద సంచలనాన్ని లేవదీసింది. ఎవరో ఊరూ-పేరూ తెలియని మనిషొకడు రైలు క్రిందపడి ఆత్మహత్య చేసుకున్నట్లు పేపర్లో పడింది. గుర్తుపట్టటానికి వీలులేనంతగా శరీరం చితికిపోయిందట. "కరుణాకరం కాదుగదా?" అని పదిమంది ముందూ మరొకసారి కళ్ళు తుడుచుకున్నారు వరదాచార్యులవారు. "అశుభం పలక్కండి — పెద్దవారు" అంటూ

సన్నంగా మందలించాడు రాఘవయ్య రాబోతున్న గోవింద యతీం ద్రులవారిని స్మరించుకుంటూ.

ఈ సంరంభంలో తిరిగి కరుణాకరం ఆ వూళ్ళో ప్రత్యక్ష మయ్యాడు !

వరదాచార్యులవారు పెద్దపెద్ద అంగలువేస్తూ రొప్పుకుంటూ వెళ్ళి "చాలా భయపడిపోయాం బాబూ" అంటూ కౌగలించుకుని కళ్ళు తుడుచుకున్నారు. వచ్చినవారు వచ్చారు. పరామర్శలూ, కబుర్లూ అయాక, అందరూ వెళ్ళాక ముత్తెం మిగిలాడు. గౌరమ్మ గారూ కల్యాణీ యిల్లు ఖాళీచేసి వెళ్ళినసంగతి గమనించి "ముత్తెం ! ఎక్కడకెళ్ళారు వాళ్ళు ?" అని ప్రశ్నించాడు కరుణాకరం.

"రాఘవయ్యగారు చెప్పలేదా బాబూ? మన సత్రంలో కొలువుకు జేరినారండి."

"ఎన్నాళ్ళయింది ?"

"యిరవై రోజు లయిందండి."

"ఎందుకని ?" ఇంకేమడగాలో తెలియక అడిగిన వ్యర్థమైన ప్రశ్న.

"ఎందుకేంటి బాబూ, ఎంతటోరైనా ఎన్నాళ్ళు పస్తులుండగలరు ? కల్యాణమ్మగోరే బతిమలాడి రాఘవయ్యగోరి సత్రంలో జేరినారంట. కాని ఆరిమానాన ఆరు బతుకుదామన్నా ప్రపంచం అన్ని బతకనీయడంలేదు బాబూ"

"ఏం జరిగింది ?"

"ఆ రాజారావు వచ్చిపోతున్నాడనీ- ఆయన రాగూడదనీ పంచాయితీ పెట్టారు వరదాచార్యులుగారు. మీకేమిటి సంబంధం ?- అన్నారట కల్యాణమ్మగోరు. ఇక్కడందరూ సంసారులు - ఇలాటి

పిచ్చేషాలు సాగనివ్వం - అన్నారట ఆచార్లుగారు. ఆ మాట రాజా రావుతోనే చెప్పండి - అన్నారట కల్యాణమ్మగారు. అంతటితో కాళ్ళు చల్లబడి ఆచార్లుగారు తోకముడుచుకుని మున్సబుగారింటికి పోయినారంట. మరి మున్సబుగారేమంటారో తెలియదు."

నిట్టూర్చాడు కరుణాకరం బరువుగా.

"ఏమైనా ఈ వరదాచార్లుగారు ఆ కల్యాణమ్మగోరిమీద కక్ష గట్టాడండి. దానికితోడు ఆ రంగదాసొకడు" అన్నాడు కొంచెం సేపయాక ముత్తెం.

"రంగదాసు ఏంచేశాడు ?"

"అంతకుముందు ఏవో తాకట్టుపెట్టి గౌరమ్మగారు డబ్బు తీసుకున్నారంట- మీరు పెట్టిన వస్తువుల విలువకంటె ఎక్కువ డబ్బిచ్చాను. ఆ డబ్బు కక్కండి-అంటూ తగువుపెట్టుకొని రకరకాలుగా ఎకిలిమాటలు మాట్టాడిపోయినాడంట. ఈసంగతి తెలిసిన వరదాచార్యులుగారు పనిగట్టుకు రంగదాసును పిలిచి- అబ్బీ- ఆవిడ యింక డబ్బిచ్చేదిలేదు. అ విలువ మరొకరకంగా రాబట్టుకోవలసిందే-అంటూ కిర్రెక్కించారంట."

"రాజారావుకి ఈ సంగతులేవీ తెలియవా?"

"తెలుసండి. యింకా ఆయన కోలుకోలేదు. కలరా తగ్గాక ఏదో నలత పట్టుకుంది బాబూ. ఈ నెలరోజుల్లో మనిషి బాగా చిక్కిపోయాడు. ఆయనే గనుక కోలుకొని మళ్ళీ కర్రబడితే చాలాతలలు ఎగిరిపోతాయి బాబూ. బరిమీదికొస్తే పదిమంది రంగదాసులు సమాధానం చెప్పలేరు రాజారావుకి- ."

"ఏమిటో ముత్తెం! ఈ మనుష్యులేమిటో, ఈ సమస్యలేమిటో ఏమాత్రం అర్థం కావడంలేదు. కాని ఒక్కటే పెద్ద విచారం

నాకు. కల్యాణి చేజేతులా జీవితం పాడుచేసుకుంది - ఇలా ఎందుకు చేసిందో అర్థంకావటం లేదు. దీనికి పరిష్కార మేమిటో అంతకంటె అంతు చిక్కటం లేదు."

"అందరూ అలాగే అంటున్నారు బాబూ. ఆమెగోర్ని చూస్తే సీతామ్మవోరు గుర్తుకొస్తారు. ఆవిడ చేయరాని పని చేసిందంటే నాకు నమ్మబుద్ధెయ్యడంలేదు బాబూ. కాని కాకుల్లా పొడుస్తున్నారందరూ."

"మన అంచనాలలో ఏదో తప్పు ఎప్పుడూ వుంటుంది ముత్తెం. రెండూ రెండూ గుణిస్తే నాలుగవుతుంది ఎక్కాల పుస్తకంలో. కాని జీవితంలో కాకపోవచ్చు. అదే చిత్రంగా కనిపిస్తుంది నాకు. అసలు అనుకున్నది అనుకున్నట్లు జరిగితే అది జీవితమే కాదేమో. ఆశ్చర్యాల సంపుటి జీవితం."

కరుణాకరం మాటలు ముత్తెంకు అర్థం చేసుకోవాలని మాట్లాడిన మాటలు కావు. కరుణాకరం తిరిగి రావడంతో రాఘవయ్య బరువుకొంత తీరింది. గోవింద యతీంద్రులవారి ఉత్సవాలకు ఎటువంటిలోటూ వుండదనే నమ్మకం కలిగింది.

"ఈ యేడు నీ ఆధ్వర్యంలో జరుగుతున్నాయి గనక కనీవినీ ఎరుగనంత ఘనంగా నీ దర్జాకు తగినట్లుగా జరగాలని నా అభిప్రాయం బాబూ." అంటూ ప్రారంభించి ఆత్మ - పరమాత్మల గురించీ, త్రిమతాచార్యుల సిద్ధాంతాల సారం గురించీ, వివరించి అయిదారు శ్లోకాలు మధ్య జొప్పించి, అడ్వాన్సుగా వెయ్యి రూపాయలు చేత బట్టుకు వెళ్ళాడు.

ఆలయ ప్రాంగణం చాలా విశాలమైంది. అంతా నాపరాయిలు పరిపించిన ప్రదేశం - ఆలయ ప్రాంగణంలోనే ఆంజనేయుల స్వామివారి గుడి ఒకటుంది. దాని ప్రక్కగా ధ్వజస్తంభానికి అల్లంత

దూరంలో పెద్ద అరుగుంది. గోవింద యతీంద్రులవారు ఉపన్యసించే వేదిక అది. చుట్టుపట్ల గ్రామాలనుండి వందల వేల సంఖ్యలో 'భక్తులు' శ్రీవారి అమృతోపదేశాలు వినడానికి వస్తూంటారు. రాఘవయ్య నడుంకడితే ఆంజనేయుడి తంతు. మహాకోలాహలంగా ఏర్పాట్లు జరుగుతున్నాయి. రెండుమూడు సుప్రసిద్ధ పుణ్యక్షేత్రాల నుండి సుప్రభాతాలు ఘనంగా చదివే పండితుల్ని రావించారు. గోవింద యతీంద్రులవారి రాకతో సంరంభం పతాకస్థాయి నందుకుంది. శ్రీ వారికీ, వారి ప్రధాన శిష్యులకూ కరుణాకరం యింట్లో మకాం ఏర్పాటు చేశారు. వరదాచార్యులగారొచ్చి "బాబూ కుర్రవాడివి. ఈ పాదతీర్థం నెత్తిన జల్లుకో" అన్నారు. అతని సమాధానానికి ఎదురు చూడకుండా నెత్తిన జల్లారుగూడా. ఆ తర్వాత మరో రెండు వేలు ఖర్చులకంటూ పుచ్చుకు పోయారు. భజనలతో భక్తి కీర్తనలతో ఆధ్యాత్మికోపన్యాసాలతో సప్తాహాలు ప్రారంభించబడ్డాయి.

వరదాచార్యులవారు గోవింద యతీంద్రులవారి ముఖ్య శిష్యుల్లో ఒకరు. లౌకిక బంధాలన్నీ తెంచుకున్న సర్వసంగపరిత్యాగులైన ఇతరులకు లౌకిక విషయాలగురించి సలహాలివ్వడానికి యతీంద్రులవారెన్నడూ వెనకాడలేదు. వరదాచార్యులవారి ద్వారా సంగతి సందర్భాలు తెలుసుకుని ఒకనాడు గౌరమ్మగార్ని యతీంద్రులవారు పిలిపించి "మీ అమ్మాయికి తక్షణం వివాహం చేయడం మంచిది" అని సలహా చెప్పారు.

"నాకూ చేయాలనే వుంది స్వామీ! కానీ మొగదక్షత లేక పోయింది. పూట గడవటమే కష్టంగావుంటే యింక పెళ్ళి సంగతి ఏమాలోచించను చెప్పండి." అంది సగం చచ్చిపోయిన గౌరమ్మగారు.

అక్కడే వున్న వరదాచార్యులవారు "మగదక్షత లేదంటావ్? మేమంతా చచ్చామనుకుంటున్నావమ్మా గౌరమ్మా? ఇదివరకు ఎన్ని

సంబంధాలు తేలేదు ? శివధనుర్భంగం చేసిన శ్రీరామచంద్రుడు దిగి వస్తేగాని బిడ్డనివ్వనంటూ బిగదీసుకు కూర్చున్నావమ్మో - నువ్వు ఊఁ అను- రేపీపాటికి ముహూర్తం పెట్టిస్తా" అన్నారు ఉదారంగా.

"ఏమిటి ? పెళ్ళికొడు కెవరు ?"

"ఎవరూ, రాజకుమారుడా ? అంటే నేనేం చెప్పలేను. నెలకు రెండువందలు సంపాదించుకుంటున్నాడు. పెళ్ళానికింత అన్నం పెట్టుకోలేకపోడు."

"ఎవరండి ?" అంది గౌరమ్మగారు.

"నే వచ్చి మాట్లాడతా ?"

గౌరమ్మగారి వెనకాతలే. సత్రానికి జేరుకున్నారు వరదాచార్యులవారు. కల్యాణి వినేటట్లు బిగ్గరగా పెళ్ళికొడుకుల కరువు దేశాన్ని ఎంత దారుణంగా పట్టి పీడిస్తున్నదో వివరించారు. "అంత మంచి సంబంధం - కట్నాలూ కానుకలూ మన మిచ్చుకోగలమా అన్నగారూ ?" అంది గౌరమ్మగారు.

"కట్నం దమ్మిడీ అవసరంలేదు. పుత్తడి బొమ్మలా తీర్చి దిద్దినట్లున్న ఈ లక్ష్మీదేవిని చూస్తే పెద్దముండావాణ్ణి నాకే మతి పోతూందే ? కళ్ళకద్దుకొని పెళ్ళి ఖర్చులు పెట్టుకు మరీ చేసుకుంటారు. నాముందు పరికిణీ కట్టుకు తిరిగిన భడవ - ఆఁ ఎలా ఎదిగి కూర్చుందీ ? రౌడీ మూకమ్మా ఈ వూరంతా ? మగదిక్కు లేకుండా ఆడప్రాణాలు అలా వుండగూడదు సుమా ? ఎవరి కే సమయంలో ఏ దుర్బుద్ధి పుడ్తుందో చెప్పలేం. ఎంతైనా ఉప్పూ్పకారాలు తింటున్న శరీరాలా ? కల్యాణినిమటుకు అని ఏంలాభం చెప్పు ? విశ్వామిత్రుడంతటి వృద్ధఋషి లొంగిపోయాడు మేనకను చూడగానే. ఏం ? ఆ మేనక దిగొచ్చిందా మన కల్యాణికంటె ?"

రామబాణం వదిలినట్లు కల్యాణికేసి వదిలాడా ప్రశ్న. గౌరమ్మ గారి కీ సంభాషణ ధోరణి రుచించక "ఇంతకీ ఎవరండీ పెళ్ళికొడుకు?" అంది.

"ఎవరో ఊహించుకో. రోజూ కళ్ళముందు కనిపిస్తున్న వస్తువునే పోల్చుకోలేక పోయారా?" అంటూ గొప్ప రహస్యం చెపుతున్నట్లు ముందుకు వంగి "అబ్బాయికీ అమ్మాయికీ మనస్సులు కూడా కలిశాయిట. మూడు వారాలనుంచీ స్వయంపాకం సత్రంలో ఎందుకు భోంచేస్తున్నాడంటావ్? కల్యాణి చేతిమీదుగా భోజనం చేయాలనే గదా!" అంటూ సన్నగా నవ్వారు ఆచార్యులవారు.

ఆ పెళ్ళికొడు కెవరో అర్థమైంది గౌరమ్మగారికి. "ఆ మిడిల్ స్కూలు హెడ్మాష్టారి సంగతేనా మీరు చెప్పేది?" అంది.

"ఔను! అంతకంటె నిక్షేపంలాంటి సంబంధం తేగలవా?" అన్నారు రవ్వంత కఠినంగా ఆచార్యులవారు.

లోపలనుంచి ఈ మాటలన్నీ వింటున్న కల్యాణి బైటకొచ్చి "మామయ్యగారూ! ఆయనకూ నాకూ మనస్సు కలిసిందని ఎవరు చెప్పారండి మీతో?" అంది రోషాన్ని కప్పిపుచ్చుకుంటూ.

"ఎవరు చెపితేనేంతే – ఉన్నమాటేగా?"

"ఉన్నమాటలు చాలా వున్నాయి లెండి. మరి మీకూ నాకూ గూడా కలిసింది మనస్సు. అత్తయ్య గారికి విడాకులిచ్చి మీరే నన్ను చేసుకోరాదూ? చక్కగా మీకు కావలసినంత ముక్కుపొడుం నూరిపెడుతూంటా రోజూ. కాలక్షేపానికి నా యీడుదే కనక మీ అమ్మాయి ఎలాగూ వుందింట్లో."

కల్యాణి మాటల్లోని వ్యంగ్యాన్ని జీర్ణంచేసుకోలేక గర్భశూల వచ్చినట్లు మూల్గారు ఆచార్యులవారు. కొంచెం సేపయాక సంబా

ళించుకొని "అమ్మాయ్! చిన్నదానివి నీ కేంతెలుసు. మేం ఏదో ఆలోచించి చేస్తాం నువ్వు వెళ్ళు అవతలికి." అంటూ మందలించి "ఈ సంబంధం తప్పిపోతే యింక నీ కూతురుకు పెళ్ళికాదు గౌరమ్మ తల్లీ. ఆనక నీ యిష్టం." అంటూ హెచ్చరించారు.

"ఆయన మొదటి పెళ్ళాన్ని వదలిపెట్టాడుట, ఆరుగురు పిల్లల్నికని? వయస్సు బాగా ముదిరినట్లుంది. ఎంత రెండొందలు సంపాదిస్తే మాత్రం చూస్తూ చూస్తూ అటువంటి వాడికి బిడ్డనెలా యిసామంటారు అన్నగారూ?" అంది గౌరమ్మగారు.

వరదాచార్యులవారు మరొకసారి తుపాకిలో మందు దట్టించినట్లు ముక్కుపొడుం పట్టించి, కూర్చున్న భంగిమ మార్చి "నీ వింత వెర్రిదానివైపోయావే చెల్లమ్మా. ఊరంతా కోడై కూస్తూంది. నిక్షేపంలాంటి కుటుంబంలో పుట్టి, ఆ దిక్కుమాలిన కులంచెడిన రాజారావుతో కులుకుతూ కూర్చుంటే, ఏ ఆడకూతురుకు పెళ్ళవుతుందంటావ్? ఈ పరగణా పరగణా అంతా తెలుసుగదా అమ్మాయి సంగతి? తెలిసి గూడా క్షమించి కడుపులో పెట్టుకుంటానంటున్నాడా హెడ్ మాష్టరు. ఇటువంటి దుశ్శీల అనే విషయం తెలిసుండీ అర్ధాంగిగా స్వీకరిస్తున్నాడంటే ఎంతటి ఉదారుడో ఆలోచించు చెల్లమ్మా" అన్నారు.

ఇంకా పరిపరివిధాల నచ్చచెప్పటానికి ప్రయత్నించారు. గౌరమ్మగారు మౌనంగా నిలబడి అన్నీ వింటున్నది. అంతలో రంగదాసు మళ్ళీ పోట్లాటకు వచ్చాడు. మీకు డబ్బిచ్చి, మీ యింటిచుట్టూ ప్రదక్షిణాలు చేయడానికి నౌకర్లమనుకున్నారా? ఇదిగోయిస్తా - అదిగోయిస్తా అంటూ ఎన్ని వాయిదాలు వేస్తారు? మంచి గొడ్డుకొక దెబ్బ, మంచిమనిషికొక మాట - అన్నారు. ఇవాళ యిస్తే

గాని కదలను. ఆ యింట్లోవన్నీ బైట గిరవాశేయించి తీసుకుపోతా ఏమనుకున్నారో" అంటూ కేకలు మొదలుపెట్టాడు.

"బయట గిరవాశేయటానికి యింట్లో యింకేం మిగిలింది రంగదాసూ ?" అంటూ కల్యాణి బయటకొచ్చింది మళ్ళీ.

"రంగదాసు కెంత ఇవ్వాలి చెల్లమ్మా ?" అన్నారు వరదాచార్యులవారు.

"ఏమో - ఆయనేం తీసుకున్నారో నాకేం తెలుస్తుంది ? ఆ లెఖ్ఖలన్నీ రంగదాసుకే తెలియాలి" అంది గౌరమ్మగారు.

"కాస్త తమాయించు రంగదాసూ. ఇంతకూ ఎంతివ్వాలి ?" అని ప్రశ్నించారు ఆచార్యులవారు.

"నూటపాతికనుకుంటా" అన్నాడు రంగదాసు.

"నీ డబ్బు ఎక్కడికీ పోదుబాబూ. సాయంత్రం యింటికిరా నేనిస్తా" అన్నారు గంభీరంగా ఆచార్యులవారు.

# పన్నెండు

ఆ రాత్రి ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. కల్యాణి కూరలు తరుగుతూంది పరధ్యాన్నంగా. అంతకుముందు మిడిల్ స్కూలు హెడ్ మాష్టరు రామనాథం గురించి ఆమె ఎన్నడూ తీవ్రంగా ఆలోచించలేదు. అతను తనకోసం క్యూలో నుంచున్న మరో పెళ్ళి కొడుకు! రూపురేఖలుగూడా స్పష్టంగా గుర్తుకు రావడంలేదు. నెలసరిగా సత్రంలో భోజనం చేస్తున్న మనుష్యులు ఇద్దరే ఇద్దరు. అందులో ఆయనొకడు; రెండవ వ్యక్తి పొలాలు కొలిచి ప్లానులు తయారుచేయడానికి వచ్చిన సర్వే డిపార్టుమెంటు తాలూకు ఉద్యోగి గోపాలం. వీరిద్దరికీ వడ్డన సాధారణంగా గౌరమ్మగారే చేసేది. ఎప్పుడోగాని కల్యాణి చేయడం జరిగేదికాదు. అర్జంటుగా రమ్మని కబురుచేస్తే వరదాచార్యులగారింటికి వెళ్ళింది గౌరమ్మగారు. కల్యాణికి వడ్డించక తప్పలేదు. ఆనాడు రెండవవ్యక్తి గోపాలం కూడా భోజనానికి రాలేదు. పాపంలా కురుస్తున్న చీకటిలావుంది తన భవిష్యత్తు. రామనాథం విలాసపురుషుడు. పద్యాలు పాడగలడు. హార్మోనియం వాయించగలడు. నాటకాల్లో వేషాలువేస్తూ చాలా నాటకాలు వేయించాడట. వాళ్ళూ వీళ్ళూ చెప్పుకుంటుంటే ఆసక్తి లేకపోయినా వినక తప్పలేదు. ఎంత వద్దనుకున్నా ఆయన్ని గురించి మనస్సు ఆలోచిస్తూనేవుంది. అలాగే కూర్చుంది వంటచేసి. అదే ఆలోచనలతో.

"ఎటువంటివాడైతేనేం! పెళ్ళి జరిగితే అతనికొక్కడికే నువ్వు జవాబుదారీ. పెళ్ళి కాకపోతే ప్రపంచంలో ప్రతిమనిషికీ నువ్వు జవాబులు చెప్తూనే వుండాలి" అని ఎవరో అరిచినట్లనిపించింది.

అంతలో కూనిరాగం విని ఉలిక్కిపడి లేచింది. ఎదురుగుండా రామ నాథం కనిపించాడు. నవ్వాడు. గ్లాస్కోపంచ - సిల్కులాల్చీ- నున్నగా దువ్వుకున్న క్రాపు- వ్రేళ్ళకు మెరుస్తున్న రెండుంగరాలు-

"చింతామణి నాటకం వేస్తున్నాం ఇరవై ఆరున. నువ్వు తప్ప కుండా రావాలి కల్యాణీ. క్రితంసారి గయోపాఖ్యానం వేసినప్పుడు గూడా రాలేదు" అంటూ స్టూలు ప్రక్కకు లాక్కుని కూర్చుని "అత్తయ్యగారేరి కల్యాణీ" అన్నాడు.

ఋణాలమీద వరుసలు కలపుకునే ఆ కలుపుకోరు తనానికి ఆమె సంతోషించలేదు.

"ఇంట్లో లేదు."

"ఎక్కడికి వెళ్ళింది ?"

"వరదాచార్లుగారు కబురు చేశారు."

"చేశారన్న మాట. అత్తయ్యగారు డబ్బు కావాలని కబురు చేస్తే - వెయ్యి రూపాయలు పంపించా."

కల్యాణి ముఖాన కొరడా పెట్టి చరిచినట్లనిపించింది. "ఏమిటి ? ఏమిటి మీరంటున్నది ? మా అమ్మ....మీకు....డబ్బు కావాలని కబురుచేసిందా ?"

"చేస్తే తప్పేముంది కల్యాణీ ? పరాయివాణ్ణి కాదుగా ?"

"ఏమిటండీ మీ రంటూంది ? పరాయివాళ్ళు గాక పూట కూళ్ళు మా యింట్లో తిన్నంత మాత్రాన మేం ఆత్మబంధువులమై పోయామా ?"

నవ్వాడు రామనాథం. కల్యాణి మనస్సు భగ్గుమంది.

"ఇందులో ఏదో పొరపాటుంది రామనాథంగారూ. అమ్మ అలా కబురంపిందంటే నేను ఒక్కనాటికీ నమ్మను -"

"నీ కింకా తెలియదా యేమిటి? వచ్చే మాఘ మాసంలో ముహూర్తం అన్నారు వరదాచార్యులుగారు. అందుకే చేతులో సమయానికి డబ్బులేకపోయినా కరుణాకరం దగ్గర అప్పు తీసుకొచ్చి మరీ పంపాను. - నువ్వు డబ్బు ఇవ్వకపోతే వాళ్ళకొంప నిలువునా కూలిపోతుంది - అన్నారు వరదాచార్యులు. అంతే- మీకు సహాయం చేయకపోతే ఎవరికి చేస్తాను చెప్పు? తల తాకట్టు పెట్టయినాసరే, మీ కివ్వాలనుకున్నాను. యిచ్చాను."

"దయుంచి భోజనానికి లేవండి. తల పగిలిపోతూంది" వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటానికి ప్రయత్నిస్తూ అంది కల్యాణి.

"కాదు కల్యాణీ - నీతో ఎంతో మాట్లాడాలని వచ్చా నివాళ. నా జీవితాశయం ఏమిటో తెలుసా? కళాసేవ! నాటకాలంటే నాకు నిద్రాహారాలు అవసరంలేదు. నాటక రంగంకోసం నా పిత్రార్జితాన్ని, శక్తియుక్తుల్ని, సంసారాన్ని, చివరకు జీవితాన్ని, కూడా త్యాగం చేశాను. అన్నీ పోయాయని నాకు బాధలేదు. నాకు తగిన యిల్లాలు దొరకలేదు. బుద్ధి తెలియకముందు చిన్న తనంలో నాకో పేరిందేవిని యిల్లాలనే పేరుతో గుదిబండగా మెడకు తగిలించారు. దాని అభిరుచులు వేరు. నా అభిరుచులు వేరు. నాట కాలకు వచ్చి, నా పద్యాలు విని అందరూ చప్పట్లు కొడ్తుంటే అది ముందు సీట్లో కూర్చొని గురకపెట్టి నిద్రపోయేది. నాటకంలో వేషం వేస్తూ ఏ ద్రౌపదిమీదనో చేయివేస్తే వారం రోజులు దయ్యంలా ముడుచుకు పడుకునేది. పిల్లలకు కూడు కూడా వండి పెట్టేదికాదు. క్షణక్షణం పోట్లాటలతో సాధింపులతో రోగాల నటనతో జీవితం భయంకర నరకంలా తయారయింది. ప్రాణంవిసిగి మిగిలిన నాలుగెక రాలూ దానిపేర రాసి వదిలించుకున్నాను. రెండేళ్ళనుంచీ చీకూ చింతా లేకుండా బ్రతుకుతున్నాను. కాని ఒంటరితనం ఎన్నాళ్ళు

భరించను చెప్పు ? నిన్ను చూశాక నాలో కొత్త ఆశలు చిగురించాయి. ఒక మహానటివి కాగల గొప్ప లక్షణాలు నీలో కనిపించాయి పూచికపుల్లలతో నాటకా లాడించాను. చలిమిడి ముద్దలచేత గయోపాఖ్యానంలో కృష్ణుడి వేషాలు వేయించాను. సానబట్టని వజ్రానివి నువ్వు. మనిద్దరం ఆదర్శ దంపతులం కాగలం కల్యాణీ."

వళ్ళంతా కళ్ళుచేసుకుని వింది కల్యాణి ఆ మాటలన్నీ. భర్త కావాలనుకుంటున్న పరాయిమనిషి- తనతో మాట్లాడుతున్నాడనే విషయం మరిచిపోయింది. ఏదో నాటకం చూస్తున్నట్లనిపించింది. అంతాచెప్పి కళ్ళజోడు తీసి కళ్ళు తుడుచుకున్నాడు రామనాథం.

"ఏమిటి ? చెప్పు కల్యాణీ ! నీ అంగీకారం లేకుండా ఇది జరగదు. జరిగినా నేను జరుగనివ్వను" అన్నాడు మళ్ళీ.

కల్యాణి తెప్పరిల్లింది. ఎదుటి మనిషిమీద జాలివేసింది. అమాయకత్వానికీ పసితనానికీ ప్రాతినిధ్యం వహించినట్లున్న కన్నీటి బిందువుల్ని అతని చెక్కిళ్ళపై చూసింది. జాలిపడింది.

"రామనాథంగారూ - మిమ్మల్ని చూస్తే..."

"చెప్పు కల్యాణీ - ఆగావేం ? నీ మనస్సులో వున్న మాట చెప్పు - మనం ఎవరి జీవితాలూ పాడుచేయడంలేదు. ఒకళ్ళ జీవితాలు ఒకళ్ళు బాగుచేసుకుందామని ప్రయత్నిస్తున్నాం. ఎండిపోయిన ఎడారిలాంటి జీవితంలో నువ్వొక ఒయాసిస్సువి కల్యాణీ. చెప్పు-మన స్ఫూర్తిగా నీకిష్టమనిచెప్పు-"

"చెప్తాను."

"ఇష్టమేనా ?'

"లేదు."

"ఎందుకని ?"

"మీ వయస్సెంత రామనాథంగారూ ?"

"ముప్పై ఎనిమిది. ఏం ? అయినా మనస్సులు కలవాలిగాని వయస్సులూ, ఈ భేదాలూ అడ్డం వస్తాయంటావా పవిత్రంగా ప్రేమిస్తే ?"

"ప్రేమకే కాదండీ - ఏ పాపం చేయడానికీ ఇవేవీ అడ్డంరావు."

"అలా అనకు. నీఅంతటి సౌందర్యవతిని పొందే అర్హత లేదని నాకు తెలుసు. అందుకే చెప్తున్నాను. నా జీవితాన్ని సరిదిద్దమని. అమృతంలాంటి మనిషివి."

"అర్హతల ప్రసక్తి ఇందులో ఏంలేదు రామనాథంగారూ. అందానికి మీరనుకున్నంత విలువలేదు ప్రపంచంలో. నా అభ్యంతరం అదికాదు."

"మరి -?"

"నాగురించి అందరూ ఏమనుకుంటున్నారో తెలుసునా ?"

"తెలుసుకోవాలని లేదు."

"అలా అనకండి. మీరు మహాయోగులని నేను భ్రమపడటం లేదు. మీరు భ్రమపడితే అది మీ పొరపాటు. స్నేహం చేయటానికి ఎవరైనా పనికొస్తారు. అప్పుడు ఎదుటి స్త్రీ గతచరిత్రతో పురుషుడికి సంబంధం లేకపోవచ్చు. కాని పెళ్ళాం అనే ముద్ర పడగానే, ఈ జీవితపు గతచరిత్రేకాదు. జన్మజన్మాల చరిత్రలన్నీ మొగుడన్నవాడికి కావాలి. అందుకే సలహాయిస్తున్నాను అందరూ నాగురించి ఏమనుకుంటున్నారో ముందు తెలుసుకోండని."

"నాకు అన్నీ తెలుసు కల్యాణీ. వద్దన్నా ఇటువంటివి చెవిన పడుతూనే వుంటాయి."

"ఏం విన్నారు చెప్పండి నా గురించి?" గడపను ఆనుకుని కూర్చుంటూ అడిగింది కల్యాణి.

"ఎందుకులే ఆ విషయాలన్నీ, నీ లేతమనస్సు పాడై పోతుంది."

"మీరంత కంగారు పడవలసిందేమీ లేదు రామనాథంగారూ. ఎంత లేతచెట్టుగూడా ఒకనాడు మ్రోడై పోతుంది. మండు టెండలు కాసినా, వడగాడ్పులు వీచినా యింకా ఎండిపోయేశక్తి దాని కుండదు. ముచ్చటగా వినాలనుంది. చెప్పండి ఏమనుకుంటున్నారో. మీ రనుకున్నట్లు మనకు జరగవలసిన కాస్త పెళ్ళి జరిగితే ముందు ముందు అపార్థాలు రాకూడదు. దయుంచి చెప్పండి."

"నీది చాలా దెబ్బతిన్న మనస్సు. అయినా అడిగావు గనుక చెప్తున్నాను."

"సంకోచం లేకుండా ఉన్నదున్నట్లు చెప్పండి."

నవలలో పాత్రలమధ్య దొర్లుతున్నట్లు సంభాషణలు నడుస్తున్నాయి. కొంచెంసేపు ఇద్దరూ మౌనంగా వున్నారు. కల్యాణి తేలికగానవ్వి "ఇటువంటి చిన్న విషయాలలో మొహమాటాలు పడుతూవుంటే యింక ముందు ముందు మనమేం కాపరం చేయగలం చెప్పండి" అంది.

రామనాథానికి ఆ మాటల్లో అమృతం వర్షించింది.

"నువ్వు చెప్పిందీ నిజమే కల్యాణీ - నువ్వు అందరిలాంటి స్త్రీవి కాదు. నాకు తెలుసు. నిజమే. ఇద్దరం సంస్కారం కలవాళ్ళం. ఒకరిని గురించి ఒకరు అన్నీ తెలుసుకోవాలి."

"అందుకే చెప్పమంటున్నాను."

"చెప్తాను. రాజారావుకీ నీకూ చాలా కాలంగా ఏదో వుందనే పుకారు వుంది. ఆ తర్వాత కరుణాకరం గురించి గూడా చాలా సంగతులు చెప్పుకున్నారు. నేను నమ్మలేదనుకో."

"మీరు రెండో విషయం నమ్మక్కర్లేదు. మొదటి విషయం నిజం."

రామనాథం ఈ మాటలువిని క్షణకాలం నివ్వెరపోయి "నేను నమ్మను. నీ మనస్సుపాడై అలా అంటున్నావు" అన్నాడు గొణుగుతూ.

"మనస్సంటూ వుంటేగా పాడై పోవటానికి రామనాథం గారూ? అయినా మీ రెంత వెర్రివారండీ. నేను హత్య చేశాను మొర్రో అంటూ ముద్దాయి ఒప్పేసుకున్నా ఏ జడ్జీగారన్నా-నువ్వు నిర్దోషివిలే – అంటూ వదిలిపెడ్తాడా?"

"వేరొకరిని రక్షించటానికి నేరం తనమీద వేసుకునే వారుండ రంటావా?"

"ఎవర్నో రక్షిస్తున్నానని భ్రమపడే శక్తి నాకు లేదు. అది నిజమూ కాదు. ఇంచుమించు అనాథలా బ్రతుకుతున్న నా రక్షణ కోరే దెవరండీ దిక్కుమాలిన లోకంలో?"

"కాదు కాల్యాణీ – నువ్వు ఉత్తమురాలివి. నిన్ను ఆ రాజా రావు మోసం చేశాడు. నమ్మించి ద్రోహంచేశాడు. ఒకవేళ పాపం జరిగినా — అది నీ వల్లకాదు. పువ్వును నలిపినట్లు నలిపి పాడు చేశాడు. కిరాతకుడు."

నిట్టూర్చింది కల్యాణి.

"బాధపడకు, నేనున్నాను."

"నేను బాధపడటం లేదండీ. జాలిపడుతున్నాను. నిష్కారణ నిందల భారం భరించలేక ఎంతమంది ఎన్నివిధాల ఈ దౌర్భాగ్య ప్రపంచంలో నలిగిపోతున్నారో తలుచుకుంటే జాలి వేస్తుంది."

"నువ్వు చెప్పేది నాకేం అర్థంకావటంలేదు."

"ఆడది ఎంత వరకూ అర్థమయేలా చెప్పగలదో అంతవరకూ చెప్తాను. ఫలానా కిరాతకుడు ఫలానా ఆడదాన్ని పువ్వులా నలిపి పారేశాడు - అంటారు. ఇది సరైన సామ్యంకాదు రామనాథం గారూ. ఆ కిరాతకుడు ఎలా మనిషో, ఈ ఆడదికూడా అలాగే ఉప్పూ కారం తింటున్న మనిషే. పాపమంటున్నారే - దానివల్ల పురుషుడికి ఎంతటి సుఖం సంక్రమిస్తుందో, స్త్రీకీ అదే సుఖం దక్కుతుంది. తన సుఖంకోసమే పురుషుణ్ణి సుఖపెడుతుంది స్త్రీ. మీరు మానవాతీతులైన దేవతల విషయం మాట్లాడకండి. మనందరం మనుష్యులం. అందరం తింటున్నాం ఉప్పూ కారం. అందరం చేస్తున్నాం తప్పూ ఒప్పూ మనం చేసిన పాపాలకూ, మనమీద విరుచుకుపడ్డ దురదృష్టాలకూ ఎదుటివారిమీద నిందవేయడం న్యాయంకాదేమో. కనీసం నా గురించి అటువంటి అపోహలు పెట్టుకోబోకండి."

రామనాథం నిరుత్తరుడయ్యాడు. ఇంత లాఘవంగా ఆమె మాట్లాడగలదనే అభిప్రాయం కలుగలేదు అంతకుముందు. కొద్ది క్షణాల తర్వాత "కల్యాణీ- జరిగిందేదో జరిగింది. నాకు కావలసింది నువ్వుగానీ, నీ గతంకాదు. గతాన్ని గతించిపోనీ. కొత్తజీవితం ప్రారంభిద్దాం. పెద్ద నాటకాల కంపెనీపెట్టి దేశాలన్నీ తిరిగిరావాలనుంది. నీ సహకారముంటే ఎంతైనా సాధించగలననిపిస్తూంది ఈ జీవితంలో. నువ్వు మరోమాటనక మనస్ఫూర్తిగా అంగీకరించు. ఏమంటావ్ ?" అంటూ వళ్ళంతా కళ్ళుచేసుకుని సర్వశక్తులూ కేంద్రీకరించి ప్రశ్నించాడు రామనాథం.

"మీ ప్రశ్నకు వెంటనే సమాధానం చెప్పాలా రామనాథం గారూ ?"

"ఇది నాకు జీవన్మరణ సమస్య. ఈ మూడువారాలనుంచీ చల్లగా నీ చేతిభోజనం తింటున్నాను. బ్రతికినంతకాలం ఈవిధంగాతిని హాయించుకుంటూ నీవడిలో సుఖంగా నిద్రపోవాలనుంది."

"నాకూ చెప్పాలనేవుంది రామనాథంగారూ. కాని-వెంటనే చెప్పలేను. ఒక గాడిలో తిరుగుతున్న గానుగరాయి ఈ మనస్సు. కాస్త సంబాళించుకోనివ్వండి. ఈ వూళ్ళో వున్నంతకాలం మీకు భోజనం పెడ్తాను."

"ఈ ఊళ్ళో ఉన్నంతకాలం- అంటున్నావు. వెళ్ళిపోదామని వుందా ఈ వూరునుంచి ?"

"వెళ్ళాలనే వుంది. కాని- "

"చెప్పు- ఆగావేం ? ఎక్కడికి వెళ్ళాలని ?"

"ఎక్కడికో తెలిస్తే యింతకుముందే వెళ్ళేదాన్ని- అదే తెలియదు. సరే లేవండి. అమ్మ యింకా రాలేదు. పొద్దుపోయింది. భోంచేద్దురుగాని-"

"కల్యాణీ - ఒక కోరికుంది?"

"చెప్పండి."

"తీరుస్తావా ?"

"మీకు నమ్మకముంటేనే అడగండి."

"ఇప్పుడే తీర్చాలి. ఎన్నాళ్ళుగానో అడగాలనుకుంటున్నాను. ఇవాళ చనువుగా మాట్లాడుకున్నాం గనక ధైర్యం వచ్చింది."

"చెప్పండి."

"కోపం రాదుగదా ?"

"అయ్యో ! నా కోపతాపాలకు విలువెంత ? అసలు నాలాంటి అబలదగ్గరకూడా మనసులోమాట చెప్పలేనివారు మీరేం సాధించ గలరండీ జీవితంలో ?"

"ఏంలేదు. ఇద్దరం ప్రక్క-ప్రక్కన కూర్చొని ఫోంచేద్దాం" కల్యాణి పకపక నవ్వి "గొప్పకోరికండీ !" ఆ వరదాచార్లుగారొచ్చి మనిద్దరి ఫొటో తీయించి రేపొద్దున గోడల కతికించి యతీంద్రుల వారిని పిలిచి చూపెడ్తారు తెలుసా ?"

"నా కోరిక చెల్లించవన్నమాట ?"

"ఇప్పుడుకాదు."

"ఎప్పుడు ?"

"వరదాచార్లుగారి నడగండి మీ జాతకం చూపెట్టి. ఆయన జ్యోతిషం బాగా చెప్తానంటాడు - చాలుచాలు లేవండిబాబూ నిద్రొస్తూంది."

# పదమూడు

ఎన్ని వ్యాపకాలు పెట్టుకున్నా ఆ వూళ్ళో కరుణాకరానికి టైం గడపటం కష్టంగానే వుంది. అందరూ తెలిసినవాళ్ళే. కాని అందరూ తనయింటికే వస్తున్నారు. ఏ క్షణంలో స్వగ్రామానికి తిరిగి రావాలని నిర్ణయం తీసుకున్నాడో, ఏ సుముహూర్తంలో ఆ వూళ్లో అడుగుపెట్టాడో గాని వచ్చిననాటినుంచి మనస్సు ఏదోవిధంగా కలవర పడుతూనే వుంది. ఈనాటి తన పరిస్థితి ఏమిటి? తనకేం కావాలో తనకే తెలియదు. ఎవరో వచ్చి గ్రామానికి సంబంధించినవీ, తమ వ్యక్తిగతమైనవీ, ఏవో గొడవలు చెప్పి, చివరకు ఏదో సహాయం అర్థిస్తూనే వున్నారు. వారు చెప్పిన విషయాల సారాంశంగూడా అతని తలకెక్కేదికాదు. అంతా విని చివరకు 'ఏంకావాలి?' అనేవాడు.

ఎవరు వెలిబుచ్చినా ఆర్థిక సంబంధమైన గొడవలే. "భూమి సూర్యునిచుట్టూ తిరగడంలేదు ముత్తెం. డబ్బుచుట్టూ ప్రదక్షిణం చేస్తున్నదని నా కిప్పుడర్థమయింది" అన్నాడొకనాడు. "బాబూ అన్నీ తెలుసుండేనా డబ్బు అలా మంచినీళ్ళమాదిరి ఖర్చుపెడు తున్నారు? ఈ ఎదవనాయాళ్ళంతా మీ చుట్టూ పిచ్చికుక్కల్లా తిరుగుతున్నారంటే ఎందుకంటారు బాబూ? మీ కోసం కాదు, మీమీద అభిమానంకాదు, మీ డబ్బునుచూసి" అన్నాడు ముత్తెం చిరాగ్గా.

కరుణాకరం జాలిగాచూసి "నాకు తెలియదంటావా ముత్తెం అంతమాత్రం?" అన్నాడు.

"తెలిసేనా ఆ సాములారి భజనలకంటూ యిప్పటికి పదివేలు తగలేశారు. ఇదంతా ఎందుకొచ్చిందంటారు ? ఆ వరదాచార్లు బాగు పడటానికేనంట"

"బాగుపడనీ ముత్తెం. ఒకళ్ళు బాగుపడుతున్నారని మన మెందుకు బాధపడాలి ?"

"అదికాదు బాబూ. ఆరు బాగుపడుతున్నారని కాదు. మిమ్మల్ని ముంచుతున్నారని. మొన్న మున్సబుగారొచ్చి పాతిక వేలు అప్పంటూ తీసుకుపోయాడా ? నంబాచార్లు సీసాడు తైలం తెచ్చి యిచ్చి అయిదొందలు అప్పంటూ గుంజుకెళ్ళాడా ? నిన్న హెడ్‌మాష్టారు వెయ్యిరూపాయలు చేతిలో వేయించుకుపోయాడా ? పైగా నాటకాల కంపెనీ పెట్టిస్తానంటాడు మీచేత ! మీ కెందుకు చెప్పండి నాటకాలు ?"

నవ్వాడు కరుణాకరం.

"అలా నవ్వకండి బాబూ. మీ దగ్గరెంత డబ్బుందో నాకు తెలీదు కాని ఎంతున్నా ఇలా సాగితే దివాలా తీయడం ఖాయం. అది గుర్తుంచుకోండి బాబూ. మీరు పడిపోయిననాడు ఈళ్ళల్లో ఒకళ్ళు గూడా మీ ఛాయలకు రారుబాబూ."

"ముత్తెం ! రాజారావుకు ఎందుకు నా మీద కోపం ?" అన్నాడు సంభాషణ మార్చాలని కరుణాకరం.

"మీ మీద ఆరికెందుకండి కోపం ?"

"నేను అలా అనుకుంటున్నాను. నా దగ్గరకు రాడు. మనసు విప్పి మాట్లాడడు."

"కాదండి. ఆరి గొడవలు ఆరివి. ఆయనకేదో జబ్బు పట్టుకుందిట."

"ఏమిటది ?"

''రకరకాలుగా చెప్పుకుంటున్నారండి.''

''ఓ పూట రాజాను భోజనానికి పిలవాలనుందోయ్. పిలిస్తే వస్తాడంటావా ?''

''మీరు పిలిస్తే ఎందుకురారండీ. మీ మీద నిజంగా అభిమాన మున్న మనిషి ఆయనొక్కడేనండీ. రండి పిల్చుకొద్దాం.''

"రేపు వెళ్దాంలే. అది సరేగాని అలా బయటికి వెళ్ళి వద్దాం" అంటూ టైం చూసుకున్నాడు. సాయంత్రం ఆరుగంటలయింది. లేచి ముఖం కడుక్కొని లాల్చీ పైజమా వేసుకున్నాడు. ఇద్దరూ నడుస్తున్నారు. రావిచెట్టుదగ్గర ఎవ్వరూ కనిపించలేదు. అందరూ గోవింద యతీంద్రులవారి సప్తాహానికి పోయివుంటారు. సత్రంముందు నుంచి నడుస్తూంటే కల్యాణి గుర్తుకువచ్చింది. లోపలకు నడవాలను కున్నాడు కాళ్ళు ముందుకు సాగలేదు. రైలుపట్టాలు గుర్తు కొచ్చాయి. దగ్గరదగ్గరగా ఎంతదూరం ప్రయాణంచేసినా అవి ఎన్నడూ కలవలేవు. కలిస్తే రైలు బోల్తాపడిపోతుందనేమో ! ఇంకెక్కడికి వెళ్ళాలి ? కాలవదాకా నడిచే ఓపిక లేదు. యతీంద్రుల వారి దగ్గరకు వెళ్తే ? అంతకుముం దొకసారి వెళ్ళాడు. మహాజనం చేసే మర్యాదల్ని భరించలేకపోయాడు. రాఘవయ్య పూలదండ వేశాడు ఆనాడు. యతీంద్రులవారు వేదిక దిగివచ్చి ఎదురు నడిచి ప్రత్యే కంగా ఆశీస్సు లందించారు. అందరూ స్వామివారి పాదాలముందు క్రింద కూర్చుంటే తనకోసం ప్రత్యేకంగా మున్సబుగారు కుర్చీ తెప్పించి వేయించారు. అక్కడ కూర్చున్నంతసేపూ భోషాణంలో పెట్టి తాళం వేసినట్లు ఊపిరాడలేదు. మరికొంతదూరం నడిచారు.

"హెడ్‌మాష్టారు చింతామణి నాటకం వేస్తున్నారట బాబూ" అన్నాడు వెంటనడుస్తున్న ముత్తెం.

రోజూ సాయంత్రం మొదలు రాత్రి పదిగంటలదాకా 'అత్తగారిచ్చిన అంటుమామిడితోట' - ఇత్యాది పద్యాలు వినిపిస్తూనే వున్నాయి. కాలక్షేపానికి అక్కడకువెళ్ళి రిహార్సల్స్ చూడాలనిపించింది.

పెద్ద పెంకుటింట్లో వుంటున్నారు హెడ్‌మాస్టారు. మండువాలో రిహార్సల్స్ జరుగుతూంటాయి. ఆయన కొక తొక్కుడు హార్మనీ వుంది. నాటకం లేకపోయినా వాయిస్తూ పద్యాలు ఏ కుర్రాళ్ళచేతనో పాడిస్తూ కాలక్షేపం చేయడం ఆయన కలవాటు. హెడ్‌మాష్టర్ రామనాథం ఇంట్లో అడుగుపెట్టేసరికి యింకా జనం చేరలేదు. సాయిబ్బులు కట్టుకునే గళ్ళలుంగీ కట్టుకొని, కట్ బనీన్ వేసుకొని బుగ్గన ఎత్తుగా కారాకిళ్ళీ బిగించి హార్మోనియం వాయిస్తూ తలెత్తి కరుణాకరాన్ని చూశాడాయన. చూడగానే సవినయంగా లేచి, నోరంతా తెరిచి నవ్వుతూ "ఏమిటీ అదృష్టం? ఎంతటిదీ ఆశ్చర్యం? నేనేవచ్చి తమ దర్శనం చేసుకుందా మనుకుంటున్నాను. తమరే వచ్చారు. ఎంత సుదినం ఈనాడు" అంటూ కుర్చీ తుడిచాడు తుండుగుడ్డ పెట్టి.

"ఒక పద్యం పాడండి మాష్టారూ కమ్మగా?" అన్నాడు కరుణాకరం.

"ఏ పద్యం పాడమంటారు?" ఆనందావేశంతో ఉక్కిరిబిక్కిరై పోతూ అడిగాడు రామనాథం.

"మీ యిష్టం" అన్నాడు కరుణాకరం.

"చెల్లియొ చెల్లకో" అన్నాడు ముత్తెం.

ఝుమ్మంటూ మ్రోగింది హార్మోనియం. గొంతెత్తాడు రామనాథం. ఆయనది సహజంగా మంచి గొంతు. కరుణాకరం అంతటివాడొచ్చాడనేసరికి యింకా ఉత్సాహం పెరిగింది. ఆ తర్వాత

ఎవరూ అడగకుండానే వరుసగా పాతిక పద్యాలు చదివాడు. అయి దారుగురు ఉత్సాహిక నటులు జేరకున్నారు. ఏలూరునుంచి కేసరీ హనుమాన్ అనే కుర్రాణ్ణి చింతామణి వేషానికని పిలిపించారు. అదొకరకంగా మెలికలు తిరుగుతూ సిగ్గుపడుతూ నిలబడ్డాడు ఆ కేసరి.

"ఇంక వెళ్తాను మాష్టారూ" అంటూ లేచాడు కరుణాకరం. కుర్రాళ్ళందరూ కరుణాకరానికి పద్యాలు వినిపించాలనే ఉత్సాహంలో వున్నా; అతని వైఖరి చూసి నిరాశ చేసుకున్నారు.

కరుణాకరంతోపాటు అడుగులు వేస్తూ కాస్తదూరం వచ్చిన రామనాథం చేతులు జోడించి నమస్కరించి "మీ సహాయం ఈ జన్మలో మరిచిపోను కరుణాకరంగారూ. నన్నొక ఇంటివాణ్ణి చేస్తున్నారు" అన్నాడు.

"ఏమిటి మీ రంటున్నది?"

"నా స్వవిషయం. మనవిచేస్తా. మన మొదటి కళత్రం ఉండీ లేనట్టే అయింది. తమకు తెలిసే వుంటుంది. ఇప్పుడు మనకూ వాళ్ళకూ ఎటువంటి సంబంధాలూ లేవు. ఈ ఒంటరితనాన్ని భరించ లేక తిరిగి వివాహం చేసుకుందామని నిశ్చయించుకున్నాను. ఆమెకు గూడా నాటకరంగంలో అభిరుచి కల్పించి, వచ్చే డిసెంబరు నాటికి 'విప్రనారాయణ' తయారు చేయాలని సంకల్పం - మా యీ నూతన సంస్థకు మీరే మహారాజ పోషకులు. మీ బలం లేకుండా నేనేమీ చేయలేను." అన్నాడు ఉద్వేగాన్ని ప్రదర్శిస్తూ రామనాథం.

"పెళ్ళికూతురు ఎవరండీ?"

"మన గౌరమ్మగారి కూతురు."

"కల్యాణా?"

"ఔనండీ."

ఒక్కసారి చీకటి దట్టమై కన్నులు కనిపించలేదు. ఆకస్మికంగా వీచిన పెనుగాలికి రావిచెట్టు కదిలి జలజలమంది.

"వాళ్ళు ఒప్పుకున్నారా?" అన్నాడు కాసేపటికి

"ఒప్పుకున్నారండీ. అదీగాక పెళ్ళికూతురుకు గూడా యీ సంబంధం నచ్చింది. నిన్నరాత్రి చెప్పొద్దూ ఆమెతో చాలాసేపు మాట్లాడాను. మనస్సులు కలిస్తే ఇంకేంకావాలి చెప్పండి. అంతా దైవశాసన మనిపిస్తుంది. ఎవరికి ఎక్కడ రాసిపెట్టుందో ఎలా చెప్ప గలం చెప్పండి? నేను కలగన్నానా ఇన్నాళ్ళకు ఈ జీవిత నౌకకు ఒక చుక్కాని ఏర్పడుతుందని? అంతా మీ ఆశీర్వాదబలం. మీరు వెయ్యి రూపాయలూ అడగగానే యిచ్చారు. వాళ్ళకు గండం గడిచింది. నిజానికి వాళ్ళకు నేను చేసిన సహాయం కాదది. మీరు చేసింది."

మౌనంగా వింటూ నడుస్తున్నాడు కరుణాకరం.

"ఇంత చిత్రంగా నిమిషాలమీద కుదిరిందే" అన్నాడు ముత్తెం. కరుణాకరంకేసి చూశాడు. చీకటిలో అతని ముఖం కని పించలేదు. మరి కొంతదూరం నడిచి శలవు పుచ్చుకొని తిరిగి పోయాడు రామనాథం - దేవాలయం దాకా నడిచారిద్దరూ. సప్తా హోత్సవాలు బ్రహ్మాండంగా జరుగుతున్నాయి. ఇసుకవేస్తే రాల కుండా జనం వచ్చారు. కరుణాకరాన్ని చూడగానే అంత వత్తిడి లోనూ ఎవరికి వారే తప్పుకుని మార్గం చూపెడ్తున్నారు. వేదిక దగ్గరున్న రాఘవయ్య హుటాహుటిన ఎదురు వచ్చి కరుణాకరాన్ని ముందుకు తీసుకు వెళ్ళాడు. ఊళ్ళో పెద్దలంతా అక్కడే వున్నారు. కుర్చీకోసం కేక పెట్టాడు మున్సబు. పాలేరు ముత్తయ్యా పరు గెత్తాడు. వద్దంటూ అందరితోపాటూ తనూ క్రింద చాపమీద కూర్చున్నాడు. అల్లంత దూరంలో వసంత కనిపించింది. తనను చూడ

గానే పమిట వళ్ళంతా కప్పుకుంది. యతీంద్రులవారు కొదమ సింహంలా వేదికమీద బాలీసు నానుకుని కూర్చున్నారు. శ్రీవారి ప్రథమ శిష్యులు రామానుజస్వామి "హరేరామ హరేరామ - రామరామ హరేహరే" అంటూ మైక్ ముందు కూర్చుని చెప్పగా, అశేష జన సందోహం వంతలై మారు పలుకుతున్నారు. ప్రతిరోజూ చివరకు యతీంద్రులవారు ఉపన్యసిస్తారు. అంతకుముందు కరుణాకరం యతీంద్రులవారి ఉపన్యాసాన్ని ఎన్నడూ విన్నవాడుకాదు. జీవితం సౌదామినివంటిదనీ, బుద్బుధ ప్రాయమనీ, కామ క్రోధ మద మాత్సర్యాది వ్యామోహాలను వర్జించి, నిష్కామ కర్మ చేసిన మనిషినే 'ముముక్షువు' అంటారనీ, అట్టి జీవికే చివరకు ముక్తి లభిస్తుందనీ, ప్రారంభించి వేదాలనుండి, ఉపనిషత్తులనుండి, పురాణాల నుండి ఎన్నో మహత్తర విషయాలను ఉటంకిస్తూ అనర్గళంగా గంటన్నర సేపు గంభీరోపన్యాసం చేస్తున్న యతీంద్రులవారి వాగ్ధాటికి ఆశ్చర్యపడ్డాడు కరుణాకరం. వింటున్నంతసేపూ సృష్టి సత్యాలను తెలుసుకుంటున్నట్లే వుంది. జీవుని వేదనను గురించి శ్రీవారు చెప్పిన వ్యాఖ్యానం అత్యద్భుత మనిపించింది. నిర్లిప్తత - అనే మాటకు ఎంత చక్కటి అర్థం చెప్పారు? నిష్కామ కర్మలోని కిటుకును ఎంత లాఘవంగా విప్పి చూపారు? ఆయన మీద గౌరవం కలిగింది కరుణాకరానికి. చివరకు పెద్దలందరూ శ్రీవారికి పాదాభివందనాలు చేసి నిష్క్రమిస్తున్నారు. తనకూ నమస్కరించాలనిపించింది. నమస్కరించాడు.

"శ్రీకృష్ణార్పణం" అన్నారు శ్రీవారు.

"ఇంటి దగ్గర కలుసుకుంటాను స్వామీ?" అన్నాడు కరుణాకరం.

"నీతో కొన్ని ముఖ్యవిషయాలు మాట్లాడాలని రెండు రోజులుగా అనుకుంటున్నాను నాయనా" అన్నారు ఆర్ద్ర కంఠంతో శ్రీవారు.

శ్రీవారు బస చేసింది కరుణాకరం యింట్లో. కాని లంకంత యింట్లో ఒక మూల గల రెండు గదులు కరుణాకరానివి. శ్రీవారిని కలుసుకుని కాలక్షేపం చేయటాని కతడెన్నడూ ప్రయత్నించలేదు.

ఆ రాత్రి -

కరుణాకరంతో శ్రీవారు అవీ యివీ మాట్లాడి "నీతో మాట్లాడాలనుకున్న ముఖ్య విషయ మేమిటంటే?" అంటూ అతని ముఖంలోకి చూస్తూ ఆగారు. వరదాచార్యులవారు శ్రీవారి కాళ్ళు పడుతూ కూర్చున్నారు.

"చెప్పండి స్వామీ!" అన్నాడు కరుణాకరం.

"ఇది నీ వ్యక్తిగత విషయం. అయినా నీకు సలహా చెప్పాలనే అభిప్రాయం నాకు కలిగింది. నీకు అభ్యంతరం లేకపోతే?"

"ఫర్వాలేదు చెప్పండి స్వామీ?"

"ఇంతకాలం - అసలు జీవితంలో అనేక కర్తవ్యాలున్నాయి బాబూ. ఏ వయస్సులో జరగవలసింది ఆ వయస్సులో జరగాలి. ఇందులో, దాపరిక మేముందు సూటిగా చెప్తున్నాను. నీకు భగవంతుడు అన్ని అదృష్టాలూ యిచ్చాడు. రూపముంది, ఆరోగ్యముంది, ఐశ్వర్యముంది, తెలివితేట లున్నాయి. అన్నీవుండికూడా నువ్వేదో బాధపడుతున్నావని నాకు ఏదో వాణి చెప్తున్నది నాయనా. నిజం కాదంటావా?"

ఈ ప్రశ్నకు ఏం సమాధానం చెప్పాలో అర్థంకాక కొంచెం సేపాగి "ప్రత్యేకంగా బాధంటూ ఏమీలేదు స్వామీ" అన్నాడు.

"అలాకాదు. ఆలోచించుకో."

"ఎంత ఆలోచించినా నాకేమీ అర్థంకావడం లేదండీ."

"అదే వేదన. జీవుని వేదన. ఈ వేదనకు కారణం ఐహిక బంధాలు. ఈ బంధాలు బాధాకరమని, అందరూ వీటిని త్రెంచుకోలేరు. అందరూ యోగులు కాలేరు. అందరూ సర్వసంగ పరిత్యాగులు కాలేరు. లోకధర్మాన్నీ జీవితధర్మాన్నీ అనుసరించటమే మీకు మార్గం. కాబట్టి ఈ వయస్సులో యింకా నువ్వు వివాహం చేసుకోకుండా వుండటం ఏమంత సమంజసంగా లేదు బాబూ."

కరుణాకరం మౌనంగా వింటున్నాడు.

వరదాచార్యులవారు వళ్ళంతా చెవులు చేసుకుని తలపంకిస్తున్నారు. శ్రీవారు నిదానంగా జీవిత రహస్యాలను క్రమంగా వివరిస్తూ సృష్టి సత్యాలను విపులీకరిస్తున్నారు.

"యౌవనం ఎటువంటిది? అదొక పొగరుమోతు అడివిగుర్రం. దానికి కళ్ళెం వేయాలి. యౌవనోద్వేగం ఎటువంటిది? అదొక నిర్నిరోధ స్రవంతి. దానికి ఆనకట్ట కట్టాలి. ఆ ఆనకట్టనే వివాహమన్నారు...."

ఈ విధంగా అరగంటసేపు వివాహ వ్యవస్థయొక్క గొప్పతనాన్ని ఉపోద్ఘాతప్రాయంగా వివరించాక అసలు విషయానికొచ్చారు శ్రీవారు. మొదటి వాక్యంలోనే విషయం కొంత అర్థమయింది కరుణాకరానికి. చివరకన్నారు - "వరదాచార్యులవారి పుత్రిక వసంత నీకు తగిన వధువని నా నిశ్చితాభిప్రాయం బాబూ."

వరదాచార్యులవారు ఊపిరి బిగబట్టి చూశారు కరుణాకరం ముఖంలోకి. తల వంచుకొని మౌనంగా కూర్చున్నాడు కరుణాకరం.

"ఏమంటావు నాయనా? వధువు తల్లితండ్రుల అంగీకారాన్ని తీసుకున్న తర్వాతనే నేనీ మాట చెపుతున్నాను. నీకభ్యంతరం లేదుగదా?"

"ఉందండీ."

వరదాచార్యులవారి శరీరం కదిలింది చిత్రంగా. సన్నటి మూలుగులాంటి ధ్వని వినిపించింది.

"ఏమిటి నాయనా నీ అభ్యంతరం? నీకు తల్లితండ్రులుంటే వారినే అడగవలసింది ఆ అదృష్టం లేకపోవడంతో ఆ బాధ్యత కొంత నీ మీద పడింది. మిగిలింది నేను స్వీకరించాను."

"ఇప్పట్లో పెళ్ళి చేసుకోవాలని లేదండీ"

వరదాచార్యులుగారు కదిలి "కాదు కరుణాకరం. ఈ క్షణాన పెళ్ళి జరిగితీరాలని ఎవరంటున్నారు? నిశ్చయం చేసుకుని తాంబూలాలు పుచ్చుకుంటే, ఆ తర్వాత నీకిష్టమైనప్పుడే ఓ ముహూర్తం పెట్టుకోవచ్చుగా. నా బాధ నీ కర్థంకాదు. పెళ్ళికి ఎదిగికూర్చున్న బిడ్డ యింట్లో వుండటం చాలా బరువు బాబూ. అసలు రజస్వల కాక ముందే వివాహం చేయడం మన సంప్రదాయం."

"నువ్వు కూడా ఈ సంబంధం విషయంలో సుముఖంగా వున్నావని తెలిసి ఈ ప్రస్తావన తేవడం జరిగింది కరుణాకరం. అయితే నువ్వు ఎందుకు సందేహిస్తున్నావో నాకర్థం కావడంలేదు. వారు వైష్ణవులు - మీరు శైవులు - నిజమే. కాని సృష్టి జరిగిన నాటినుంచీ ఇన్ని వర్గాలూ వర్ణాలూ లేవుసుమా? బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులనే విభజన కూడా సాంఘిక బాధ్యతల పంపిణీకోసం మాత్రమే జరిగింది. ఆ తర్వాత అనేకమంది ప్రవక్తలు భిన్నమైన సిద్ధాంతాలను వ్యాప్తిలోకి తీసుకురావడంతో ఇన్ని రకాలుగా చిలవలు పలవలుగా ఈ వర్ణ వ్యవస్థ విస్తృతమయింది.

మధ్యలో వచ్చిన ఈ మార్పు మధ్యలో పోయేదే." అన్నారు యతీంద్రులు అనునయంగా.

"అయితే ఒక బ్రాహ్మణ యువతి ఒక మహమ్మదీయునో మాదిగ యువకునో వివాహం చేసుకున్నా తప్పు లేదంటారా ?"

"దైవందృష్టిలో ఉండదీ తప్పు. కాని సాంఘిక భద్రతకూ సంఘ నీతికీ విఘాతం కలుగుతుంది."

"ఎందుకంటారు ?"

"భిన్న భిన్న మతాల వారికి, కులాలవారికి విభిన్నమైన సంప్రదాయాలూ జీవిత విధానాలూ వున్నాయి. రెండు చక్రాల బండి సంసారం. ఒకటి పెద్దదీ మరొకటి చిన్నదీ అయితే బండి నడువదు. ఈ వ్యత్యాసం శైవులకూ వైష్ణవులకూ మధ్య అంతగా ఉండనవసరం లేదు."

"పోనీండి. నా అభ్యంతరం అది కాదసలు. మాట వచ్చింది గనుక ఏదో అడిగాను. నాకు ఇప్పట్లో వివాహం చేసుకుందామని లేదు. ఎప్పుడు చేసుకుంటానోగూడా చెప్పలేను."

"నీ నిర్ణయం అయేదాకా వసంతకు పెళ్ళి చెయ్యను కరుణాకరం" అన్నారు వరదాచార్యులవారు.

"అయ్యా, ఈ విషయంలో మాత్రం మీరు పొరపాటు పడకండి. నేను వివాహం చేసుకోవడం జరిగినా వసంతను మాత్రం కాదు. నాకా అభిప్రాయం మాత్రం లేదు. తర్వాత మీరు బాధపడినా ప్రయోజనంలేదు. ఆమెమీద గల సోదర వాత్సల్యంతో వివాహానికి కావలసిన ధన సహాయంమాత్రం చేయగలను. ఇంతకు ముందు ఈ విషయంలో కొన్ని అపోహలు బయలుదేరాయి. వాటిని మొదట్లోనే త్రుంచివేయడం ఉభయులకూ మంచిదని ఇంత స్పష్టంగా చెప్తున్నాను."

"ఇదే నీ చివరిమాటా ?" అన్నారు కఠినంగా వరదా చార్యులు.

"చివరి మాటా మొదటిమాటా ఏముందండీ ? ఉన్నమాట చెప్పాను. మీ మనస్సుకు బాధ కలిగితే క్షమించండి."

ఆ సమావేశం అంతటితో ముగిసింది.

కరుణాకరం చివాలున లేచి వెళ్ళిపోయాడు. "అజ్ఞానాంధ కారం" అన్నారు యతీంద్రులవారు.

"కాదు వళ్ళు పొగరు" అన్నారు వరదాచార్యులవారు.

"ఎవరి బాధలు వాళ్ళవి" అన్నారు శ్రీవారు అనునయంగా.

"కాళ్ళు కడిగి బంగారంలాంటి పిల్లను కన్యాదానం చేస్తా మంటే అంత కళ్ళు నెత్తిమీద కొచ్చాయా ? పూటకు ఠికానాలేని దరిద్రుడికి నడమంత్రపు సిరి వచ్చి లక్షలకు లక్షలు చేతిలో ఆడు తుంటే కళ్ళు కనిపిస్తాయిటండీ ? ఏ కల్యాణిలాంటి చెడిపోయిందో ఆ దౌర్భాగ్యుడికి నచ్చుతుంది కానీ అయినింటి పిల్లలు నచ్చుతారు టండీ మీ వెర్రిగాని. సాక్షాత్తూ దైవాంశ సంభూతులైన మీ అంతటి వారు సలహా చెప్పారే అతగాడి కేమన్నా తలకెక్కిందీ ? అనుభ విస్తాడులెండి. అసలు ఈ సంబంధం చెడడం కూడా ఓ విధంగా మంచిదే అయింది. వాడికి డబ్బెలా వచ్చిందనుకున్నారు ? పోలీసు వాళ్ళు పసిగట్టి తిరుగుతున్నారట. తప్పదులెండి శ్రీకృష్ణ జన్మ స్థానం" అంటూ భారీ యెత్తున ప్రచారయుద్ధం ప్రారంభించాలనే సమరోత్సాహంతో దట్టంగా ముక్కుపొడుం పట్టించి లేచిపోయారు వరదాచార్యులవారు.

# పధ్నాలుగు

యతీంద్రులవారు - వరదాచార్యులు - కరుణాకరం - ఈ ముగ్గురి సమావేశం జరుగుతున్న సందర్భంలోనే నంబాచార్లు కూతురు శాంత తన బాధలు చెప్పుకుంటానికి వసంత యింటికి వచ్చింది. కాని వసంత అంతులేని ఉత్సాహంతో ఉబుకుతున్న ఆవేశంతో కనిపించేసరికి క్షణకాలం తన బాధలుకూడా మరిచి పోయింది శాంత.

"ఏమిటే కథ అంత హుషారుగా వున్నావ్" అంటూ బుగ్గలు గిల్లింది.

"పోవే - ఏమిటా మోటు సరసం" అంది వసంత.

"అవున్లేవోయ్. గిల్లవలసినవాళ్ళు గిల్లితే హాయిగానే వుంటుంది. ఇంతకీ కథ ఏమిటో చెప్పావుకాదు."

"నాన్నగారు వెళ్ళారు."

"ఎక్కడికి ?"

"యతీంద్రులవారి దగ్గరకు."

"ఎందుకు?"

"ఎందుకేమిటే వెర్రిదానా అందుకే..."

"అబ్బ చంపుతున్నావ్. అర్థమయేటట్లు చెప్పవేతల్లీ."

"కరుణాకరంతో మాట్లాడతారట యతీంద్రులవారు."

"అదా హుషారు. ఎప్పుడు పెట్టిస్తావ్ పప్పన్నం."

"ఆ ఏడుకొండలవాడు చల్లగాచూడాలిగాని - ఒక పప్పన్న మేమిచ్చే బంగారు పళ్ళెరంలో పంచభక్ష్య పరమాన్నాలు పెట్టి ఈ ప్రాణస్నేహితురాలికి కానుకగా అర్పించనూ?"

వసంతను గాఢంగా కౌగలించుకుంది శాంత "ఎంత పిచ్చి అభిమానమే నీకు. కాస్త మనస్సు ఉగ్గబట్టుకో."

"ఆగటంలేదే."

"ఆగటంలేదూ పాపం? ఆగకపోతే సరాసరి వెళ్ళి అతగాణ్ణి కొరుక్కు తినెయ్యి."

"నువ్వలాగే తిన్నావా మొదటి రోజు మీ ఆయన్ని?"

మొదటిరోజు గుర్తొచ్చింది శాంతకు. తనకంతటి ఆలోచనలే వుండేవికావు. అసలు శరీరంలోనే వేడి లేదేమో. మొదటిరోజని తెలియకుండానే మొదటిరోజు గడిచిపోయింది. ఒక్క క్షణకాలం మైమరపించే ఉద్వేగంలా శరీరాన్ని వణికించింది. అంతే. కాని ఎంత అదృష్టవంతురాలు వసంత! ఏమిటీ ఉద్వేగం? ప్రతి చిరుగాలికీ కదిలిపోయే చిగురుటాకులా కనిపించింది. ఊహల ఉయ్యాలలో ఊగిపోతున్న మనస్సది. ఆశ్చర్యంగా చూసింది ఆ ఆవేశాల ముద్దను శాంత.

"వసంతా! నీ అదృష్టానికి నేనూ అబ్బురపడిపోతున్నాను. కానీ నువ్వు మరీ పిచ్చిదానివై పోతున్నావేమో అనిపిస్తూంది."

"నీ కర్థంకాదే ఇది."

"అర్థమేం కాకపోలా. కానీ కనిపించిన ప్రతివాళ్ళతోటీ ఇదే గొడవ చెప్తున్నావటగా? నువ్వు ఆడపిల్లవి. ఆ విషయం గుర్తుంచుకో. ఎంత ప్రేమున్నా అంతా బయట పెట్టుకోగూడదు. కొంత గుండెల్లో దాచుకో పీటముడి వేసుకుని. అంతా బయటపెడితే ఆ మోజు పోతుందంటారు."

"అందుకేగా ఆయన యింటి ఛాయలకుగూడా వెళ్ళటం మానుకున్నా. మొన్న ఏమయిందనుకున్నావ్? నువ్వు రాలా. సప్తాహానికి వెళ్ళానా? అతనొచ్చాడు. తలెత్తిచూసేసరికి కనిపించాడు. వణికిపోయాననుకో. అలే చూస్తూ కూర్చున్నా. కాసేపటికి నన్ను చూశాడు. చూపు కలవగానే ప్రాణం జివ్వున లాగేసిందనుకో."

"ఏమైనా పెళ్ళికాకుండా యింత అల్లరి కాకూడదే. ఏమన్నా అనుకుంటారు ఎవరైనా."

"అనుకోనీవే, అదేదో సినిమాపాటలా 'ఏడ్చేవాళ్ళను ఏడవనీ' కొందరి బ్రతుకులంతే. వాళ్ళు అనుభవించలేరు, ఎదుటివాళ్ళు అనుభవిస్తుంటే చూసి భరించలేరు. వాళ్ళను చూసి జాలిపడటంగాక మనమేం చెయ్యాలేం."

వసంత మాటలు వింటుంటే ఆమెమీద జాలిపడింది శాంత' 'ఎంత వెర్రిపిల్ల' అనుకుంది.

"చీకట్లో లైట్లు వేసుకోకుండా ఏమిటే ఆ గుసగుసలు" అంటూ కేకపెట్టింది చెల్లాయమ్మగారు.

"చూశావా వసంతా? ఆడపిల్లలు చీకట్లో కూర్చుంటేనే తప్పుగా తోచింది మీ అమ్మకు. ఇది లోకంతల్లీ. ఇటువంటి తెలివితక్కువతనంతోనే అల్లరయింది కల్యాణి."

"అది చెడిపోయిందే - దానితో నన్ను పోల్చకు. ఏమిటో అనుకున్నా. ఆ రాజారావంటే దేముడంటూ తిరిగింది కొన్నాళ్ళు. ఇప్పుడు హెడ్‌మాష్టరు రామనాథంతో సంబంధం కుదురుతూవుంది."

"అలాగేం? ఇదెప్పుడు?"

"నిన్నరాత్రి గౌరమ్మగారు మా యింటికొచ్చింది. నాన్న

గారితో మాట్లాడుతూంటే విన్నా. ఆ రామనాథానికి ఎంత చెడ్డ పేరుందో తెలుసా? దీనికి దొరికేవన్నీ అటువంటి సంబంధాలే."

"అది ఒప్పేసుకుందంటావా?"

"ఒప్పుకుందట."

"ఆ హెడ్‌మాష్టరు మొదటి పెళ్ళాన్ని ఒదిలిపెట్టాడట?"

"ఔనుట. ఇదొకటేనా యింకా చాలా వింటున్నాం ఆ మహానుభావుణ్ణి గురించి."

"రాజారావుకీ దీనికీ ఎందుకు చెడింది?"

"ఆ భగవంతుడికి తెలియాలి. అదెప్పుడూ పైకి మాట్లాడదు గదా? అంతా స్వయంపాకం. మనలా తెలివితక్కువదేం కాదు బడబడా వాగటానికి."

"చాలా రోజులయిందే దాన్ని చూసి. ఆ సత్రానికి పోవాలంటే ఏమిటో యిదిగావుంది."

"మనకుంటుంది చూడాలని. కాని దానికుండొద్దూ? నేను ప్రొద్దున్న వెళ్ళా. సరిగ్గా మాట్లాడనన్నా మాటలాడలేదు."

"నీమీద కోపమెందుకు?"

"కోపంకాదు. చూడలేకపోవడం."

"ఛా! అది అటువంటిదికాదే."

"అదే చిత్రమే! నేనూ అలాగే అనుకున్నా యింతకాలం. పెళ్ళి పలకరిస్తే బుంగమూతి పెట్టుకు కూర్చుంది. పెళ్ళిసంగతి అడిగాను. - ఎవరినో ఒకరిని చేసుకోక తప్పదంటున్నారే అంతా అంది."

"పాపం దాని బాధలు దానివి" అంటూ నిట్టూర్చింది శాంత తన బాధల్ని నెమరు వేసుకుంటూ.

శాంత వెళ్ళిపోయింది. తండ్రి ఏ కబురు తీసుకువస్తాడో అని ఎదురు చూస్తున్న ఉద్వేగంలో వసంతకు నిద్ర పట్టలేదు. కల్యాణి గుర్తుకు వచ్చింది. ఆమె బ్రతుకు పాడై పోయిందనిపించింది. నిజానికి ఆమె తనకంటె అందమైంది. కుదురుగల పిల్లని పేరు తెచ్చుకుంది చిన్నప్పుడు. ఆ రోజుల్లో ఆడపిల్లలందరూ కల్యాణి స్నేహంకోసం ప్రాకులాడేవారు. ఆమె యించుమించు అందరితోనూ ముభావంగానే వుండేది. ఒక విధంగా తనూ ఆమెను చూసి అసూయపడేది. కాని - అనుకుంది వసంత "ఎంత చిత్రం ? - కాలప్రభావం ఎటువంటిది ? ఓడలు బండ్లూ, బండ్లు ఓడలూ అవుతాయన్నారందుకనే. ఈనాడు కల్యాణి తననుచూసి అసూయపడే పరిస్థితికి దిగజారింది. ఏడుకొండలవాడా దానిని రక్షించు -" అంటూ లోలోన ప్రార్థించింది.

కాని -

ఆమె ఆ విధంగా తన అదృష్టాన్ని, కల్యాణి దురదృష్టంతో పోల్చుకుని ఆమెమీద జాలిపడుతున్న సమయంలోనే యతీంద్రుల వారి దగ్గర కరుణాకరం ఖండితంగా తానూహించజాలని నిర్ణయం ప్రకటించటం జరిగిందని తెలుసుకోలేకపోయింది. ఆ స్వప్న సౌధాలు మరోక్షణంలో కూల్చటానికి వరదాచార్యులవారు వస్తున్నారనే విషయం మనస్సుకు స్ఫురించే ఆస్కారం లేకపోయింది. తండ్రి రాఘవయ్యతో ఏదో చెప్పిపెడ్తున్న కేకలు విని ఊహాలోకాన్ని వదిలి భూమిమీదకు రాలింది వసంత. తండ్రి కరుణాకరాన్ని తిడుతున్నాడు. మనస్సు ఏదో అనుమానాన్ని పెంచుకుంది అరక్షణంలో. అది పెరిగి పెరిగి గుండెలను చీల్చుకుని బయటకు వచ్చేలావుంది. కొంచెంసేపయాక ఆయన లోపలికి వచ్చి కరుణాకరాన్ని తిట్టడం మొదలుపెట్టాడు. తనకు స్ఫుటంగా వినిపిస్తున్నా యా మాటలు దొడ్లోంచి. నెత్తిన పిడుగు పడినట్లనిపించింది. "కొంపలు తీసేరకం - ఆఁ పోలీసులు" "........ ...." మతి పోయినట్లయింది.

ఏవో మాటలు విరిగి విరిగి వినిపిస్తున్నాయి. "దొంగనోట్ల వ్యాపారంట ...... నే చెప్తే విన్నారా? అసలు హైద్రాబాదు అంతా చుట్టపెట్టి వచ్చాట్ట - కల్యాణిమీద పడినట్లుంది కన్ను - పెళ్ళి చేసుకుంటాడా? ఆఁ నా మొహం - వీళ్ళకు పెళ్ళిళ్ళెందుకే? జరగవలసినవన్నీ సుఖంగా జరుగుతూంటే? పీడి తాతల్లాంటి వాణ్ణి తెస్తాను మూడు నిమిషాల్లో - వాడి అంతు తేలుస్తా - మన కెందుకండీ వాడెట్లాపోతే - చూద్దుగాని శ్రీకృష్ణ ఏదీ శ్రీకృష్ణజన్మస్థానం -

వసంత తల తిరిగి పోయింది. తలుపు గడియ పెట్టుకొని మంచం మీద పడుకుని ఏడ్చింది - కుళ్ళి కుళ్ళి ఏడ్చింది. ప్రాణం అలిసిపోయేటట్లు గుక్కలుపట్టి ఏడ్చింది. తల్లి తలుపులు కొట్టింది అన్నానికి రమ్మంటూ. తలుపు తీయలేదు. కొట్టి కొట్టి విసుగొచ్చి పడుకుందావిడ. ఏదో రాచకార్యం సాగించటానికి మన్సబుగారింటికి వెళ్ళాడు వరదాచార్యులవారు.

ఏడ్చి ఏడ్చి నిద్రపోయింది. చిత్ర విచిత్రమైన కలలు-ఊరంత పందిరి. దీపావళి వెలుగులు. బాండ్ మేళం - మంత్రఘోష - హైదరాబాద్ మకాం మార్చటం - పెద్దమేడ - కారు - విందులు - వినోదాలు - పాతివ్రత్యం - బిడ్డలు - గొప్పగొప్పస్కూళ్ళు - శలవులకు కారులో తన వూరు రావడం - శాంతకు చేయాలనుకున్న సహాయం - సీతారాముల ఆలయంలో పూజలు - తిరపతిమొక్కు - సాయిబ్బును పెళ్ళిచేసుకున్న నాయుడు కూతురు డాక్టరమ్మ కొడుకులా 'మమ్మీ' అనిపిలిచే దొరబాబులాంటి కొడుకు - సినిమాలోలా ఆయనకు బూట్లు తొడిగి, టై కట్టి బయటకు సాగనంపడం - విమానంలో ప్రయాణం - క్రింద కీటకాల్లా కనిపించే మనష్యులు - మబ్బులు - వాన - ఉరుములు - మెరుపులు - తలెత్తిన త్రాచుపాము - నిప్పు

రవ్వలు - కూలిన విమానం - విరిగిన శరీరాలమధ్య అదృశ్యమైపోయిన 'ఆయన' - కెవ్వున కేకపెట్టి లేచింది. యింకా తెల్లవారని చీకటి - మూలుగుతున్న నక్కలు - అరుస్తూన్న కుక్కలు - ఈదురు మంటున్న గాలి - జలదరిస్తున్న గుండెలు - గడ్డకట్టిన రక్తం - మళ్ళీ ఏడిస్తే బావుండుననిపించింది. రాని ఏడుపుమీద కోపం - అందరిలా బ్రతకలేదు తాను. అందరిలా పుట్టలేదు తాను. అయితే తాను మహారాణిగా సువిశాలమైన సామ్రాజ్యాలను వెలిగిపోతూ పాలించ గలదు. లేకపోతే అడివిలో సూర్యరశ్మి సోకకవాడిన పూవులా రాలి పోగలదు - కల్యాణిమీద జాలిపడింది రాత్రి. కాని ఇప్పుడు అసూయ పడుతూంది. దాని అదృష్టం గొప్పది. ఆశలులేని మామూలు మట్టి ముద్దలాంటి మనస్సు - అలా అనిపిస్తుంది కల్యాణిని చూసినప్పుడల్లా. ఉద్రేకాలకు లొంగని, ఉద్వేగాలకు పొంగని చిత్రమైన యోగిని లాంటి మూర్తి. తనతో ఎన్నడో కల్యాణి అన్నమాటలు గుర్తొచ్చాయి. 'ఒక కథ చదివానే - ఎవడో కాళ్ళకు చెప్పులు కొనుక్కుంటానికి డబ్బులేదని ఏడ్చాడుట తన దురదృష్టాన్ని తలుచు కుంటూ - కాళ్ళులేని కుంటివాణ్ణి చూసి నవ్వాడుట తృప్తిగా. తన అదృష్టాన్ని చూసి - ఇందులో ఎంత నీతి వుందంటావ్ ?' అంది. 'ఎక్కడ చదివావే ఈ కథ ?' అంది తాను.

'మా నాన్న చెప్పాడు ముందు' తర్వాత ఒక పుస్తకం యిచ్చి చదవమన్నాడు. అందులో వుంది. పుస్తకం పేరు గుర్తులేదు. మా నాన్న చాలా గొప్పవాడు. మహామంత్రి కావలసినవాడు. బడి పంతులుగా బ్రతికి తండ్రి ఆస్తి సగం అమ్మి మిగిలింది అప్పులకు కట్టి దిక్కుమాలిన చావుతో యాత్ర ముగించాడు. కాని వసంతా - నాకా విచారంలేదు. ఆయనకంటె దిక్కుమాలిన చావు చచ్చిన వాళ్ళు చాలామంది వున్నారు లోకంలో.'

ఎంత గొప్ప మనస్సు. అందుకే భరించగలుగుతూంది అన్ని కష్టాలనూ, అన్ని నిందలనూ, అన్ని అవమానాలనూ. తెల్లవారింది. లేచింది. దొడ్లో తులసిమొక్కదగ్గర తల్లి నీడ కనిపించింది. శరీరం - మనస్సూ రెండూ బరువెక్కాయి - బయటనుంచి బిగ్గరగా మాటలు వినిపిస్తున్నాయి -

"ఈ ఛండాలాలు ఊళ్ళో జరగనివ్వకూడదు" అంటున్నాడు రంగదాసు. పది గొంతులూ పదిరకాల మాటలూ వినిపిస్తున్నాయి.

"అందరూ సంసారాలు చేసుకుంటున్నవాళ్ళు. ఆడపిల్లలున్న వాళ్ళం - ఇలా జరగటానికి ఒక్కనాటికీ వీల్లేదు మున్సబుగారూ" తండ్రి గొంతు అది.

"ఇప్పుడేం చేయమంటారు ?" మున్సబు గారంటున్నారు.

"గ్రామ సంక్షేమంకోసం ఏది న్యాయమనిపిస్తే అది చేయండి-అటువంటి మనుష్యులు కాపురాలు చేసే కొంపలమధ్య వుంటే" - రంగదాసు గొంతు.

"ఏమౌతుందండీ ?" ముత్తెం అన్నాడు.

ఏదో గొడవ జరుగుతున్నదని గ్రహించింది వసంత.

"ఏమౌతుందా ? నీకేంబాబూ లక్ష చెప్తావు నువ్వు? మేమంతా ఆడపిల్లలున్న వాళ్ళం-అటువంటి వాళ్ళవల్ల మా పిల్లలు పాడుకారని నువ్వు హామీ యిస్తావా ?" గద్దించారు ఆచార్యులవారు.

"ఒకరి సావాసంతో చెడిపోయేవారు, ఏ సావాసం లేక పోయినా ఎలాగూ చెడిపోతారు ఆచార్లుగోరూ !" అన్నాడు ముత్తెం.

వరదాచార్యులవారు ఆగ్రహావేశాలు పట్టలేక "వళ్ళు దగ్గ రుంచుకు మాట్లాడు ముత్తెం. పెద్దాచిన్నా లేకుండా యిష్టంవచ్చి

న్నట్లు మాట్లాడుతున్నావ్ - ఆ కరుణాకరం వెనకున్నాడని కొమ్ములు పెంచుకోకు. వాడి బ్రతుకెంతో నాకూ తెలుసు. వాడితోపాటు నువ్వూ ఇలాగే వాగుతూంటే శ్రీకృష్ణజన్మస్థానం తప్పదు" అన్నారు.

వసంత లేచి కిటికీ తలుపు తెరిచి చూసింది. పెద్దసభ. విషయం పూర్తిగా అర్థం కాలేదు. తన మనస్సే బాగుండలేదు. దానికితోడు మరో గొడవ వచ్చిపడింది. కల్యాణి పేరు వినిపించింది. "తలుపులకు తాళంపెట్టి వచ్చా అటూ యిటూ" అంటున్న తండ్రి మాటలు వినిపించాయి. రెండోవ్యక్తి ఎవరు? కరుణాకరం కాదుగదా? అయితే బావుండు ననిపించింది. తనకు సంబంధంలేని నాటకం చూస్తున్నట్లనిపించింది ఆ కాసేపు. 'ఆ రెండోవ్యక్తి ఎవరు?' ఇదే ఆలోచన. వింటూంది తందరిస్తున్న గుండెలతో. కాళ్ళు తడబడుతున్నాయి. కిటికీలోంచి చూసింది. ఎదురుగుండా రంగదాసు కనిపించాడు. సందులోంచి చూస్తూంది. బయటవాళ్ళు తనకు కనిపిస్తున్నారు. తాను బయటవాళ్ళకు కనిపించటం లేదు. చాలాసేపు తర్జన భర్జనలు జరిగాయి. జరుగుతున్నది 'తప్పు' అనే విషయం గురించి కాదు. 'ఏం చేయాలి?' అనే విషయం గురించి.

"ఆరిమీద ఎవరన్నా చేయి చేసుకున్నారా తలకాయలు పగులుతై. చావదలుచుకున్న వాళ్ళు రండి" అంటూ ముత్తెం ముందు చకచక అంగలు వేసుకుంటూ వెళ్ళాడు. ఆ మాటలు విని, ముత్తెం రౌద్రం చూసి కొందరు చల్లబడ్డారు. కాని వరదాచార్యుల వారు మహోద్రిక్తంగా ఉపన్యసించారు. గీతాశ్లోకాలను సోదాహరణంగా ఉటంకిస్తూ 'గ్రామక్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని నిర్దాక్షిణ్యంగా నేరస్థులను శిక్షించవలసిందే' అంటూ ముగించి తీక్షణంగా "ఏమంటావు రంగదాసూ?" అంటూ ప్రశ్నించారు.

రంగదాసు మీసం మెలిపెట్టాడు. "ఏ మాత్రం ఎందరి తలలు పగలగొడతారో చూద్దాం పదండి." అంటూ లేచాడు. నివ్వెర పోయి చూస్తున్న మున్సబుగారిని చూసి, "యింక మీరు జాప్యం చేయగూడదు మున్సబుగారూ. ఊరికి పరిపాలకులు మీరు. అధర్మాన్ని ఖండించి, ధర్మాన్ని సంస్థాపించ వలసిన బాధ్యత మీరు విస్మరించ గూడదు." అంటూ మరో శ్లోకం చదివారు. అజ్ఞానాంధ కారం తొలగిపోయిన అర్జనుడి మాదిరి కదిలారు మున్సబుగారు. "యతీంద్రులవారి దగ్గర పంచాయితీ పెట్టిద్దాం. వారి నిర్ణయానికి అందరం బద్ధులం కావలసిందే." అంటూ గర్జించారు వరదాచార్యుల వారు. మున్సబు సహజంగా శాంత స్వభావంగల మనిషి. కాని వరదాచార్యుల వాగ్ధాటికి లొంగిపోయాడు. విశ్వపతి మాష్టారి దగ్గర చదువుకున్న రాఘవయ్యకూడా ఈ పరిస్థితికి చాలా కలవర పడ్డాడు. ఇంత కాలంగా ఊళ్ళో అందరినీ వేధిస్తున్న అనుమానం పైకి పొక్కి పొగలు సెగలై మండుతూంది. ఆ విషజ్వాలలో దగ్ధమైపోబోతున్న కల్యాణిమీద ఎవరికీ జాలి కలగలేదు.

అందరూ సత్రం దగ్గర జేరారు. పదిమందిని చూసి మరో పాతికమంది జేరారు. పెనుసంగ్రామం జరగబోతున్న రణరంగంలా వుంది ఆ ప్రదేశం. బయట అరుగుమీద కూర్చుని ఏడుస్తూంది గౌరమ్మగారు. గదికి అటూయిటూ తాళం పెట్టారు. బొడ్లోంచి తాళం చెవులుతీసి ఆడిస్తూ "తెలిసే ఈ ఘోరం జరుగుతూందన్న మాట గౌరమ్మతల్లీ ?" అన్నారు. ఆవిడ చేతులెత్తి నమస్కరిస్తూ భోరున ఏడ్చి "క్షమించండి అన్నగారూ. ఇవి చేతులు కావు..." అంటూ ప్రాధేయపడింది.

"పోనీండి ఆచార్లుగారూ. ఎవరి పాపం వాళ్ళది, రండి పోదాం" అంటూ రెక్కపుచ్చుకు లాగాడు రాఘవయ్య.

"వీల్లేదు. విషయం తేలవలసిందే" అన్నాడు రంగదాసు.

గౌరమ్మగారికి తాళంచెవు లిచ్చి "చెల్లమ్మా, తలుపులు తీసి వా రిద్దరినీ బయటకు రమ్మనండి" అన్నారు వరదాచార్యులు.

"లేకపోతే మేమే జుట్టు పట్టుకు బయటకు లాగుతాం." అంటూ ఉరిమాడు రంగదాసు.

ఎవరినోటి కొచ్చినట్లు వారు మాట్లాడుతున్నారు. వింటున్న వాళ్ళ కంటె మాట్లాడుతున్న వాళ్ళే ఎక్కువమందయారు. తాళం తీసి తలుపులు బాదుతూ "బయటకు రండి ఇద్దరూ" అంటూ కేకలు పెట్టారు. తలుపు తెరుచుకుంది. మౌనంగా కల్యాణి బయటకు వచ్చి నిర్లిప్తంగా అందరినీ కొన్ని క్షణాలు తేరిపార చూసింది. ఆ కొద్ది క్షణాలు జనమంతా నిర్జీవంగా నిలబడ్డారు.

"మీ కేంకావాలి ?" అంది ఆచార్లుగారిని చూసి.

వరదాచార్యులుగారు సంబాళించుకుని "అతన్ని గూడా బయటకు పిలువు" అన్నారు.

"ఆయన వంట్లో బాగుండలేదు. రాత్రి అంతా నెత్తురు దోక్కున్నారు. ఇంతకు ముందే నిద్రపట్టింది. లేపటానికి వీల్లేదు." అంది నిమ్మదిగా. కాని స్పష్టంగా-

"రాత్రంతా నిద్రపోయాడని మే మన్నామా ? నిద్రపోవడానికయితే ఈ గదిలో దూరవలసిన గతేం పట్టింది." అన్నాడు రంగదాసు.

"అతను బయటకు రావలసిందే" అరిచాయి కొన్ని గొంతులు.

"రాకపోతే ఏం చేస్తారు?"

"జుట్టు పుచ్చుకు గుంజుకొస్తాం" అరిచాడు రంగదాసు.

"అదుగో వస్తున్నాడు-"

"కళ్ళు చూడు చింతనిప్పుల్లా."

రాజారావు బయటకు వచ్చాడు. "రంగదాసూ!" అన్నాడు.

"ఏం ?" తెల్లబోయాడు అంతటి రంగదాసూ.

"చావాలనుందా?"

భయంకరమైన నిశ్శబ్దం. కొన్ని క్షణాల తరువాత "ఏం చంపుతావా ?" అన్నాడు.

"ఇందాక అన్నమాట మళ్ళీ అను."

"ఏమన్నాను?"

"జుట్టు పట్టుకు లాగుతానన్నావు!"

"ఆc, బయటకు రాకపోతే అంతపనీ జరిగేది."

రాజారావు చేతిలో పొడుగాటి టార్చిలైటుంది. అది ఎత్తి బలంగా రంగదాసు మీదకు కొట్టాడు. అద్దం పగిలింది. రంగదాసు కణతలు చిట్లి నెత్తురు పొంగి క్రిందపడ్డాడు. రాజారావు రౌద్ర మూర్తిని చూసి ఎవరూ మాట్లాడలేకపోయారు.

"వెళ్ళండి" అన్నాడు ఆయాసపడుతూ.

ఎవరూ కదలలేదు. కల్యాణి రెండడుగులు ముందుకు వేసి "మున్సబుగారూ! మీరన్నా చెప్పండి. మా గురించి మీరెవరూ బాధపడవలసిన అవసరం లేదు. రేపు ఈ పాటికి మీ సత్రం ఖాళీ చేస్తాము. దయుంచి వెళ్ళండి." అంటూ నెమ్మదిగా రెక్కపట్టుకొని రాజారావును గదిలోకి తీసుకుపోయింది. రంగదాసు మూలుగుతూ లేచి "ఇందరున్నారు తాడిచెట్లకుమల్లే. వాడు కొడుతుంటే చూస్తూ వూరుకుంటార్రా?" అన్నాడు రోషంగా.

"నువ్వు మా అందరికంటె పొడుగున్నావుగా!" అన్నా రెవరో. రంగదాసు తల తిప్పి చూశాడు. అది ముత్తెం గొంతు. విని ఊరుకున్నాడు. కొంతసేపటికి ఎవరి దోవన వాళ్ళు వెళ్ళి పోయారు. ఊరంతా అల్లరయింది. ఈ సంఘటన విని కరుణాకరం చాలా నొచ్చుకున్నాడు. వెంటనే ఆ రాత్రికి రాత్రి కల్యాణిని చూడాలనిపించింది. కాని గ్రామ వాతావరణం మలినరహితంగా లేదు. మర్నాడుదయం వెళ్ళాడు. కాఫీ కలుపుతున్న కల్యాణి నవ్వుతూ ఎదురు వచ్చి "రా కరుణా! నిన్న రావలసింది, ఇక్కడ మంచి రసాత్మకమైన నాటకం జరిగింది." అంటూ స్టూలు వేసింది.

"మీ అమ్మగారేరీ ?"

కాఫీ సగం గ్లాసులో పోసియిస్తూ "చూడు ఈ కషాయాన్ని గొంతులో పోసుకోగలవేమో" అంటూ యిచ్చింది. త్రాగుతూ "అమ్మగారేరీ ?" అని మళ్ళీ ప్రశ్నించాడు కరుణాకరం.

"వెళ్ళిపోయింది."

"ఎక్కడికి ?"

"మావయ్య దగ్గరకు."

"ఎందుకని ?"

"ఎందుకో నీకు తెలియదా ? ఈ మధ్య అందరూ నా మీద దండయాత్రలు ప్రారంభించారు భారీయెత్తున. అమ్మకు కూడా నా మీద కోపం వచ్చింది."

"సత్రం ఖాళీ చేస్తున్నావట."

"చెయ్యమన్నారు."

"మరి ఎక్కడికెళ్తావ్ ?"

"ఎక్కడికి వెళ్ళమంటావ్ ? మీ యింటికి తీసుకుపోరాదూ ఇంత అన్నం వండి పెడ్తూంటా. నేను ఎలాగూ ఒకపూటే తినేది ?"

ఆ మాట బాణంలా గ్రుచ్చుకుని కరుణాకరం ముఖం వివర్ణమై "అలాగే వద్దుగా ని. కాని ఒకపూటే ఎందుకు అంటున్నావ్?" అన్నాడు.

"ఏం చేయమంటావ్ కరుణా. ఆ కాస్త తిండికే శరీరం మత్తెక్కి తెగబలిసిపోతూంది. ఇంక రెండుపూట్లా తింటే దాన్ని భరించగలనా? అదీగాక పూటకూళ్ళని పేరేగాని ఈ సత్రం వుద్యోగం ఏమంత లాభసాటిగా లేదు. అసలు నాలాంటివాళ్ళు వ్యాపారానికి పనికి రారేమో."

"కల్యాణీ!"

"

"ఒక్క మాటడగనా?"

"అడుగు. ఉపోద్ఘాతం దేనికి?"

"రామనాథం సంబంధం కుదిరిన తర్వాత మళ్ళీ..." ఆగి పోయాడు.

"ఆగిపోయావేం? అడుగు కరుణా. నీ ప్రశ్న నాకు అర్థ మయిందిలే. రాజారావు రాత్రి మా యింటికి ఎందుకు వచ్చాడంటావ్? అంతేగదా? కాని ఈ ప్రశ్న మరొకరు అడిగితే సమాధానం చెప్పే దాన్ని కాదు. చెప్పినా ఎవ్వరూ నిజం నమ్మరు. కొందరి కొందరి జీవితాలు అలాగే నడుస్తాయేమో. ఏపని చేసినా ఏ మాట చెప్పినా అనుమానిస్తుంది లోకం. కాని ఎవరో ఏదో అనుకుంటారని మనస్సుకు విరుద్ధంగా నడుచుకోమంటావా? అదే నాకు చేతకాలేదు. అసలు రాజారావెందుకొచ్చాడని? మిగిలిన ఆ స్థలం కాస్తా రంగదాసుకు తాకట్టుపెట్టాడు. అతను ఇన్నాళ్ళూ బయటకు రావడంలేదు. ఎందు కని? తల్లికి సేవలు చేయడంతో ఆ జబ్బు ఇతనికి పట్టుకుంది. బ్రతికి

నన్నాళ్ళు తల్లిని బ్రతికించుకుందామని ప్రయత్నించాడు. చివరకు ఆమెకంటె ముందే ఇతను పోయేటట్టున్నాడు."

"వైద్యం ఎందుకు చేయించుకోడు?"

బేలగా నవ్వి "ఇది లక్షాధికారులకు రావలసిన రోగం. అందరూ ప్రాణాల్ని కొనుక్కోగలరంటావా?" అంది కల్యాణి.

"కల్యాణీ! ఈ మనుష్యుల తత్వాలేమిటో నా కర్థం కావడం లేదు. నా దగ్గర నా అవసరాలకు మించిన డబ్బుంది. ఎందరు పొందటంలేదు నా సహాయం? రాజారావు కెందుకు అంత పట్టుదల? నీకు మాత్రమెందుకు? ఎవరికి నేను దగ్గరగా రావాలనుకుంటు న్నానో వారు దూరదూరంగా తప్పుకుపోతున్నారు. ఎవరికి దూరంగా పోవాలనుకుంటున్నానో వాళ్ళు మీదపడుతున్నారు. మా యిల్లు చూడు, ఒక సత్రంలా రైల్వే ప్లాట్ ఫారంలా తయా రయింది. ఎవరు ఎందుకు వస్తున్నారో, ఎందుకు తింటున్నారో, ఎన్నాళ్లు ఉంటున్నారో అంతు చిక్కటంలేదు. మీకు ఆ మాత్రం సహాయం చేయలేనంటావా? రాజారావును నేను తీసుకువెళ్తా ఏ హైదరాబాదో. నువ్వూ రా. వైద్యం చేయిద్దాం. యిద్దరూ సుఖంగా వుందురుగాని."

"అతని దగ్గర యిప్పుడు డబ్బుంది. తల్లిని మా యింట్లో దిగ బెట్టి ఆ డబ్బు చేతపుచ్చుకొని పట్నంపోయి వైద్యం చేయించుకుందా మనుకున్నాడు. ఆ మాట అడగటానికే వచ్చాడు. వస్తూనే గుండెలు పగిలేలా దగ్గుతూ దోసెడు నెత్తురు కక్కి సొమ్మసిల్లి పడిపోయాడు. ఎవరన్నా చూస్తే నా కళ్ళకు పొరలుకమ్మి అతన్ని యింట్లో పెట్టు కున్నానని అంటారని తలుపులు గడియపెట్టాను. మంచం ప్రక్కనే అలా ఎంతసేపు కూర్చొని అతన్ని కాపాడమని ఎందరు దేవుళ్ళను

ప్రార్థించానో చెప్పలేను. అమ్మ బయటనుంచి తిట్లు ప్రారంభించింది. దోవనపోయేవాళ్ళు విన్నారేమో, అడవిమంటలా ప్రాకింది శుభవార్త. తలుపులు బయట తాళంవేసి పదిమందిని వెంటబెట్టుకొని పంచాయితీకి వచ్చాడు వరదాచార్లు. నే నే పాపం ఎరగనని తల పగుల గొట్టుకున్నా నమ్మేదెవరు చెప్పు ?"

"అదే చెప్తున్నాను కల్యాణీ. మనం మంచిగా బ్రతకడమే కాదు. మంచిగా బ్రతుకుతున్నట్లు కనిపించాలి ప్రపంచానికి. లేక పోతే ఎవరూ నమ్మరు."

"నువ్వు నమ్ముతున్నావా పోనీ ?"

"నేను...నీ కెందుకు కలిగింది అనుమానం ? పోనీ ఆ సంగతి అలా వుంచు. రామనాథం సంబంధం కుదిరింది గదా ? అది ఈ గొడవతో తెగిపోయినట్లేనా ?"

"తెగిపోదు."

"ఇంత తెలిసీ రామనాథం అంగీకరిస్తాడా ?"

"చూద్దుగాని ?"

"మనస్ఫూర్తిగా ఇష్టమయ్యే రామనాథాన్ని చేసుకుంటానికి ఒప్పుకున్నావా ?"

"అంతకంటె ఏం చేయగలను ?"

"మరి రాజారావు ?"

"అతని కిష్టంలేదు."

"ఎందుకని ?"

"రేపో మాపో పోయేవాణ్ణి - అన్నీ తెలిసి నీ జీవితం పాడు చేయనా ? అంటాడు. ఎక్కువకాలం బ్రతుకుతానని అతనికి నమ్మకం లేదు."

"ఎవరితో ఈ విషయం ఎందుకు చెప్పడు ?"

"నాతో చెప్పాడు."

"నాతో ఎందుకు చెప్పలేదు ?"

"చెప్పి ప్రయోజనం ?"

"ఏం ప్రయోజనం లేదంటావా ? అతనికి నేను సహాయం చేయగలిగేవాణ్ణి కాదంటావా ?"

"కాదు కరుణా ! ఎవరికైనా సహాయం చేసే అధికారం ఎవరికైనా ఉంటుంది. కాని ఒకరిదగ్గర సహాయం స్వీకరించే అర్హతా, అధికారం అందరికీ ఉంటుందంటావా ?"

"ఎంతమంది పొందటంలేదు నా దగ్గర సహాయం ?"

"అంతే !"

"ఆ రామనాథంతో నా కెంత పరిచయం ? అడగ్గానే ముత్తెం వద్దంటున్నా వేయిరూపాయ లివ్వలేదూ ?"

"అతను రామనాథం - ఇతను రాజారావు - ఇద్దరూ ఒకటే నంటావా ?"

రాజారావు మీద కల్యాణికి గల గౌరవానికి, భక్తికి కరుణాకరం కళ్ళు చెమ్మగిల్లాయి. కొంచెంసేపాగి "ఇంత తెలివైనదానివి కల్యాణీ - ఆ రామనాథాన్ని శాశ్వతంగా మెడకు కట్టుకుంటానికి ఎలా అంగీకరించావో అర్థం కావడంలా" అన్నాడు.

"జీవితంలో కావాలనుకున్నవన్నీ దొరుకుతాయా కరుణా ? అనుకున్నవన్నీ అనుకున్నట్లు జరుగుతాయా చెప్పు ? రైలు బయలు దేరి పరుగులు తీస్తున్నప్పుడు వెనక ఎంతదూరం పరుగెత్తమంటావు నన్ను ? మరో రైలు రాదని తెలిసినప్పుడు - ఏ వంటెద్దుబండో ఎక్కి పోవలసిందే గదా ?"

కారొచ్చి సత్రంముందు ఆగింది. ప్రపంచపు ఏడు వింతల్లో ఒకదాన్ని చూసినట్టు ఆ కారును చూస్తున్నారు ఆ వూళ్ళో జనం.

"ఇంక వెళ్తాను" అన్నాడు కరుణాకరం.

"భోంచేసి వెళ్ళరాదూ ?" అంది కల్యాణి.

"నువ్వే అన్నావుగా దేనికైనా అర్హత వుండాలని ?"

"అర్హతలేంది ఎవరికో నాకు బాగా తెలుసు కరుణా. ఈ విషయాన్ని తర్కంతో మనం మభ్యపెట్టలేం. కాని మరో సంగతి కూడా గుర్తుంచుకో. ఇది సత్రం. ముప్పావలా పారేసిన ప్రతి వ్యక్తికీ ఇక్కడ నా చేతి భోజనం చేసే అధికారం ఎన్నడో లభించింది. ఊరికినే తినటం యిష్టం లేకపోతే ఆ డబ్బులు పారేసి నువ్వే తినొచ్చుగా ?"

"నువ్వు మనస్ఫూర్తిగా పెట్టిన భోజనానికి డబ్బులిస్తే ఋణం తీరుతుందంటావా కల్యాణీ ?"

"మనస్ఫూర్తిగా పిలిచానని నువ్వు మనస్ఫూర్తిగా నమ్మితే కాదని వెళ్ళగలవా చెప్పు ?"

నిరుత్తరుడయ్యాడు కరుణాకరం -

"భోజనానికేకాదు కల్యాణీ, నువ్వు మనస్ఫూర్తిగా ఏది అడిగినా కాదనే శక్తి నాకు లేదు."

"ఆ సంగతి నీకంటె నాకే బాగా తెలుసు."

ఆ మాటలు అంటున్నప్పుడు కల్యాణి కళ్ళు మెరిసాయి.

"తప్పకుండా తింటాను కల్యాణీ. ఆ భూముల విషయంలో రాజుగారితో మాట్లాడటానికీ, ప్లీడరుతో సంప్రదించడానికీ ఏలూరు వెళ్ళాలి - ఇది నా భోజనం టైముకూడా కాదు. వచ్చాక కలుస్తాను" అంటూ వెళ్ళిపోయాడు కరుణాకరం. అతను కనుచూపుమేర దాటి

పోయేదాకా, అలే రెప్పలార్పకుండా చూస్తూ, జలపాతంలా పొంగి జలజల కారుతున్న కన్నీటిని తుడుచుకోవాలనే ధ్యాసకూడా లేకుండా అచేతనంగా నిలబడిపోయింది కల్యాణి.

'నాకోసం నువ్వెంతైనా త్యాగాన్ని చేయగలవు కరుణా. కాని దాన్ని నేను భరించగలనా?' అంటూ విలపించింది ఆమె కన్నీరు!!

# పదిహేను

ఆ రాత్రి కల్యాణికి నిద్రపట్టలేదు. ఉదయం అన్నం తినలేదు. సాయంత్రం తినక తప్పలేదు. శరీర తత్వం అది. ఎవరికోసమూ ఆగని కాలంలా, శరీరావసరాలూ ఎవరికోసమూ ఆగవేమో. కరుణాకరానికి అన్నం పెట్టాలనుకుంది. తినకుండా వెళ్ళిపోయాడు. మరొకసారి అడిగితే వుండేవాడేమో. కానీ, దేనికీ ఎవరినీ బలవంతపెట్టడం ఆమె తత్వంలో లేదు. శరీరాన్ని లొంగదీసుకోవాలని ప్రయత్నించింది. అది కొంతవరకే సాధ్యమయింది. 'తిండి తినకపోతే ఏమౌతుంది?' ఇది ఆమె నెదుర్కొన్న మొదటి ప్రశ్న. 'పెళ్ళి చేసుకోకపోతే ఏమౌతుంది ఆడపిల్ల?' అదొక సమాధానం రాని ప్రశ్న. పెళ్ళి చూపుల మొదటి భాగోతం గుర్తు కొచ్చింది. సంతలో గేదెలనూ, ఆవులనూ కొంటున్నట్లు చూసే మగపెళ్ళి మహాజనంమీద కోపం వచ్చింది. ఆరోజు అమ్మ తలంటి పోసింది. పట్టుచీర కట్టింది. కన్నులకు కాటుక పెట్టింది. కస్తూరి తిలకం దిద్దింది. మొగలి రేకులు తెప్పించి తురిమింది తలలో. తనను పాట పాడమన్నారు. నాన్న ఓ అరడజను కృతులు నేర్పించాడు ఓ చిన్న హార్మోనియం వాయిస్తూ. ఒకటి పాడింది. పిల్ల నచ్చిందన్నారు. మిగతా విషయాలలో చెడిపోయింది. ఆ వార్త సంబంధం ముందు మాట్లాడిన నంబాచార్లు మోసు కొచ్చి తల్లికి చెప్తున్నప్పుడు తనలో విపరీతమైన ఆభిజాత్యం, రోషం బుసలుకొట్టాయి. ఆడపిల్లలను మొగపిల్లలు వచ్చి నఖశిఖపర్యంతం పరీక్ష చేసిపోవటం ఎందుకు ఆచారం కావాలి? రోజులు తిరగబడి మొగ పిల్లలనే ఆడవాళ్ళు పరీక్షచేసే కాలం వస్తే? ప్రతీకార వాంఛ మెదలింది - చిత్రంగా ఆలోచిస్తూంటే చెల్లాయమ్మగారొచ్చి అడుగుతూంది తల్లిని "సంబంధం కుదిరినట్టేనా?" అంటూ.

"ఆఁ కుదిరినట్లే -"

"మరి పెళ్ళెప్పుడు ?" అందా యిల్లాలు.

"అధిక మాసానికి ముందే అనుకుంటున్నాం. ఏడుకొండలవాడి దయతో ఆ మూడుముళ్ళూ పడితే... ?"

"ఆహా ! యిప్పటికే జాగయింది. తొందరగా చేసేయండమ్మా? ఈపాటికి యిద్దరు పిల్లల్ని కనాల్సిన వయస్సు" అంటూ దీర్ఘాలు తీస్తూ వెళ్ళిపోయింది చెల్లాయమ్మగారు. అంతలో కట్నం చాల దంటూ పిడుగులాంటి వార్త తెచ్చాడు నంబాచార్లు. అమ్మ వారం రోజులు అన్నహారాలు మానింది. ఆరోజూ తనకు నిద్రపట్టలేదు. రాత్రి చిత్ర విచిత్రమైన కలలు. మారిన రోజులు. ఆడపిల్లల ఆధిపత్యం - ఒక పెళ్ళికొడుకును తా నడిగింది 'పాడగలవా ?' అంటూ. పాడాడు. నచ్చలేదు పొమ్మంది. మరో పెళ్ళికొడుకును 'భరత నాట్యం వచ్చా ?' అని అడిగి, రాదని విని, తీసి పారేసింది. మరో చలిమిడి ముద్దను 'పప్పు రుబ్బటం వచ్చా ?' అంది. 'నీదగ్గర నేర్చుకుంటా ?' అన్నాడు ఆ అమాయకుడు సిగ్గుపడుతూ. 'గుర్రం దగ్గర స్వారీ చేయడం నేర్చుకుంటావా చిట్టి తండ్రీ, అంటూ పకపక నవ్వింది తాను. ఎందరో బ్రహ్మచారులు పిల్లలు దొరకక సంబంధాలు కుదరక బెండకాయల్లా ముదిరి ఎండి రాలిపోతున్నారు. కాషాయ వస్త్రాలు గట్టుకుని టిక్కెట్లు కొనకుండా హిమాలయాల్లోకి పోతున్నారు. విరగబడి నవ్వుతూ లేచింది నిద్ర. ఇంకా రాత్రి పది గంటలు కాలేదు. పూటకూళ్ళు తింటున్న గోపాలం యింకా భోజనానికి రాలేదు. అతన్ని చూస్తే ఈ మధ్య వళ్ళు మండిపోతూంది. కావాలని బాగా ప్రొద్దుపోయి వస్తున్నాడు భోజనానికి. గంటన్నర నంజుతాడు తనకేసి పిచ్చిచూపులు చూస్తూ. ఆ మధ్య ఏవో పిచ్చి మాటలు రాసి కవిత్వమంటూ హత్యచేస్తున్నట్లు భయపడుతూ తనకు

'చదివి అర్థం చేసుకోండి' అంటూ యిచ్చిపోయాడు. మర్నాడు రామనాథంముందే ఆ కాగితాలు తిరిగేస్తూ 'నాకేం అర్థం కాలేదు మీ కవిత్వం' అంది ముభావంగా.

"కవిత్వం ఏమిటోయ్ ?" అన్నాడు ఆ మిడిల్ స్కూల్ హెడ్‌మాష్టారు రామనాథం.

"భావ కవిత్వం" అన్నాడు మెలికలు తిరుగుతున్న గోపాలం.

"నీకింకా పెళ్ళి కాలా ?" అన్నాడు రామనాథం.

"లేదండీ" అన్నాడు వంగిపోతూ గోపాలం.

రామనాథం ఆ కవిత్వం చదివి నిప్పులు తొక్కినట్లు చిందులు వేస్తూ "ఇలాంటి పిచ్చివేషాలు వేస్తే వళ్ళు హూనమౌతుంది జాగ్రత్త" అంటూ కేకలు పెట్టాడు. ఆరడుగుల గోపాలం అమాంతం మాష్టారి కాళ్ళమీద పడి శరణు వేడుకుని క్షమించమన్నాడు. క్షమాశక్తితో మొద్దుబారిపోయిన రామనాథం ముసిముసి నవ్వులు నవ్వుతూ "నీ వయసులో ఇంతకంటె ఘాటుగా ప్రేమలేఖలు వ్రాసినవాణ్ణేలే" అంటూ సముదాయించి, "ఒకసారేమైందనుకున్నావ్ ! అప్పటికింకా ఇరవై ఏళ్ళు. జొన్నకుర్రు జమీందారుగా రమ్మాయికి ట్యూషన్ చెప్తున్నా. ఆ అమ్మాయి అంటే ఏమిటనుకున్నావ్ ? ఏ కవులూ వర్ణించలేరనుకో. మంచినీళ్ళు త్రాగుతూంటే ధార కనిపించేది గొంతులోంచి! ఓ పెద్ద ఉత్తరం రాశా. ఇవ్వటానికి భయం వేసింది. చివరకు న జ భ జ జ జరేభ లన్నీ చదివి చంపకమాలలు అయిదు రాసి పంచరత్నాలంటూ ఆమె స్లిప్పర్లమీద పెట్టా. చదివిందిట రాత్రి. మర్నాడు గుర్రంతోక జడ వేసుకొని, జంపర్ చోళీ వేసి, దేవకన్యలా ముస్తాబై వచ్చింది ట్యూషన్‌కి. పాఠం చెప్పటం ప్రారంభించా. వరూధిని ఘట్టం బయటకు లాగి 'అట జని కాంచె భూమిసురుడు'

అంటూ యమన్ రాగంలా గొంతెత్తా. వళ్ళంతా కళ్ళు చేసుకొని మెరపుతీగలా కదిలి బావురుమంటూ నిట్టూర్చింది. ఆ ఉద్రేకంలో తెలియక అధరామృతానికై అర్రులు చాచా. నా పద్యం అలారంలా మ్రోగడంతో మేడమీద దుబ్బు మీసాలకు పదును పెడ్తూ తిన్నది అరగటానికి పచార్లు చేస్తున్న జమీందారు రాయణింగారు కొరడాతో ఒక్క చురక అంటించారు. 'ఏమిటి వాగుతున్నావ్ ?' అన్నారు. 'ప్రేమ! - వరదల్లా పొంగుతున్న పవిత్ర ప్రేమ!'- అన్నాను. తుపాకి గురిపెట్టారు. గుండె పగిలినంతై, నీ పిందాక నా ముందు ఎలా శరణుజొచ్చావో అలాగాక, యింకా హుందాగా చేతులు మోక రించి 'మేం ప్రేమైకజీవులం - వేరుచేయకండి' అన్నా. కాని ఆ కఠిన శిల కరగలేదు. ఆ వూరునుంచి పొమ్మన్నారు. విధిలేక వచ్చేశాను." అంటూ నిట్టూర్చాడు రామనాథం.

"ఆ జమీందారుగారి కూతురేమైంది?" అన్నాడు ఉత్కంఠతో గోపాలం.

"ఏడుగురు పిల్లలు."

"ఏమిటి ?"

"మరో కీచకుణ్ణి పెళ్లాడి, నన్ను పూర్తిగా విస్మరించి వాడితో సంసారం చేస్తూ ముసలిదై పోయింది. మొన్న చూశా. ఛా - ఈ మనిషి నేనా ఆనాడు నేను ప్రేమించింది ? అనిపించింది."

ఈ జ్ఞాపకాలు కదులుతున్నాయి కల్యాణి మనస్సులో. తన చుట్టూ ఏదో పంజరం వుంది. అది కనిపించని ఖైదు. ఆశలనూ, కోర్కెలనూ లోపలకు రానీయని పాతాళ గృహం. చీకటి - కటిక చీకటి. చలి - నరాలు కొరికే చలి - మూలుగుతున్న ఆశలు. సలసల పొంగుతున్న పాలు ఒక్కసారి గడ్డకట్టినట్లు వేడెక్కి వాడెక్కిన తన హృదయం ఎందుకు గడ్డగట్టి మొద్దుబారింది. కన్నీటితో తడిసి చివికి

ఏమైంది ? అర్ధరాత్రి అయినట్లనిపించింది. యింక గోపాలం భోజనానికి రాడు. ఇంత రాత్రివేళ వచ్చినా తాను తలుపు తీయగూడదు. చనువు యిచ్చినకొద్దీ నెత్తి నెక్కుతున్నారు. తన మీద ఎందుకీ వ్యామోహం జనానికి? ఎందుకా వెకిలిచూపులు ఆ వెర్రిమొహాలకు ? తలుపులు వేసి వచ్చి పడుకుంది. దుప్పటి చినిగిపోయింది. కంబళీ పరుపు క్రిందది తీసి కప్పుకుంది. గుచ్చుకుంటూంది. వళ్ళు విరుచుకుంది. చిత్రమైన ముళ్ళలాంటి కంబళీ.... తలుపులు బాదుతున్నారు ఎవరో. గోపాలమై వుంటాడనుకుని పడుకుంది వినిపించుకోకుండా. యింకా దబదబ కొడ్తున్నారు బలంగా. గోపాలం కాదు. అతనికి అంత గట్టిగా తలుపులు కొట్టడం గూడా చేతకాదు. లేచింది. రెండడుగులు ముందుకు వేసి "ఎవరూ ?" అంది.

"మాది ఏలూరండి."

"ఏం కావాలి ? ఎవరికోసం ?" అయోమయంగా అడిగింది.

"కరుణాకరంగారి కాలు విరిగిందండి. తలకూడా పగిలిందట."

తలుపులు తీసి "ఏమైంది ?" అంది.

"ఆయన కారు లారీకి ఢీకొట్టుకుందండి. హాస్పటల్‌లో వున్నారు. పోయేముందు మిమ్మల్ని చూడాలంటున్నారు. తీసుకు రమ్మని కారు పంపారు."

కల్యాణి మనస్సు కకావికలయింది. "పదండి ప్రాణానికి ఏం భయం లేదుగదా ?" అంటూ తలుపులు తాళం గూడా వేయకుండా కారులో ఎక్కి కూర్చుంది. శరవేగంతో పోయింది కారు. బయట గాఢాంధకారం - క్షణాలు యుగాలై పేరుకుంటున్నాయి.

ముందు సీటులో డ్రైవరు కాక యిద్దరు కూర్చున్నారు. వాళ్ళ ముఖాలు గూడా కనిపించటంలేదు. కారు ఎగిరెగిరి పడుతూంది.

ఒకచోట ఆగింది ఏదో అడ్డం వచ్చి. తలెత్తి చూడటానికి ప్రయత్నిం చింది. కారులోని ఇద్దరు దిగి వెనక్కి తోస్తున్నారు. కళ్ళు తుడుచు కుంది. అది రోడ్డుకాదు. చుట్టూ పొలాలు. తాటి తోపులు. బళ్ళు నడిచే డొంకమీద కుంటుతూంది మూలుగుతున్న కారు.

"ఆపండి" అంటూ కేక పెట్టింది.

నవ్వుతున్నారిద్దరూ.

"ఎవరు మీరు ?" అంది పగిలిన గొంతు.

"కొంచెమాగు తెలుస్తుంది" అన్నాడొక రాక్షసుని పోలిన ఆకారం దగ్గరకొచ్చి వెనక సీట్లో కూర్చుంటూ. ఆ క్షణంలో అన్ని ఆలోచనల్నీ మరిచిపోయింది తన పరిస్థితిని తలుచుకుని. ఆ ఆకారం మొహంమీద మొహం పెట్టి ఏదో ప్రేలుతున్నాడు. గుప్పుమంది వాసన. ఎలుగుబంటి ప్రక్కన కూర్చున్నట్లుంది. చెదరిపోతున్న గుండెలను కూడగట్టుకుంది. "ఏంచేస్తారు నన్ను ?" అంది మళ్ళీ.

"అంత తొందరెందుకు. అక్కడకు జేరనీ" కొండలు పగి లేలా నవ్వాడు. ఆ నవ్వు వినడానికి ఆ చుట్టుపట్ల మరొకరు లేరు. పరిస్థితుల్ని ఎదుర్కోవాలి. మరో మార్గం లేదు. కారు ఆగింది ఓ పాడుబడిన సత్రం ముందు.

"మీ సత్రం బావుందా ? మా సత్రం బావుందా ?" అన్నాడు మరొకడు లోపలనుంచి వచ్చి తలుపు తీస్తూ.

గుర్తు పట్టింది.

రంగదాసు.

"నువ్వా ? ఏంచేద్దామని ఈ ఘోరం" అంది ఏడుస్తూ.

"లోపలికి నడు" అంటూ గర్జించాడు.

వెనకాతల రెండు పిశాచాలు కనిపించాయి. అంధకారాన్ని చీల్చుకుంటూ ఎగురుతున్న నక్షత్రాల మాదిరి మిణుగురు పురుగులా ఆమె ఆగింది. రంగదాసు రెక్కపుచ్చుకు గుంజుకుంటూ ఆమెను లోపలకు లాగుకుపోయాడు. ఆ మహా నిర్మాణం ఎన్ని శతాబ్దాల క్రితం ఎవరు కట్టారో ఎవరికీ తెలియదు. కాని ఒకానొక కాలంలో అక్కడ గొప్ప వూరుండేదనీ, కొరివిదయ్యాలు ఆ ప్రాంతంలో విజృంభించి గృహదహనాలు ప్రారంభించడంతో, భయపడిన ప్రజలు పారిపోయి ప్రాణాలు చేతపట్టుకు వలసపోయారనీ ఒక కథ వుంది. ఈ విచిత్ర గాథలో ఉపాఖ్యానాలుగా శత సహస్రకోటి కథలు ప్రచారంలోకి వచ్చాయి. ఆ సారవంతమైన దయ్యాల లంక పాడుబడి శతాబ్దాల తరబడి నిర్జన ప్రాంతంగా నిలిచిపోయింది. తర్వాత భూపతిరెడ్డి అనే నాస్తికుడు దేముళ్ళను తిడుతూ ఆ దయ్యాల లంకను ఆక్రమించుకొని, పట్టాలు సంపాదించి, వ్యవసాయం సాగించి, ఓ వంద కుటుంబాలకు ఆ ప్రాంతానికి మూడుమైళ్ళ దూరంలో పాకలు వేయించి భూస్వామిగా మారిపోయాడు. ఆ తర్వాత ఆయన బిడ్డలు ఆరుగురూ ఆ సుక్షేత్రాన్ని పంచుకోగా, కొందరు తెగ నమ్ముకుని పట్నాలు జేరారు. ఏమైనా ఆ ప్రాంతమంతా సస్య శ్యామలంగా మారినా, దయ్యాల భయం మాత్రం పోలేదు. ఆ దయ్యాల లంకలో ఆ పాడుబడిన సత్రంలో అ నరరూప రాక్షసుల కైపులో తన భవిష్యత్తును ఊహించలేక, తడబడి క్రిందపడి, ఎదురు దెబ్బ తగిలి, కాలివేంట కారుతున్న రక్తాన్ని కిర్సనాయలు దీపపు మసక వెలుతురులో చూసుకుని తల్లెత్తింది. మాంసం మాడిన వాసనతో తల తిరిగింది. ఆ పెద్ద హాలులో గబ్బిలాలు నిద్రపోతున్న మూలలు మసక మసకగా మెరుస్తున్నాయి. తలుపులు గడియలు పెట్టి కుండలు ఖాళీ చేస్తున్న కసాయివాళ్ళను చూసి 'ఏమిటీ దుర్గతి భగవాన్' అంటూ రోదించింది. ఎడమ ప్రక్కగా ఒక ద్వారం వుంధి

ఆవల ఏముందో? అనుకుంది. ద్వారానికి తలుపులున్నాయి. పారి పోతే - కోపంతో వళ్ళు మండింది. రోషంతో బుసలు కొట్టింది. దుఃఖాన్ని మింగి "రంగదాసూ!" అంటూ కేక పెట్టింది. తూలు కుంటూ వస్తున్న అతని చేతిలోని కల్లుముంత క్రిందపడింది.

"ఏమిటిది ?" అంది కఠినంగా.

"పగ" అన్నాడు పెదిమలు వణికిస్తూ.

"ఎవరిమీద ?"

"రాజారావుగాడు. సన్నాసి పీనుగ - నన్నుకొడ్తాడూ ? ఆడి నెత్తురు తాగుతా - రంగదాసు తడఖా....".

"రాజారావు నిన్నుకొత్తన్నాడని నన్నెందుకు హింసిస్తావ్ ?"

"ముందు నిన్ను - తర్వాత రాజారావును - ఆడూ నువ్వూ ఒకటే గదుటే. వస్తా వుండు."

"ఆగు."

"తొందరపడకే బుల్ బుల్ - కాస్త కైపెక్కనీ" అంటూ పర్వతంలా మిగిలిన రాక్షసులదగ్గరకు పోయి చతికిలబడి 'తొందర పడుతూంది రవ్వ' అంటూ బిగ్గరగా నవ్వడం మొదలుపెట్టాడు.

మరికొంచెంసేపు మానవత్వాన్ని మరిచిన ఆ పశువుల్ని చూస్తూ, వారిలో ప్రకోపిస్తున్న రాక్షసత్వాన్ని తలుచుకుంటూ అలాగే కూర్చుంది. గబ్బిలాలు కిచకిచలాడుతున్నాయి. కిటికీలోంచి గుబురు గుబురుగా చీకట్ల ముసుగులో నిద్రపోతున్న చెట్లు కనిపించాయి. జర జర కదిలిం దేదో. నాగుపాము - నల్లత్రాచు - దగ్గర కొస్తూంది. భగవంతుణ్ణి వేయివిధాల ప్రార్థించింది. పొగిడింది. 'ఆ దయామయునికి నా అవసరం తెలుసు' అనుకుంది తూలిపోతూ. కాని ఆ అలికిడికి పరుగెత్తింది పాము ఆ రాక్షసులున్న

మూలకు. దాని కోరల్లో విషం చాలదూ వాళ్ళ తలలకెక్కిన హాలా హలాన్ని మింగటానికి ? వారి మధ్యకు పోయిందది. ఎగిరి లేచాడు రంగదాసు. 'పాము' అరిచిందో గొంతు. 'నల్లత్రాచు' మరో కేక. బుసలుకొడ్తూ మెరుస్తున్న పడగ కనిపించింది. రంగదాసు నిలబడి కాలెత్తి తొక్కాడు. రాక్షసు లిద్దరూ దూరంగా పోయి దాక్కు న్నారు. 'ఎంత పొగరు దానికి. దెబ్బకు చచ్చింది' అంటూ ముంత కోసం వెతుక్కుంటున్నాడు రంగదాసు.

# పదహారు

చివరి ఘడియల్లో ఎవరికి ఏ మనిషి అవసరమో, ఎవరు ఏ మనిషి గుండెల్లోని ఆర్ద్రస్పందన విని కన్ను మూయాలనుకుంటారో, తన కోసం చెమ్మగిల్లిన కనులను చూసి చివరి ఊపిరి వదిలిపెట్టాలనుకుంటాడో ఎవరు చెప్పగలరు? ఎవరు పోల్చుకోగలరు? రంగదాసు ఆడిన కపటనాటకంలో ఒక అల్పమైన సత్యలేశం దాగివుందని అతనికి తెలియదు. చివరి ఘడియల్లో కల్యాణిని చూడాలని ఆరాటపడిన ఒక మనిషి కరుణాకరం కాదు, రాజారావు. ఉదయాన్ని చూడననే భావం కలిగి ఒక ఉప్పరి కుర్రవాణ్ణి పిలిపించి ముత్తెంకు కబురు చేశాడు. పరుగు పరుగున పోయాడు ముత్తెం. రంగదాసు పంపిన వస్తాదులు దౌర్జన్యంతో కల్యాణిని ఎత్తుకుపోవాలని వచ్చి 'ప్రాణం పోయేముందు మిమ్మల్ని చూడాలంటున్నాడు' అని చెప్పిన క్షణంలో సరిగ్గా రాజారావు అదేమాట చెప్తున్నాడు ముత్తెంతో. మనుష్యుల మనస్సుల్ని దూరంచేస్తున్న శక్తులెన్ని? మనిషిలోని రాగద్వేషాలు, విషరోషాలు, అహంకారాలు, నయవంచనలు, దురభిమానాలు - ఇవన్నీగాక, ఇంకెన్ని బహిరశక్తులు దురదృష్టాలని చిలకరించి ఏకం కావలసిన మనుష్యులమధ్య అభేద్యమైన అడ్డుగోడలు కట్టటంలేదు? ప్రాణస్నేహితుణ్ణి వంచించిన మనుష్యులుండవచ్చు. రెండు చేతులా డబ్బు సంపాదిస్తూ దారిద్ర్యపు అగ్నిగుండంలో తనకు జన్మమిచ్చిన తల్లిదండ్రుల్ని కాల్చి భస్మంచేసిన తనయులుండవచ్చు. పాపపుణ్యాలెరుగని పూవులాంటి కన్నెమనస్సులోని మకరందాన్ని త్రాగి వాడిపోయిన పుష్పాన్ని నేలరాచిన పాపండ్లుండవచ్చు. కన్నబిడ్డల్ని పీక నులిమి చంపిన కిరాతకులుండవచ్చు. సుదీర్ఘమైన మానవాళి

విచిత్ర చరిత్రలో వింతలకు తక్కువలేదు. కాని ఈ పిశాచ లస్యాలకు కారణం ఏదో ఒక స్వార్థం మనిషిలోని మనస్సును హరించి మానవత్వాన్ని హరించడం - ఈ దురదృష్టాలకు కారణం మనిషి. కాని మానవసంకల్పం రాకుండా ప్రయత్నం లేకుండా ఎన్ని సృష్టి శక్తులు విషాదనీరదాలను సృష్టించటంలేదు లోకంలో- జీవితంలో ?

రాజారావు మాట విని, మూలుగు విని, ముఖమండలంలో కారుమేఘాల మాదిరి అలుముకున్న దైన్యం చూసి ముత్తెం జాలిగా "బాబూ! ఆమెగారు యిక్కడకు రావడం మంచిదికాదు. ముందు మీ ఆరోగ్యం విషయం చూసుకోండి - నేను పలూరుపోయి డాక్టరును పిలుచుకొస్తాను. ఎన్నివేలైనా ఖర్చుపెట్టటానికి కరుణాకరంగారున్నారు. దేముడు చల్లగా చూస్తే కల్యాణమ్మగారెక్కడికీ పోరు" అంటూ పరుగెత్తాడు.

"దాహంరా రాజా" అంటూ కేక పెట్టింది ముసలమ్మ.

రాజారావు నిమ్మదిగా శక్తినంతా కూడబెట్టుకుని గ్లాసుతో నీళ్ళు తీసుకుపోయి తల్లికి పట్టాడు. "కోడలిని ఎప్పుడు తీసుకొస్తావురా రాజా ?" అంది ముసలమ్మ మూలుగుతూ. జవాబు చెప్పే ఓపిక గూడా లేకపోయింది రాజారావుకు. పడుకున్నాడు మళ్ళీ. నిద్ర పట్టలేదు. గుండెల్లో అడవిమంటలాంటి బాధ. ఆ మంటల్లో దగ్ధమౌతున్న మనస్సు - అన్నయ్యను చూడాలనిపించింది. వదినచేతి అన్నం తినాలనిపించింది. ఊళ్ళో అయినవాళ్ళందరికీ పెద్ద విందు చేయాలనిపించింది. తండ్రి సగం ఆస్తి ఇటువంటి సంబరాలతోనే తగలపెట్టాడు. పట్టుపంచ కట్టుకొని, నడుముకి ఉత్తరీయం చుట్టుకొని. కోలాహలంగా పదిమందికి అన్నం వడ్డించటం ఆయనకు సరదగా వుండేది. కాని, తాను పిలిచినా ఎవరూ రారు. అందరి మీదా ఎంతో కాలం కోపం వచ్చింది. కాని ఇప్పుడది చల్లబడిపోయింది. తనలో

ఏదో లోపం వుంది. ఏదో తప్పు చేశాడు. ప్రపంచం క్షమించలేక పోయింది. కాని ఇప్పుడు ప్రపంచాన్నంతా క్షమించాలనిపిస్తూంది. అందిరినీ చివరిసారి కౌగలించుకోవాలనిపిస్తూంది. కాని తనను ఆదరించేదెవరు? తనకేదో జరుగుతూంది. రెండుప్రక్కల నుండీ తగలబడిపోయి కరిగిపోయి కాలిపోయిన మైనపు వత్తిలాటి జీవితం. ఏదన్నా జరిగితే? అమ్మ ఏమౌతుంది? ఎవరు చూస్తారు? అన్నయ్యకా ధైర్యం లేదు. పదిమందిచేతనూ సంప్రదాయకుడని గౌరవింప బడుతున్న పెద్దమనిషి అన్నయ్య. సంఘం పాడుకాకుండా, శిబిరంలో మలిననాయువులు ప్రవేశించకుండా కాపలాకాస్తున్న వస్తాదు వరదా చార్యులు. ప్రపంచానికి ప్రతినిధి. తన జీవితంలో వీఁన్. ఎన్ని ఆలోచనలు చిందరవందరగా కదులుతున్నా, అమ్మసంగతేమిటి? అనే ప్రశ్న వదిలిపెట్టటంలేదు. ఏ పరిస్థితులలోనూ తనకు తలుపులు తెరిచే వ్యక్తి ఎవరో తనకు తెలుసు. అమ్మను ఆమెకు అప్పజెప్పాలి. ఏదో ఆవేశం ఊపింది మనిషిని. లేచి సత్రం దగ్గరకు వెళ్ళాడు. తలుపులు బార్లా తెరిచి వున్నాయి. కల్యాణి ఆ అర్ధరాత్రి సమయంలో యింట్లో లేకపోవడం ఆశ్చర్యం కలిగించింది. పిచ్చి ఆలోచనలతో క్షణకాలం మనస్సు సుళ్ళు తిరిగింది. రావిచెట్టుదాకా నడిచాడు. మనస్సు ఏదో కీడును శంకించింది. తెల్లవారుఝాము కాకపోయినా కోడి కూసింది. రావిచెట్టు అరుగుమీద కూర్చుని పిచ్చిపాటలు పాడు తూంది ఉప్పరి మల్లమ్మ. ఆ పిచ్చిదాన్ని చిన్నప్పటినుంచీ చూస్తు న్నాడు. "ఎవరు వారు?" అంది ఊరికి తానే కాపలా కాస్తున్నట్లు. ఊళ్ళో అందరిక్షేమం దానికే కావాలి. రాజారావు మాట్లాడలేదు. "ఎవరు వారంటే మాట్లాడరేం?" అంది.

"నేను, రాజారావుని"

"ఎందుకొచ్చావ్?"

"గౌరమ్మగారి కల్యాణి కనిపించిందా ?"

"ఆ రెవరో రెండో ఝామున కార్లో ఎక్కించుకు పోయారుగా !"

రాజారావు అనుమానం పదింతలయింది. అది పిచ్చిది. ఎన్నో ప్రశ్న లడిగాడు. కాసేపు తెలివిగా మాట్లాడుతుంది. అంతలోనే పిచ్చి ఊపు వస్తుందేమో పకపక నవ్వి పాడుకుంటూ పడుకుంటుంది. ఎప్పుడో మొగుడు దాన్ని వదిలిపెట్టి రంగూన్ పారిపోయాట్ట. దానికి పిచ్చెక్కింది. ఎవరు ఏపని చెప్పినా చేసిపెడుతుంది. పట్టెడన్నం పెడితే వెర్రిగా నవ్వుకుంటూ తింటుంది. పెట్టమని మాత్రం ఎవరినీ అడగదు. ఆ కాలువగట్లూ పొలాలూ, రావిచెట్టు అరుగూ, గడ్డివాముల దొడ్లూ అన్నీ దాని నివాసాలే. విహార ప్రదేశాలే. దయ్యాల భయం లేదు. పాములంటే సరదా. చెట్టెక్కి కూర్చొని దోవన పోయేవాళ్ళని కెవ్వున కేకపెడ్తుంది. రాజారావు ఎన్ని ప్రశ్న లడిగినా ఏదో వాగుతూందేగాని సూటిగా సమాధానం చెప్పదు. విసుగొచ్చి వెర్రిగా నడుస్తున్నాడు రోడ్డు మీదకు.

"బుల్లోడా" అంటూ కేక పెట్టింది మల్లమ్మ.

"గౌరమ్మగారి కల్యాణేనా ?"

"కారటు వెళ్ళింది. అటు పుంతలోకి తిరిగింది. అయినా ఆవిడగారితో యిప్పుడు నీకేం పని ?" అంది కోపంగా.

రాజారావు అనుమానం బలపడింది యింకా. అలాగే రొప్పుకుంటూ రోడ్డుమీదకు నడిచి పుంతలో ముందుకు సాగాడు. కాలవ గట్టున మేదరివాళ్ళ గుడిసెలున్నాయి. వాళ్ళు "ఒకారు అటు దయ్యాల లంకలోకి వెళ్తుంటే చూశాం" అన్నారు.

"లోపలనుంచి కేకలు వినిపించాయి గూడా" అన్నాడు మరొకడు.

"కారులో ఎవరెవరున్నారు ?" అన్నాడు రాజారావు.

వాళ్ళు సరిగ్గా చూడలేదు. ముందుకు నడిచాడు తొందర తొందరగా. రోగం మాయమైనట్లనిపించి వెర్రిబలం వచ్చింది. అలా ఎంతసేపు నడిచాడో తెలియదు. సత్రంలో వెలుతురు కనిపిస్తూంది. మరికొంత ముందుకు నడిచాక కారు కనిపించింది. గుండెలు తంద రించాయ. లోపల మాటలు వినిపించాయి. అడుగు పెట్టగానే అక్కడ కనిపించిన దృశ్యాన్ని చూసి నివ్వెర పోయాడు. రంగ దాసును గుర్తుపట్టాడు. తక్కిన రెండూ చూసిన ముఖాలే. ఆ వూరి వాళ్ళుమాత్రం కాదు.

"రంగదాసూ" అంటూ కేక పెట్టాడు.

అదిరిపడ్డారు ముగ్గురూ.

"ఏమైంది కల్యాణి ?"

"నీ కెందుకురా గాడిదా - గుద్దుకు చస్తావ్" అంటూ మీద మీద కొచ్చాడు రంగదాసు. రాజారావు చేతనున్న పొడుగాటి బ్యాటరీలైటుతో రంగదాసు నెత్తిమీద బాది "ఇదివరకోసారి ఈ దెబ్బ చూశావు, అప్పుడే మరిచిపోయావుట్రా" అంటూ మీద కురి కాడు. పెనుగులాట జరుగుతూంది. ఆ పాడుబడిన సత్రం మృత్యు దేవి నృత్యవేదికగా మారింది. 'రాజా' కేక వినిపించింది కల్యాణి గొంతు. త్రాగిన మైకంలో ముగ్గురూ తూలుతున్నారు. 'ఇటు - ఈ గదిలో' అంటూ అరిచింది మరోసారి కల్యాణి. ఆ తర్వాత క్షణ కాలంలో కల్యాణి తలుపు తీయడం - రాజారావు లోపలికి దూకడం-మళ్ళీ లోపల తలుపు గడియ పెట్టటం జరిగింది. ఈ పెనుగు లాటతో ఆ ముగ్గురి మత్తూ చాలా దిగిపోయింది. 'బయటకు రారా చవట పీనుగా' అంటూ జబ్బలు చరుస్తున్నాడు రంగదాసు. బయ టకు వస్తే జరగబోయేదేమిటో రాజారావుకు తెలుసు. తలుపు కేసి

చూశాడు. చాలా దృఢంగానే వుందని సంతృప్తి పడ్డాడు. లోపల చీకటి గుండ్రటి కన్నాలుమాత్రం వున్నాయి రెండు. క్రింద రాతి బండలు పగిలి చిందరవందరగా వున్నాయి. దుర్భరమైన దుర్గంధం. అలాగే కూలబడ్డాడు క్రింద. శక్తి నీరసించింది. మూలిగాడు. కల్యాణి లాలనగా 'ఎంతపని చేశావు రాజా' అంటూ కళ్ళు తుడుచుకుని, వళ్ళో అతని తల పెట్టుకు నిమిరింది. చెమటలు పట్టి వళ్ళంతా తడిసి పోయింది. "ఏం జరగలేదుగదా ?" అన్నాడు.

"భగవంతుని దయవల్ల ప్రమాదం జరగలేదు. కాని ఈ పరిస్థితిలో నువ్వు ఇంతదూరం నడిచివచ్చావా రాజా ఈ రాక్షసుల దగ్గరకి" అంది అతన్ని హత్తుకుంటూ. బయట వాళ్ళు ముగ్గురూ చాలా సేపు తిడుతూ, తలుపులు బాదుతూ రభస చేస్తున్నారు. తలుపులు బ్రద్దలు కొట్టటానికి ప్రయత్నించారు. వారి చేతకాలేదు. అలా గడిచింది. చిత్రమైన కాలం. పాపపుతెర తొలగినట్లు చీకటు పలచబడటంతో సన్నటి వెలుగు వచ్చింది గదిలోకి. బయట సవ్వడి మణిగింది. కారు బయలుదేరిన చప్పుడు వినిపించింది. లేచి కన్నంలోంచి చూసింది. వెళ్ళిపోతూంది కారు. అలిసిపోయిన రాజారావు నిద్రపోతున్నట్లు గోడకు జారగిలబడి కూర్చున్నాడు. బయట తలుపు గొళ్ళెం వేసిపోయారు ఆ రాక్షసులు. కేకలు పెట్టినా నరసంచారం లేదు వినటానికి. కొంచెం సేపయాక పరిస్థితి చెప్పి "ఎలా బయట పడటం ?" అంది కల్యాణి.

"బయట పడకపోతే ఏమౌతుంది ?" నీరసంగా ప్రశ్నించాడు రాజారావు.

"ఇలాగే యిక్కడ మురిగి చావగలమా యిద్దరం ?" అంది కల్యాణి.

## 18

"ఇద్దరం? - కాదు కాదు. అలా జరగటానికి వీలులేదు. కల్యాణీ! నువ్వు పదికాలాలపాటు సుఖంగా బ్రతకాలి. నావల్ల జరిగిన అఘాయిత్యం చాలు. ఇంకా బుణపడే శక్తి నాకు లేదు. ఔను, ఎలా బయటపడటం" అంటూ తలుపును అటూ యిటూ చాలా సేపు కదిపి చూశాడు. లాభం లేకపోయింది. కన్నంలోంచి చాలాసేపు అలాగే చూస్తూ నిలబడింది కల్యాణి. ఎక్కడా మనిషి అలికిడి లేదు. కూలబడ్డారు మళ్ళీ యిద్దరూ. అలాగే వున్నారు మధ్యాహ్నంవరకూ. రాజారావు తలెత్తి చూశాడు. రాతిబండ మీద నిశ్చలంగా నిద్రపోతున్నది కల్యాణి. తల చిందరవందరగా రేగి పోయింది. దగ్గరకు జరిగి తల ముంగురులు సవరించాడు. కదిలింది అలలాగా. "రాజా!" అంటూ చేతిని పట్టుకుని హృదయానికి హత్తుకుంది.

మౌనంగా మాట్లాడుకుంటున్న మనస్సులో వేయిజన్మల స్మృతులు కదలి మెదిలినట్లనిపించి "కల్యాణీ - ఇలాగే కూర్చోవాలని ఉంటుంది నీదగ్గరే ఎప్పుడూ" అన్నాడు.

"నే వద్దన్నానా రాజా. అలాగే కూర్చో నీ మనసుతీరే దాకా. అదీకాక మనకు బయటపడే మార్గంకూడా లేదుగా."

ఈమాట అంటున్నప్పుడు కల్యాణి కళ్ళు మెరిసాయి.

"మళ్ళీ అల్లరి జరుగుతుంది. ఈ వెధవలు మరో దుమారం లేవదీస్తారు."

"జరగవలసిన అల్లరంతా యింతకుముందే జరిగిందిగా రాజా. యింకా జరగవలసిందేముంది?"

---

# పదిహేడు

సరిగ్గా అనుకున్నంతపనీ జరిగింది. మర్నాడు మధ్యాహ్నం రావిచెట్టుదగ్గర మళ్ళీ పంచాయితీ పెట్టించాడు రంగదాసు. వరదాచార్యులవారి వాగ్ధాటి అత్యద్భుతంగా పరిణమించింది. మున్సబు కూడా నివ్వెరపోయాడు. రంగదాసు కుండ బద్దలుకొట్టినట్లు కథలా సత్రంలో జరిగిన సంఘటనలను తలక్రిందులు చేసి చెప్పి "ఇది ఘోర మంటారా కాదా?" అని ప్రశ్నించాడు మహాజనాన్ని. వరదాచార్యులవారు అందుకొని "దీన్ని గురించి యింత సేపు తర్కించడం అనవసరమయ్యా. కామం వాళ్ళ కళ్ళను కప్పివేసింది. ఊళ్ళోనే సాగించారు యింతకాలం. మనం అభ్యంతరం చెప్తున్నామని బరితెగించి ఆ దయ్యాల లంకలోని సత్రానికి మకాం మార్చారు. యిలా ఎన్నాళ్ళనుంచి జరుగుతూన్నదో ఎవరికి తెలుసు. పాపం ఆ రంగదాసూ, ఈ హుసేనుసాయిబూ వాళ్ళూ చూశారు గనక సరిపోయిందిగాని. దీనికి – ఇది చాలా ఘోరం – ఏమిటి పరిష్కారం? ఏంచేయాలి వీళ్ళని? ఇలాటి పనులు సంసారాల మధ్య జరుగుతూంటే ఏమౌతుంది వూరు?" అంటూ సూటిగా ప్రశ్నించారు మహాసభను.

"యతీంద్రులవారుంటే బావుండేది" – మరొక గొంతు.

యతీంద్రులవారు సప్తాహాలు ముగించుకొని సపరివారంగా బొబ్బర్లంకలో మరో భక్త సమాజం ఆహ్వానం మన్నించడానికి లేచి చక్కాపోయారు.

"మాట్లాడరేం ?" అన్నారు వరదాచార్యులుగారు.

"ఇందులో ఏదో లిటిగేషను వుంది" అన్నాడు ము త్తెం.

"అంటే ?"

"అసలు ఈ సాతం చెప్తున్న రంగదాసూ, ఆ హుసేను సాయిబ్బా అర్ధరాత్రివేళ దయ్యాల లంకకు ఎందుకు వెళ్ళాల్సి వచ్చిందీ అంట ?"

"అది నీ కనవసరం" అన్నాడు రంగదాసు.

"అలా అయితే ఆ రాజారావుగారి గొడవకూడా మీ కనవసరమే. తిన్నది అరక్క యీ బండలమీద జేరి..." అంటున్న ముత్తెంను మందలించాడు మున్సబు.

"మున్సబుగారూ ! ఉన్నమాట చెప్తుండాను. అనవసరంగా రాజారావుగారి జోలి కొచ్చిన్రా తలలు పగులుతై. ఉప్పరిగూడెమంతా బిరిగీసి నిలబడుతుంది వూరిమీద. ముందే చెప్తుండా" అంటూ వెళ్ళిపోయాడు అక్కణ్ణించి. అందరూ జంకారు కొంత. రథోత్సవంలో బలాబలాలు చూసుకునే తరుణం వచ్చింది. అప్పుడే అర్థమయింది అందరికీ యదార్థ పరిస్థితి.

పైకి ఎవరు ఎన్ని మాటలు చెప్తున్నా లోలోపల ఎవరికీ తెగింపులేదు. అందరికీ బెరుకుగానే వుంది. చాలాసేపు తర్జన భర్జనలు జరిగినై. నేరం చేసినవారిని శిక్షించే శక్తి ఆ మహాసభకు లేకపోయింది.

"మొత్తం ఆ సత్రంలో ఒక రాత్రీ ఒక పగలూ వాళ్ళున్నారన్నమాట ?"

"దయ్యాల భయంకూడా వాళ్ళ కడ్డం రాలేదు."

"వ్యామోహమండీ వ్యామోహం. చింతామణి నాటకం చూడలా ? పాము తోక పుచ్చుకొని గోడ దూకడమంటే... కళ్ళు కనిపించవండీ."

"కామాతురాణాం న భయం న లజ్జా - ఏమన్నాడు మహానుభావుడు ? కామాంధకారంతో కన్నులు మూతపడిన కీటకాలకు లజ్జకాని భయంకాని వుండదన్నాడు."

"ఇంత జరిగినా ఆ హెడ్ మాష్టరు రామనాథంగారికి బుద్ధి లేదు."

ఈ విధంగా ఒక రసాత్మక చర్చ జరిగిందేగాని, ఎవరూ ఏ నిర్ణయానికీ రాలేకపోయారు. ముత్తెం సరాసరి కరుణాకరం దగ్గరకు వచ్చాడు. ఏలూరునుంచి తిరిగిరాగానే బడలికకొద్దీ భోంచేసి పడుకుని నిద్రపోయాడు కరుణాకరం. నిద్ర లేచేసరికి వాకిట్లో ముత్తెం కనిపించాడు. "ఏమిటి విశేషాలు ?" అని ప్రశ్నించాడు. అంతవరకూ జరిగిన కథంతా ఉన్నదున్నట్టు చెప్పాడు ముత్తెం. మౌనంగా విని, నిట్టూర్చాడు కరుణాకరం. కొంచెంసేపయాక "కొందరి జీవితాలు అంతే ముత్తెం. తమమీద తామే పగబట్టి చేజేతులా నాశనం చేసుకుంటారు బ్రతుకుల్ని. ఎందుకలా చేస్తున్నారూ ? అంటే చెప్పలేం. క్రమక్రమంగా ఆత్మహత్య చేసుకునే క్షుద్ర కీటకాలను ఎవరు రక్షించగలరు ? అంతమాత్రాన వారు వంచకులూ కాదు, దుర్మార్గులూ కాదు. వారిని చూసి ప్రపంచంలో కనీసం జాలిపడే వారు కూడా వుండరు."

కరుణాకరం కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. బాగా చీకటి పడింది. లైటు వేసుకోవాలనే గుర్తుకూడా రాలేదు ఎవరికీ ?

"కల్యాణి చాలా తప్పు చేసింది ముత్తెం" అన్నాడు కొంచెంసేపయాక కరుణాకరం.

"ఏమో బాబూ. నాకు నమ్మబుద్దెయ్యడంలేదు. ఏదో పాడు పని చేయడానికి వాళ్ళు అంతదూరం దయ్యాల లంకకు పోయా

రంటే నమ్మలేకపోతున్నా. ఏదో కారు తిరిగిందట వూళ్ళో చీకటి పడ్డాక. ఇందులో ఏదో రహస్యం వుంది బాబూ."

"అంతా అయోమయంగా వుంది. రవ్వంత మనశ్శాంతిని వెతుక్కుంటూ ఈ వూరొచ్చాను. అదీ లేకుండా పోయింది ఈ కల్యాణివల్ల. ఏదో భయంకరమైన దురదృష్టం ఆమెను వెన్నాడుతూం దనిపిస్తూంది. ఆ వరదల్లో కొట్టుకుపోతున్న మనిషిని ఎవరూ వడ్డుకు చేర్చలేరు. ఎవరన్నా ప్రయత్నించినా వాళ్ళూ మునిగిపోతారు నామరూపాల్లేకుండా. నే చేసిన పాపం నాకు తెలుసు ముత్తెం. ఒంటరితనాన్ని భరించలేక ఈ జీవిత కవాటాలను మొదటిసారి తెరిచాను కల్యాణికోసం. దాని పాపపు చీకట్లు మాత్రమే ప్రవేశిం చాయి లోపలికి నన్ను నాశనం చేయటానికి దురదృష్టంకంటె భయంకరమైన అంటువ్యాధి లేదు ముత్తెం. కల్యాణిని పట్టుకు పీడుస్తున్న మహామారి అదే అనుకుంటా. సాంగత్య దోషంవల్ల మొదట నాకే సంక్రమించాలి న్యాయంగా."

ముత్తెం లేచి లైటువేశాడు. ఎదురుగుండా మూలగా కుర్చీలో కూర్చొనివుంది కల్యాణి. సంబాళించుకుటూ "మీరు వచ్చి ఎంత సేపయింది కల్యాణమ్మగారూ!" అన్నాడు ముత్తెం.

"చాలాసేపయింది."

"నే చూడలేదు...."

"నీవు రాకముందే వచ్చాను ముత్తెం. కారేమయింది ?"

కరుణాకరం తేరుకుని "ఇంతసేపూ మాట్లాడకుండా కూర్చుండి పోయావేం కల్యాణీ? నువ్విక్కడున్నట్లే నాకు తెలియదు." అన్నాడు.

"ఆ సంగతి నాకు తెలుసు. నేనున్నానని తెలిసివుంటే ముఖం మీద అంత కఠినంగా మాట్లాడేటంత నిర్దయుడివి కాదు నువ్వు"

నిట్టూర్చాడు. తల రెండుచేతులతో పట్టుకున్నాడు.

"బాధపడకు కరుణా. నేను వినాలని ఆ మాట లనలేదు నువ్వు. ఆ సంగతి నాకు బాగా తెలుసు. నీ వ్యధ అలా అనిపించింది. నన్నేదో అన్నానని నువ్వు సిగ్గుపడటం అనవసరం. మనుష్యుల్లో కొందరు దేవత లుంటారంటారు. నీలో ఆ అంశ వుంది నీకు తెలియక పోయినా. నా దురదృష్టాలూ దౌర్భాగ్యాలూ నీకు సోకగూడదనే ఇంతకాలం వేయిదేముళ్ళకు మొక్కుకున్నా నేను. కాని ఒక సంగతి మాత్రం నీతో చెప్పాలని-"

వంటవాడు కాఫీ తేవడంతో ఆగింది. ముత్తెం మళ్ళీవస్తానంటూ వెళ్ళిపోయాడు ఏదో గుర్తుకువచ్చినట్లు. ఇద్దరూ కాఫీ త్రాగారు.

"ఏమిటి చెప్పు కల్యాణీ?"

"ఇదివరకు ఒకసారి యిలాగే నీ గదికి వచ్చి ఒక మాట చెప్పాను గుర్తుందా?"

"ఏమిటది?"

"నువ్వు మరిచిపోలేని మాట అది - నిన్ను ఈ వూరునుంచి వెళ్ళిపొమ్మన్నాను."

"ఔను."

"నువ్వు వెళ్ళలేదు - పది రోజులుండి మళ్ళీ తిరిగొచ్చావు."

"వెళ్ళలేకపోయాను."

"నాకు తెలుసు. వెళ్ళలేకపోయావు. అలా చేయటానికి నీకు శక్తి లేకపోయింది. నీకు తెలియకుండానే మనస్సు నిన్ను బానిసను చేసింది. ఔనా?"

"ఏమో..."

"ఇందులో దాచుకోవలసింది లేదు కరుణా. కాని ఒక విషయం గుర్తుంచుకో. మనస్సు నీకెలావుందో నాకూ అలాగే వుంది.

దాని స్వరూపం ఎంత అస్పష్టమైనదైనా, దాని ప్రభావం మాత్రం అల్పమైందంటావా? పసిపాపలా ఏడుస్తున్న మనస్సును పీక పిసికి చంపమంటావా చెప్పు? - ఇది తర్కానికీ కట్టుబాట్లకూ లొంగే సమస్యంటావా?"

"కానీ - కల్యాణీ - మాట వచ్చింది గనుక నా మనస్సులో మాట కూడా చెప్తున్నాను. నువ్వు చేసింది పొరపాటనిపిస్తోంది నాకు. ఇక్కడ సత్రంలో ఆ నాడు రాజారావు వచ్చి పడుకున్నాడు. ఎంత గొడవ జరిగిందో నీకు తెలుసు. మళ్ళీ ఎలా వెళ్ళారు ఆ దయ్యాల లంకకు? ఎందుకున్నారక్కడ? ఇది హైద్రాబాదూ మద్రాసూ కాదు. దిక్కుమాలిన పల్లెటూరు. ఎవరు ఏం తిన్నదీ ఏం కట్టుకున్నదీ అందరికీ కావాలి. ఇంత తెలివైన దానివి, నిగ్రహం కల దానివి, మూర్ఖంగా ఇలా ఎందుకు ప్రవర్తిస్తున్నావో - నన్నిలా ఎందుకు హింసిస్తున్నావో అర్థం కావడంలేదు."

"పోనీ కరుణా. ఎన్ని ఆరోపణలకని ఎందరి నిందలకని సమాధానాలు చెప్పను? ఎన్నింటికని బాధపడను? ఆ రోజు నిన్ను వెళ్ళిపొమ్మన్నాను. నీ దగ్గర శలవు తీసుకుందామని వచ్చాను. బహుశా యింక నీకు కనిపించనేమో."

"ఏమిటి? వెళ్తున్నావా? ఎక్కడికి?"

మౌనంగా బొటనవ్రేలితో నేలమీద రాస్తూ తలవంచుకు కూర్చుంది కల్యాణి.

"చెప్పు కల్యాణీ. ఎక్కడికి వెళ్ళాలని?" పగిలిపోయింది అతని గొంతు.

"ఈ ప్రపంచానికి దూరంగా. రేపు ఉదయం రైలుకే పోవాలని."

"ఎక్కడికి పోయినా ప్రపంచం ఉంటుంది కల్యాణీ."

"ఔను. కాని ఇది తెలిసిన ప్రపంచం, అది తెలియని ప్రపంచం."

కరుణాకరం ఆవేశాన్ని పట్టలేక లేచి ఆమె దగ్గరకు వెళ్ళాడు. నంబాచార్లుగారు లోపలకొచ్చి పడగవిప్పిన పామును చూసి భయపడినట్లు ఎగిరిగెంతి పారిపోయాడు బయటకు. కల్యాణి వచ్చిన వ్యక్తిని గుర్తుపట్టి, "కరుణా! నిన్ను బాధ పెట్టటానికీ, ఈ నిందా భారాన్ని నీకు పంచి పోవాడానికీ రాలేదు నేను. కళంకం లేని నీ జీవితాన్ని మలినం చేసేటంత శక్తి లేదు. నేనూ ఆలోచించాను కరుణా. మన అదృష్టాలు వేరు."

"కాదు కల్యాణీ. నువ్వు వెళ్ళటానికి వీల్లేదు. నేను ఎన్నటికీ అంగీకరించను."

"ఈ పులుల మధ్య నక్కల మధ్య, అడవి మంటలమధ్య నేను యింకా బ్రతకగలనంటావా కరుణా? బ్రతికినా ఆ బ్రతుకును భరించగలనంటావా? నా దైవం నన్ను శంకిస్తే ఏం చేయగలను? దేవాలయంలో కూర్చోగలనా?"

"కాదు. నేనూ వస్తాను నీ దగ్గరకు. నీతోపాటు."

కరుణ అశ్రుమలినమై పొగలు చిమ్ముతున్న అతని కన్నుల్లోకి చూసి "అలా కుదరదులే. వెర్రివాడివి కాకు. మండిపోయిన మంచు బిందువులో యింకా ఏం మిగిలింది కరుణా నీకు సేద తీర్చటానికి చెప్పు? తైలంలేక ఆరిపోయి కొడిగట్టిన వత్తికి నిప్పు తగిలితే ఏమౌతుంది ఆలోచించు, మసిగా రాలి గాలికి ఎగిరిపోవడంగాక? ఎంతకాలం, ఎంతదూరం వెన్నాడగలం ఎండమావులను? నేనెలా బ్రతకాలో ఎక్కడ బ్రతకాలో నాకు తెలుసు. కనీసం తెలుసుననుకుంటున్నాను."

"నువ్వు వెళ్ళిపోయాక నన్నేం చేయమంటావు?"

"నీకు సలహా చెప్పగల శక్తి నాకు లేదు కరుణా."

"నా ప్రార్థన మన్నించలేవా ?"

"క్షమించు కరుణా."

కరుణాకరం మంచంమీద కూలబడ్డాడు. కల్యాణి లేచివెళ్ళి అతని కన్నీరు తుడిచి "ఎందుకు నా గురించి అంత బాధపడతావు అనవసరంగా చెప్పు. నిన్ను బాధపెట్టటానికి రాలేదు నేను, ఒక విషయం చెప్పిపోదామని వచ్చాను." అంది లాలనగా చంటిపాపతో మాట్లాడుతున్నట్లు.

"ఏమిటది ?"

"రాజారావు యింకా ఎక్కువకాలం బ్రతకడు."

"ఆఁ... అలా జరగటానికి వీల్లేదు."

"పిచ్చి మనస్సు నీది. మనం అంగీకరించనంత మాత్రాన జరగవలసినవి జరక్కుండా పోతాయా. సరే - ఒకవేళ అది జరిగితే- అతనికో ముసలి ప్రాణం వుంది. ఆమె సంగతి ఎవరు చూస్తారో అర్థంకాక బాధపడుతున్నాడు. ఆ భారం నువ్వే భరించాల్సి వస్తుందని చెప్పటానికే వచ్చాను." అంటూ రెండడుగులు ముందుకువేసి "వస్తాను" అంది.

ఆమెకేసి అలాగే చూస్తున్న వాడు ఒక్కసారి లేచి "కల్యాణీ- ఆగు" అంటూ పెట్టెలోంచి ఒక పొట్లం తెచ్చి యిచ్చాడు.

"ఏమిటిది కరుణా ?"

"బహుశా-నీకు నే చేయగలిగిన చివరి సహాయం- తీసుకెళ్ళు."

"కరుణా ! నీ దగ్గర చాలా డబ్బుంది. నువ్వు యిస్తావు. కాని నేను ఎలా తీసుకోగలను చెప్పు. తీసుకున్నా ప్రతిఫలంగా నీకేం బదులివ్వగలను ?"

"వేరే ప్రతిఫలం కాదు. ఒక మంచి స్నేహితుడిచ్చే బహుమానంగా స్వీకరించు."

"ఎందుకీ ఆత్మవంచన కరుణా అన్నీ తెలుసుండీ ?"

"ఏమిటి ?"

"నువ్వంటున్న మాట నిజానికి ఎంతదూరమో నీకు తెలుసు."

"నన్ను శంకిస్తున్నావా కల్యాణీ ?"

"కాదు. ఉన్న విషయం చెప్తున్నాను. నా జీవిత గాథ నీకు చాలా తెలుసు కరుణా. దానితో నువ్వు రాజీ పడలేవు. నీ మనస్సులో మాట నీ నోటిగుండా బయటకు రాలేక కరిగి కళ్ళల్లోంచి తొంగి చూస్తున్నది చూడు. ఒకరినొకరం యింకా హింసించుకోవడంలో అర్థం లేదు. మగవాడివి, చాలా గొప్పపనులు చేసి పదిమందిని ఉద్ధరించవలసినవాడివి, అలా బెంబేలు పడకు. మరో మార్గం లేనప్పుడు తప్పకుండా నీ సహాయం అర్థిస్తాను నేనే స్వయంగావచ్చి."

"ఇప్పుడేముంది నీకు మార్గం?"

"స్పష్టంగా తెలియదుగానీ ఉండకపోదు."

కల్యాణి వెళ్ళిపోయింది.

# పద్ధెనిమిది

కల్యాణి వెళ్ళిపోయిన తర్వాత కిటికీలోంచి బయటకు చూశాడు కరుణాకరం. విడిపోతున్న శ్రావణ మేఘాలను చీల్చు కుంటూ విరియబూస్తున్నది పుచ్చపూవులాంటి వెన్నెల. కల్యాణి ఒక నాడు తనను భోజనంచేసి పొమ్మంది. ఆ ఆహ్వానాన్ని మన్నించి ఆతిథ్యం స్వీకరించలేకపోయాడు. 'మీ యింట్లో ఈ రాత్రి భోం చేస్తా' నంటూ ముత్తెంతో కబురు పెట్టాడు.

కబురు చెప్పి ముత్తెం వెళ్ళిపోయాక, ఏదో ఆలోచిస్తూ పర ధ్యానంలో మునిగిపోయింది కల్యాణి. లోపలనుంచి కేక వినిపించింది. రామనాథం భోజనం ముగించి మంచినీళ్ళకోసం పిలుస్తున్నాడు. వెళ్తూ "కల్యాణీ! ముందు తటపటాయించినా నువ్వు రమ్మన్నాక రాలేకుండా వుండలేకపోతున్నాను. ఈ వూళ్ళో వుండలేనంటు న్నావు నువ్వు. నిన్ను వదిలిపెట్టి నేను వుండలేనాయె - సరే పద పోదాం. రేపుదయం రెడీ. హైదరాబాద్‌లో మా శుద్రకుడికి చిన్న యిల్లు చూడమని వుత్తరం రాశా. చూద్దాం... ఆమాత్రం బ్రతక లేమా" అంటూన్న సమయంలో కరుణాకరం అక్కడకొచ్చాడు. భవిష్యజ్జీవితాన్ని పోల్చుకుంటూ అతని మాటలు వింటూ అస్పష్టంగా కనిపిస్తున్న మూర్తిలోని రూపురేఖలను గుర్తించటానికి ప్రయత్ని స్తున్న కల్యాణి కరుణాకరాన్ని చూడగానే త్రుళ్ళిపడింది. రామ నాథం సాదరంగా నిలబడి కరుణాకరాన్ని ఆహ్వానిస్తూ "అయ్యా! నేనే వచ్చి తమ దర్శనం చేసుకుందా మనుకుంటున్నాను. తమకు ఈ గొడవలన్నీ తెలిసే వుంటాయి. మీ చేతులమీదుగానే మా వివాహం జరుగుతుందనుకుని సంబరపడ్డాం. పరిస్థితులు విషమించ

టంతో హైదరాబాదు పోయి రిజిష్టరీ మారేజి చేసుకుందామని నిశ్చయించుకున్నాం. అయ్యా అదీ సంగతి. తమ ఆశీస్సులు ఎప్పుడూ కావాలనుకోండి." అన్నాడు నవ్వుతూ.

"రామనాథం! మీ ప్రయాణం ఎప్పుడు?" అన్నాడు కరుణాకరం.

"రేపు మధ్యాహ్నం బండికి" అన్నాడు రామనాథం.

"ఉద్యోగం మానేస్తున్నారా?"

"కల్యాణి ఎక్కువా? ఉద్యోగమా? అనే సమస్య వచ్చిందండి. ఆమెముందు నాకు ప్రపంచమంతా అల్పమనిపించిందండి. ఇలాటి వుద్యోగాలు వేలకువేలు సంపాదించవచ్చు. లక్షలకు లక్షలు డబ్బు గడించవచ్చు. కాని కల్యాణిలాంటి మనిషి ఎక్కడ దొరుకుతుందండి. అదీగాక ఎంత చచ్చినా నాటకరంగంలో రెండు దశాబ్దాల అనుభవమున్న ముండాకొడుకును గదండీ, ఇప్పుడు హైద్రాబాద్‌లో సినిమాలు తీస్తున్నారట. తమలాటి పెద్దల రికమెండేషన్లుంటే వేషాలు దొరక్కపోతాయా? అయ్యా తమ ప్రాణమిత్రుల్లో సినిమా ప్రొడ్యూసర్లేమన్నా వున్నారా?"

"లేరండీ."

"పోనీ యాక్టర్లు...."

"లేరండీ."

"ఫర్వాలేదులెండి, నాతో చిన్నప్పుడు బొబ్బర్లంకలో గోలీలాడుకున్న నంగివెధ వొకడు మాంచి పొజిషన్‌లో వున్నాడు. వాణ్ణి పట్టుకుంటా."

"రేపుదయం ఒకసారి రండి మా యింటికి పనుంది."

"చిత్తం."

"వెళ్ళిరండి."

"చిత్తం" అంటూ వెళ్ళిపోయాడు రామనాథం.

కొద్ది క్షణాల నిశ్శబ్దం తర్వాత "కల్యాణీ! అన్నం పెడ్తావని వచ్చాను. మొన్న నువ్వు పెడ్తానన్న రోజు నేను తినలేకపోయాను. ఈనాడు పిలవకపోయినా వచ్చాను అన్నాడు. కరుణాకరం.

కల్యాణి నవ్వుతూ "సంతోషం. నీలాగా పిలవకుండా వచ్చి తినిపోయేవాళ్ళు నాకుమటు కెవరున్నారు కరుణా. కాని అన్నం చల్లారిపోయింది. ఆవకాయుంది, చల్లున్నాయి. తినగలవా?" అంది.

వేమన శతకంలో పద్యం గుర్తుకొచ్చింది కరుణాకరానికి. అతను సత్రానికి రావడం ఎవరూ గుర్తించినట్లు లేదు. కరుణాకరం వస్తాడని తెలిస్తే యింకా ఎంతగానో చేయగలిగేది విందు. యింట్లో వెచ్చాలన్నీ నిండుకున్నాయి. ఆ సమయంలో ఏం చేయగలదు? కల్యాణి దొడ్లోకిపోయి అరిటాకు కోసి తెచ్చింది. పీట వేసింది. అదొక పెద్ద పీట. యాభై సంవత్సరాలు విశ్వపతి మాష్టారు ఆ పీట మీదనే కూర్చొని భోజనం చేశారు. ఆ సంగతి గుర్తుకు వచ్చి కల్యాణి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. అతను చూడకుండా వంటయింట్లోకి పోయి మౌనంగా గుక్కలుపట్టి యేడ్చింది. ఆవకాయ కలుపుకుని, కల్యాణి జాడలేక పిలిచాడు కరుణాకరం.

"కల్యాణీ - కారం మండిపోతూంది - కాస్త నెయ్యి...."

కళ్ళు తుడుచుకుని నవ్వుకుంటూ వచ్చి "లేదని ఎలా చెప్పను కరుణా? పావుకిలో తెచ్చా. వాళ్ళిద్దరికీ వారంరోజులనుంచీ రెండేసి గరిటెలు వేసుకుంటూ గడిపా ఎలాగో. తీరా నువ్వొచ్చేసరికి అయిపోయింది. చిత్రంగా లేదూ?"

"ఇందులో చిత్రమేముంది కల్యాణీ?"

"నీకు యివ్వటానికి నా దగ్గర ఏమీ మిగలటంలేదు."

"నువ్వు చాలా ఆకతాయివి కల్యాణీ! జీవితాన్ని గురించి నువ్వు ఏమనుకుంటున్నావో నాకు తెలియదు. దాన్ని ఒక ఆట వస్తువుగా భావిస్తున్నావేమో! నిర్లక్ష్యం చేయతగిన వస్తువు కాదది. దాన్ని గౌరవించటం నేర్చుకో."

"అది నా దురదృష్టం కరుణా. నాకీనాడు ఎవరూ మిగల లేదు దేనికీ. నిర్నిరోధంగా బుసలు కొడుతూ పరుగులుతీసే మహా ప్రవాహంలో కొట్టుకుపోతున్న అల్పప్రాణి ఏం చేస్తుందో తెలుసా? ఏ తృణాం కనిపించినా ఆత్మరక్షణకోసం, బ్రతుకుమీదగల తీపికొద్దీ దానిని పట్టుకొని వడ్డుకు చేరుకోవాలనుకుంటుంది. తల్లి నన్ను అర్థం చేసుకోలేదు. కన్న తండ్రి అర్థం చేసుకోలేదు. స్త్రీ జీవితాన్ని తరించే పురుషుడనుకున్న వ్యక్తి అర్థం చేసుకోలేదు. తల్లి తండ్రుల స్థానాన్ని ఆక్రమించిన మిత్రుడనుకున్న దైవం కూడా నన్ను దగా చేస్తే, నేనేం చేయగలను చెప్పు?"

కరుణాకరం త్రుళ్ళి పడ్డాడు. కల్యాణి చేస్తున్న నేరారోపణ ఎవరిమీదనో అర్థమై కంపించాడు. ఏదో చెప్పాలనుకున్నాడు. పెదవులు కదలక గొంతుక పెగలక నివ్వెరపోయాడు. ఆ మౌనాన్ని భరించలేకపోయింది. 'మౌనం' వేయి గొంతులు చాచి మాట్లాడుతుందని గ్రహించింది మళ్ళీ.

"నువ్వింకా ఎందుకు పెళ్ళి చేసుకోలేదు కరుణా?"

"నీకు ఆ విషయం తెలియదా?"

"కొంత తెలుసు."

"మరి?"

"పూర్తిగా నీ నోట విందామని"

"వినడం వల్ల నీకు కలిగే ప్రయోజనం ?"

"జీవితంలో - ఎంత పాపిష్ఠి జీవితంలోనైనా స్వార్థాన్ని మించింది లేదంటావా కరుణా ? నా మంచి చెడ్డలమీద నీకున్న వ్యామోహంలో పదోవంతు నాకుండటం తప్పంటావా ? ఒకసారి పరోక్షంగా ఇదే ప్రశ్న అడిగాను నిన్ను. నీకర్థమయిందో లేదో తెలియదు. సమాధానం మాత్రం రాలేదు. కాని ఇది చివరి కోరిక అనుకోవడంలో తప్పులేదు. ఎందుకు చెప్పవ్ సమాధానం ? నా కోరికను చెల్లించే బాధ్యత నీకు లేదంటావా ?"

కరుణాకరం మాట్లాడలేదు.

"చెప్పవా కరుణా ?"

"చెప్తాను కల్యాణీ. నీకు తప్పకుండా చెప్తాను. అదొక పెద్ద కథ. నువ్వు హైదరాబాద్ వెళ్తున్నావ్. అక్కడ నీకు తెలిసే అవకాశముంది. చాలా పుకార్లు వింటావు నా గురించి. ఆ పొట్టంతా ఎగరవేస్తే నిజం బయట పడుతుంది."

"ఏమిటది ?"

"నీకు అభ్యంతరం లేకపోతే మరోసారి హైదరాబాద్ వచ్చి నిన్ను కలుసుకోవాలనుంది. అక్కడ చెప్తాను. నేను చాలా ఒంటరి వాణ్ణి కల్యాణీ. మహాసముద్రంలో అనంత జలరాశి మధ్య ప్రయాణం చేస్తూ త్రాగటానికి ఒక్క చుక్క మంచినీరు లేక దప్పికతో మరణించిన అభాగ్య జీవిని ఏమనాలి ? ఒంటరితనం చాలా భయంకరమైంది కల్యాణీ. తృణమో కీటకమో తోడు కావాలనిపిస్తుందోసారి. ఆత్మీయులతో పంచుకున్న కన్నీరు అదృశ్యమై పోతుందంటారు.

"అందుకే ఒంటరితనం నీకు పనికిరాదంటున్నాను."

"కాని వివాహమంటే భయంగా వుంది కల్యాణీ."

"పెళ్ళి చేసుకోవడానికి భయపడేటంత దుర్బలుడివి కాదు నువ్వు. నువ్వు పెళ్ళి చేసుకోకపోతే నాకు మనశ్శాంతి వుండదు కరుణా."

"రేపు వెళ్ళటం నిజమేనా ?"

"నీకు అబద్ధం చెప్తానా కరుణా ?"

కరుణాకరం మాట్లాడలేదు. దూరంగా అనంత దిగంతాల దాకా వేయి నాలుకలు చాచి విస్తరించిన పల్చటి చీకటి పొరలనూ, వాటిని చీల్చుకుంటూ కరిగిస్తున్న వెన్నెల కిరణాలనూ చూస్తూ కూర్చుండిపోయాడు.

"వసంతను ఎందుకు చేసుకోనన్నావ్ కరుణా ?"

"యిష్టంలేక."

"ఎందుకని ?"

"ఎందుకు ఒకరి మీద యిష్టముంటుదో, ఎందుకు ఒకరి మీద నిష్కారణంగా జుగుప్స కలుగుతుందో ఎవరు చెప్పగలరు కల్యాణీ ?"

"ఆమెను గురించి సంశయం అనవసరం కరుణా. అది నిప్పు లాంటి మనిషి. నాలాంటిది కాదు. కళంకంలేని మాలిన్యం సోకని నిర్మల సౌందర్యం వసంత. ఎన్ని లోకాలు వెతికినా అటువంటి యిల్లాలు నీకు దొరకదు."

"......"

"మాట్లాడవేం కరుణా. తల్లితండ్రుల పేరు ప్రఖ్యాతులను బట్టి బిడ్డల గుణగణాలు అంచనా వేయడం అవివేకం కాదంటావా ?"

"అలా అని కాదు."

"యింక అభ్యంతరం చెప్పబోకు నువ్వు. వీలుంటే నా చేతుల మీదుగా పెళ్ళి చేయించాలని వుంది. నా యీ కోరిక మన్నించలేవా కరుణా ?"

మౌనంగా ఉండిపోయాడు కాసేపు.

"వసంత సంగతిలో నువ్వు ఎటువంటి అనుమానాలూ భయాలూ పెట్టుకోవద్దు. దాని విషయంలో నేను హామీ యిస్తున్నాను. నా జీవితంలో మిగిలిన ఈ పెద్ద బరువూ తీరిపోతే ఎంత తేలికగా ఊపిరి పీల్చగలనో ఊహించగలవా నువ్వు. ఇలా నీ కోసం చేతులెత్తి నమస్కరించి ప్రార్థించేవాళ్ళు మాత్రం ఎంత మంది వుంటారు చెప్పు ? ఇందులో మాత్రం నా స్వార్థం లేదంటావా ?"

కరుణాకరం ఆలోచనలో పడ్డాడు. తనకోసం బాధపడుతూ తన భవిష్యత్తును అంచనా కట్టుకుంటున్న మరో హృదయంలో స్పందిస్తున్న ఆర్ద్రభావానికి అతని మనస్సు కృతజ్ఞతా భావంతో నిండిపోయింది. ఎవరున్నారీ లోకంలో తన కోసం కంటతడి పెట్టేవారు ? తన సుఖం కోసం ఆరాటపడి మూలుగుతున్న గుండె చప్పుడు మరెక్కడ వినిపిస్తుంది ?

"ఏమంటావ్ కరుణా ?" అంది కొంచెం సేపయాక కల్యాణి.

"నువ్వేం చేయమంటే అదే చేస్తాను-నీ యిష్టం."

"సంతోషం - చాలా సంతోషం - నీ కోసం మా ప్రయాణం వాయిదా వేసుకుంటాం. రేపుదయం నేను మాట్లాడతాను వసంతతో-వరదాచార్యులు నీ దగ్గరకు వస్తారు. ఇవాళ చాలా సుదినం కరుణా. నా చేతులమీదుగా నీ పెళ్ళి జరగడం ఈ జీవితంలో అల్పమైన అదృష్ట మంటావా ? సరే - మాటల సందర్భంలో నువ్వు కడుపు నిండా అన్నం తిన్నట్లు గూడా లేదు."

కరుణాకరం పరధ్యాన్నంగానే అన్నం తిన్నాడు. కల్యాణి వద్దన కూడా అలాగే జరిగింది.

"యింక వెళ్తాను కల్యాణీ."

"ఔను, చాలా పొద్దుపోయినట్లుంది."

* * * * * *

మర్నాటి ఉదయం జరిగిన సంఘటన కల్యాణి జీవితంలోని దురదృష్టాల వరదలలో మరొక కెరటం. తెల్లవారగానే కాఫీ త్రాగి ఉతికిన చీర కట్టుకొని వరదాచార్యులగారింటికి బయలుదేరుతున్న సమయంలో రామనాథం ఎదురుపడ్డాడు. అతనితో పాటు మరొక వ్యక్తి కూడా వచ్చాడు. అతని మెడలో ఒక చిన్న కెమేరా వ్రేలాడుతూంది. వారిని చూడగానే కల్యాణి వళ్ళంతా పమిట కప్పుకొని వెనకకు వెళ్ళింది యింట్లోకి. ఇద్దరూ నవ్వుకుంటూ లోపలికి వచ్చారు.

రామనాథం స్టూలు లాగి అతన్ని కూర్చోబెట్టి "కల్యాణీ - ఇతను చిన్ననాటి స్నేహితుడు. కలిసి వందలకొద్దీ నాటకాలేశాం. తర్వాత బుజ్జెమ్మ అనే అమ్మాయిని - మా నాటకాల్లో వేసేదిలే - మద్రాసు తీసుకుపోయాడు సినిమాల్లో చేర్పించటానికి. ఆవిడ పేరు మార్చుకొని పెద్ద తారైపోయాక మనవాణ్ణి గెంటేసింది - మళ్ళీ కొత్త సినిమా తీయాలని ప్రయత్నం." అంటూ ఏవేవో చెప్తున్నాడు.

కల్యాణి అతనికేసి చూసింది. ఉల్లిపొరలాంటి సిల్కు లాల్చీ, గ్లాస్కో పంచ - చేతిలో గోల్డుఫ్లాక్ టిన్ - రిమ్ములేని బంగారు రంగు కళ్ళజోడు - చిత్రమైన అతి మెత్తటి నవ్వు -

"ఏమంటావ్ ?" అన్నాడు రామనాథం.

ఈ అమ్మాయికి ఫోటో లెందుకోయ్. నా అనుభవంతోనే చెప్తున్నాగదా ? అది - ఏది ? బుజ్జులు - ఈవిడ కాలి గోటికి పోలు

తుందా? అయినా వచ్చాను గనుక - ఈ సిరెండ పోకముందే నాలుగు శ్నాపులు తీద్దాం -"

"మేకప్ లైటుగా అవసరమంటావా?"

"సహజ సౌందర్యముగల స్త్రీకి నగలెందుకని వాడెవడో కవి కూన వాగినట్లు - ఈవిడ కెందుకోయ్ మేకప్? శుద్ధ అనవసరం -"

"కల్యాణీ - మన గుర్రాజు రెండు ఫొటోలు తీయాలని వచ్చాడు పద దొడ్లోకి" అన్నాడు రామనాథం.

కల్యాణికి వళ్ళంతా తేళ్ళూ, జెర్రులూ ప్రాకుతున్నట్లనిపించింది. "ఏమండీ! యిలా రండి" అంది వంటింట్లోకి పిలుస్తూ.

"కల్యాణీ-వెతకబోయిన తీగ కాలికి తగిలిందంటారు చూడు. వీడి అడ్రసు దొరక్క తన్నుకు చస్తున్నా. మొన్న జంక్షన్‌లో కనిపించాడు. ప్రాణం లేచొచ్చింది. రమ్మన్నా. వచ్చాడు. చేతి కందుతున్న అదృష్టాన్ని మనం జారవిడుచుకో గూడదు - దా - నా పరువు తీయబోకు. ఏమో, ఇదెందు కొచ్చిందో - " అంటూ బ్రతిమలాడుతూంటే కల్యాణికి అంతులేని కోపం వచ్చింది.

ఇద్దరిమధ్యా జరుగుతున్న ఈ తర్జన భర్జనలు చూసి "పోనీ ఓసారి ఏలూరు తీసుకు రారాదూ? మా పార్టనర్ కూడా చూసినట్టూ వుంటుంది. ఏదో అడ్వాన్సంటూ లాంఛన ప్రాయంగా యిచ్చి, ఎగ్రిమెంట్లూ వ్రాయించుకోవచ్చు." అంటూ లాలనగా ఏదో చెప్పబోయాడు.

కల్యాణి ఆగ్రహావేశాలను అణచుకుంటూ "అయ్యా! నేను నాటకాల్లో వేస్తానని గానీ, సినిమాలు కావాలనిగానీ ఎవరితోనూ అనలేదు. దయుంచి మమ్మల్నిలా వదిలిపెట్టండి - నాకు పనుంది" అంటూ అక్కడమంచి లేచి వెళ్ళిపోయింది.

ఆ తర్వాత కల్యాణి సరాసరి వరదాచార్యులుగారింటికి వచ్చింది. చెరువుకు నీళ్ళకు వెళ్తున్న చెల్లాయమ్మగారు కనిపించింది గుమ్మంలో. కల్యాణిని చూసి ఆగింది.

"వసంత వుందాండీ ?" అంది కల్యాణి.

"ఏం పనమ్మా దానితో నీకు ?" అంది కఠినంగా చెల్లాయమ్మ గారు.

"చాలా అర్జంటు పనుందండీ ?"

"దానితో అంత అర్జంటు పనులేముంటాయమ్మా నీకు, నాకు తెలీక అడుగుతాను."

"గుమ్మంలో యిలా నిలబడి చెప్పేమాట కాదండీ."

"ఏమిటో యీ పాడు రహస్యాలు —"

"వసంత లేదాండీ ?"

"లేదు తల్లీ వెళ్ళు."

"ఎక్కడికి వెళ్ళింది ?"

"లేదని చెప్తున్నాగా" అంటూ తలుపు దభాలున వేసి చెరువుకు దారి తీసింది చెల్లాయమ్మగారు. భరించలేని అవమాన భారంతో కల్యాణి కాళ్ళు కదలలేదు. అంతలో తలుపు తీసింది వసంత. మాట్లాడలేక కల్యాణి వెనకకు తిరిగింది.

"కల్యాణీ !" పిలిచింది వసంత.

ఆగింది కల్యాణి.

"లోపలకు రా ?"

"నాకా అర్హత లేదని చెప్పింది మీ అమ్మ."

"ఇంతదూరం వచ్చావుగా - రా - ఆ చెప్పదలచుకున్నది చెప్పి వెళ్ళు."

కల్యాణి నిర్జీవ ప్రతిమలా నడిచింది లోపలికి. ఆమెను కూర్చోమనలేదు వసంత.

"నీతో ఒక ముఖ్య విషయం చెప్పాలి వసంతా" అంటూ తానే కూర్చుంది మంచంమీద.

"నాతోనా ?'

"ఔను - కూర్చో. నువ్వు నాకు ఆత్మీయురాలవనే అభిప్రాయంతో ఆమాట చెప్పటానికి వచ్చాను."

"నేను నీకు ఎంతవరకు ఆత్మీయురాలినో నీకే తెలియాలి."

"పోనీ అంత పెద్దమాటెందుకు - కనీసం నీక్షేమంకోరే దానిననే విషయమన్నా నమ్మగలవా వసంతా ?"

"క్షేమం కోరేదానివనే ఇన్నాళ్ళూ అనుకున్నాను కల్యాణీ. కాని నిజంగా క్షేమం కోరినవా రెవరూ యింత ద్రోహానికి తలపెట్టరని గుర్తుంచుకో."

ఈ నిష్కారణ నిందను అర్థం చేసుకోలేక "ఏమిటి వసంతా ! నువ్వంటున్న దేమిటో నా కర్థం కావటంలేదు. ఈ వూళ్ళో ఎందరో ఎన్నో నిందలు మోపారు నా మీద. ఏ నిందలో ఎంత నిజముందో కనీసం తెలుసుకుంటానికి గూడా ఎవరూ ప్రయత్నించలేదు."

"నిప్పు లేకుండా పొగ పుడుతుందంటావా ? నువ్వేం చేయకుండానే అనవసరంగా లోకులు నిన్ను ఆడిపోసుకుంటున్నారంటావా ?"

కల్యాణి నిరుత్తరురాలయింది. ఒక్క క్షణ మాగి "పోనీలే - నా మంచితనాన్ని గురించి నీకు నచ్చచెప్పి నీ దగ్గర సర్టిఫికెట్ సంపాదించాలని రాలేదు నేను. నీ మనస్సులో దృఢమైన అనుమానాలు నా మీద గూడు కట్టుకోవడం నా దురదృష్టం వసంతా."

"నిండా మునిగిన మనిషికి చలి లేదంటూరు. నిజమైన దుర దృష్టం నీదికాదు, నాది. నువ్వు రాజారావును నమ్ముకున్నావు. మీ జోలికి ఎన్నడూ రాలేదు నేను. కాని కరుణాకరానికీ నాకూ జరగవలసిన పెళ్ళి చెడగొట్టడానికి జరిగిన నాటకంలో నీ పాత్ర ఎంత వుందో మనస్పూర్తిగా చెప్పగలవా ? నీకేం ద్రోహం చేశాను కల్యాణీ ? నీ బ్రతుకెలాగూ పాడైంది. నాదీ పాడుచేస్తేనే కాని నీకు కళ్ళు చల్లబడ లేదన్న మాట ?"

"వసంతా" అంటూ కేక పెడుతూ పెద్దపెద్ద అంగలు వేస్తూ గదిలో ప్రవేశించిన చెల్లాయమ్మగారు "వెళ్ళు తల్లీ - కల్యాణమ్మ తల్లీ - మా కొంపకు నిప్పెందుకు పెడ్తావ్ ?" అంటూ కుమార్తెను రెక్కపుచ్చుకు లాక్కుపోయింది. కల్యాణి లేచి తడబడుతున్న కాళ్ళను నిలుపుకు అంగలు వేసుకుంటూ పగులుతున్న గుండెలను అదిమి పట్టుకుంటూ నిర్నిరోధ దుఃఖ స్రవంతులను పైకి పొంగ కుండా కళ్ళల్లోనే దాచుకుంటూ ఆ యింట్లోంచి బయట పడింది.

# పందొమ్మిది

కల్యాణి యింటికి తిరిగి వచ్చేసరికి గుమ్మంముందు కారు ఆగి వుంది. అది కరుణాకరానిది కాదు. ఎంత ఆలోచించినా ఆమె ఊహకు అసలు విషయం అందలేదు. త్వరితంగా అడుగులు వేసుకుంటూ నడిచింది. తలుపులు తెరిచే వున్నాయి. మంచం వాల్చుకుని కూర్చున్న ఒక స్త్రీ మూర్తి కనిపించింది. అంతకుముందు ఆమెను చూడలేదు. తాను లోపల అడుగు పెట్టగానే ఆమె చిరునవ్వుతో స్వాగత మిచ్చింది. తను మరొకరి యింటికి వచ్చినట్లనిపించింది.

"మీరు ...?" అంటూ సగంలో మాట మ్రింగింది కల్యాణి.

"మీ పేరు కల్యాణి ?" అందా మూర్తి.

"ఔను."

"నే నెవరో గూడా మీకు తెలుసు. యింతకుముందు మనం కలుసుకోలేదు. కాని మీ గురించి చాలా విన్నాను."

"నా గురించా ? మీరు...."

"చెప్తే అంతా మీకే తెలుస్తుంది. నా పేరు ప్రసూన. రాజారావుగారు ఒకప్పుడు నాకు కావలసిన వారు."

ఆ స్త్రీ మూర్తిని ఆశ్చర్యంగా చూసింది కల్యాణి. మనస్సును స్థిరపరచుకోటానికి కొన్ని క్షణాలు పట్టింది.

"చాలా సంతోషం. మిమ్మల్ని చూడాలనే కోరిక వుండేది నాకు. అనుకోకుండా మీరే అభ్యాగతిగా మా యింటికి వచ్చారు. కాఫీ తెస్తాను వుండండి."

"ఈ పూట మీ యింట్లో భోజనం కూడా చేసి పోదామని వచ్చాను."

"తప్పకుండా. ఉన్నంతలో వండిపెట్టగలను మీరు సంతృప్తిగా భోజనం చేయగలిగితే."

ఇద్దరూ కాఫీ త్రాగారు.

ఒక గంట తర్వాత సంగతి -

మనుష్యుల మమతలూ, మనస్సులూ చాలా చిత్రంగా వుంటాయి కొన్ని సమయాలలో. సంవత్సరాల తరబడి ఒకే గదిలో ఒకే నీడలో కలిసి బ్రతికినా ఇద్దరు వ్యక్తులు పరాయివాళ్ళుగానే వుండిపోవచ్చు. కాని, ఒక చూపులో ఒక మాటలో కొద్ది క్షణాల పరిచయంతో ఇద్దరు ఆత్మీయులై మనస్సులు కలవడం కూడా అసంభవం కాదు. జన్మాంతర బంధాలు పైకుబికి ఆ రెండు ప్రాణాలనూ పెనవేయడం కూడా ఆశ్చర్యకరం కాకపోవచ్చు. రాగద్వేషాల నీడలో యిష్టా యిష్టాల ఛాయలు జన్మాంతర సంబంధాలు కాకపోతే మరేమిటి? ఒక మనిషిని చూడగానే హృదయానికి హత్తుకోవాలనిపించటంలో, మరో వ్యక్తిని చూడగానే ఆ నీడను కూడా భరించలేక పారిపోవాలనిపించటంలో ఏమున్నది ఆంతర్యం? ఏ తర్కం, ఏ గణితం, ఈ చిక్కు ముడిని విప్పగలదు? ప్రసూనను చూడగానే తన మనిషిని మొదటిసారి చూసినట్లు తన హృదయం ఎందుకు పల్లవించిందో కల్యాణికి అర్థం కాలేదు. అంతకు మించి ఆమె ఉత్సాహం, మెరుస్తున్న కళ్ళు, విరియబూస్తున్న మందహాసాలు, బుగ్గన సొట్ట, ఎగిరి పడుతున్న ముంగురులు - తీగెవంటి నడుము - నల్ల చుక్కల వుల్ వాయిల్ చీర - ఆభరణాలు లేని అలంకరణతో సౌందర్యాన్ని గంధంగా రంగరించి వంటికి పూసుకున్న పరిమళ మాధుర్యం - రెప్ప లార్పకుండా చూసి 'ఎలా

వదులుకున్నాడీ పరిమళాల పుత్తడి బొమ్మను వెర్రి 'రాజా' అను కుంది కల్యాణి. ఎన్నడూ కన్నీటితో మాలిన్యం కాని కాంతి రేఖ లను విరజిమ్ముతున్న కన్నులు కనిపించాయి ఆమె వదనంపై కల్యాణికి. 'ఈమెకు కష్టాలు లేవా ? సమస్యలు లేవా ? వ్యథలకూ బాధలకూ అతీతురాలా ? బ్రతికినంతకాలం విరయబూసిన బొండు మల్లెలా నవ్వుతూ జీవన మాధుర్యాన్ని, జీవితానందాన్ని పరిమ ళంగా విరజిమ్ముతూ, పదిమందికీ పంచుతూ ఎదుటి వారికి సుఖా న్నిస్తూ అందులో భాగం పంచుకుంటూ, ఉన్నచోటును స్వర్గ ధామంగా మార్చుకోగల విచిత్రమైన దివ్య శక్తి కనిపించింది ఆమె మూర్తిలో కల్యాణికి. ప్రసూనతో మాట్లాడుతున్నంతసేపూ ఆమె మనోకాశంలో క్రమ్మిన విషాద నీరదాలు విచ్చుకొని విడి పోయి దూది పింజలై ఎగిరిపోవటం అనల్పమైన అనుభూతిగా చవి చూచింది. ఎన్నో సంగతులు చెప్పింది. పాండిత్యంతో, అనుసరించ లేని అధిగమించలేని నైతిక సూత్రాల సెగల పొగలతో, చెప్పింది చేయలేని చేసింది చెప్పలేని పిరికితనాల మురికి నీటిలో కలుషితం కాని, రూపరాహిత్యం జరగని వ్యక్తిత్వంలోని నగ్న సౌందర్యం చూసి కల్యాణి ముగ్ధురాలయింది.

"ఎందుకు వదిలి పెట్టాడు రాజారావు మిమ్మల్ని ?" భోజనా లయాక అడిగింది కల్యాణి. ఆ కొద్ది కాలంలో అంతటి ఆత్మీయు లయ్యారు వారిద్దరూ.

ప్రసూన జలజల మంటూ నవ్వింది.

అదొక చిత్రమైన నవ్వడి.

"అలా చెప్పాడా చెల్లీ ?" అంది కొంటెగా చూస్తూ.

"అతను చెప్పలేదు. నేనే అడుగుతున్నాను."

"అతన్నే నేను వదిలిపెట్టాను."

"అలాగా ?"

"ఏం నామాట నమ్మలేవా ?"

"నువ్వు ఏం చెప్పినా నమ్మగలను. కాని, అలా ఎందుకు జరిగింది ?"

"నాలాంటి స్త్రీని రాజావంటి దుర్బలుడు భరించగల డంటావా ?"

కల్యాణి ఈ ప్రశ్న విని ఆశ్చర్యపోయింది. రాజారావు ఏ విధంగా దుర్బలుడో ఆమె కర్థం కాలేదు.

"అంటే ?" అంది కల్యాణి.

"అతనికి ఆరోగ్యం లేదు. డబ్బు గలవాళ్ళే లక్షలు ఖర్చు పెట్టినా రాలిపోతున్నారు క్షయ రోగంతో. రాజా ఎంతకాలం బ్రతకగలడు ? అతని మనస్సు మరీ దుర్బలం. ఉద్రేకాల ముద్ద లాంటి మనిషి. దేనికీ తట్టుకోలేడు. అన్నీ కావాలంటాడు. జీర్ణశక్తి లేనివాడు బుట్టెడు అరిశెలు తింటే ఏమౌతుంది చెప్పు. అతనికి నువ్వూ కావాలి - నేనూ కావాలి. కాని ఇద్దరిలో ఏ ఒక్కరినీ భరించలేడు. అతను చాలా దుర్బలుడు చెల్లీ. మనస్సుకు నిగ్రహం లేదు. ఏపని చేస్తే ఆయుర్దాయం తగ్గుతుందని డాక్టరు చెప్తాడో మొద్దుబారేదాకా ఆ పనే చేసి తనమీద తనే కసి తీర్చుకుంటాడు. ఒక సమయంలో నాకూ అతనిమీద అంతులేని వ్యామోహం కలిగింది. కాని, సొంతం మునిగిపోకముందే కళ్ళు తెరిచి బయట పడ్డాను. మరో చిత్రం చూడు....."

ప్రసూన చెప్తున్నది వింటూ, ఆమెకేసి రెప్పలార్పకుండా చూస్తున్నది కల్యాణి.

"మనుష్యులు సాధారణంగా ఎందు కేడుస్తారో తెలుసా? కావాలనుకున్నది దొరకనప్పుడు. మన రాజా అట్లా కాదు. తనకేం కావాలో అతనికే తెలియదు. అతన్ని గురించి చాలా ఆలోచించా. అదోకరకం తత్వం. అందనిదానికోసం నెత్తురు ధారబోసి ఏటి కెదురీది సాధించాలనే పట్టుదలలో ఉన్న తీవ్రత, దాన్ని సాధించిన తర్వాత అనుభవించటంలో వుండదు. అతని మనస్సొక తాటాకు మంట. ఓ పాల పొంగు. చెయ్యరానిదని తెలిసీ ఆ పని చేయడం, పొరపాటు జరిగిందని బాధపడటం, మళ్ళీ అదే తప్పు మళ్ళీ చేయడం - ఇదీ అతని నైజం. తాను సుఖపడలేదు, ఒకరిని సుఖపెట్టలేదు. నాటకంలో పాత్రలా బ్రతికే మనిషి. ఏ పాడు పుస్తకాలు చదివాడో మరి -"

"రాజాను చూశావా అక్కా?" అంది కల్యాణి.

"లేదు. ఇటు వెళ్తూ వారి ఊరు - ఆగాను."

"వారంటే?"

"మావారు."

"పెళ్ళయిందా?" అంటూ ఆమె మెడకేసి చూసింది. మంగళసూత్ర మున్నట్లు కనిపించలేదు.

"లేదనాలా అయిందనాలా? కావ్యాల్లోనూ పురాణాల్లోనూ గాంధర్వ వివాహమంటారు చూడు. అటువంటిదే ఏదో జరిగింది. నాకోసం హైదరాబాద్‌లో ఓ బంగళా కొన్నారు. ఈ రాజారావు గుడిసెకంటె చాలా సుఖంగా వుంది."

"ఏంచేస్తారాయన?"

"తాత తండ్రులు బస్సు పర్మిట్లు సంపాయించి దమ్మిడీలు మూటకట్టి లక్షలు సంపాదించారు. ఈయనగారు జాగ్రత్తగా దాన్ని తగలేస్తున్నారు."

ఇలాగే చాలాసేపు దొర్లాయి కబుర్లు. "ఇంక నే వెళ్తాను. ఒక్క సంగతి. నా దగ్గర చాలా డబ్బుంది. పస్తులున్న రోజుల్లో రూపాయి దొరకని అనుభవం నాకు తెలుసు. ఈ పాడు డబ్బు ఏం చేసుకోవాలో అర్థం కావడంలా. రాజా నేనిస్తే తీసుకోడు. ఇది నీ దగ్గరుంచి వైద్యం చేయించు. ఎలాగైనా అతని కందేలా చెయ్యి. హైదరాబాద్ వస్తే, మా యింటికి రా." అంటూ అడ్రస్ రాసి యిచ్చి వెళ్ళిపోతానంటూ లేచింది ప్రసూన.

"అక్కా! రాజాను చూడకుండా వెళ్తావా?" అంది కల్యాణి.

"చూడాలనే ప్రాణం పీకుతూంది. యింత దూరం వచ్చాను కానీ...."

"చూసిపో అక్కా. బహుశా ఈ అవకాశం జారవిడుచుకుంటే మళ్ళీ రాదేమో. ఆ తర్వాత ఏడ్చి ప్రయోజన మేమిటి చెప్పు? - నాకు తెలుసు. ఎంత నిబ్బరమున్నా ఈనాడీ పొరపాటు చేస్తే, తర్వాత తప్పక బాధపడతావు నువ్వు."

వెళ్తున్న ప్రసూన ఆగింది. ఏదో ఆలోచనలో పరాధీనయైనట్లు చూసింది. ఆమె పెదిమలమీద మెరుస్తున్న చిరునవ్వు చెరిగిపోయింది.

"ఇంత మంచిదానివి ఎలా పుట్టావు చెల్లీ? ఈ ప్రపంచంలో ఎలా బ్రతుకుతున్నావ్? ఎందుకో నీ ఆజ్ఞ శిరసా వహించాలనిపిస్తూంది - పద వెళ్దాం."

ఇద్దరూ కారులో బయలుదేరి వెళ్ళారు. ఆ అందమైన పొడుగాటి కారు ఆ సందులను దాటి ఉప్పరిగూడెంలో ప్రవేశించటంతో గాలి దుమారం రేగింది.

కల్యాణి ముందు లోపల ప్రవేశించింది. అనుసరించింది ప్రసూన. మృత్యు ధూళితో మలినమై నరకానికి ప్రతిరూపంలా కనిపించిందా నివాసం. సుపరిచితమైన ముసలమ్మ మూలుగు - రాజారావు కనిపించలేదు. ఆవలి గదిలోంచి మేదరి విసనకర్ర నేల మీద కొడుతున్న చప్పుడు వినిపించింది.

"రాజా" అంటూ లోపలకు వెళ్ళింది కల్యాణి.

రాజారావు తలెత్తి చూసి నవ్వుతూ "మళ్ళీ వచ్చావా కల్యాణీ? ఏమిటో...మనం ఒకళ్ళ నొకళ్ళు బాధ పెట్టుకుంటానికే పుట్టామా అనిపిస్తూంది." అంటూ లేచాడు.

"బయట ఎవరున్నారో చూడు?"

"ఎవరు?"

"రా, చూడు. నిన్ను చూడటానికి వచ్చిన మనిషి."

ప్రసూనను చూడగానే కంపించాడు రాజారావు. ఆమె పల్చగా నవ్వుతూ "చాలా పాడైపోయావ్ రాజా" అంది.

"కూర్చోండి. ఇంకా నన్ను మర్చిపోలేదన్నమాట." అన్నాడు మంచం ఇవతలకు లాగుతూ. ప్రక్కన కుర్చీమీద కూర్చు న్నాడు రొప్పుతూ.

"నిన్నెలా మరిచిపోతాను రాజా. ఆ రాత్రి నీ దెబ్బలకు చెయ్యి విరగాలిసింది తెలుసా? విరగలేదు. పెద్ద గాయమయింది. అది మానిందిగానీ మన స్నేహానికి చిహ్నంగా ఈ మచ్చ మిగిలింది" అంది చేయెత్తి చూపుతూ ప్రసూన.

తల వంచుకున్నాడు. "ఔను ప్రసూనా! నేనెంత దౌర్భా గ్యుణ్ణో నువ్వు చెప్పకుండా నన్ను వదిలిపోయిన రోజునే తెలుసు కున్నాను. మళ్ళీ మరిచిపోలేను గూడా. ఎవరూ గుర్తు చేయకుండానే ఆ దౌర్భాగ్యాన్ని గుర్తు పెట్టుకోగలను."

ప్రసూన కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. దుఃఖాన్ని దాచుకుంటూ "యింక నే వెళ్ళాలి రాజా. పొరపాటు జరిగితే క్షమించు" అంటూ లేచింది.

"నా పొరపాట్లు ఎవరు క్షమిస్తారు."

ఆమె కళ్ళల్లోంచి అదుపు తప్పిన కన్నీరు కట్టలు త్రెంచుకుని ప్రవహించింది.

"వెళ్ళనా రాజా ?" అంది కళ్ళు తుడుచుకుంటూ.

"నా అనుజ్ఞకు ఎంత విలువుందో నాకు తెలుసు ప్రసూనా ? ఒకనాడు మాటవరసకన్నా చెప్పకుండా చీకట్లో అదృశ్యమై పోయావ్. ఆనాడు అవసరంలేని అనుజ్ఞ ఈనాడు ఎందుకు కావాలి ? మనలో ఎవరం ఎవరినీ మోసం చేసుకోలేము. మళ్ళీ చూడనను కున్నాను. ఇంక ఈ జీవితంలో ఎంత వ్యవధి మిగిలిందో నాకూ తెలుసు. ఆ మహాయాత్రకు టిక్కెట్టుకోసం క్యూలో నుంచున్న మనిషిని నేను. నేను కొట్టినా ఆ శిశును మధురస్మృతిగా మూట గట్టుకువచ్చి యిక్కడ గుమ్మరించి పోతున్నావు. నేనేం చేసుకోను ఆ జ్ఞాపకాలనూ అనుభవాలనూ ? మేకులై బాకులై గుండెల్లో గుచ్చుకుంటున్నా - మూలగటానికి శక్తి లేకపోయినా, యింకా ఆకలి తీర్చుకుంటానికి కుంపటి అంటించుకుంటున్నానంటే, నీలోంచి ప్రవహించిన వేడి యింకా యీ శిధిల శరీరంలో చల్లారలేదని గుర్తుంచుకో."

"ఎందుకు నన్నిలా హింసిస్తావ్ రాజా ?"

"నాకు చేతనైన విద్య అదొక్కటే ప్రసూనా. కనీసం నువ్వు అర్థం చేసుకో గలిగింది అంతవరకే ప్రసూనా."

"మనస్ఫూర్తిగా అంటున్న మాటేనా అది రాజా."

"నీకు తెలియదా ?"

"నువ్వు కాదంటే నేను యిక్కడనుంచి అడుగు ముందుకు వేయగలనా ? చెప్పు రాజా. ఉండిపోనా పోనీ."

"ఏం చేస్తావు ఉండి ?"

"మరి ఎందుకు వెళ్ళవద్దంటావు ?"

"అనలేదే నేనలా ?"

"మరి ?"

"వెళ్ళు ప్రసూనా - కాని ఒక్క విషయం గుర్తుంచుకో. నువ్వు చాలా కఠినురాలివి. నా రైలు వచ్చేవేళయింది. నేను వెళ్ళి పోయాక ప్రశాంతంగా కాసేపు ఆలోచించు. నేను నీపట్ల చేసిన అపరాధం - దానికి నువ్వు విధించిన శిక్ష - ఎంతవరకు పరిష్కార మయిందో - ఆనాడు నిజం నీకు కనిపిస్తే, నీ కళ్ళనుంచి రాలిన రెండు కన్నీటి చుక్కలు చాలు - ఈ పాపిష్ఠి ఆత్మకు శాంతి అవసర మైతే కొనుక్కుంటానికి."

గుండెల్లో సూటిగా గ్రుచ్చుకున్న పరుష వాక్యం అది-

ప్రసూన తలవంచుకుని మారు మాట్లాడకుండా వెళ్ళిపోయింది. కల్యాణి చైతన్యంలేని ప్రతిమలా నిలబడింది అక్కడే పరుగు తీస్తున్న కారును చూస్తూ. కళ్ళు మూసుకొని నిస్తేజమైన నిర్జీవ మైన మాంసపు ముద్దలా మంచంమీద కాళ్ళు ముడుచుకు పడు కున్నాడు రాజారావు. అతనిని ఎలా పలకరించాలో, ఏమని ఓదార్చాలో కల్యాణికి అర్థం కాలేదు. అతనినే చూస్తూ కుర్చీలో కూర్చుంది మౌనంగా. ఒకనాడు కఠోపనిషత్తులో నిర్దేశింపబడిన యోగాన్ని గురించి మాట్లాడుతూ గోవింద యతీంద్రులవారు చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి.

'వేదనలలో కాలిపోయే మానవునికి భగవంతుడు ప్రసాదించిన గొప్ప వరం చిరునవ్వు. మనసారా నవ్వడం నేర్చుకో. నరాలకు సత్తువ వస్తుంది. దైన్యం కరిగి ఆవిరై పోతుంది. పక్షులూ పశువులూ నవ్వలేవు. ఆ శక్తి ఒక్క మనిషికే వుంది. ద్వేష రోషాలనూ, అసూయాహంకారాలనూ జయించటానికి మనిషికి భగవంతుడిచ్చిన వజ్రాయుధం చిరునవ్వు.'

రాజారావు పెదిమలమీద చిరునవ్వు చూసి ఎన్నాళ్ళయింది? ఏ దివ్యత్వాన్ని పూసి, ఏ అమృతాన్ని రాసి ఎండిన అతని పెదిమల మీద చిరునవ్వును మొలకలెత్తించ గలదు? కదలకుండా పడుకున్నాడు రాజారావు. నుదుటిమీద బాగా చమటలు పట్టాయి. దగ్గరకు వెళ్ళి మంచంమీద కూర్చుని పమిటకొంగుతో ముఖం తుడిచి తల నిమిరింది. చిందరవందరైన జుట్టు చేతివ్రేళ్ళను దువ్వెనగా చేసి చిక్కు తీసింది.

"రాజా" అంటూ మూలిగింది ముసలమ్మ.

అతను కదలలేదు. ఆమె లేచి ముసలమ్మ మంచం దగ్గరకు వెళ్ళింది "అత్తయ్యా!" అంటూ పిలిచింది.

"ఎవరూ?" అంది ముసలమ్మ రెప్పలెత్తి చూడటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూ.

"నేను కల్యాణిని."

"వచ్చావా కోడలా. అబ్బాయిమీద అలిగి వెళ్ళిపోయావుట. ఆలూమగలన్నాక ఏవో వస్తూంటాయి పొరపొచ్చాలు. సర్దుకు పోవాలి తల్లీ. పెళ్ళయిన కొత్తల్లో - అప్పుడు యింకా పదమూడేళ్ళు లేవు నాకు. మీ మామయ్యా - అబ్బో - ఎంత దూకుడుగా ఉండేవారనీ - వీడూ ముమ్మూర్తులా ఆయన పోలికే - ప్రథమ కోపం - అప్పుడు ఎదురు చెప్పగూడదు. వింటున్నావా?"

చెప్పలేక ఓపికలేక అతి కష్టంమీద మాటలు సగం విరుస్తూ సగం మ్రింగుతూ చెపుతున్నది ముసలమ్మ. కల్యాణి మాట్లాడలేదు. "ఏం మాట్లాడవే కోడలా?" అంటూ అతి కష్టంమీద వీపు నిమురుతూ "భడవాకానా! మొగుడు పేరెత్తగానే సిగ్గొచ్చిందా?" అంటూ జడ గుంజింది చిత్రంగా ముసిముసి నవ్వులు కక్కటానికి ప్రయత్నిస్తూ ముసలమ్మ. కల్యాణి పమిటచెంగును నోట్లో కుక్కుకుంది. "కోడలా - జావ పెట్టలా?" అంది ముసలమ్మ.

కల్యాణి "పెడ్తాను అత్తయ్యా. ఒక క్షణం" అంటూ లేచింది. యిల్లంతా చిందరవందరగా వుంది. చీపురుకట్ట కనిపించలేదు. ప్రక్కనున్న ఉప్పరి వీరాస్వామి ఇంటికి వెళ్ళి, తాటి ఈనల చీపురు తెచ్చింది. యిల్లంతా తుడిచింది. చినిగి తడికమీద వ్రేలాడుతున్న చింకిరి చాపల్ని చుట్టచుట్టి మూల పెట్టింది. కుంపటి రాజుకుంది. డబ్బాలూ గిన్నెలూ అన్నింటినీ పరామర్శించింది. మూల బియ్యపు పీపా కనిపించింది. పాలడబ్బాడు బియ్యం తీసి చాటలో పోసింది.

"కోడళా" అంటూ మళ్ళీ కేకపెట్టింది ముసలమ్మ.

"ఏం అత్తయ్యా!"

"ఏం చేస్తున్నావే?"

"బియ్య మేరుతున్నా నత్తయ్యా."

"నీరసంగా వుంది తల్లీ. కాస్త జావ గొంతులో పొయ్యి."

ముసలమ్మకు జావ చల్లార్చి యిచ్చింది. బియ్యం కడిగి కుంపటి మీద పెట్టింది. ఆధరువు చేయడానికి యింట్లో అన్నీ నిండుకున్నట్లున్నాయి. నాలుగు మిరపకాయలు కనిపించాయి. రెండు వెల్లుల్లిపాయలు దొరికాయి. జాడీనిండా ఉప్పుమాత్రం పుష్కలంగా వుంది. ఆ నాలుగు మిరపకాయల్లూ వేయించి, వెల్లుల్లిపాయలు వేసి కారం

నూరింది. పింగాణీ కంచం శుభ్రంగా కడిగింది. వంట పూర్తయేసరికి చీకటి పడింది. బయటకు వచ్చిన అలికిడికి రాజారావు లేచి కూర్చుని చూసి "యింకా వెళ్ళలేదా కల్యాణి" అన్నాడు.

"లేదు" అంది దీపంతీసి దౌర్భాగ్యుని జీవితంలా పొగ చూరిన చిమ్నీని తుడుస్తూ.

"చీకటి పడుతున్నట్లుంది. పాపం వంట చేసుకోవాలేమో వెళ్ళరాదూ !"

"ఎక్కడికి ?"

"మీ యింటికి."

"నాకు యిల్లెక్కడిది రాజా. అది సత్రం ఆ ఉద్యోగంకూడా తీసేశారు. మరో రెండు రోజులు వుండవచ్చునన్నార్రనుకో..."

"ఎవరు ?"

"ఊళ్ళో అవినీతి జొరబడకుండా కాపలా కాస్తున్న వస్తాదులు."

"ఆనాడు మనం అనుకున్నట్లు జరిగివుంటే - ఛీ పాడు ఆశలు..."

రాజారావు తలెత్తి కల్యాణి కళ్ళల్లోకి చూశాడు. ఆమె కూడా మొదటిసారి ఒక మహాద్భుతాన్ని చూస్తున్న పాపలా రెప్ప లార్పక చూసింది కాసేపు. ఆమెలో ఒకక్షణం విద్యుత్తు ప్రసరించి నట్లు కళ్ళు మెరిసాయి. బుగ్గలు ఎర్రబడ్డాయి. పమిటకొంగు కప్పు కుంది తెప్పరిల్లి గుండెలకు. తల వంచుకుంది నేలను చూస్తూ.

"కల్యాణీ !"

"ఊఁ"

"నా యింట్లోనే యిలాగే నాకు రోజూ వంట చేసిపెడ్తా వనుకున్నాను. ఆ అదృష్టం తప్పిపోయింది. మొదటిసారి ఎన్నడో కన్న కల నిజమయింది. నా యింట్లో నాకు అన్నం వండిపెడు తున్నావు."

"ఎంత నిజమనుకున్నా కల నిజమౌతుందా రాజా. జరుగు తున్నంతసేపూ నిజమే అనిపిస్తుంది. కాని కళ్ళు తెరిచి చూడగానే ఏం కనిపిస్తుంది. వెలుగును మ్రింగిన కారు చీకటి. యదార్థ జగత్తు. క్షణికమైన అనుభవం."

నిట్టూర్చింది కల్యాణి.

రాజారావు తేలికగా నవ్వుతూ "కల్యాణీ - ఈ జీవితంలో - ఆద్యంతాలులేని విస్పష్ట స్వరూపంలేని కాలవాహినిలో ఏది క్షణికం కాదు కల్యాణీ? జగత్తు యదార్థం కావచ్చు. జీవితం మిథ్య కాదం టావా? జీవితమంతా ఒక పెద్ద కలకావంటావా? కాల వ్యవధిని బట్టి అనుభవానికి విలువ కడ్తావా? ఇలారా -" అన్నాడు.

"చెప్పు."

"కాసేపు దగ్గరగా కూర్చో."

"బాగుంది. నీకు ఏది వచ్చినా పట్టపగ్గాలుండవు. భోజ నానికి లే."

విచలితుడయ్యాడు రాజారావు. కల్యాణి లేచి అన్నం వడ్డిస్తున్నది. మంచంమీద నడుం వాల్చి, ఆమె వడ్డన కార్యక్రమాన్ని చూస్తూ పేకమేడలై ఇసుక గూళ్ళులా కూలిపోయి చెదిరిపోయిన భవిష్యజ్జీవిత సౌధాలను పోల్చుకుంటూ పరధ్యాన్నంలో మునిగి పోయాడు రాజారావు.

"లే రాజా!"

"కూర్చో."

"ముందు భోజనం చెయ్యి."

ఆమె వడ్డించి "కారం మెతుకులు పెడ్తున్నాను రాజా" అంది.

"నాకు భోజనం వద్దు."

"ఎందుకని ?"

"ఆకలిగా లేదు. యిలాగే ఆయువున్నంతకాలం నిన్నే చూస్తూ కూర్చోవాలనిపిస్తూంది. ఇదేమంత పెద్ద కోరికంటావా కల్యాణీ - రా-యిలా కూర్చో."

"బాగుంది వరస" అంటూ నవ్వి "లే ముందు - భోం చేశాక చూద్దాం" అంది కల్యాణి చెయ్యిపుచ్చుకు లేవదీస్తూ.

"చిరునవ్వులతో మగవాణ్ణి సర్కస్ గుర్రంలా ఆడించే శక్తి అందరాడవాళ్ళకూ వుండేదికాదు కల్యాణీ. ఆ రామనాథం - పాపం అమాయకుడు - అసలే..."

"ఊఁ - ఆపు బాబూ" అంది ముఖం చిట్లిస్తూ కల్యాణి.

భోజన మయాక కుర్చీలో కూర్చుంటానికి ప్రయత్నించాడు రాజారావు.

"మంచంమీద పడుకో. బాగా నీరసంగా వున్నావు."

మంచంమీద పక్క దులిపి వేసింది ఈ లోగా. అతను పడుకున్నాడు. కుర్చీ దగ్గరకు లాక్కుని కూర్చుంది కల్యాణి. మాటలు రాకుండా, శరీర స్పర్శ లేకుండా అలాగే కూర్చున్నారు ఒకరి సాన్నిధ్యాన్ని ఒకరు అనుభవిస్తూ.

"చాలా ప్రొద్దుపోయింది" అన్నాడు నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ రాజారావు.

"ఔను."

"ఒక్కదానివీ యింటికి వెళ్లగలవా ? నేను వచ్చి దిగబెట్టనా?

"వద్దులే."

"ఇంత రాత్రివేళ ఒక్కదానివీ వెళ్లటం క్షేమం కాదు."

"నేను వెళ్లను."

"వెళ్ళక ?"

"ఈపూట యిక్కడే వుంటాను."

ఆశ్చర్యపడుతూ రాజారావు లేచి "కల్యాణీ ! ఇంత జరిగాక నువ్వు మళ్ళీ యిక్కడకు రావడమే తప్పు. ఎందుకొచ్చిన గొడవలు? మళ్ళీ అల్లరి. రామనాథం బాధపడతాడు. వెళ్ళు కల్యాణీ" అన్నాడు గట్టిగా.

నిశ్చలంగా నిదానంగా అతన్ని చూస్తూ "ఈ యింట్లోకి రావటానికీ, ఉండటానికీ నాకు పూర్తి అధికార ముందన్నావు. అన్ని మాటలూ నీవేనా రాజా ?" అంది కల్యాణి.

"నీ మంచికే చెప్తున్నాను. కాదంటావా ?"

"నా మంచి నాకూ కొంత తెలుసంటావా ?"

"తెలిస్తే యిలా ఎందుకు జరుగుతుంది చెప్పు. నీకు వంద సార్లు, వేయిసార్లు చెప్పాను. ఎప్పుడు విన్నావు నా మాట ? తప్పు చేయడం కాదు లోకానికి నచ్చని పని. తప్పు చేస్తున్నట్లు కనిపించటం. ఆ రహస్యం తెలియకనే మనం అందరికీ చెడ్డవాళ్ళమైపోయాం."

ఏమైనా కానీ రాజా, మనస్సాక్షిగా భగవంతుని సాక్షిగా ఇవేళ యిక్కడనే వుండిపోవాలని నిశ్చయించుకున్నాను నేను."

గుండెలను చీల్చుకుంటూ బరువుగా ఊపిరి బయట పడింది అతనిలోంచి. దగ్గుతెర కొన్ని క్షణాలు మనిషిని అతలాకుతలం చేసింది.

"ఇలా మంచంమీద కూర్చో కల్యాణీ."

"కూర్చుంటాను. తప్పకుండా రాజా."

కూర్చుంది. తరగని ఆలోచనలు. విరిగిపోతున్న మనస్సు. ఇంకా ఎంత వ్యవధి మిగిలింది ? ఎన్నిరోజులు ? ఎన్ని గంటలు ? ఎన్ని క్షణాలు - చెవులకు వినిపించకుండా, కంటికి కనిపించకుండా కరిగిపోతున్న కాలం చేస్తున్న మోసానికి ఎక్కడుంది పతనం ? ఏమిటి పరిష్కారం?

రైలులో ప్రయాణం చేస్తున్నప్పుడు కనిపించే టెలిఫోను స్తంభాలవంటి అనుభవాలు ముందుకు సాగినకొద్దీ సన్నవై చిన్నవై అదృశ్యమై పోయినట్లు - ఏమైపోతా యీ అనుభవాలు ? మనిషిని మనిషి ఎందుకు ప్రేమిస్తాడు ? ఎందుకు ద్వేషిస్తాడు ? మనిషి మనిషికి ఎందుకు దగ్గరగా వస్తాడు ? ఎందుకు దూరంగా పోతాడు ?

"నేను నీ జీవితంలో అడుగు పెట్టాలనుకున్న రోజునే నీకు కష్టాలు ప్రారంభమయ్యాయి రాజా. నష్టజాతకుల పొందు కూడ దంటారు అందుకనే. సుడిగుండంలో కొట్టుకుపోతున్న ప్రాణి, సహాయం చేయటానికి వచ్చిన ప్రాణిని కూడా కౌగలించుకుని తనతో పాటు మృత్యుమందిరానికి లాక్కుపోతుంది. ఏనాడో నేను తెలుసుకో వలసింది. ఆకులు పట్టుకుందామనేసరికి చేతులే కాలిపోయాయి."

రాజారావు ఆమె చెంపలమీద నిమిరి "ఇంకా ఎందుకు బాధ పడ్తావు కల్యాణీ నా గురించి" అన్నాడు బరువుగా.

మరోమాట చెప్పలేకపోయాడు. ఆమె పెదిమలు వణుకు తున్నాయి. శూన్యమైన హృదయం గాలితో నిండి, ఊపిరితో ఎగి రెగిరి పడుతున్నది. రామనాథం గుర్తుకు వచ్చాడు. వెన్నెముకలేని వ్యక్తిత్వంలేని పటుత్వంలేని పసలేని చొప్పదంటులాంటి మనిషి. అతనితో వివాహానికి తానెలా అంగీకరించిందో అర్థంకాలేదు.

పరాయి మనిషిని పిలిచి ఫొటోలు తీయించడం - ఏలూరు వెంట బెట్టు కొస్తాననడం - సినిమా వ్యామోహం - గడిచిపోయిన ప్రేమ గాథల కథనం - అంతా తలుచుకుంటే దుర్భరమైన జుగుప్స కలిగింది. అతగాడు గొప్పవాడని తానెన్నడూ భ్రమపడలేదు. కాని కీటక ప్రాయమైన వ్యక్తిత్వాన్ని గ్రహించటంలో మరొక దురదృష్టం బయటపడింది.

"అందరూ ఏమనుకుంటున్నారో తెలుసా కల్యాణీ ?"

'పోనీ రాజా.'

"నేను నిన్ను పాడుచేశా ననుకుంటున్నారు. నీ జీవితాన్ని నాశనం చేశా ననుకుంటున్నారు. ఆ విషయం తలుచుకుంటే ఎంత వెర్రి బాధ, భరించలేని వ్యధ నన్ను కలిచివేస్తుందో నే నెలా చెప్పను కల్యాణీ."

"పడుకో. ప్రొద్దుపోయింది."

"నువ్వు ఎక్కడ...?"

"ఆ కుర్చీలో."

"కాదు - కాసేపు యిలాగే కూర్చో కల్యాణీ -"

ఆరాత్రి అలాగే గడిచిపోయింది. మాటలు పోయిన మనస్సుల మూగ బాధ పొగలై సెగలై చీకట్లో కలిసిపోతూ ముసలమ్మ మూలుగుకు వంతపాడుతూ ఏడుస్తూ అదృశ్యమై పోతున్నది. విషాదాన్ని మద్యంగా త్రాగి, మైమరచిన ప్రాణులు - సూర్యోదయమై మండుటెండ వస్తుందని చీకట్లో చలిగాలికి మండిపోతున్న హిమ బిందువులవంటి మనస్సులు - కోడి కూసింది. చలిగాలి తిరిగింది. అలిసిపోయిన ప్రాణాలు రెండూ ఆదమరచి నిద్రపోతున్నాయి.

---

# ఇరవై

ఆ మర్నాటి ఉదయం—

కల్యాణి రామనాథంతో కలిసి హైదరాబాద్ వెళ్ళిపోతున్న దనీ, అక్కడ వారిద్దరూ రిజిష్టర్డు మ్యారేజి చేసుకోబోతున్నారనీ, అతిలోకమైన ఆ వివాహానికి కరుణాకరం ఆశీస్సులు అండగా వున్నాయనీ, రకరకాల వ్యాఖ్యానాలతో ఉపాఖ్యానాలతో చిలవలు పలవలైన ఆ వార్త అడవి మంటలా ఊరంతా వ్యాపించడంతో నంబాచార్లుగారి కూతురు శాంత చెవిలో కూడా పడింది. తల్లి తండ్రులు తెలిస్తే మందలిస్తారని తెలిసిగూడా, చెరువుకు నీళ్ళకంటూ బయలుదేరిన శాంత నెమ్మదిగా సత్రంలో ప్రవేశించింది. దొడ్లో కల్యాణి బట్టలు ఉతుక్కుంటున్నది.

"ఏమిటేవ్? నేకంటున్నది కలా సత్యమా? శాంతమ్మగారు ఈ దిక్కుమాలిన పాప పంకిలమైన యింట్లో అడుగు పెట్టటమే!" అంటూ లోపలికి వచ్చి నేస్తానికి పీటవేసి కూర్చోమంది కల్యాణి.

మామూలు మాటలయాక శాంత "ఏమే నిజమేనా?" అంది అస్పష్టంగా.

"ఏమిటే?"

"అదే నే విన్నది...."

"అదే ఏమిటి - మొహమాట పడకుండా చెబుదూ?"

"నువ్వూ, మీ కాబోయే శ్రీవారూ కలిసి హైదరాబాద్ వెళ్ళటం."

"ఔను. అనుకున్నాం."

"ఇదెక్కడ విడ్డూరమే తల్లీ! పెళ్ళయిం తర్వాత భర్తతో వెళ్ళటం తప్పులేదుగానీ - ముందే యిలా చేస్తే అందరూ నవ్వరుటే!"

"ఇప్పుడు నవ్వడంలేదంటావా?"

"మొండికెత్తావన్న మాట."

"పోనీ అలాగే అనుకో."

"కాదు కల్యాణీ! ఇలా అంటున్నానని నామీద కోపం తెచ్చుకోకు. నీ మంచి నేను కాకపోతే యింకెవరున్నారు చెప్పు ఆలోచించటానికి. పదిమందీ పది రకాలుగా నీ గురించి ఆడిపోసు కుంటుంటే నేనెంత కుమిలి పడుస్తున్నానో తెలుసా?"

కళ్ళు తుడుచుకుంది శాంత.

నవ్వును గురించి యతీంద్రులవారు చెప్పిన హితోపదేశాన్ని స్మరించుకుంటూ, చిలిపిగా నవ్వుతూ "శాంతా - ఎంత వెర్రిపిల్లవే. అందుకే మీ ఆయన వేదాంతంలో పడ్డాడు. ఇప్పుడేమైందని ఆబాధ నీకు?" అంది.

"కాదే. ఆ రామనాథం అసాధ్యుడట. పెళ్ళి చేసుకుంటా నంటూ మభ్యపెట్టి తీసుకుపోయి నిన్ను నట్టేట్లో ముంచితే? ఆ తర్వాత అనుకుని ఏంలాభం చెప్పు."

"ఏం చేస్తాడంటావ్ అతగాడు?"

"కొన్నాళ్ళు నీతో వుండి, తర్వాత నువ్వెవరో నాకు తెలి యదు పొమ్మంటే ఏం చేస్తావే అప్పుడు?"

"ఆ పరిస్థితి వచ్చినప్పటి మాటగదా?"

"అతని వాగుడు చూస్తే పెళ్ళి జరిగినా మీ సంసారం తుద నెగ్గేలా లేదు. నిన్నట సినిమాల్లో చేర్పిస్తాట్ట. పెద్ద స్టారును చేస్తాట్ట. ఆ రావిచెట్టు క్రింద జేరి ఒకటే వాగుడట. నేను ఊరికే అనడం కాదుగానీ, అతగాడికి ఏదో పిచ్చుందే అసలు."

"సినిమా పిచ్చి."

"మరి ? కొంపతీసి నీకూ పుట్టిందేమిటి ఆ పిచ్చి ?"

"అదేం లేదులే. అంతేసి ఆశలు పెట్టుకునే శక్తి నా కెప్పుడూ లేదు."

"వెళ్ళబోకే. వాడి వెకిలి చూపులూ, వెర్రి చేష్టలూ చాలా యిదిగా చెప్పుకుంటున్నారు. మొన్న చింతామణి నాటకమంటూ ఏలూరునుంచి ఓ ముసలమ్మను తెచ్చి ఒకటే అల్లరిట. చీర చూస్తే చాలు, వాడి మతి పోతుందట. అలాటి వాజమ్మా చివరకు నీకు దొరికింది ?"

"లేని బావకంటే గుడ్డిబావ మేలంటారు కదుటే ?" మళ్ళీ నవ్వింది కల్యాణి.

శాంత వళ్ళు మండి "తల్లీ ! నీకు జీవితమంటే చిన్నప్పుడు మనం ఆడుకున్న బొమ్మలాటలా వుందేమో. నీ ఖర్మ తల్లీ-ప్చ్ ! ఎలాటి దానివి ఎంతకు దిగజారావే ?"

కల్యాణి యింకా నవ్వి "భయపడకే - హైదరాబాద్ వెళ్ళటం లేదులే" అంది నెచ్చెలి బుగ్గ గిల్లుతూ.

"మరి ?"

"తర్వాత చెప్తాగానీ - ఒక్క మాట — వసంతకు మన కరుణాకరాన్ని చేసుకోవాలనుందా ? ఆ పెళ్ళి చెడిపోవడానికి నేనేదో కారణ మంటూంది."

"ఔనట. నాకీ సంబంధం యిష్టంలేదని చెప్పాడట కరుణాకరం."

"అది గతం. ఇప్పుడు ఏ మున్సబుగారితోనో రాయబారం నడపమను వరదాచార్యులగారిని. ఒప్పేసుకుంటాడు కరుణాకరం."

"నీ కెలా తెలుసు ?"

"అదం తేలే."

"నే చెపితే బావుంటుందంటావా ?"

"పోనీ వాళ్ళమ్మకు చెప్పు. దానికి చాలా మేలు చేసినదానివి కాగలవు. నా మాట నమ్మి ఈ మాత్రం పుణ్యం కట్టుకోవే శాంతా."

ఆ తర్వాత కాసిని నూకలుంటే అన్నం వండుకుని, చింత పండు కారం నూరుకొని, రాత్రి చల్లతో భోజనం ముగించి బట్టలూ, సామానూ సర్దుకోవడంలో లీనమైంది కల్యాణి. గోనె సంచిలో మిగిలిన కాసిని యిత్తడి పాత్రలూ పెడ్తున్న సమయంలో వచ్చాడు రామనాథం ఈలపాట పాడుకుంటూ. వస్తూనే వంటింట్లో ప్రవేశించి కల్యాణి బుగ్గమీత చిటికవేసి "ఈ పాడు చెత్తంతా ఎందుకూ ? రాణీగారి కోసం అక్కడో బంగళా సిద్ధముఉంది. బంజారాహిల్స్ అనీ మా మంచి లొకేషన్ లే. మన ప్రొడ్యూసర్ గారి వేసవి విడి దన్నమాట. ప్రస్తుతానికి - ఏదీ నాలుగు పిక్చర్లల్లో ఛాన్స్ దొరికే దాకా అదీ మన బస. అసలు హైదరాబాద్ - ముందు యిలా రా, ఈ పాడు చాకిరీ యింక మర్చిపో. నీ జాతకంలో మరో మహాదశ ప్రవేశించిందివాళ. వేయించాలే జాతకం -" అంటూ ఆమెను రెక్క పుచ్చుకుని లాక్కుపోయి నడవమీద మంచంమీద కూర్చోబెట్టి, తను స్టూలు లాక్కుని ముందుకు వంగి కూర్చున్నాడు.

"అయితే జాతకం మారిందంటారు" అంది మళ్ళీ నవ్వి కల్యాణి.

"ఆహా బ్రహ్మాండంగా మారింది."

"మీదా నాదా ?"

"ఇద్దరిదీను."

"అయితే సినిమాల్లో జేరి లక్షలు సంపాయిస్తా మంటారు ?"

"నిస్సందేహంగా ?"

మళ్ళీ నవ్వింది జాలిగా.

"ఏం ? నీకు నమ్మకంలేదా కల్యాణీ ?"

"నాకు దేనిమీదా నమ్మకంలేదు సుమాండీ."

"అదే నీతో వచ్చిన చావు. ఇదుగో నే చెప్తున్నా విను. ఏమీ మేకప్ లేకుండా, ఈ డర్టీ చీరలో ఈ పిచ్చి వాలుజడతో ప్రతి మగాడి చూపునీ అరెస్టుచేసే పర్సనాలిటీ నీకుందంటే - నిజానికి హెయిర్ స్టయిల్ మార్చి, నైలాన్ చీర కట్టి, తగిన గెటప్ యిస్తే- నీ కసలు ఫ్రెంచి బ్యూటీల ఫేస్ కట్ వుంది. చిత్తైపోరూ జనం ? అసలెందుకు ? రెండు స్టిల్స్ పడనీ చూద్దుగానీ ? దద్దరిల్లిపోదూ ఫీల్డంతా - ఏదైనా ప్రజంటేషన్‌లో వుందన్నారు - అందాకా ఎందుకు ? మనగాల రాజాగారి కొడుకు మద్రాసులో చదివాడు. ఇంగ్లండు వెళ్ళొచ్చాడు. క్యూలో నిలబడ్డారు ఆడపిల్లలు కనీసం కాంట్రాక్టు పెళ్ళన్నా చేసుకో రాజా అంటూ. ఆయనేం చేశాడు ? గుర్రంమీద యిస్టేటు అడవులు తనిఖీకి పోయాడు. ఆరోజుల్లోనే. తమ్మిలేరు గట్టు మీద గడ్డికోస్తున్న వెంకటలచ్చి కనిపించింది. ఓ బ్యూటీ - కంట్రీ స్టఫ్ అనుకో - మతిపోయింది, టాలంట్‌ను డిస్కవర్ చేయడం మరీ గొప్ప టాలంటనుకో - ఆపాళాన పంచేశాడా ప్రిన్స్ ? ఆ పిల్లనే చూస్తూ గుర్రంమీద కూర్చున్నాడు. అలా ఎంత సేపు చూశాడో ఆయన టైం చూసుకోలా. ఆ వెంకటలచ్చి చీర గోచీ ఎగగట్టి ఆ పెద్ద గడ్డిమోపు

వెత్తిన పెట్టుకు నడుస్తూంటే వెనకాలే నడిచింది గుర్రం - గుర్రాల్లో జీనియస్ లుంటాయి తెలుసా. ఆ తర్వాత ఏం జరిగిందని ? ఆ వెంకట లచ్చిని అమాంతం గుంజుకుపోయి ఓ డాక్ బంగళాలో బాత్ రూంలో విసిరాడు. ముందు మూడు కుక్క సబ్బులు - ఆ తర్వాత ఆరు లైఫ్ బాయిలు, ఆ పిమ్మట ఓ డజన్ శాండల్ వుడ్‌లు అరగ దీయించాడు దాసీలచేత. లావెండర్ కలిపి వంద బిందెల వేడినీళ్ళు - పన్నీటి వర్ష మనుకో. ఇంట్లో పిల్లలకు పాఠం చెప్తున్న యింగ్లీషు పంతులమ్మ ట్రయినింగ్‌లో పెట్టాడు వెంకట లచ్చిని - ఎంతలో ? ఫోర్ట్ నైట్. ఈ లోగా గూడెంలో సదరు వెంకటలచ్చి జాడ తెలి యక గలభా బయలుదేరింది. చివరకు అసలు విషయం బయట పడింది. కర్రలూ బల్లేలూ పుచ్చుకొని డాక్ బంగళా మీద దాడి చేశారు - తుపాకి పుచ్చుకు బయటకొచ్చారు యువరాజాగారు. జనం కర్రలెత్తారు. బల్లేలు గురిపెట్టారు - పెద్ద కమోషననుకో. నిజానికి సినిమా తీయొచ్చు. తెలుగు సినిమా - అయిందా - "ఆగండి" అంటూ రంకె పెట్టి, "కర్రలు దించండి" అంటూ ఆజ్ఞా పించారు యువరాజాగారు.

"మేం చస్తాం - మిమ్మల్ని చంపుతాం" అన్నాయి వేయి గొంతులు.

"మీరు తొందర పడుతున్నారు" అన్నాడు యువరాజా.

"మా వెంకటలక్ష్మి ఎక్కడ ?" అన్నాడు ఓ విలన్.

అదేదో సినిమాలో అదేదో హీరోలా యువరాజావారు తుపాకి ఆవల గిరవాటుపెట్టి "మీ వెంకటలక్ష్మి మా బంగళాలోనే వుంది. క్షేమంగా వుంది." అన్నారు మరో బెంగాలీ సినిమాలో హీరోలా.

"ఎందుకు తెచ్చారిక్కడికి ?" అన్నాడు విలన్ శిష్యుడు.

"ఆగండి చెప్తా" అంటూ యువరాజావారు లోపలికి పోయి వెంకటలక్ష్మిని జబ్బ పుచ్చుకు లాక్కొచ్చి వాళ్ళముందు నుంచో బెట్టారు. రంభ - ఊర్వశి - మేనక - వాళ్ళ గ్రాండ్ మదర్‌లా వచ్చింది.

"ఎంకటలచ్చీ" అంటూ పడ్చాడు వరుసకు బావైన విలన్.

"ఆమె పేరుకూడా మారింది. మనోమోహిని అని పిలు" అన్నాడు యువరాజా.

"ఎందుకు మార్చారు?" అన్నాడు మొదటి విలన్ రెప్ప లార్పక వెంకటలచ్చిని చూస్తూ.

"ఆమె యికముందు మీ అందరికీ యువరాణి. ఇందులో స్వార్థంలేదు. సామాన్య ప్రజానీకం పట్ల నాకుగల అనురాగాన్నీ గౌరవాన్నీ యిలా ప్రదర్శించాను. నిరూపించుకున్నాను. యింకా నన్ను అనుమానిస్తున్నారా?" అంటూ క్లైమాక్స్ సీన్ డైలాగులు చెప్పాడు యువరాజా.

అంతే, లేచిన కర్రలు రాలిపోయాయి. ఎత్తిన బల్లేలు జారి పోయాయి. ఆ తర్వాత ఆమె అందాల పోటీలో మిస్ వరల్డుగా ఫస్టు ప్రయిజ్ సంపాదించి మాతృదేశ గౌరవాన్ని నిలబెట్టింది -"

"రాత్రల్లా ఆ సినిమా జనంతో కాలక్షేపం కామాల్ను మీకు?" అంది వ్యంగ్యంగా కల్యాణి.

"కరెక్ట్. నిజానికి మనం తీయబోయే సినిమా ప్లాటు ఇది. ఎలావుంది? అందులో వెంకటలచ్చి - ఎలయాస్ మనోమోహిని - నువ్వే - బావుందా?"

"బాగానే వుంది."

"గానే అనబోకండి స్టారుగారు. ముందు మనం ఏలూరు వెళ్ళాలి. అక్కణ్ణుంచి కారులో హైదరాబాద్."

"ఏలూ రెందుకు ?"

"మన ప్రొడ్యూసర్ గా రక్కడున్నారు. మనతో వారూ వస్తారు హైదరాబాద్. జాలీ కంపెనీ. చూడు ముహూర్తం పెట్టించా ప్రయాణానికి. సరిగ్గా నాలుగూ యాభై కి ఖావుంది. కారొస్తుంది. రెడీగా వుండాలి నువ్వు. చీరలు లేవని బాధ పడకు. ఏలూరులో కొనుక్కుందాం." అంటూ లేచాడు రామనాథం.

"ఆగండి."

"ఏమిటి ?"

"నేను రావడంలేదు."

రామనాథం నెత్తిన నాపరాయి పగిలింది.

"ఎందుకని ? ఏమిటి నువ్వంటున్నది ? ఏమిటి రాణీగారూ నన్నే ఆట పట్టిస్తున్నారా ?"

"కాదు రామనాథంగారూ. నిజంగానే చెప్తున్నాను నేను మీతో రాదల్చుకోలేదు."

"ఎందుకని ? యింత జరిగాక ?"

"ఏం జరిగింది ?"

"ఏర్పాట్లన్నీ చేసుకువచ్చానే !"

"ఈ దిక్కుమాలిన ఏర్పాట్లు చేయమని నేనేం ప్రాధేయ పడలేదే ?"

"నీ మంచికోసం -"

"ఇప్పటికి చాలామంది అన్నారామాట. రామనాథంగారూ! మీరు ఏ శ్రమలూ పెట్టుకోబోకండి. నేను రావడంలేదు. రాను, రాలేను."

"ఏం, వంట్లో బావుండలేదా?"

"నాకేం రోగం? నిక్షేపంలా వున్నాను."

"ఏదో అపార్థం చేసుకున్నావు నన్ను కల్యాణీ."

"అపార్థం కాదు. సరిగ్గానే అర్థం చేసుకున్నాను. సమయం చేయిజారిపోకముందే అర్థం చేసుకోవడం జరిగింది. దయుంచి వెళ్ళండి. ఆ యువరాజావారిలా గాలించండి ఆ చేలగట్లూ ఏటి వడ్లూను. మరో వెంకటలచ్చి దొరక్కపోదు."

"కల్యాణీ!"

"దయుంచి వెళ్ళండి."

"ఇదే చివరిమాటా?"

"చివరి మాటా మొదటిమాటా అంటూ లేదు. ఒకటే మాట చెప్తున్నాను - వెళ్ళండి - నాకు చాలా పనుంది. మరో సంగతి - ఈ సత్రంలోంచి నే వెళ్ళిపోతున్నాను. మీ భోజనపు ఏర్పాట్లు మరొక చోట చేసుకోండి."

రామనాథానికి కోపం వచ్చింది. "ఎక్కడికి వెళ్తున్నావ్?" అన్నాడు.

"ఎక్కడికో చెప్పవలసిన బాధ్యత నాకూ లేదు, తెలుసుకోవలసిన అవసరం మీకూ లేదు."

"రాత్రి ఎక్కడి కెళ్ళావ్?"

కల్యాణి దెబ్బతిన్న చిరుతపులిలా చూస్తూ "ఏట్లోకి, మీ కెందుకు?" అంది.

"ఎందుకా? ఎందుకో చెప్తా. గాలి మరో దిక్కుకు మారిందన్న మాట. నీ బ్రతుకేమిటో ఎంతటిదో నేనూ చూస్తా. యూ బిచ్. నీ సంగతి నాకు మొదటినుంచీ తెలుసే కులటా."

"మరి తెలిసే తాళి గట్టానని వచ్చావేం?" అలా యెలా గాజులు తొడిగించుకున్నావ్. వెళ్ళు - వెళ్ళు."

పెద్దగా కేకలు వేసుకుంటూ, చకచక అంగలు వేసుకుంటూ, వరదాచార్యుల వారినీ, వారి బృందాన్నీ వెతుక్కుంటూ వెళ్లాడు రామనాథం రావిచెట్టు దగ్గరకు.

# ఇరవై ఒకటి

ఆ వూరు వచ్చేదాకా కరుణాకరానికి తాను చాలా అదృష్ట వంతుణ్ణనే అభిప్రాయం వుండేది. కష్టాలు పడలేదని కాదు. కళ్ళు తెరిచి ప్రపంచాన్ని అవగాహన చేసుకోలేని పసితనంలోనే అనాధలా, సంతలో మారపడి, తిరిగి తిరిగి కూలబడిన పసిపాపలా విసిరివేయ బడ్డాడు హైదరాబాద్ రోడ్లమీద. ఆనాటి వరకూ అతనికి చరిత్రంటూ లేదు. అంటే మరొక ప్రాణిమీద ఎటువంటి ప్రభావమూ ప్రసరించని జీవితమయింది. ఆ రోజుల్లో ఏం తిన్నాడు? ఎక్కడ వున్నాడు? ఎలా బ్రతికాడు అంటే ఆ ప్రశ్నలకు సమాధానం అతనుకూడా చెప్పలేడు. గాలిని పొట్టపోసుకుంటూ, పేవ్‌మెంట్ల మీద పడుకుంటూ, మండు టెండలనూ నరాలు కొరికే చలినీ జయించిన కాయ శరీరాన్నీ, దానితోపాటు మొద్దుబారిన మనస్సునూ సంపాదించాడు. ఆ తర్వాత అతని చరిత్ర పధ్నాలుగు సంవత్సరాల వయస్సులో ప్రారంభమయింది. ఈ రోజు నిద్ర బద్ధకం వదలక, కప్పుకున్న రగ్గు సగంమాత్రం గుండెలదాకా తొలగించి వంటవాడు కలిపి తెచ్చిన ఫిల్టర్ కాఫీ త్రాగుతూ, రవ్వంత కిటికీ తెరిచి బయట కురుస్తున్న తుప్పరనూ, వేగంగా వేయి విమానాల గుంపులా అపార సేనా వాహినిలా పొంగుతున్న మహా సముద్రంలా మహా విప్లవానికై ఉవ్వెత్తున లేచిన జనవాహినిలా క్షణక్షణానికీ రూపం మార్చుకుంటూ పరుగులు తీస్తున్న మబ్బుల దొంతరలను చూస్తూ, చదవాలని ప్రయత్నం చేస్తున్న పుస్తకంలోని ఒక ప్రశ్నకు సమాధానం వెతుక్కుంటున్నాడు కరుణాకరం. ఏదో తెలుగు నవల. కథానాయకుడు చివరలో చచ్చిపోయే ముందు ఆత్మ పరిశోధనలో చిరకాలంగా వేధిస్తున్న ఒక ప్రశ్నకు సమాధానం వెతుక్కుంటాడు.

"నేను అదృష్టవంతుణ్ణా కాదా ?" అదీ అతని శేషప్రశ్న.

దానికి ఎంత ఆలోచించినా సమాధానం రాదు. పాత్ర ఆయువు తీరిపోతుంది. చివరకు రచయిత జీవితంలోని అదృష్టాల గురించీ, దురదృష్టాల గురించీ చర్చించటంతో నవల పూర్తి అయింది. ఆ రచయిత వ్రాసిన చివరి మాటలు తనను గురించే వ్రాశాడనిపించింది.

నీ జీవితం విజయవంతమా ? ఓడిపోయిందా ? ఈ ప్రశ్నకు ఒక విధంగా సమాధానం చెప్పుకోవచ్చు. నీకు భగవంతుడు కని పించాడనుకో- ఏ మానవుడికీ ఎన్నడూ లభ్యంకాని ఒక అద్భుతమైన వర మిచ్చాడనుకో - ఇదే జీవితం తిరిగి మొదటినుంచి మరొకసారి బ్రతుకవోయ్ నరుడా - అన్నాడనుకో, అప్పుడు ఆ అవకాశం నీకు వరంలా కనిపిస్తుందా ? శాపంలా - పాపంలా పరిహసిస్తుందా ? ఎగిరి గంతేసి - మళ్ళీ బ్రతుకుతాను హుషారుగా ఇదే జీవితం భగ వంతుడా - అని నీవు అనగలిగితే జీవితాన్ని జయించిన - అనుభ వించిన - ప్రేమించిన - అదృష్టశాలివి నువ్వు. అలా కాకుండా - ఒద్దు బాబోయ్, ఆ గడిచిపోయిన జీవితాన్ని కాలగర్భంలో కలిసి పోనీ. ఆ అనుభవాలేకాదు, వాటి తాలూకు జ్ఞాపకాలు కూడా నాకు వద్దురా తండ్రీ - అంటూ మూలిగావా - నీవు పరాజితుడి వనీ, దురదృష్టవంతుడవనీ, జీవిత పోరాటానికి తలవంచి పరిగెత్తిన భీరుడవనీ - అర్థం. అంటూ ఒక పరిష్కార మార్గం చూపెట్టి పాఠకు లను సమాధానం వెతుక్కోమన్నాడు - తక్కువ కోరికలతో ఎక్కువ భయాలతో బ్రతికేవాడినే దౌర్భాగ్యుడంటారు - అంటూ నిర్వచనం చెప్పాడు. ఆశలుండాలని చెప్పినంత మాత్రాన దురాశ పనికిరాదన్నాడు. పిల్లికూనకు ఏనుగును మ్రింగాలనే కోరిక వుండ టంలో అర్థం లేదంటూ షరతు పెట్టాడు. కష్టాన్ని చూసి భయ

పడకు - ఎదురుగుండా గుండెలు పెట్టుకు వెళ్ళి ఎదిరించు - అంటూ సలహా చెప్పాడు. సుఖపడాలంటే కష్టమంటే ఏమిటో అనుభవించి తెలుసుకో - అంటూ హితోపదేశం చేశాడు. కష్టాల బ్రేకులు, మధ్య మధ్య పడకపోతే సుఖాల బండి బోల్తా కొడుతుంది. నిమ్నోన్న తాలతో వక్రమైన జీవిత పథంలో పరిగెత్తలేక - అంటూ హెచ్చ రించాడు. చివరకు కష్టంకంటె, సుఖంకంటె జీవితం గొప్పదని నమ్మిన వాడే జీవితాన్ని జయించగలడు - అంటూ ముగించాడు. రచన బావుందనిపించింది. ఏదో హోటల్లో సర్వరుగా పనిచేస్తూ అక్షర జ్ఞానం సంపాదించి రచనలు సాగిస్తూ - పాతికా పదీ సంపాదిస్తూ - పొరపాటున పెళ్ళి చేసుకుని, గవర్నమెంటువాళ్ళ కుటుంబనియంత్రణ మంత్రాన్ని పాటించక వరసగా సైజులవారీగా పిల్లల్నికని, దారి ద్ర్యాన్ని రెండో భార్యగా స్వీకరించి డజన్లకొద్దీ అప్పుల్ని కూడా కని, ఆ సంసారభారంలో నలిగిపోయి చచ్చిపోయేట్ట ఆ సర్వర్ వెంకటేశం. అటువంటివాడు ఈ చక్కటి నవల ఎలా వ్రాశాడో అర్థంకాలేదు. అంత తెలివిగా జీవితాన్ని గురించీ ప్రపంచాన్ని గురించీ ఆలోచించి పదిమందికీ చెప్పగల పెద్దమనిషి, ఆ జీవితంలోనే ఎందుకు పరాజితుడై పచ్చికుండలా విచ్చి, కసుగాయలా రాలి పోయాడో అంతు చిక్కలేదు.

ఇంతకాలం తాను అదృష్టవంతుణ్ణనే అనుకున్నాడు. అందరూ ఆ విషయాన్ని సృష్టి సత్యంగా అంగీకరించారు. కాని ఇటీవల తాను భ్రమపడ్డాననే అనుమానం కలుగుతోంది. డబ్బుతో జీవితంలో సమస్యలన్నీ పరిష్కారమైపోతాయనుకోవడం ఎంతటి భ్రమో, అనుభవం వలన తెలుసుకున్నాడు.

"బాబూ !" అన్నాడు ముత్తెం.

ఊహాపథంనుండి తలెత్తి చూసి "ఏం ముత్తెం - రా - కాఫీ తాగావా ?" అన్నాడు.

క్రింద కూర్చున్నాడు ముత్తెం చేతికర్ర మూలపెట్టి, చెప్పులు బయట విప్పి. ఎంత కోరుకున్నా తన దగ్గర చనువు తీసుకోని మనిషి ఒక్కడే. చిన్ననాటి ముత్తెం మారిపోయాడు. పొగరుమోతుతనం తగ్గింది. వినయ విధేయతలు నేర్చుకున్నాడు. "అలా కుర్చీలో కూర్చో ముత్తెం" అన్నాడు లాలనగా.

"తప్పండీ."

"నే చెప్తున్నాగా ?"

"పెద్దోళ్ళు చనువిచ్చారని నెత్తిన ఎక్కగూడదండీ."

"ఎవరు యిందులో పెద్ద ముత్తెం ? నన్ను ఎవ్వరూ అర్థం చేసుకోవడంలా. నువ్వుకూడా. ఆ వరదాచార్లుగారికి నేనే మపకారం చేశాను చెప్పు ? దావా వేయించాడు రాజుగారి వారసులచేత. ఆ పొలం కొనడం చాలా పొరపాటు ముత్తెం. ఇలా మనుష్యులు డబ్బు కోసం గడ్డితింటారనుకోలేదు. చివరకు మున్సబుగారు కూడా వాళ్ళ పక్షాన పనిచేస్తున్నారు. దావాకి పదివేలు కావాలి. ప్రస్తుతం పది వందలు లేవు నా దగ్గర. ఈ యిల్లు బేరంపెట్టు ఎవరికైనా."

నేను ముందే చెప్పాను బాబూ, ఈళ్ళంతా నక్కలని. చివరకు అందరూ కలిసి మీకు గొయ్యి తవ్వుతారు. మనమూ కూసంత తెలివిగా ఉండాలి బాబూ. ఈ ఊళ్ళో మీ డబ్బు తినని ఎదవ లెవరు ? చెవులు మెలబెట్టి వసూలు చేద్దాం."

"ఎవ్వరూ యివ్వడంలేదు ముత్తెం."

"దావా తగిలించండి."

"మనకు అంధుకు ఆధారమేముంది? కాగితం వ్రాయించుకుని ఎవరికిచ్చాం?"

"డబ్బుకు భయపడకండి బాబూ. నేనున్నాగా. ఈ దావా ఎందుకు నెగ్గదో చూద్దాం."

"ఏమో ముత్తెం - నాకు చాలా విసుగ్గా వుంది. ఆ దేముడిచ్చిన ఐశ్వర్యంతో అందరికీ సహాయం చేద్దామనే ప్రయత్నించా. నేను పెట్టిన అన్నం విషంగా మారి చివరకు నన్నే దహిస్తూందిరా."

ఇన్నాళ్ళ తర్వాత ముత్తెను 'ఒరే' అన్నాడు కరుణాకరం.

మోసపోయిన మనిషి కరుణాకరం - కాలవకు ఎగువను చవిటిపర్ర లన్నింటినీ సస్యశ్యామలంగా మార్చి పంటలు పండించి పదిమందికి పెట్టి తాను తినాలనుకున్నాడు. అయిదారు కుటుంబాలను పాకలు వేసి అక్కడకు తరలించాడు. ఉద్యోగం పోయిన నంబాచార్లు అల్లుడికి ఉపాధి చూపెట్టి అక్కడొక యిల్లుకూడా యిచ్చాడు. అదొక అపవాదయింది వరదాచార్యులవారి ఆశీర్వాద బలంతో. 'చెల్లీ' అంటూ పిలిచాడు శాంతను. అది మహాపరాధమంటూ రావిచెట్టుక్రింద సభలో ఎలుగెత్తి అరిచాడట వరదాచార్యులు. "తప్పులు చాలామంది చేయవచ్చు. అందులో కూడా నీతీ నిజాయితీ వుండాలి. వేశ్యల్లో కూడా పాతివ్రత్యం వుండాలి. అదీ మన సంప్రదాయం. ఆ పాడు సంబంధాన్ని చేసిన పాపాన్ని కప్పిపుచ్చుకుంటానికి లోకం కన్ను గప్పటానికీ ఆ బుచ్చిరామయ్య పెళ్ళాన్ని 'చెల్లమ్మా' అనగానే సరిపోయిందీ? ఆ మహాపాపం ఊాళనమైపోయిందీ? ఈ ఊరికి కొన్ని అరిష్టాలు పట్టి తగలబడిపోయే రోజు వచ్చింది. మున్సబుగారు కూడా గాజులు తొడిగించుకు కూర్చోవడం మన దురదృష్టం."

ఈ మాటలు విన్న నంబాచార్లు యధాతంధగా కరుణాకరానికి వచ్చి చెప్పిపోయాడు. ఆనాటినుంచీ కాలవ దగ్గరకు

వెళ్ళటమంటేనే భయంగా వుంటూంది. వెళ్ళినప్పుడల్లా 'అన్నయ్యా' అంటూ పెద్ద గ్లాసు మజ్జిగ యిచ్చేది శాంత. అమృతంలా త్రాగితే సేద తీరినట్లనిపించేది. "నిన్ను చల్లగా చూడమని వేయి దేముళ్ళకు మొక్కుకుంటున్నా నన్నయ్యా. మా సంసారం నిలబెట్టావు. ఆయనకు దోవ చూపెట్టావు" అంటూ ఆనాడు శాంత కాళ్ళకు నమస్కరించి కళ్ళు తుడుచుకుంది. తన ఫొటో తెప్పించుకు యింట్లో పెట్టుకుంది. దానిమీద ఎప్పుడూ వాడని పూలమాల కనిపించేది.

"ఏమిటీ పిచ్చి తల్లీ" అన్నాడు ఒకనాడు తన రాకను గమనించకుండా ఫొటో దగ్గర నిలబడి తదేకంగా చూస్తూ పరధ్యాన్నంలో మునిగిపోయిన శాంతను చూసి.

"ఏముందన్నయ్యా. ఇంతకంటె నేనేం చేయగలను చెప్పు. నేను ఏడుకొండలవాణ్ణి ఏమని ప్రార్థిస్తున్నానో నీకు తెలుసా అన్నయ్యా - ఈ భూమండలానికి నీలాంటి దేవత రాజయితే పగిలిపోయిన ఎన్ని లక్షల గుండెలు బాగుపడగలవో, ఎండిపోయిన ఎన్నికోట్ల మోడులు చిగురించగలవో ఎవరూహించగల రన్నయ్యా. అందుకే ఆ ఏడుకొండలవాడి ప్రక్కనే నీ ఫొటో పెట్టాను."

"మనిషికీ దేముడికీ మధ్య చాలా దూరముందమ్మా. మానవ మాత్రులం దైవానికి అంత దగ్గరకు జేరితే ఆ తేజాన్ని భరించ గలమా ?"

"నీకు తెలియదన్నయ్యా."

చింపిరి పీలికలు కుట్టుకుంటూ చిరిగిన చీరకు మరమ్మతులు చేసుకుంటున్న శాంతను చూసి ఒకనాడు నాలుగు చీరెలు కొని తీసుకుపోయి యిచ్చాడు కరుణాకరం.

ఆ చీరల్ని చూసి కృతజ్ఞతా భారంతో ఆర్ద్రమై కరిగి చెమ్మగిల్లిన కళ్ళతో "ఎందుకన్నయ్యా ఇవన్నీ?" అంది.

"తప్పేముందమ్మా. నాకు అక్కచెల్లెళ్ళంటూ ఎవరూ లేరు. ఉంటే ఎంత బావుండేదా అనుకునేవాణ్ణి. నా కష్టసుఖాలు పంచుకుని తృప్తిగా భరించటానికి ఎవరున్నారమ్మా."

"కాని - ఇలా చీరలూ అవీ నువ్వు తీసుకురాగూడదన్నయ్యా."

"ఏం?"

"ఏంలేదు - అది మంచిపని కాదు."

"అంటే? ఎవరన్నా ఏమన్నా అనుకుంటారని భయమా?"

"ప్రపంచానికి భయపడి ఎంతకాలం బ్రతకగలంగానీ - ఏదో అభిమానం కొద్దీ ఆయనకు ఈ పొలాల వ్యవహారాలు అప్పజెప్పి ఇలా డబ్బు ముట్టజెప్తున్నావుగానీ, మాకిచ్చేదానికి సమానంగా మేం ఉపయోగపడటంలేదు నీకు."

"కఠినంగా మాట్లాడకు చెల్లీ. జీవితంలో ప్రతి పనికీ మనం అణా పైసలతో విలువకట్టి అంచనా వేయగలమా?"

"నీ ఋణం ఎలా తీర్చుకోగలం చెప్పు కాస్త."

"వద్దు చెల్లీ. ఆ పిచ్చిపని చేయాలనే ఆలోచన కూడా పెట్టుకోకు. ఈ రుణానుబంధం జన్మజన్మలకూ యిలాగే వుండిపోనీ."

"నీ యిష్టం అన్నయ్యా. నీమాట కాదనేందుకు నేనెవర్ని?"

శాంత గుర్తుకు రాగానే అర్థంలేని ఆవేశంతో వేదనతో వెర్రి బాధ కలిగి "ఈ ప్రపంచం నాలాంటి వాళ్ళకు కాదు ముత్తెం" అన్నాడు కరుణాకరం.

"మీరు అనవసరంగా బాధ పడకండి బాబూ. మీ మెతకతనమే దీనికంతకూ కారణం. ఈ పాడు లోకంలో మంచితనాన్ని చేతకానితన మనుకుంటారు బాబూ. డబ్బు గురించి ఇబ్బంది పడ

బోకండి - దావా నడిపిద్దాం. న్యాయం ఎందుకు గెలవదో చూద్దాం" అంటూ పరుగెత్తాడు ముత్తెం.

తాను ఈ వూరు రావడానికి అసలు కారణం కల్యాణికి పూర్తిగా తెలియదు. తన మనస్సూ, శరీరం ఏకమై ఎందుకోసం యింతగా తపన పడుతున్నాయో ఆమె కర్థంకాదు. కల్యాణి వెళ్ళి పోతుందనుకున్నాను రామనాథంతో కలిసి హైదరాబాద్. "అక్కడ రిజిస్టర్డు మారేజి చేసుకుంటున్నాం" అన్నాడు రామనాథం. రామనాథానికి ఉద్యోగానికి సిఫార్సుచేస్తూ ఓ మిత్రుడికి ఉత్తరం కూడా యిచ్చాడు. ఆ మిత్రుడు అప్పు అయ్యర్. చాలా సంవత్సరాల క్రితం తనతోపాటు హోటల్ సర్వర్‌గా పనిచేశాడు. తర్వాత చిన్న సందులో ఒక పాకలో ఇడ్లీ భవన్ పెట్టాడు. ఉప్పూ కారమున్న టిఫిన్ దొరకక మొహం వాచిపోయిన హైదరాబాద్ వలస వచ్చిన తెలుగు వాళ్ళలో ఈ ఇడ్లీభవన్ వార్త అడవి మంటలా వ్యాపించింది. కొద్ది రోజుల్లో క్యూలో నిలబడుతున్నారు జనం. అక్కడ దొరికేది కేవలం యిడ్లీ - అల్లపు పచ్చడీ - కమ్మటి కారప్పొడీ - కొద్ది రోజుల్లో ఇడ్లీమీద భ్రాంతికొద్దీ జిహ్వా చాపల్యం ఆపుకోలేక పెద్దవాళ్లు కూడా కార్లలో ఆ పాకముందు ఆగడం మొదలు పెట్టారు. కొద్ది నెలల తర్వాత ఓ పెద్ద సెంట్రల్ గవర్నమెంట్ ఆఫీసు రావడంతో ఆ ప్రాంతానికీ ఆ సందుకూ ప్రాముఖ్యత వచ్చింది. ఇడ్లీ భవన్ వున్న మాజీ బొగ్గులడితీ ఖాళీ స్థలమంతా కొన్నాడు అయ్యరు. సంవత్సరం తిరక్కుండా రెండు గదులు వేశాడు ఏజ్‌బెస్టాస్ రేకులతో. మరో ఆరునెలల కది రెండు గదుల డాబా అయింది. కథ క్లుప్తంగా చెప్పాలంటే నాలుగు సంవత్సరాలకు వంద గదుల ఆరంతస్థుల విశ్రాంతి మందిరమయింది ఆ ఇడ్లీ భవన్. అప్పు అయ్యర్ తలుచుకుంటే రామనాథానికి నెలకు రెండు వందల రూపాయల ఉద్యోగం యివ్వలేకపోడు. కల్యాణీ అతనూ

సుఖంగా బ్రతకలేకపోరు - అలా అనుకుని సంతృప్తి పడ్డాడు. కాని చివరకు బయలుదేరే సమయంలో కల్యాణి మనస్సు మార్చుకోవడం లోని ఆంతర్యం అర్థంకాలేదు. ఎందుకిలా చేసింది ? ఇటువంటి సమాధానం రాని లేని వేయి ప్రశ్నలు సృష్టించిందామె తన జీవితంలో! ఆ వూరు వదిలి తానే తిరిగి విశాల ప్రపంచంలో రవ్వంత మనశ్శాంతి నిచ్చే తావు వెతుక్కుంటూ వెళ్ళిపోదా మనుకున్నాడు. కాని వ్యవహారాలన్నీ అలాగే వుండిపోవటంతో అప్పట్లో అది సాధ్యం కాకపోయింది. ఆ తర్వాత తానే వెళ్ళిపోతానన్నది. ఆమె ఉనికి తొలగిపోతే నిరంతరంగా వీస్తున్న ఈ పెనుగాలులు తొలగి మనో వీధిలో కొంత ప్రశాంత వాతావరణం ఏర్పడవచ్చు.

ఆనాడు "హైదరాబాద్ రేపు వెళ్ళిపోతున్నాను కరుణా" అంటూ వచ్చింది కల్యాణి. అప్పుడు ఆమె చెప్పిన మాటలు యింకా మనస్సులో ప్రతిధ్వనిస్తూనే వున్నాయి.

—"నన్ను అపార్థం ఎన్నడూ చేసుకోకు కరుణా. ఈ జీవితానికి ఏదో శాపం వుంది. పాపం పులుముకుంది. అది నీ కర్థం కాదు. ఆకాశానికీ భూమికీ మధ్య ఎంతెంత దూరం? మధ్య ఎంత అగాధం? ఆకాశాన్ని చూసి సముద్రమైన మనస్సు ఎంత పొంగినా ఎంత దూరం పోగలదు ? ఎగిరి ఎగిరి అందుకోలేక ఏమౌతుంది చెప్పు ఆ కన్నీటి పొంగు ? ఎవరి ఏకాంతాలు వారివి. కనిపించని సంకెళ్ళు మనల్ని బంధిస్తాయి. వినిపించని గొంతులు కఠినస్వరంతో చేయరాని చేయలేని పనులు చేయమంటూ మనని ఆదేశిస్తాయి. వివేకంలాంటి చుక్కానిని కోల్పోయి, ఉద్వేగాల ఉప్పెనలో ఉవ్వెత్తున లేస్తున్న తరంగాలలో చిక్కుకున్న నౌక మన మనుకున్న మార్గంలో నడుస్తుందా ? గమ్యం తెలియక కాదు కరుణా ఈ వెర్రి బాధ - దాన్ని చేరుకోలేక. కాని ఎన్నడో ఎక్కడో ఆకాశం భూమిని కలుస్తుంది.

తప్పకుండా అప్పుడు భూగర్భంలో దాగి మండుతున్న లావాగ్ని బయటకొచ్చి అంతర్యం బయటపడదంటావా ? భూమీ ఆకాశం ఏకం కావంటావా ? ఆ క్షణం వచ్చినప్పుడు నీ ప్రశ్న అన్నింటికీ తప్ప కుండా సమాధానం చెప్తాను కరుణా. అంతవరకూ నీ దగ్గర శలవు తీసుకోక తప్పదు."—

ఈ మాటలు చెప్పి వెళ్ళిపోయింది కల్యాణి.

మళ్ళీ ఆమెను చూడటం జరుగుతుందనుకోలేదు.

ఆమె గదిలోంచి బయటకు పోగానే దుర్భరమైన శూన్యం గుండెల్లో. నరాల్లో ఆవరించి కొంతసేపు అతన్ని నిస్తేజితుణ్ణి చేసింది మనుష్యుల్ని ఒకరి కొకరిని కనిపించకుండా కట్టిపడేసే బంధం ఎంత గట్టిది ? విడిపోవటం కోసమే కలుసుకోవడం జరుగుతుందా తన జీవితంలో ఎవరినైనా ? ఆ మాటలు చెప్పి కొన్ని క్షణాలు తల వంచుకు మౌనంగా నిలబడింది కల్యాణి ఆనాడు. కన్నీటిలో కరిగి పోతున్న మౌనంతో ఆమె వెళ్ళిపోయింది.

"నా గుండెల్ని పగలగొట్టి వెళ్ళిపోతున్నావు కల్యాణీ" అని చెప్పాలనుకున్నాడు. చెప్పలేక పోయాడు. చెప్పినా ప్రయోజనం లేదని తెలుసు. "కల్యాణీ - నువ్వు నాకు కావాలి. ఊపిరి ఎంత అవసరమో నేను బ్రతకటానికి నువ్వూ అంతే అవసరం" అని చెప్పా లనుకున్నా పెదిమలు కదలలేదు. ఆత్మీయులకు వీడ్కోలు చెప్ప టంలో మృత్యుదేవి రోదన వినిపిస్తుందేమో !

ఆనాటి సాయంత్రం బాగా చీకటిపడిం తర్వాత ఏమీ తోచక అలా బయటకు వెళ్ళినప్పుడు - రావిచెట్టు క్రింద అరుగుల మీద ఒక మూలగా కూర్చున్నప్పుడు తన ఉనికిని గమనించని గొంతులనుండి వచ్చిన మాటలు వద్దంటున్నా చెవిన పడ్డాయి.

"మాషారి కూతురు ఆ రామనాథానికి టోపీ పెట్టి ఆ రాజా రావు దగ్గర చేరింది."

"రేపో మాపో చచ్చేవాణ్ణి పట్టుకు వెంపర్లాడుతుందే ?"

"అదంతా నాటకం గురూ, వెనకనుండి నాటకం నడిపిస్తున్న కథానాయకుడు కరుణాకరం."

"మొన్న రాత్రి ఆవిడగారు కరుణాకరంగారి యింటికొచ్చి వెళ్ళటం ఉప్పరి మల్లమ్మ చూసిందట."

"డబ్బుంది గనక ఆ కరుణాకరం ఎన్ని నాటకాలాడినా చెల్లుతున్నాయి."

"ఇంకెన్నాళ్ళులే. వాడికి చిప్పా కర్రా చేతికొస్తుంది చూడు."

అంతలో ఆ బృందంలోని ఒక పెద్దమనిషి దూరంగా కూర్చున్న కరుణాకరాన్ని చూసి "ఎవరూ ?" అన్నాడు.

కరుణాకరం మాట్లాడలేదు.

"ఎవరండీ, మాట్లాడరేం ?" అంటూ టార్చిలైటు వేశాడు మరొక వ్యక్తి. కరుణాకరం ఎటువంటి భావమూ లేకుండా ప్రశాంతంగా మౌనంగా కూర్చున్నాడు. ఆ క్షణంలో ఆ బృందంలోని పెద్దమనుష్యుల ముఖాలు ఎంతగా మారాయో ఆ చీకటికే తెలియాలి.

# ఇరవైరెండు

ఎవరూ ఎన్నడూ ఊహించని సంగతులు అప్పుడప్పుడు జీవితంలో జరుగుతూనే వుంటాయి. వసంతను పెళ్ళి చేసుకోవాలని ఎన్నడూ అనుకోలేదు కరుణాకరం. వసంత కూడా ఆశ నిరాశ చేసుకుంది. ముత్తెంకూడా నమ్మలేదు ఎన్నడూ. చివరకు అదే జరిగింది. వరదాచార్యులవారు సంబంధం కుదిరి ముహూర్తం పెట్టుకున్నాక వెంటనే కరుణాకరం దగ్గరకొచ్చి లెంపలేసుకుని "నిన్ను అర్థం చేసుకోలేక పోయాను బాబూ. దేముడిలాంటి మనిషివి నువ్వు. నన్ను క్షమించు నాయనా" అంటూ రెండు చేతులూ పట్టుకు బావురుమన్నాడు. తాను నీతి బాహ్యుడనీ, వ్యసనపరుడనీ పదిమందినీ నమ్మించటానికి భారీయెత్తున ప్రచారం సాగించిన వరదాచార్యులవారిలో కలిగిన ఈ మహా పరివర్తన వలన, కరుణాకరానికి ఆయనమీద గౌరవమేమీ పెరగలేదు. పెళ్ళికూడా అతి సాధారణంగా జరిగింది. అటు ప్రక్క వరదాచార్యులవారు, యిటు ముత్తెం - ఇంచుమించు ఆ యిద్దరే ఏర్పాట్లన్నీ చేశారు. గోవింద యతీంద్రులవారు సపరివారంగా తరలివచ్చి కల్యాణ మంటపంముందు ముఖ్య అతిధిగా కూర్చొని నూతన వధూవరుల్ని ఆశీర్వదించారు. ఊళ్ళో అన్ని వర్ణాలవారికీ భారీయెత్తున భోజనపు ఏర్పాట్లు చేయడం జరిగింది. ముత్తెం దేవాలయంలో సీతారాములకు ప్రత్యేకంగా నవ దంపతుల పేరున కైంకర్యాలు ఏర్పాటు చేయించాడు.

వివాహ సమయంలో కరుణాకరంలో కొంత ఉదాసీనత కనిపించింది. రాజారావుదగ్గర ఉంటున్నది కల్యాణి. స్వ[illegible]ంగా తాను వెళ్ళి పిలిచాడు పెళ్ళికి రమ్మని.

"ఎందుకురా లేనిపోని గొడవలు ?" అన్నాడు రాజారావు.

"నీ పెళ్ళి మంత్రాలూ బాజాలూ యిక్కడిదాకా వినిపించ వంటావా ?" అంది కల్యాణి. తాను బలవంత పెట్టాడు రమ్మని. "సరే, చూద్దాం" అని మాత్రం అంది. పెళ్ళికి మర్నాడు కార్యం జరిగింది. వసంత జీవితంలో వసంతోదయ మయినట్లు ఆమె శరీరంలో అణువణువునా ఆనందం విరియబూసింది. పెళ్ళికి కల్యాణి రాక పోవడం లోటుగానే కనిపించింది కరుణాకరానికి. "నా చేతుల మీదుగా నీ పెళ్ళి చేయిస్తాను కరుణా" అంటూ ఆమె చెప్పిన మాటలు యింకా అతని చెవుల్లో రింగుమంటున్నాయి. తొలినాటి రాత్రి సౌందర్యం కప్పుకున్న యౌవన మాధురిలా తలంటుకొని మొగిలిరేకులతో మల్లె పువ్వులతో మత్తెక్కించే పరిమళాలను గది నంతా నింపుతూ విరిగిపడిన కోరికలా మంచంమీద వళ్ళు మరచి నిద్రపోతున్న వసంతను చూసినప్పుడు చిత్రమైన ఉద్వేగంతో అతని హృదయం కంపించింది. తన చుట్టూ కోటివేల ఆశల తోరణాలను కట్టుకున్న జవ్వని. తన కన్నీటినీ, కష్ట సుఖాలనూ పంచుకుంటానికి జీవితాన్ని చీల్చుకుని భాగం పంచుకున్న అర్ధాంగి. తనకు బిడ్డలను కని వంశాన్ని ఉద్ధరించబోతున్న మాతృశ్రీ. సంస్కృత శ్లోకం గుర్తుకు వచ్చింది. తనను సుఖపెట్టే రంభ, సలహా చెప్పే మంత్రి, సేవలుచేసే దాసి - జరిగినదంతా పీడ కలలా మరిచిపోగలిగితే ? ఏదో సినిమా గుర్తుకు వచ్చింది. కారు ప్రమాదంలో ఒకామెకు గాయం తగిలి మెదడు చెడిపోతుంది. గతాన్నీ, దానితోపాటు తా నంతవరకూ ప్రేమించిన ప్రియుణ్ణి కూడా మరిచిపోతుంది. పరామర్శించటానికి గుండెలు బాదుకుంటూ వచ్చిన ప్రియుణ్ణి 'ఎవరు నువ్వు ?' అన్నట్లు చూసింది. అంతా మరిచిపోయింది. కొంగ్రొత్త జీవితం ప్రారంభించింది. ఆ తర్వాత ఏం జరిగిందో గుర్తు

లేదు. తనకూ అలా జరిగితే బావుణ్ణు. వసంత మొదటిసారి విమాన మెక్కిన పల్లెటూరి పైతులా, తొలిసారి ఇంద్రధనస్సును చూసిన శైశవం దాటని పసిడి హృదయంలా, అప్పుడే రెక్కలు విప్పుకొని ఆకసంలో ఎగిరిపోయిన పక్షిలా, వికసించి రేకలు విప్పుకున్న బొండు మల్లెలా, కట్టలు త్రెంచుకుని యింకా పొర్లి ప్రవహిస్తున్న వరదలా - కదులుతూ కంపిస్తూ కలల దొంతరల్లో చిరునవ్వుల్ని కరిగించుకుంటూ, వెచ్చటి పరుపుకు పచ్చటి పారాణి పులుముతూ, వేడెక్కిన బుగ్గల నిగ్గులను అద్దంలో చూసుకొని పెదవి కొరుక్కుంటూ, రేగిన ముంగురులనూ జారిన పయ్యెదనూ సవరించుకుంటూ, చెరిగిన తిల కాన్ని సరిదిద్దుకుంటూ, నిద్రలేమిచే నలిగిన శరీరానికి విముక్తి కని పించక వళ్ళు విరుచుకుంటూ, చీకటి ముసుగులో సిగ్గునూ రగ్గునూ తొలగించుకుని సుఖాల చలిమంటలో నులివెచ్చని కమ్మదనాన్ని అనుభవిస్తూ కాలాన్ని విస్మరించింది. కాని, ఆగని కాలం కరుగుతూ జరుగుతూనే వుంది. మరొక నెల గడిచింది. పాలు పొంగి పొర్లి మండుతున్న బొగ్గులపై పడి వేడి తగ్గినట్లు ఈ నాడు ఆమె ప్రపం చాన్ని చూడగలిగే స్థితిలో కళ్ళు తెరిచింది.

ఆనాటి రాత్రి కరుణాకరం కేకపెట్టాడు నిద్రలో. ఆమె లేచింది. 'కల్యాణీ' అంటూ ఏడుస్తున్నాడు. లైటు వేసింది. అత నింకా ఆ స్వప్నబంధాన్ని తెంచుకొని కళ్ళు తెరవలేదు. చెంపలమీద మెరుస్తున్నది కన్నీటి ధార. ఆ దృశ్యాన్ని, అతని పలవరింతనూ భరించలేకపోయింది. తాను కంటున్న కలలన్నీ ఒక్కసారి బెదరి పోయినట్లనిపించింది. మర్నాటి ఉదయం చాలా ఆలస్యంగా లేచాడు కరుణాకరం. అప్పటికి వరదాచార్యులుగారు మూడు నాలుగు సార్లు వచ్చి తిరిగి పోయారు.

"ఏమిటి నాన్నారూ ?" అడిగింది వసంత.

"అర్జెంటు పనుంది, కాస్త లేపు తల్లీ మీ ఆయనను."

"రాత్రి నిద్రలేదు, కొంచెమాగితే ఆయనే లేస్తారుగా."

వరదాచార్యులవారికి కాలు నిలవడంలేదు. ఊళ్ళో రాజకీయా లన్నింటికీ ఆయన కేంద్రంలాంటివాడని వసంతకు తెలుసు. మళ్ళీ ఏమి ఉపద్రవం వచ్చిందోనని భయపడింది వసంత.

కరుణాకరం నిద్రలేచాడు. చిత్రమైన కలను మరొకసారి గుర్తుకు తెచ్చుకున్నాడు. కల్యాణీ, రాజారావూ పుష్పక విమానంలో ఎగిరిపోయారు కలలో మరొక లోకానికి. స్వప్నవృత్తాంతాలను బట్టి జోస్యం చెప్పే పండితులున్నారు. తన కలకు అర్థం ఏమిటో! రాజారావు ఆరోగ్యం మెరుగయిందని విన్నాడు. భీమవరం రాజుగా రేదో నాటువైద్యం చేస్తూ పెద్దపెద్ద యింగ్లీషు డాక్టర్లు కుదర్చని వ్యాధుల్ని నివారిస్తున్నాడట. ఏవో పూజలు చేసి కేవలం కాయ గూరలు తింటూ సిద్ధి పొందాడట. అక్కడ వైద్యం చేయించు కుంటున్నాడట. చాలా రోజులుగా అతన్ని చూసి రావాలను కున్నాడు. కాని వెళ్ళలేకపోయాడు. అపనిందల భారం ఎంత దుర్భరమైనదో అతనికి తెలియకపోలేదు. పెళ్ళికి శాంత మంగళ హారతి పాడింది. వేయినూట పదహార్లు మంగళహారతి పళ్ళెంలో తాను పెట్టినప్పుడు వికృతంగా మారిన ఆనాటి ముఖసౌందర్యాలను యింకా మరిచిపోలేదు. పదిమంది మధ్యకు వెళ్ళాలన్నా, మాట్లాడా లన్నా భయంగానే వుంది. 'నీవింకా కుర్రవాడివి నాయనా, నీవ్యవ హారాలన్నీ నాకు వదిలిపెట్టు –' అంటూ హామీ యిచ్చి వరదా చార్యులవారు చక్రం నడిపిస్తున్నారు. ముఖం కడుక్కొని కాఫీ త్రాగుతుండగా మళ్ళీ వచ్చారు వరదాచార్యులవారు 'ఇది నాలుగో సారి నాయనా తెల్లారి రావడం' అంటూ.

"ఏమండీ?" అన్నాడు కరుణాకరం

"ఇంక మనం ఇలా గాజులు తొడిగించుకు కూర్చుంటే లాభం లేదయ్యో - మంచితనాని కివి రోజులు కావనుకో. ఊరుకున్న కొద్దీ నెత్తికెక్కుతున్నారు. లేకపోతే నెత్తిన రూపాయిపెట్టి వేలం వేస్తే నయాపైసాకు మారని వెధవలు - నీమీదా నామీదా సవాలు చేస్తారూ? చూస్తా." అంటూ కూర్చొని దట్టంగా తుపాకీలో మందు కూరినట్లు ముక్కుపొడుం పట్టించారు వరదాచార్యులుగారు.

"ఏం జరిగిందండీ?"

"యింకా ఏం జరగాలయ్యో. ఇదేమన్నా వూరా మాల పల్లా? ఆ మున్సబూ, రాఘవయ్య గాజులు తొడిగించుకు కూర్చున్నారని ఆ రాజారావుగాడు వెర్రి సుబ్బిగాణ్ణి పంచాయితీ ప్రసిడెంటు చేయించాలని పోటీ పెడతాడూ?"

"పోనీండి, ఎవరు ప్రసిడెంటయితే మనకేం పోయింది.?"

"అదే తెలితక్కువతన మంటాను. చూడబ్బాయి, ఇంత వూరుంది. నీకంటె స్థితిమంతు డెవరంట? రాఘవయ్య ఎన్నడో దివాలా తీశాడా? మున్సబు మాత్రం ఆ స్తికి మూడింతలుంది అప్పు. నోటు రాయించా నీకివ్వాల్సిన డబ్బుకి. రేపు నోటీసు పారేస్తే ఎల్లుండీపాటికి అంతా వేలం వేయించొచ్చు."

వసంత కాఫీ తెచ్చి యిచ్చింది మళ్ళీ పెద్ద గ్లాసునిండా తండ్రికి.

"చూడమ్మా, పంచాయితీ ప్రసిడెంటుగా మీ ఆయన్ని పోటీ చేయమంటున్నాను. మనవాడి కేం తక్కువ చెప్పు? ఇతగాడి కాలి గోరికి పోలగలరాఅంట ఈ చచ్చు పీనుగులంతా? అదీగాక భగవంతుడు ఐశ్వర్యం యిచ్చినప్పుడు దానికి తగ్గ హోదా కూడా సంపాదించుకోవాలా వద్దంటావా? ఇన్నాళ్ళూ దమ్మిడీకి మారని

వెధవలు పరిపాలించారయ్యా వూరు. అదింక సాగకూడదంటాను. ఏమంటావమ్మా ?"

తండ్రి మాటల పటుత్వం ఆమెకు చిరకాలంగా తెలుసు. కాని అంతలోనే వ్యామోహ పడింది. "ఔనండీ - నాన్న చెప్పింది నిజం. మీరు ప్రసిడెంటు తప్పకుండా ఔతారు. తక్కువ గౌరవమా అది. ఒప్పుకోరాదూ !" అంది.

"నీకు తెలియదు వసంతా - అటువంటివి నాకనవసరం."

"నీకు అన్నీ అనవసరమే" అంటూ నాలిక కరచుకొని "ఆలోచించండి నాన్న చెప్పేది మన కోసమే" అంది.

కరుణాకరాన్ని మొదటినుంచీ 'నువ్వు' అని పిలవడం అల వాటున్నా పెళ్ళి జరిగిం తర్వాత అనేకమంది మందలించాక 'మీరు' అనడం నేర్చుకుంటూంది.

"నన్ను - కాదండీ - నాకు యిష్టంలేదు." అన్నాడు నిశ్చయంగా కరుణాకరం.

"అలాగయితే - పోనీ - యింక చేసేదేముంది ? నీ ప్రతినిధిగా నేను పోటీ చేస్తాను. మన కుటుంబంలో ఎవరైనా ఒకటే అనుకో" అన్నాడు కరుణాకరం ముఖంలోకి చూస్తూ.

కరుణాకరం మాట్లాడలేదు.

"ఏమంటావయ్యా ?" అన్నాడు లాలనగా వరదాచార్యులు.

"మీ యిష్టం."

వసంత ముఖంమీద చిరునవ్వు మెరిసింది. వరదాచార్యులవారు రొమ్ము విరుచుకు నడుస్తూ లేచి చక్కా పోయారు.

ఆయనగారు బయట గుమ్మంలో అడుగుపెట్టేసరికి ముత్తెం రావడం కనిపించింది. వివాహం జరిగిం తర్వాత ముత్తెంను

కరుణాకరానికి దూరం చేయడానికి చాలా ప్రయత్నం చేశారు వరదాచార్యులవారు. ఆయన ప్రయత్నాలు యింకా ఫలించలేదు. ఒకనాడు 'ఈ ముత్తెం అంటే ఏమిటనుకుంటున్నావో అబ్బాయ్. గాదెక్రింద పందికొక్కు. అసాధ్యుడు సుమా' అంటూ మరొకసారి హెచ్చరించారు.

"మీరు పొరపడుతున్నారు. ఉన్న నాలుగెకరాలూ అమ్మి మన అవసరానికి పదివేలూ చేతులో పోశాడు. అది మరిచిపోబోకండి." అంటూ సన్నగా మందలిచాడు కరుణాకరం.

నిజానికి ముత్తెం దగ్గర డబ్బు తీసుకోగూడదనుకున్నాడు. కాని తప్పలేదు. ఎక్కడి డబ్బు అక్కడ బిగుసుకు పోయింది. ప్లీడరు డబ్బు లేకపోతే అంతా నాశనమై పోతుందంటూ ఉత్తరాల మీద ఉత్తరాలు వ్రాయడం జరిగింది. ఆ తర్వాత పెళ్ళి ఖర్చుకు కారు తాకట్టు పెట్టవలసి వచ్చింది. వ్యవసాయం తనకు అనుభవం లేదు. ముత్తెం కూడా ఏమీ చేయలేకపోతున్నాడు. పాతిక ఎకరాలలో పచ్చిమిర్చి వేశాడు. ధర పడిపోయింది. అంతవరకూ కిలో రూపాయి అమ్మి, తన పంట కోతకు వచ్చేసరికి పావలాకు దిగజారింది. చివరకు మిగిలిందేమీలేదు. తన శక్తికి మించిన కమతం పెట్టటం జరిగిందని పించింది. అసలు డబ్బంతా బ్యాంకులో వేసుకొని వడ్డీతిన్నా సరి పోయేది బ్రతికినంతకాలం. డబ్బు ఉన్న రోజుల్లో అడిగినవాడికి కాదనకుండా కాగితాలూ పత్రాలూ లేకుండా అప్పులిచ్చాడు. తిరిగి యిచ్చిన పెద్దమనిషి లేడు. డబ్బు సంపాదించడంకంటె, సంపాదించిన దాన్ని నిలుపుకోవడం కష్టం.

వరదాచార్యులవారు పంచాయితీ ప్రసిడెంటుకు పోటీ చేస్తున్నాడని కరుణాకరం చెప్పగానే ముత్తెం నిర్మొహమాటాంగా 'ఈయనగారికి ఓట్లెవరిస్తారండీ - మీరివ్వాలి నేనివ్వాలి' అన్నాడు.

"ఆయన తప్పకుండా గెలుస్తా - అంటున్నాడు ?"

"అఁ గెలవాల్సిందే. ఈ లిటిగేషన్లు మనకెందుకు బాబూ. ఆ వరదాచార్లు చివరకు మిమ్మల్ని సొంతం ముంచేస్తాడు."

గదిలోకివస్తూ ఈ మాటలు విన్న వసంత తోక త్రొక్కిన త్రాచులా బుసలుకొడుతూ "అడ్డమైనవాళ్ళూ మీకు సలహాలు చెప్పే వాళ్ళే. యిప్పటికైనా తెలుసుకోండి అల్లుళ్ళకు అలుసిస్తే నెత్తి నెక్కుతారని" అంది. ముత్తెం మాట్లాడలేకపోయాడు. కరుణాకరం వసంతను మందలించాడు. మందలిస్తున్నకొద్దీ ఆమె రెచ్చిపోయింది. "మీ స్నేహాలన్నీ యింతే పాడు మనుష్యులు తప్ప మంచివాళ్ళెవరూ మీకు నచ్చరు." అంటూ గొంతెత్తింది. చిలికి చిలికి గాలి వానయింది. "ముష్టి పదివేలు అప్పిచ్చానని కళ్ళు నెత్తిమీద కొచ్చాయేమో. రేపీపాటికి అవతల పారేస్తాం."

వ్యవహారం ముదిరి తన మూలంగా భార్యాభర్తల మధ్య పొరపొచ్చాలు వచ్చే ప్రమాదముందని భయపడి మారు మాటాడకుండా తలవంచుకు వెళ్ళిపోయాడు ముత్తెం.

"నీ ధోరణి నాకేం నచ్చలేదు వసంతా" అన్నాడు కరుణాకరం ముత్తెం వెళ్ళిం తర్వాత.

"మీ ధోరణి నాకూ నచ్చడంలేదు. ఏం చేయమంటారు ?"

"అంటే మీరు రాత్రి తెల్లవార్లూ ఏం కలవరిస్తున్నారో, ఎటువంటి కలలు కంటున్నారో గుర్తుకు తెచ్చుకోగలిగితే గుర్తుకు తెచ్చుకోండి."

"ఏమిటి నువ్వనేది ?"

"ఏమంటానికీ నే నెవర్ని. అందరూ చెపితే ఏమిటో అనుకున్నాగాని ఇంతవరకూ వుందని నాకు తెలియదు. ఆ ముత్తెంమీద మీకంత ఆపేక్షకు కారణమేమిటో గూడా అర్థమయింది."

"నువ్వేదో మనస్సులో పెట్టుకు మాట్లాడుతున్నావు వసంతా ?"

"ఆ తెలివితేటలు మీలాంటి వాళ్ళవి. మనసులో ఒకటి, పైకి మరొకటి. అంత మనస్సున్నవారైతే దాన్నే చేసుకోక పోయారా? ఆ ముత్తెం యింత రాయబారం చేస్తున్నవాడు ఆ మూడుముళ్ళూ వేయించలేక పోయాడా ?"

ఏడుస్తున్నది వసంత.

"వసంతా - నువ్వనవసరంగా బాధ పడుతున్నావు. నన్ను బాధ పెడుతున్నావు. నువ్వేం మాట్లాడుతున్నావో నీకే తెలియడం లేదు. అది నా దురదృష్టం."

"దురదృష్టం మీదికాదు నాది. అందరూ నా అదృష్టాన్ని చూసి అసూయ పడుతున్నారు. నేనూ గర్వపడ్డాను. నేను విన్న మాటలన్నీ కట్టు కథలని మనస్సుకు సమాధానం చెప్పుకుని నిండుగా మీ నీడలో బ్రతకాలనుకున్నాను. నిజం చెప్తున్నా వినండి. మీ ఐశ్వర్యం చూసీ హోదాను చూసీ నేను భ్రమిసిపోలేదు. మనస్ఫూర్తిగా మీ మనస్సు కావాలనుకున్నాను. అదే నాదికాదని తెలిస్తే ఎల్లా భరించగలనో చెప్పండి."

నిట్టూర్చాడు కరుణాకరం.

మంచంమీద పడుకుని తల గోడవైపుకు తిప్పి ఏడుస్తున్నది వసంత.

కొంచెంసేపయాక "యిప్పుడు నన్నేం చేయమంటావ్ వసంతా ?" అన్నాడు. ఆమె లేచి "ఏం చేయగూడదో మీకు చెప్పే వివేకం నాకు లేదు. నే చెపితేగాని తెలుసుకోలేని అజ్ఞానం మీకూ లేదు. నాచేత వాగించకండి" అంది.

"నిజంగానే అడుగుతున్నాను వసంతా. సూటిగా చెప్పు."

"నాకు మీరుగాక ఎవరూ లేరు. మీరూ అలానే అనుకోవా లని కోరుకుంటున్నాను. నా సంసారాన్ని విచ్ఛిన్నం చేయడానికి కల్యాణి నిప్పు రాజేయగలదనీ తెలుసు. దానికి గాలి విసిరి ఎగ తోయడానికి ముత్తెం ఉన్నాడనీ తెలుసు. చేతులెత్తి నమస్కరిస్తాను. వీళ్ళిద్దరినీ మరిచిపొండి. లేకపోతే మనకు సర్వనాశనం తప్పదు" అంటూ కుమిలి కుమిలి ఏడుస్తూ క్రిందకు దిగి వెళ్ళిపోయింది వసంత.

పెళ్ళి జరిగింతర్వాత భార్యాభర్తల మధ్య జరిగిన మొదటి తగవులాట ఇది. జరిగింది మరిచిపోవడానికి ప్రయత్నిస్తూ క్రిందకు దిగి ఆఫీసు గదిలోకి వచ్చాడు కరుణాకరం. తన కోసం నిరీక్షిస్తున్న రామనాథం మాష్టారు కనిపించాడు.

"ఏం మేష్టారూ! ఈ మధ్య కనిపించడం మానేశారు?" అన్నాడు కరుణాకరం ఇంకేమనాలో తెలియక.

"రిహార్సల్స్ గొడవలో ఊపిరి సలపడంలేదండీ. మళ్ళీ చింతా మణి వెయ్యమంటూ అడిగారండీ గుడివాడ వాళ్ళు. ఒప్పేసుకున్నా."

"ఎప్పుడండీ నాటకం?"

"పదహార్నండీ. బాబుగారూ! ఇప్పుడు చాలా పెద్ద ఆప దొకటి వచ్చిందండీ. మీ సహాయం లేకపోతే - అంటే ఆర్థిక సహాయం కాదులెండి - రవ్వంత మాట సహాయం - దయుంచి..."

"చెప్పండి."

"అసలేం జరిగిందంటే - మనవి చేస్తా. చింతామణిలో మన ఏలూరు రామతిలకం ఓ పాతికసార్లు హీరోయిన్ వేసిందండీ. అసలు దానికి వత్తుల ట్రబులుండేది. ఎవరూ పనికిరావు పొమ్మంటే నా కాళ్ళమీద పడిందండీ. హీరోయిన్ని చేస్తానని మాటిచ్చి, ఒకచోట

నుంచి మరోచోట ఎగిరెగిరి పడుతున్న వత్తుల్ని - మనవిచేస్తా - 'బాధ' అనటానికి ఆ వత్తు యిటు మార్చి 'భాద' అనేదండీ - అలా గాడి తప్పుతున్న వత్తుల్ని సర్దేసి, ఏక్టింగ్ నేర్పి, తోమితోమి చివరకు 'చింతామణి వేస్తే ఏలూరు రామతిలకమే వేయాలి దాని శిగ తరగ' అని పదిమందీ పొగిడేలా తయారుచేశానండీ దాన్ని. ఓ ఘట్టంలో నన్ను పెళ్ళి చేసుకోమందండీ. చేసుకున్నా పోయేది. అప్పుడు ఏదో వైరాగ్యంలో 'యింక ఈ జన్మకు పెళ్ళిలేదు' అంటూ కొట్టేశానండీ కేసు."

ఈ ఉపోద్ఘాతం తెగేలా లేక "ఇంతకీ అసలు విషయం చెప్పండి మాష్టారూ" అన్నాడు కరుణాకరం.

"మనవి చేస్తానండి. పదహారు షో అన్నాను గదండీ - మొన్నటిదాకా రిహార్సల్సుకి వచ్చిందండి. బసా గట్రా మా యింట్లోనే యేర్పాటుచేసి, గురవయ్యగారి గొడ్లపాకలో రిహార్సల్సు దంచుతున్నామండి. నిన్న ఎవడో కుర్రాడు ఏలూరునుంచి వచ్చి దాని చెవిలో ఏదో వూదాడండీ. అంతే. "నాకు సినిమా ఛాన్సొచ్చింది - మద్రాసు పోతున్నా" అంటూ మరో మాట వినిపించుకోకుండా గజ్జెల గుర్రంలా ట్రంకు చేత పుచ్చుకుని గబగబా నడుచుకుంటూ రోడ్డుమీద కెళ్ళి బస్సెక్కి లేచ్చక్కాపోయిందండీ. గుడివాడ వాళ్ళ దగ్గర మూడొందలు అడ్వాన్సు పుచ్చుకుని వాడేసుకున్నామండీ సాదరులకి. కొంపలు పోతాయండీ నాటకం వేయకపోతే" అన్నాడు రామనాథం నాటక ఫక్కీలో.

"నన్నేం చేయమంటారు మాష్టారూ ?"

"ఒక చిన్న రికమెండేషనండీ. మన కల్యాణిగారు మీరు చెపితే వింటారండీ. నేను - ఆ బాధ మీ కవసరంలా - నేను ట్రయినిం

గిచ్చుకుంటాను. మీరే ఈ ఆపదనుంచి గట్టెక్కించాలి. యింక ఎవరు చెప్పినా వినదండీ ఆవిడ."

కరుణాకరానికి కోపం వచ్చింది. "మాష్టారూ! ఆవిడ నాట కాలు వేస్తానని మీతో అన్నదా ఎన్నడైనా?" అన్నాడు.

"అబ్బే - చింతామణి రోల్‌కు బాగా సూట్ ఔతుందనీ -"

"అలా అని అందరినీ అడగగలరా? ఆమె తరఫున ఎవరూ లేరని భ్రమతో మీకీ ధైర్యం వచ్చింది. అంతేగదూ?" అంటూ నాలుగు చివాట్లు పెట్టి, గట్టిగా మందలించి పంపించాడు.

రామనాథం వెళ్ళిపోయిం తర్వాత కిటికీలోంచి బయటకు చూస్తూ చాలాసేపు నిలబడ్డాడు కరుణాకరం.

ఒంటెద్దు బండిలో రాజారావు, కల్యాణీ రావటం చూశాడు. బహుశా భీమవరంనుంచి వస్తున్నారేమో వైద్యానికి పోయి. రాజా రావు ముఖంలో మంచి నూర్పు లీలగా కనిపించింది. కల్యాణి ఏదో చెపుతున్నది రాజారావు నవ్వుతున్నాడు. పిలిచి లోపలకు రమ్మందా మనుకున్నాడు. గొంతుక పెగలలేదు. బండి దగ్గరకు వచ్చింది. రాజా రావుతో ఏదో చెప్పబోతున్న కల్యాణి, ఆకస్మికంగా తలెత్తి చూడ గానే కరుణాకరం కనిపించడంతో క్షణకాలం నివ్వెరపోయి, వెంటనే చూసినట్లు నవ్వింది.

అప్పటికీ వాళ్ళని పిలవలేకపోయాడు కరుణాకరం!

# ఇరవై మూడు

ఇష్టం లేకపోయినా పంచాయితీ ఎన్నికలలో తల కొంత యినా దూర్చవలసి వచ్చింది కరుణాకరం. ఇరుపక్షాలవారూ ముమ్మరంగా ప్రచారం సాగిస్తూనే వున్నారు. ఆ ఊరి జనాభా ఆరువేల పైచిలుకు శివార్లను కలుపుకుంటే. ఎక్కువమంది అంటే సగానికి పైచిలుకు మాల, మాదిగ, ఉప్పరి, కుమ్మరి కులాల వాళ్ళున్నారు. స్వాతంత్ర్యం రాకముందు వరదాచార్యుల వంటివారు అరుగులమీద కూర్చుంటే ఆ వీధిన కొన్ని కులాలవారు చెప్పులు తొడుక్కునిగానీ, గొడుగు వేసుకునిగానీ వెళ్ళటానికి వీలుండేది కాదు. ఆ కులాలవారిలో కుర్రకారు స్వాతంత్ర్యం వచ్చిందని గ్రహించి, ఓటు హక్కు అందరికీ లభించిందని తెలుసుకుని దానితో పాటు అనేక హక్కులు తమకు లభించాయని అర్థం చేసుకున్నారు. ఊళ్లో హైస్కూలు పెట్టటంతో వారిలో కూడా అక్షరాస్యుల సంఖ్య పెరిగింది. "అన్ని కులాలు సమానమే. హెచ్చు తగ్గులు లేవు. అగ్రకులాలవారని చెప్పుకుంటున్న ఈ పెద్దల జులుం చెల్లటానికి వీలులేదు" అంటూ గూడెం గూడెంలో వెర్రి సుబ్బిగాడి తరఫున అనేకమంది యువకులు నడుం కట్టుకుని ప్రచారం ప్రారంభించారు. రెండు వర్గాలకూ మధ్య తరచుగా ఘర్షణలు జరుగుతున్నాయి. వెర్రి సుబ్బిగాడి తరఫున ప్రచారం రాజారావు నాయకత్వంలో జరుగుతూంది. ముత్తెం లోపల మనస్ఫూర్తిగా యిష్టం లేకపోయినా కరుణాకరం ముఖం చూసి వరదాచార్యులగారి పక్షాన పనిచేయడం జరుగుతూంది. రామనాథం తన శిష్య బృందంతో పద్యాలూ పాటలూ పాడుతూ ఎన్నికల సభలను రసాత్మకంగా రూపొందిస్తున్నాడు. వరదాచార్యులవారి గొప్పతనాన్ని వర్ణిస్తూ 'ప్రజా నాయ

కుడు' అనే పేరున బుర్రకథ ఒకటీ, 'మహామనీషి' అనే పేరున పంచ రత్నాలనూ వ్రాసి ప్రచార యుద్ధాన్ని నాటకీయం చేశాడు. వరదాచార్యులవారిమీద గౌరవమున్నా లేకపోయినా ఈ వినోద కార్యక్రమాలకు జనం విరగబడి వస్తూనే వున్నారు. ఈ పోకడ చూసి గూడెంలోని కుర్రకారంతా చందాలు వేసుకొని హైదరా బాద్‌నుంచి బెనర్జీ బృందాన్ని పిలిపించి వారంరోజుల కాంట్రాక్టుతో బుర్రకథలు ఏర్పాటు చేశారు. వరదాచార్యులవారు రెండు చేతు లతో మంచినీటిలా డబ్బు ఖర్చుపెడుతూ పదిమంది రౌడీలను పెట్టి ప్రతిపక్షంవారి మీటింగులో అల్లరి చేయించాడుట.

"అసలు మీరు మీటింగు పెట్టకుండా చేయగలం తలుచు కుంటే - తలలు పగుల్తాయి జాగ్రత్త" అంటూ రాజారావు కుమ్మరి వీరాస్వామి ద్వారా కబురు పెట్టాడు. "చూద్దాం ఎవరితలలు పగుల్తాయో" అంటూ గర్జించారట వరదాచార్యులవారు.

ఒకనాడు మీటింగులో యిరుపక్షాల మధ్యా గాలివాన చెల రేగటంతో కర్రలు లేచాయి. వరదాచార్యులవారి రౌడీలు సుబ్బి గాడి పక్షానికి చెందిన ఇద్దరు కుర్రవాళ్ళను చావ చితకకొట్టారట. వెంటనే వెర్రి సుబ్బిగాడు కేకలు పెట్టుకుంటూ రాజారావు దగ్గరకు పరుగెత్తాడు. "దెబ్బకు దెబ్బ తీయాల్సిందేనండీ. ఆ కరుణాకరం బలం చూసుకొని వరదాచార్లు మరీ బరి తెగించాడు. ఆయన బుర్ర రామకీర్తన పాడిస్తామంటున్నారు మనవాళ్ళంతా." అంటూ జబ్బ చరిచాడు.

"తొందర పడవద్దు" అన్నాడు రాజారావు.

"ఇలా మనం ఊరుకుంటే వాళ్ళింకా రెచ్చిపోతారండీ. మీ రూరుకోండి. మనవాళ్లు తగిన విధంగా కథ నడిపిస్తారు" అన్నాడు సుబ్బిగాడు.

రాజారావు అతన్ని "కొంచెం ఓపిక పట్టు"మని మందలించి కరుణాకరంతో మాట్లాడటానికి వెళ్ళాడు. ముందు వసంత కనిపించింది. ఎన్నడూ రాని రాజారావు తమ యింటికి ఎందుకు వచ్చినట్లో అర్థం కాలేదు. అతన్ని చూడగానే నిప్పు రవ్వను తొక్కినట్లు ఎగిరి పడింది క్షణకాలం.

"కరుణాకరం వున్నాడామ్మా" అన్నాడు ఆప్యాయంగా రాజారావు.

"మేడమీద వున్నారు, పిలుస్తా." అంటూ వెళ్ళిపోయింది వసంత.

కొంచెం సేపటికి కరుణాకరం దిగి వచ్చాడు. మిత్రులిద్దరూ చాలాసేపు మాట్లాడుకున్నారు. పోటీలు జరిగినంత మాత్రాన కొట్టుకు చావవలసిన అవసరం లేదనే విషయం ఇద్దరూ అంగీకరించారు. ఎన్నికల నాటకాన్ని శాంతియుతంగా నడిపించాలని నిశ్చయించుకున్నారు. ఆ సమయంలో వరదాచార్యులవారు అక్కడికి రావడం, రాజారావును చూసి రెచ్చిపోవడం జరిగింది. "నామీద ఆ వెర్రి సుబ్బిగాణ్ణి పోటీపెట్టి అగ్రకులాలవారి మీదకు అలగా జనాన్ని ఉసిగొలపడం గొప్పనుకుంటున్నావా. ఆ వెర్రి వెధవ ఊరికి ప్రసిడెంటా ? సిగ్గుండక్కర్లేదా ?" అంటూ ప్రారంభించాడు.

"అతను వెర్రివాడు కావచ్చు. కాని వాళ్ళ జుట్టూ వీరి జుట్టూ ముడిపెట్టి కొంపలుతీసేరకం కాదులెండి" అన్నాడు వ్యంగ్యంగా రాజారావు.

"అంటే అక్కడికి నేను కొంపలు తీస్తున్నానని అర్థమా ? ఆఁ, పెద్దా చిన్నా లేకుండా ఏమిటా పొగరుమోతు త్రాగుబోతు వాగుడు ? నువ్వు చెడిందిగాక ఊరంతా తగలపెట్టాలని చూస్తున్నావా - చూద్దాం."

రాజారావుకు కోపం వచ్చింది. కరుణాకరం సర్ది "ఆచార్లు గారూ! పెద్దవారు మీరు. మీరే అలా కయ్యానికి కాలు దువ్వుతూ మాట్లాడకూడదు" అంటూ మందలించడంతో ఆచార్యుల వారికి పుండుమీద కారం జల్లినట్లయింది.

"బావుంది బాబూ! కంచే చేను మేసిందని ఆ రౌడీ వెధవను వెనకేసుకు నువ్వే మాట్లాడితే యింక నిర్వాకమైనట్లేలే. నీ మాట మీద నిలబడ్డాను. ఈ రకంగా శల్యసారథ్యం నడిపే బుద్ధిమంతుడివని తెలిస్తే ముందే జాగ్రత్తపడేవాణ్ణి. ఔన్లే, ఎంత వారలైనా కాంత దాసులే అని వ్యామోహాలు వదులుకోలేకపోతే యింతగాక ఏమౌతుంది?" అంటూ యజ్ఞోపవీతాన్ని రెండు చేతులతో విష్ణు చక్రంలా తిప్పుతున్న ఆచార్లుగారిని చూసేసరికి కరుణాకరం ఆగ్రహావేశాలను పట్టలేక "ఇంక మాట్లాడక దయుంచి వెళ్ళండి ముందు" అంటూ కేకపెట్టాడు. ఆచార్యులవారు "ఆఁ నన్ను? డెబ్బయ్యేళ్ళ ముండావాణ్ణి, కాళ్ళుకడిగి పిల్లనిచ్చినందుకు యింతేసి మాట లంటావా" అంటూ మెట్లుదిగి క్రిందకుపోయిన కుమార్తెను కౌగలించు కొని "వాడు దాని వలలో చిక్కుకున్నాడే వెర్రితల్లీ. వాళ్ళమీద వున్న అభిమానంలో వీసమెత్తు మనమీదుందీ? ఆ సంగతి ముందే తెలుస్తే యిలా నీ గొంతు కోసేవాణ్ణి కాదమ్మా - ఏడుకొండల వాడా! నా బిడ్డను రక్షించు" అంటూ బావురుమన్నాడు.

"నాకు తెలుసు నాన్నా - మోసపోయాం తెలీక" అంటూ ఆమెకూడా కుళ్ళి కుళ్ళి యేడ్చింది. రాజారావుముందు యింత రభస జరిగినందుకు చాలా బాధపడ్డాడు కరుణాకరం. "ఛీ! ఛీ! ఛాదుమనుష్యులు. ఎదుటవాళ్ళనుగురించి ఎందుకంత నీచంగా ఆలోచిస్తారో అర్థంకావటంలేదు" అంటూ తనని తను ఓదార్చు

కుంటానికి ప్రయత్నించాడు. "యింక వెళ్తానురా కరుణా" అన్నాడు రాజారావు.

"అలా వీలులేదు. నువ్వు ఈ పూట భోంచేయకుండా యిక్కణ్ణుంచి కదలటానికి వీలులేదు. రాకరాక వచ్చావు మా యింటికి" అంటూ బలవంతపెట్టాడు కరుణాకరం. వంటవాడైన నందిని పిలిచి భోజనం యిద్దరికీ తయారు చేయమని పురమాయించాడు. ఉండిపోక తప్పలేదు రాజారావుకు.

మిత్రులిద్దరూ చాలాకాలం తర్వాత చాలాసేపు కలిసిమెలసి కబుర్లు చెప్పుకునే అవకాశం లభించింది. ఆద్యంతాలు లేని ఎడారిలో ఎండ మావుల్ని వెన్నాడుతూ అలిసిపోయిన దౌర్భాగ్యుడికి ఒయాసిస్సు కనిపించినట్లయింది. చిన్ననాటి సంగతులన్నీ ఒకరికొకరు జ్ఞాపకం తెచ్చుకున్నారు. భోజనాలకు లేచే సమయంలో పనిమనిషి వచ్చి "మీ కోసం ఎవరో ఆడకూతురు ఒకావిడ వచ్చి క్రిందగదిలో కూకున్నారండీ" అంది. రాజారావు అక్కడే మేడమీద గదిలోనే కూర్చున్నాడు. కరుణాకరం క్రిందకు దిగి ఆ స్త్రీమూర్తిని చూసి నివ్వెరపోయాడు. "ప్రసూనా - నువ్వా ?" అతని నోట్లోంచి అస్పష్టంగా మాటలు బయటకొచ్చాయి. ఆమె కట్టుకున్న చీర విలువైందేమీ కాదు. నలిగిపోయింది. నిద్రలేక, దీర్ఘ ప్రయాణం చేసి అలిసిపోయిన మనిషిలా వుంది.

"ఏం, గుర్తుపట్టటానికి వీలులేనంత మారిపోయానా ?" అందామె.

"ఔను, అలాకాదు చూసి చాలా కాలమయింది."

"మూడేళ్ళు పైన."

"నిన్ను మళ్ళీ చూస్తాననుకోలేదు."

"నేనూ అనుకోలేదు."

"లే - లోపలికి పద, స్నానం చేద్దుగాని. ఆనక మాట్లాడుకుందాం."

ఆమె నవ్వింది.

"నీ నవ్వుమాత్రం అలాగే వుంది?"

"ఎలా ?" అంది మళ్ళీ నవ్వుతూ.

"ప్రపంచంలో ఏ శక్తికీ ఏ కష్టానికీ తలవంచని నువ్వు - అలా అందరూ నవ్వలేరు ప్రసూనా ?"

"అదొక్కటే మిగిలింది కరుణా."

"అంటే ?"

"పోన్లే - అదంతా వినిమాత్రం నీకేం లాభం - చెప్పినా అర్థంకాదు. జీవితంలో మనం చేసే కొన్ని పనులకు మనమే అర్థం తెలుసుకోలేం. ఇలా ఎందుకు జరిగింది? అని ఆలోచించే లోపునే జరగవలసినవి జరిగిపోతాయి."

"సర్లే, బాగా అలిసిపోయినట్లున్నావ్ - లే - లోపలికి పద."

"బావుంది వరస -"

"ఏం ?"

"ఏం లేదు, నీకు పెళ్ళయిందట !"

"ఔను, నీ కెవరు చెప్పారు !"

"ఇదేమంత రహస్యమని ?- అదీగాక యెప్పటికప్పుడు నీ గురించి తెలుసుకుంటూనే వున్నానులే."

"అలాగా !"

"పెళ్ళాం నచ్చిందా ?"

"అంటే ?"

"నన్ను తప్ప ఎవరినీ చేసుకోనన్నావ్? బ్రతికినంతకాలం బ్రహ్మచారిగానే వుండిపోతా నన్నావ్ ?"

సూటిగా ముఖంలోకి చూస్తూ అడిగింది ప్రసూన.

అంతలో ఆ గదిలో అడుగుపెట్టిన వసంత ఆ మాటలు విని, ఎదుట కనిపించిన స్త్రీమూర్తిని చూసి, తెల్లబోయి గిరుక్కున వెనక్కు తిరిగింది.

"వసంతా!" పిలిచాడు కరుణాకరం.

ఆగింది వసంత.

"ఈవిడెవరో తెలుసా- ఇలారా పరిచయం చేసుకుందువుగాని."

"ఎవరు ఎవరో తెలుసుకోకపోయినా ఈ దిక్కుమాలిన బ్రతుకుకు ఎటువంటి లోటూ రాదులెండి" అంటూ వెళ్ళిపోయింది వసంత కన్నీరు తుడుచుకుంటూ. నిట్టూర్చాడు కరుణాకరం.

"తెలివైన పిల్లే" అంటూ. మళ్ళీ నవ్వింది ప్రసూన.

"కాదు, మూర్ఖురాలు." అన్నాడు కరుణాకరం.

"పెళ్ళయి ఎక్కువరోజులుగూడా కాలేదు, అప్పుడే ప్రారంభించారా ద్వంద్వయుద్ధాలు. పెళ్ళయినా రెండేళ్ళ తర్వాతగానీ మా అమ్మా నాన్నా ముష్టియుద్ధాలు ప్రారంభించలేదట - అదిసరే గానీ - రాజారావు బావున్నాడా ?" అంది.

ఈ ప్రశ్న విని ఆశ్చర్యంతో "మా రాజా - ఏమిటి ? నీకు తెలుసా ?" అన్నాడు.

"తెలుసు. ఈ ఊళ్ళో ఒకరోజు కాపరంకూడా వెలగబెట్టాం."

"ఎప్పుడు ?'

"ఆ మధ్య - నీకు తెలియదులే -"

"నన్నెందుకు చూడలేదు ?"

"వద్దనుకునే - బాధ పడకు కరుణా - ఆ గొడవ లెందుకు గానీ, ఒక సహాయంకోసం వచ్చాను."

"చెప్పు."

"చేస్తావా? డబ్బు కావాలి."

"ప్రసూనా! ఈ డబ్బంతా మీ నాన్నది, నీది. నాకంటె దీనిమీద మీకే ఎక్కువ అధికారముంది తెలుసా?"

"పాతిక వేలు కావాలి. నాకు నీడనిచ్చి, నాతో బ్రతుకుతున్న ఒక మనిషి అరెస్టు కాబోతున్నాడు. పాతికవేలుంటేగాని బయటపడడు. నిన్నుగాక యింకా ఎవరిని సహాయం అడగాలో అర్థం కాలేదు. అదీగాక నువ్వు దగా చేయవనే నమ్మకముంది."

కరుణాకరం ఆలోచనలో మునిగిపోయాడు. ప్రసూన నవ్వుతూ "ఏమిటి దీర్ఘాలోచనలో పడ్డావ్?" అంది.

"నా మాట నమ్ముతావా ప్రసూనా?"

"చెప్పు."

"నా దగ్గర డబ్బు లేదిప్పుడు."

"అంతా ఏమయింది?"

"హరించుకు పోయింది. ఎక్కడిదక్కడ బిగుసుకుపోయింది. డబ్బు రాగానే సరికాదేమో. అందరూ లక్ష్మీదేవిని నిలబెట్టుకోలేరనుకుంటా. నాలాంటి దురదృష్టవంతుణ్ణి లక్ష్మీదేవికూడా అసహ్యించుకుంటుంది తెలుసా."

"అదంతా ఎందుకుగానీ - లేదంటావ్?"

"కాదు, ప్రస్తుతం లేదు. కాని - ఎప్పుడు కావాలి డబ్బు?"

"నాలుగు రోజులో."

"ప్రయత్నం చేస్తాను."

"ప్రయత్నం చేయడం కాదు. ఎలాగైనా ఆయన్ను గట్టెక్కించాలి. నేను గుడివాడలో వుంటున్నాను. సోమవారం నాటికి తెచ్చి యివ్వు." అంటూ అడ్రస్ యిచ్చి వెళ్ళిపోయింది ప్రసూన. ఆమెను ఉండమనే సాహసం లేకపోయింది. కరుణాకరానికి. వసంత జాడలేదు. వంటవాడు నంది భోజనాలు వడ్డించాడు. రాజారావును పిలవడానికి మేడమీదకు వెళ్లాడు కరుణాకరం.

"ప్రసూన నీకు తెలుసా కరుణా?" అన్నాడు రాజారావు.

"పదేళ్ళుగా. నీ కెలా తెలుసు?"

"నాకూ తెలుసు రెండేళ్ళుగా - చిత్రమైన మనిషి. నీకెలా పరిచయం?"

"అదంతా ఒక పెద్ద కథ. అందులోనే వుందేమో నా జీవిత రహస్యమంతా. తర్వాత చెప్తాను. ఆలస్యమయింది, పద భోజనం చేద్దాం."

ఇద్దరూ మౌనంగానే భోజనం ముగించారు. ఎవరి ఆలోచనలు వారివి. ఎవరి ఏకాంతాలు వారివి. ఏం తింటున్నారో తెలియకుండానే ముగించారు. ఆలోచనలతో ఆవేదనలతో వర్తమానాన్ని ఆవిరి చేసుకుంటున్న పిచ్చి మనుష్యులు. గతంలో సగం - భవిష్యత్తులో సగం; అనుభవాలను నెమరువేసుకుంటూ సగం, జరగబోతున్న జీవితాన్ని పోల్చుకుంటూ సగం - సగం సగం బ్రతుకుతున్న మనిషికి వర్తమానం ఆవిరిగాక మరెలా వుంటుంది? ఎంతకాలం వ్యర్థమైపోతుందిలా? కాళ్ళక్రింద జారిపోతున్న కాలం తిరిగి రాదని తెలిసీ ఎందుకు మోసపోతుంది మనస్సు?

"మనస్సు బొత్తిగా బావుండలేదు రాజా! చాలా దురదృష్టాలకు అలవాటుపడ్డాను. కానీ, ఈనాడిలా నెత్తిన పిడుగు

పడుతుందనుకోలేదు. నా నీడ పడినచోట పచ్చగడ్డి భగ్గుమంటున్నది. జీర్ణకోశం చెడిన దుర్బలుడు ఏం తిన్నా అరాయించుకోలేడు. నా అదృష్టమూ అటువంటిదే. అందరూ అసూయపడ్డారు. అనుమానాలు - అపనిందలూ కారడవిలా చుట్టుకొని నన్ను ఒంటరివాణ్ణి చేశాయి. కాని, ఈ విచిత్రమైన అదృష్టం నా కెంతటి సుఖ శాంతుల నిచ్చిందో ఆ పరమేశ్వరుడికే తెలియాలి. తెల్లవారని కాళరాత్రి - ఎన్నటికీ కరిగిపోని జాగృతిరాని పీడకల - దీనినుంచి విముక్తిలేదు, రాదు."

రెండు చేతులతో తల పట్టుకొని మూల్గాడు కరుణాకరం.

"ఏమిటి కరుణా - స్పష్టంగా చెప్పు నీ బాధ". అన్నాడు రాజారావు భుజం చెయ్యిపెట్టి నిమురుతూ.

"చెప్తాను రాజా. కానీ తల పగిలిపోతూంది. రేపొకసారి రా. చాలా మాట్లాడాలి. తప్పకుండా వస్తావా ?"

"వస్తాను."

రాజారావు వెళ్ళిపోయాడు. కరుణాకరం మంచంమీద పడుకున్నాడు అటూయిటూ దొర్లుతూ. శరీరంలోంచి ఆవిరులు సెగలై పొగలై వస్తున్నాయి బయటకు. అందరూ మనుష్యులే. అందరూ తింటారు ఉప్పూ కారం - అందరూ చేస్తారు తప్పూ ఒప్పూ. అందరూ అనుభవిస్తారు కష్టం సుఖం - కాని తన తప్పులేమిటి ? తన కష్టాల స్వరూప మేమిటి ?

ఆనందంలో పొంగిపోతూ విషాదంలో క్రుంగిపోతూ - ప్రేమోద్వేగంలో ఆర్ద్రమై కరిగి ఒరిగిపోతూ ద్వేషాగ్నిలో శిఖలై మండి కాలిపోతూ, నవ్వుతూ ఏడుస్తూ పనిచేస్తూ అలిసిపోతూ జీవిత సాగరాన్ని మధనం చేస్తున్న మనుష్యులే అందరూ. కాని ఆ సాగర

మధనంలో హాలాహలంతోపాటు అమృతంకూడా పుట్టింది. తన జీవితంలో ?

కష్టానికీ సుఖానికీ అందరి కళ్ళల్లోనూ ఉంటుంది కన్నీరు.

ఉద్రేకానికీ ఉద్వేగానికీ అందరి గుండెల్లోనూ వుంటుంది స్పందన -

కాని—

తన జీవితంలో ?

ప్రతి చిరుగాలికీ కదిలి కంపించే చిగురుటాకులాంటి మనస్సుతో- వక్రించిన జీవనపథంలోని మలుపుల దొంతరల కావల ఏముందో ఎలా తెలుసుకోగలడు. ఆలోచనలు వరదలై, అందులో తాను తృణంగా కొట్టుకు పోతున్నాడు. వంటవాడు కాఫీ యిచ్చిపోయాడు. త్రాగి పడుకున్నాడు మళ్ళీ. శరీరం గాలిలా తేలికై పోయినట్లు ఏదో శూన్యం గుండెల నావిరి చేసినట్లనిపించింది. సాయంత్రమయింది. నిలబడ్డాడు కిటికీదగ్గర. చెరువుగట్టున నడుస్తున్న ముత్తెం కనిపించాడు. పిలవాలనుకున్నాడు. గొంతుక పెగల్లేదు. ఇంటికి రావడం తగ్గించాడు పూర్తిగా. రావద్దని చెప్పిందేమో వసంత ! తలవంచుకుని చక చక అంగలువేస్తూ నడుస్తున్న ముత్తెంమీద జాలి కలిగింది. నాలుగెకరా లమ్మి బూడిదలోపోశాడు తనకోసం. ఆ దావా రావణాసురుడి కాష్టంలా మండుతూనే వుంది. తానీ జన్మలో ఎవరి ఋణం తీర్చుకోలేడు. 'తాతలనాటి నాలుగెకరాలూ - పాపం - ముత్తెం-' అంటూ అస్పష్టంగా రోదించింది అతని మనస్సు. సంజవెలుగు సన్నబడుతూంది. చీకటి తెరలు దట్టమౌతున్నాయి. జుట్టు విరబోసుకొని ప్రళయ భయంకరంగా తపస్సు చేస్తున్న బ్రహ్మారాక్షసుల మాదిరి రావిచెట్లు చెరువుగట్టుమీద కనిపిస్తున్నాయి. ఆలయ ధ్వజస్తంభం కనిపించింది. మిణుకు మిణుకు మంటున్న ఆకాశ దీపం -

ఉప్పరి మల్లమ్మ అల్లాయిపదాలు పాడుకుంటూ చెరువుగట్టుమీద నూతి ప్రక్కన కూలబడింది. వసంత కనిపించలేదు.

"భోజనం పెట్టాను బాబూ." అన్నాడు నంది.

"అమ్మగారు భోంచేశారా?"

"లేదండి. ఉదయంకూడా తినలేదు. వంట్లో బాగాలేదట."

క్రిందకు దిగి వసంత గదిలోకి వెళ్ళాడు. ముసుగుపెట్టుకొని పడుకొనివుంది. పలకరించాడు. ప్రాధేయ పడ్డాడు. చాలాసేపు ఆమె మాట్లాడలేదు. చివరకు "నా మట్టుకు నేనే భరించలేని వెర్రిబాధ అనుభవిస్తున్నాను. నా జీవితంతోపాటు కష్టాలనూ కన్నీటినీ గూడా పంచుకోవలసిన నువ్వే యిలా..." అంటూ చెయ్యి మీదవేసి ప్రక్కన కూర్చొని వీపు నిమిరాడు. ఆమె చెయ్యి బయటకు త్రోసివేసి "యింకెంతమందున్నారు మీకు చెప్పండి దయుంచి." అంది.

"పొరపాటు జరిగింది వసంతా. యింతకుముందే అంతా నీకు చెప్పవలసింది. నాదే తప్పు."

"ఒద్దులెండి. నేను వినలేను. విని భరించలేను."

"కాదు, నువ్వు వినితీరాలి. చెప్తాను. త్వరలోనే నీకు అన్ని విషయాలూ చెప్తాను." అంటూ వెనకకు తిరిగి మేడమీదకు వెళ్ళిపోయాడు కరుణాకరం.

# ఇరవై నాలుగు

కలత నిద్రతో ఎంతో రాత్రికిగాని నిద్ర పట్టలేదు కరుణా కరానికి. అంతలోనే ముత్తెం కేకలతో మెలుకువ వచ్చింది. "బాబు గారూ, కొంపలు మునుగుతున్నయ్. ఇంతకుముందే గడ్డివాముకు నిప్పంటించటానికి వరదాచార్లు పదిమందినీ వెంటపెట్టుకొని బయలు దేరాడు. ఈ యవ్వారం చాలాదూరం నడిచేటట్లుంది బాబూ." అన్నాడు ముత్తెం.

"ఎవరి గడ్డివాము? వెర్రి సుబ్బిగాడిదా?"

"కాదండి, నంబాచార్లుది."

"నంబాచార్లుదా? ఆయన మన పక్షమే గదా?"

"అదేనండి లిటిగేషను. వరదాచార్లుది పాదరసంలాటి బుద్ధి. మన గడ్డివాము చిన్న సైజుది మనమే తగలబెట్టుకొని, ఆ దారుణం చేసింది ఎర్రి సుబ్బిగాడి మడుషులని కేసు బనాయించి, ఆ ఎర్రి సుబ్బిగాణ్ణీ, రాజారావుగార్నీ జైలుకు పంపాలని మన ఆచార్లు పథకం."

పరుగు పరుగున కరుణాకరం ముత్తెంతో కలిసి గడ్డివాము దగ్గరకు పరుగెత్తాడు. నంబాచార్లు కూడా అక్కడే వున్నాడు. "అయ్యా, వందరూపాయల గడ్డి - ఇరవై బొద్దులు కొన్నా మొన్ననే" అంటూ గొణుగుతున్నాడు. "ఎన్నికల్లో గెలవనీవయ్యా. ఇరవైకి రెండొందల బొద్దుల గడ్డి యిప్పిస్తా - ఊఁ చలమయ్యా కానీ -" అన్నారు వరదాచార్యులవారు.

"ఆచార్లుగారూ, యిది చాలా తప్పు. మన గడ్డివాముకు మనమే నిప్పంటించుకొని ఎదుటివారి మీద కేసు బనాయించడం మాత్రం అన్యాయం" అన్నాడు కరుణాకరం.

"చుట్టూ అన్నీ తాటాకు పాకలు. గాలి తిరిగి నిప్పు రవ్వలు లేచి ఊరంతా తగలబడిపోతే?" అంటూ మూలిగాడు నంబాచార్లు.

"మేమంత తెలివితక్కువ వాళ్ళం కాదులేవయ్యా. పోలీసు వాళ్ళకు అవసరమైనంత కాలగానే ఆర్పేస్తాం. అవిగో పాతిక బిందెలూ పాతికమంది జనం రెడీ. ఊఁ, చలమయ్యా కానీ."

అందరూ సమరోత్సాహంలాంటి ఉద్రేకంతో సతమతమై పోతున్నారు. వరదాచార్యులవారు అలనాటి కురుక్షేత్ర సంగ్రామంలో ద్రోణాచార్యులమాదిరి తుండుగుడ్డ తలకు చుట్టి మహా సేనానిలా విజృంభించారు. "చలమయ్యా" అంటూ గర్జించాడు కరుణాకరం. చలమయ్యా అంటించిన నిప్పుపుల్ల గడ్డివాముమీద పడకుండా గుంజి ఆవల పారేశాడు ముత్తెం. ఎవరో బలంగా ముత్తెం నెత్తిమీద కొట్టారు. గావుకేక పెట్టి నేల కొరిగాడు. వరదాచార్యులవారు విజృంభించి మరో నిప్పుపుల్ల గీసి గడ్డివాముమీద గిరవాటు పెట్టాడు. ముందే అక్కడ రవ్వంత కిర్సనాయిలు పోసినట్లున్నారు. క్షణంలో ఆకాశానికి లేచాయి మంటలు. కరుణాకరం కొయ్యబారిపోయాడు. అగ్ని మహాగ్నిగా మారి వేయి నాల్కలు చాపి విజృంభించింది. గాలి రేగింది. "ఇంక ఆర్పండి - నీళ్ళు - ఊఁ పరిగెత్తండి" అంటూ కేకలు పెడుతున్నాడు వరదాచార్లు. చెరువు దగ్గరలోనే వుంది. పరుగెత్తారు జనం. ఊరు ఊరంతా లేచింది. పెడుపులు - కేకలు - బెదిరింపులు - అదొక భీభత్సం - అందరూ ఎవరి కందిన పాత్రలు వారు పుచ్చుకుని చెరువుకు పరుగులు తీశారు. గాలి రేగింది. అగ్నిదేవుడు విజృంభించాడు. ఊరికి పట్టిన మహా పాపాలను

ఊళనం చేస్తున్నాడేమో, అనుకున్నట్లే అయింది. "నిప్పురవ్వ మా యింటిమీద పడుతుందేమో" అంటూ గుండెలు బాదుకుంటూనే వున్నాడు సంబాచార్లు. మండుతున్న తృణాలు తూటాలమాదిరి నిప్పు రవ్వలు కక్కుకుంటూ సంబాచార్లు యింటిమీద పడ్డాయి. ఎండిన తాటా కుల పాక అంటుకుని భగ్గుమంది దొడ్లో. పెంకుటిల్లు అంటుకుంది. ఏలూరునుంచి రావాలి ఫైరింజన్లు. అవి వచ్చేసరికి ఊరంతా పరశు రామ ప్రీతి అయేలా కనిపించింది. వరదాచార్యులవారి యింటినుండి మంటలు పడమటి గాలి తగలడంతో ప్రక్కనున్న కంసాలి కామయ్య యింటిని చుట్టుముట్టాయి. వరదాచార్యులగారి యింట్లోనుండి సామాను ఎవరి కందింది వారు బయట గిరవాటు పెడ్తున్నారు. ఈ లోపున దొంగతనాలు, కొందరు చేతికందిన సామాను పుచ్చుకు పోతున్నారు. కొంతసేపు ప్రాణంలేని ప్రతిమలా కొయ్యబారి పోయిన వరదాచార్యులవారు "నా దిండు, నా దిండు అంటూ గుండెలు బాదుకుంటూ మంటల మధ్యనుంచి యింట్లోకి దూకారు. "ఆయన్ను పట్టుకోండి, ఆ మంటల్లో కాలిపోతారు" అంటూ రంగ దాసు కాళ్ళు పట్టుకు తల బాదుకుంది చెల్లాయమ్మగారు. రంగ దాసు లోపలికి మంటల్లోకి దూకి వరదాచార్యుల వారిని భుజాన వేసుకు వచ్చాడు. ఇంచుమించు సగం పైచిలుకు కాలిపోయిన బూరుగదూది దిండు ఒకటి ఆయన కౌగలించుకున్నాడు గట్టిగా. "ఆరువేలు, తగలబడి పోయింది. అంతా సర్వనాశనం" అంటూ మూర్ఛపోయారు ఆచార్యులవారు. దిండులో కాలిపోయిన చిన్న నోట్ల ముక్కలు కనిపించాయి. మిగిలినదంతా బూడిదై రాలి పోయింది. కంసాలి కామయ్య ఎగిరెగిరి పడుతూ పడుస్తూ పెళ్లాన్ని గట్టిగా వదలకుండా పట్టుకున్నాడు. అంతలో ఒక మహాద్భుతమే జరిగింది. చూస్తుండగానే పదిక్షణాల్లో మబ్బులు కరిగి జోరున వాన కురవడం - కొద్దిసేపట్లో మంటలు ఆరిపోవడం జరిగింది. కొందరు

రాజారావునూ, వెర్రి సుబ్బిగాణ్ణీ తిట్టారు. "అసలు ఇదంతా చేసింది వరదాచార్లే" అన్నాడు బిగ్గరగా ముత్తెం. ఆ మాట వినగానే మూర్ఛనుండి ఒక్కసారి లేచి కూర్చున్న వరదాచార్యులవారు "ఈ నింద మహా దారుణం. రాజారావు నిప్పంటించటం - పారి పోవడం నే కళ్లారా చూశాను." అంటూ యజ్ఞోపవీతం సాక్షిగా ప్రమాణం చేసి మళ్ళీ మూర్ఛపోయారు. ఆచార్యులవారి యిల్లు ఒక్కటే పూర్తిగా తగలబడిపోయింది. కంసాలి కామయ్య యిల్లు సురక్షితంగా వుంది. వరదాచార్యులవారిని కరుణాకరం యింటికి జేరవేశారు. తెల్లవార్లూ 'నా దిండు - ఆరువేలు' అంటూ కలవ రిస్తూనే వున్నారు వరదాచార్యులవారు. ఓ రాత్రివేళ 'వసంతా' అంటూ కేక పెట్టారు. అందరూ జేరారు మళ్ళీ. నిప్పు సెగతో ముఖం కమిలిపోయింది. గుండెలకు గాయాలున్నాయి. "యింక నేను బ్రతకను తల్లీ - కరుణాకరం ఏడీ?" అన్నారు. అతను దగ్గ రకు వచ్చాడు. వసంతను అతని చేతిలో పెట్టి "జరిగిందంతా మరిచి పొండి. సుఖంగా బ్రతకండి బాబూ. ఆ ఆరువేలూ నీవే. అగ్ని దేముడు హరించాడు." అంటూ మళ్ళీ మూర్ఛపోయారు.

తెల్లవారింది. మున్సబుగారి కబురందుకొని పోలీసులు వచ్చారు. ఇన్‌స్పెక్టరు నాయుడు అందరి దగ్గరా వాఙ్మూలాలు తీసుకుంటున్నాడు. ఒకరిమీద ఒకరు కేసులు బనాయించాలని ప్రయత్నం అందరికీ. రాజారావు మాత్రం "నే చెప్పవలసింది ఏమీ లేదు ఇన్‌స్పెక్టరుగారూ." అన్నాడు. వెర్రి సుబ్బిగాణ్ణి అరెస్ట్ చేశారు. మరో అయిదారుగుర్ని లాకప్‌లోకి తీసుకోబోతున్నారనే పుకారులు వ్యాపించాయి. వరదాచార్యులవారికోసం కబురు పెట్టాడు ఇన్‌స్పెక్టరు నాయుడు. "అగ్నిప్రమాదంలో చావు తప్పి బయటపడ్డాను. రాలేను క్షమించండి." అంటూ సవినయంగా

సమాధానం పంపారు ఆచార్యులవారు. దాంతో ఇన్‌స్పెక్టరు స్వయంగా బయలుదేరి రావడం జరిగింది. "రాజారావూ, వెర్రి సుబ్బిగాడూ గడ్డివాముకు నిప్పుపెట్టటం స్వయంగా చూశానండీ. మా అల్లుడుగూడా అప్పుడు నా ప్రక్కనే వున్నాడు." అంటూ మరొకసారి ప్రమాణంచేసి భగవద్గీతనుండి రెండు శ్లోకాలను అప్పజెప్పాడు వరదాచార్యులు. ఇన్‌స్పెక్టరు నాయుడు చిలిపిగా నవ్వి "మీరూ స్టేట్‌మెంట్ యివ్వాలి కరుణాకరంగారూ. మీరన్నా ఉన్నదున్నట్లు చెప్తారనే నమ్మకం నాకుంది." అన్నాడు.

"అంటే నేను అసత్య ప్రమాణం చేశానని మీ అభిప్రాయమా?" అన్నారు వరదాచార్యులు రోషంతో.

"మీరు చెప్పేది మీరు చెపుతున్నారు. ఆవతలివారు మరొక కథ చెప్తున్నారు. ఎవరిని నమ్మమంటారు చెప్పండి ?"

అంతలో ఒక కానిస్టేబిల్‌వచ్చి శాల్యూట్ చేసి "దొరగారొచ్చారండీ, లైబ్రరీ దగ్గరున్నారు. తమని రమ్మంటున్నారు." అన్నాడు. లేచి టోపీ పెట్టుకొని బయటకు నడిచాడు ఇన్‌స్పెక్టర్ నాయుడు. ఈలోగా చిల్లర స్టేట్‌మెంట్లన్నీ ఎస్. ఐ. తీసుకోవడం జరిగింది. ఆ నాడు ఆ ప్రాంతంలో డి. ఎస్. పి. కాంప్ చేయవలసి ఉంది. ఈ రిపోర్టు రావడంతో ఆయనే స్వయంగా రావడం జరిగింది.

డి. యస్. పి. ప్రభాకరరావు చాలా కరెక్టు మనిషి. విపరీతంగా అల్లర్లూ, హత్యలూ, దొంగతనాలూ జరిగే ప్రాంతాల్లో ఆయనను ప్రత్యేకంగా నియమించేది ప్రభుత్వం. ఇరుపక్షాలవారినీ ఎగదోయడం కాకుండా, నయానా భయాన లాలించి బెదిరించి రాజీ చేయడం ఆయన కలవాటు. ఊరి పెద్దలందరినీ పిలిపించాడు. "మీరు రాజీపడి బుద్ధిగా వుండకపోతే అందరినీ అరెస్టు చేయవలసి వస్తుంది.

అంతకుముందు ఈ విద్రోహాచర్యలకు తలపెట్టినవారు, వారంతట వారు తప్పు ఒప్పుకొని నష్టపరిహారం చెల్లించాలి." అంటూ గట్టిగా చెప్పాడు. ఎవరూ బయటపడలేదు. చివరకు చాలామంది "అయ్యా! కరుణాకరం గారిని పిలిపించండి, జరిగిన నిజం ఎటువంటిదో వారికి తెలుసు. వారు చెప్పింది విన్నతర్వాత మీకు ఎలా తోస్తే అలా చేయండి." అన్నారు.

కరుణాకరం రావడం, ఉన్నదున్నట్లు చెప్పడం జరిగింది. అంతమంది ముందు తన అల్లుడే తనకు వ్యతిరేకంగా సాక్ష్యం చెపుతాడని వరదాచార్యులవారు ఊహించలేదు. లజ్జా భారంతో ఆయన తల వ్రాలిపోయింది. డి. యస్. పి. వరదాచార్యులవారిని చివాట్లు పెట్టాడు. "ఈ ఆగడంవల్ల నష్టపోయింది ఎవరండీ? దేముడి కళ్ళు కప్పటం చాలా కష్టం. అగ్నిదేముడే మీకు ప్రాయశ్చిత్తం చేశాడు." అంటూ సన్నగా కఠినంగా మందలించాడు డి. యస్. పి.

వరదాచార్యులవారు దించిన తల యెత్తలేదు. "కావాలంటే మిమ్మల్ని ఆరేళ్ళు శ్రీకృష్ణజన్మస్థానానికి పంపగలను. కాని వయోవృద్ధులని వదిలిపెడుతున్నాను. కొండలకూ బండలకూ గూడా ఉంటుంది మీ కంటె పదిరెట్లు వయస్సు. ఆ విషయం గుర్తుంచుకోండి".

ప్రస్తుత పరిస్థితుల్లో శాంతి భద్రతలకు భంగం వాటిల్లే ప్రమాదముందిగనుక పంచాయితీ ఎన్నికలను వాయిదా వేయించడం అవసరమంటూ కలెక్టరు ద్వారా ప్రభుత్వానికి సిఫార్సు చేయించాడు. "స్తన్యం త్రాగి తల్లి రొమ్ములు గుద్దే నీచులు కూడా వున్నారీ

దిక్కుమాలిన ప్రపంచంలో, అందుకే ఈ ప్రపంచం యిలా తగలబడుతూంది." అంటూ తఃపుక్కున ఉమిసి లేచ్చక్కాపోయారు వరదాచార్యులవారు. వసంత ఈ కథ విని తండ్రికి భర్త వలన జరిగిన అవమానానికి వెర్రికోపంతో అవధులులేని రోషంతో బుసలు కొట్టింది.

"ఇలా వీడు కొరకంచై తలకు బ్రతికుండగానే కొరివి పెడతాడనుకోలేదు తల్లీ" అంటూ కుమార్తెను కౌగలించుకు కుమిలిపోయారు ఆచార్యులవారు. చెల్లాయమ్మగారు కొయ్యబారిపోయింది.

"అందరం మోసపోయాం నాన్నారూ." అంటూ తన కళ్ళు తడుచుకొని పమిట కొంగుతో తండ్రి కళ్ళు తుడిచింది వసంత. కరుణాకరం అక్కడికి వచ్చి ఈ దృశ్యం చూసి క్షణకాలం అక్కడ నిలబడి "వసంతా! నీతో మాట్లాడాలి ఒకసారి పైకిరా." అన్నాడు. ఆమె మాట్లాడలేదు. మళ్ళీ వంట మనిషి నందితో కబురుపెట్టాడు. ఆమె వినిపించుకోలేదు. "వెళ్ళు తల్లీ" అంది చెల్లాయమ్మగారు. "ఏముందమ్మా మనకు ఆయనతో మాట్లాడవలసింది?" అంటూ మొరాయించింది వసంత. పట్టలేని కోపాన్ని అదుపులో పెట్టుకొని క్రిందకు దిగిన కరుణాకరం వేగంగా అంగలు వేసుకుంటూ వచ్చి వసంతను రెక్కలు పుచ్చుకొని మేడమీదకు లాక్కుపోయాడు.

"తల్లీ! కట్టుకున్న భర్త. మేం కాటికి కాళ్ళు చాచాం. అతని మనస్సెరిగి నడుచుకో తల్లీ. మీ నాన్న సంగతి నీకు తెలియదు." అంటూ మూలిగింది చెల్లాయమ్మగారు.

"ఇంక నీతో సంసారం చేయను. సన్యాసం పుచ్చుకుని యతీంద్రులవారి ఆశ్రమంలో చేరకపోతే నేను ప్రతివాది భయంకర శాస్త్ర

కాచార్లు కడుపునే పుట్టలేదు." అంటూ యజ్ఞోపవీతం త్రెంచుకున్నారు చిందులు తొక్కుతూ వరదాచార్యులవారు.

"ఇప్పటికి చాలాసార్లు పుచ్చుకున్నారుగానీ సన్యాసం — స్నానానికి లేవండి, భోంచేద్దురుగాని. శోష వస్తుంది." అంటూ తుండు గుడ్డ అందించింది.

దాన్ని అందుకుని విసిరి నేలమీద కొట్టి వాకిట్లో బాదంచెట్టు క్రిందున్న మంచంమీద చుట్టచుట్టుకు పడుకున్నారు వరదాచార్యుల వారు.

# ఇరవై ఐదు

వసంతను పడకగదిలోని పట్టిమంచం మీదకు విసిరాడు కరుణాకరం. ఆమె క్రోధారుణ నయనాలతో దెబ్బతిన్న చిరుతపులిలా అతన్ని చూస్తూ "ఏమిటి మీ ఉద్దేశ్యం?" అంది.

"వసంతా! నేను చెప్పే ప్రతి మాటా నువ్వు జాగ్రత్తగా వినాలి."

"ఎందుకు?"

"ఇద్దరికీ ఒక బంధం ఏర్పడింది గనుక."

"బంధం ఉందనుకునే యింతపని చేశారా? పిల్ల నిచ్చిన నేరానికి ఆ ముసలాయన్ను యిలా వెన్నుపోటు పొడుస్తారా? ఏమిటి ఆయన మీకు చేసిన అపకారం? మీ మంచి కోరాడు, మిమ్మల్ని అందలం ఎక్కించాలనుకున్నాడు, అంతేనా?"

"ముందు నేను చేసిన అపకారమేమిటో కూడా కొంచెం చెప్పు. నంబాచార్లు గడ్డివాముకు నిప్పు అంటించింది మీ నాన్న. నేను కళ్ళారా చూశాను. చూసింది చెప్పాను. నిజం చెప్పడం గూడా పాపమంటావా?"

"మీరు సత్యహరిశ్చంద్రులనీ, మా నాన్న పరమదుర్మార్గుడనీ ప్రపంచం అనుకోవాలని కదూ మీరా పనిచేసింది? నిజంకోసం మామగార్ని కూడా జైలుకు పంపించటానికి సిద్ధపడిన సత్యసంధుడని లోకం అందలమెక్కిస్తుందని కదూ అంత ఘనకార్యం చేసింది?"

"మీ నాన్న మంచిచెడ్డలు నే చెపితేగాని ఊళ్ళోవాళ్ళకి తెలియదంటావా ?"

"ఔను. ఎన్ని పాపాలుచేసినా, ఎన్ని ఘోరాలుచేసినా మీలాగ అమాయకత్వం నటించటం ఆయనకు తెలియదు మరి."

"వసంతా!" కంఠస్వరం హెచ్చించి మందలించాడు కరుణాకరం.

"ఏం ? ప్రాణం తీస్తారా ? మీరు లక్షలకు లక్షలు ఎక్కడనుంచి మూటకట్టుకొచ్చారో, ఏ విధంగా సంపాదించారో ఎవరికీ తెలియదనుకోకండి. ఎవరికోసం డబ్బు రహస్యంగా యింట్లోంచి బయటకు జారవేస్తున్నారో అదీ తెలుసు. ఈ తెరచాటు నాటకాలు నిరాటంకంగా సాగించి లోకం కళ్ళుగప్పటానికే నన్ను పెళ్ళినాటకంలో హీరోయిన్ను చేశారని గూడా తెలుసు."

"ఏమిటి నీకు తెలిసింది ?"

"ముందు నా ప్రశ్నకు సమాధానం చెప్పండి."

"ఏమిటది ?"

"నగలన్నీ తీసుకొని చిన్న పెట్టెలో పెట్టి ఆఫీసు గదిలో ఎందుకు దాచుకున్నారు ?"

"చెప్తాను, అమ్మటానికి."

"ఎవరికి పెట్టటానికి ?"

"ఎవరిదగ్గర్నుంచి ఆ డబ్బు వచ్చిందో వారికి తిరిగి ముట్ట జెప్పటానికి. అంతేకాదు, ఆస్తి అంతాకూడా అమ్ముతున్నాను. మిగిలింది కూడా ఎక్కువలేదు."

"నా మీద కక్షగట్టి సాధిస్తున్నారా ?"

"పిచ్చిదానా ! అనవసరమైన శ్రమలు పెట్టుకోబోకు. ఈ కథంతా నీకు చెప్పకుండా వెళ్ళను. కాని యిప్పుడు వినే సహనం

నీకు లేదు, చెప్పే ఓపిక నాకూ లేదు. ఒక్క విషయం ప్రశాంతంగా ఆలోచించుకోమని మాత్రం చెప్తున్నాను. నువ్వు నన్ను చేసుకుంటానికి కారణం నా ఐశ్వర్యం కాదన్నావు. అదే నిజమైతే ఫర్వా లేదు. కాకపోతే మనం యింకా ఎక్కువ కాలం కలిసి వుండటం జరగదు." అంటూ ఆఫీసు గది బీర్వా తెరిచి నగల పెట్టె తీసుకొని, కొన్ని కాగితాల ఫైళ్ళూ, దస్తావేజులూ పట్టుకొని వెళ్ళిపోయాడు కరుణాకరం.

చిన్ననాడు చదువుకున్న 'కరి మ్రింగిన వెలగపండు' అనే పద్యపాదం గుర్తుకు వచ్చింది వసంతకు. గాలి పోయిన రబ్బరు బెలూను, రెక్కలు విరిగిన పక్షి, నీటినుండి బయటపడిన చేప, కోరలు తీసిన పాము, నడుం విరిగిన వస్తాదు - రకరకాల దృశ్యాలు మనోపథంలో కదిలి తేలుతున్నాయి. మర్నాడు సాయంత్రానికి తిరిగి వచ్చాడు కరుణాకరం. ఒకరితో ఒకరు మాట్లాడుకోకుండా మరొక వారం రోజులు గడిచిపోయాయి. వంటవాడు పెడుతున్న మెతుకులు తింటూ కాలక్షేపం చేస్తున్నాడు కరుణాకరం. కారు ఏలూరు నుంచి తిరిగి రాలేదు. డ్రైవర్ కూడా అదృశ్యమైపోయాడు. ఆ వారం రోజులూ వరదాచార్యులవారి సాధింపులు వినిపిస్తూనే వున్నాయి. ఆయనతో పోట్లాడే ఓపిక కూడా లేకపోయింది. వసంత అసలు బయట కనిపించలేదు. ఒకటవ తేదీ తర్వాత కొలువు అవసరంలేదని వంటవాడికి చెప్పాడు కరుణాకరం. పరిస్థితుల పరిణామాన్ని తలచుకొని కంటతడిపెట్టాడు ముత్తెం. "తెలియక గోతులోపడి అమ్మాయి గొంతు కోసేశాను రాఘవయ్యా" అంటూ రావిచెట్టుక్రింద పదిమంది ముందూ బావురుమన్నాడు వరదాచార్యులవారు. "డబ్బుండగా సినిమా తీసినా బావుండేది" అన్నాడు మిడిల్ స్కూల్ హెడ్ మాష్టారు రామనాథం. "ఈ జీవితంలో ఎప్పుడు ఏం జరుగుతుందో చెప్పలేంగదా ?" అంటూ వేదాంతం చెప్పాడు నంబాచార్లు. "దేముడి

లాంటి అన్నయ్యకు యిన్ని కష్టాలు రావాలా" అంటూ కంటతడి పెట్టింది శాంత. "ఎంత అజ్ఞానులీ మానవులు" అన్నట్లు నిర్లిప్తంగా పెదవులమీద చిరునవ్వు కరిగించాడు భార్య మాటలు విన్న బుచ్చి రామయ్య.

మరో పదిరోజులు గడిచాయి—

ఒకనాటి ఉదయం కరుణాకరం క్రిందకు దిగి వసంత గదిలోకి వచ్చి నేను ఈ వూరువదిలి వెళ్ళిపోతున్నాను వసంతా. నీవు ఎంతగా పెడచెవి పెట్టినా, చెప్పిపోవడం నా బాధ్యతగనక చెప్తున్నాను." అన్నాడు.

"నన్నేం చేస్తారు ?" అంది వసంత.

"నీ కభ్యంతరం లేకపోతే వస్తానంటే నాతోపాటు తీసుకు పోతాను."

"ఎక్కడికి ?"

"ఎక్కడికో యింకా ఆలోచించుకోలేదు."

"నెత్తిన గుడ్డవేసుకు బయలుదేరి పోయాక ఏ దేశంకాని దేశం లోనో ఏం తిని బ్రతకుతాం ? అంతా మంగళం చేసుకున్నాక ?"

"అందరూ లక్షలుండే బ్రతుకుతున్నారా ?"

"అందరి సంగతీ మాట్లాడబోకండి. మీ అంత అయోమయంగా ఎవరూ బ్రతకరు. చేతికందిన అదృష్టాన్ని నిర్వాకం చేసుకోలేనివారు, మీరు సంపాదించి నన్ను ఉద్ధరిస్తారంటే ఎలా నమ్మగలను ?"

"నమ్మగలిగితేనే రా. నేను బలవంతపెట్టి నిన్ను వెంటతీసుకు పోలేను. కాని వసంతా - జీవిత మన్నాక అందరికీ ఏదో దుర్ముహూర్తంలో దుర్భరమైన విషమ సమస్యలు ఎదురై ఊపిరాడని పరిస్థితు లేర్పడవచ్చు. జీవితాన్ని చూసి భయపడి విముక్తికోసం ప్రాణం ఆరాటపడే సందర్భం రావచ్చు. అటువంటి సమయంలో ఆత్మీయులు.

కావలసిన వారినుండి, ఏ సహాయం కాకపోయినా రవ్వంత సానుభూతి కూడా లభించకపోతే ఆ అల్పజీవి ఏం కావాలి చెప్పు? నేను ఏ పాపం చేశానో, ఏ నేరానికి శిక్షలు అనుభవిస్తున్నానో నీకెలా తెలుస్తుంది? నీ దగ్గరకువచ్చి, ఎంతో దగ్గరకు వచ్చి, ఎన్నో చెప్పాలని, కనీసం నీవైనా నన్ను అపార్థం చేసుకోగూడదని, నేరస్థుడని చీదరించగూడదని, ఈ మనస్సు ఎంతగా ఆరాటపడుతున్నదో, తపిస్తున్నదో, నీకెలా చెప్పను వసంతా? ఆద్యంతాలు లేక బుసలు పెడుతూ సుడిగుండాల ఉప్పెనల కెరటాలలో పరుగులు తీస్తున్న నిర్నిరోధ ప్రవంతిలో కొట్టుమిట్టాడే అభాగ్యునికి సాయంగా చేతి కందిన తృణంకూడా కాలనాగుగా మారి కాటువేస్తే అతనేం కాగలడు చెప్పు? జీవితంతో రాజీపడి, అన్ని ఆశలూ చంపుకుని ఏవో ఆదర్శాల భ్రమలతో బ్రతకాలనుకున్నా, అంతా పేకమేడలై కూలిపోతే ఎలా ఊపిరి పీల్చగలను చెప్పు?"

ఈ మాటలు విన్నతర్వాత వసంత క్రోధం కరిగి దుఃఖంగా పొంగి కన్నీరై రాలింది. "మీ బాధలు మీరు చెపుతున్నారు. మీ వ్యథలను తోరణాలుగా గుచ్చి, నా మెడకు ఉరివేస్తున్నారు. మీరూ ఆలోచించండి. నాలాంటి వాళ్ళతో మీకు చాలామందికి పరిచయముంది. కాని నాకు మీ రొక్కరే. ఆశలూ ఆశయాలూ ఆకాంక్షలూ మీకేకాదు, బ్రతికున్న ప్రతి మనిషికీ వున్నాయి. నాకూ వున్నాయి. నేను కన్న కలల గురించీ, అల్లుకున్న ఆశల గురించీ ఎవరికి చెప్పుకోను? ఎవరు నాకు సమాధానం చెప్పేది?" అంటూ అతని వళ్ళో వ్రాలిపోయింది.

పంచుకున్న కన్నీరు పలచబడి పోతుందంటారు.

"సార్!" పిల్చాడు వంటవాడు.

రాజారావ్ వచ్చాడట. ఎదురువెళ్ళి వెంటబెట్టుకొని మేడ మీదకు నడిచాడు కరుణాకరం. నంది కాఫీ తెచ్చి యిచ్చాడు. కాఫీ

వద్దన్నాడు రాజారావు. "మా రాణీగారి ఆజ్ఞ. నిజంగా బ్రదర్. చంటిపాపను సాకినట్లు సాకుతూందనుకో. దాని పరిరక్షణా, ఆశీస్సులూ లేకపోతే ఎన్నడో పోయేదీ ప్రాణం." అన్నాడు కృతజ్ఞతా భావంతో మెరుస్తున్న కన్నులతో.

"అదృష్టవంతుడివిరా." అన్నాడు కరుణాకరం.

"కల్యాణి మనస్సటువంటిది. అటువంటి స్ఫటికంలాంటి మనిషిని గురించి ఎన్ని అపవాదులూ, ఎన్ని నిందలు? అందుకే రేపు సోమవారం పెళ్ళి చేసుకుంటున్నాం. అమ్మకూడా యింకా ఎక్కువకాలం బ్రతికేటట్లు లేదు. యింతకాలం ఆమెను మభ్య పెడుతూ వచ్చాం. ఆ లాంఛనం పూర్తిచేస్తే పరలోకానికి పోయినా ఆమె ఆత్మ శాంతిస్తుంది. ఈ పిచ్చికుక్కల అరుపులూ తగ్గుతాయి.'

ఆనందాతిశయంతో చెమ్మగిలిన కనులతో మిత్రుని భుజం తట్టి "చాలా సంతోషం రాజా. ఎంతటి కారుమబ్బులు పట్టినా ఎక్కడో ఒక మెరుపు విరిస్తుంది. అదే జీవితం నడిచే తీరు అనుకుంటా." అన్నాడు.

ఆ తర్వాత సంభాషణ ప్రసూన మీదకు దొర్లింది. "చెప్పావు కాదు, ఎలా తెలుసు నీకు?" అన్నాడు కరుణాకరం.

"తెలియడమంటే చెప్తా. ఆ మనిషిని తెలుసుకోవటం ఎవరి తరం? గభీరమైన ఒక సముద్రం ఆ మనస్సు. కాని ఒక్కటే తేడా. నీటి కెంత నిలకడవుందో ఆమె మనస్సుకూ అంతే. జీవితాన్ని అంత నిర్లక్ష్యంగా చూస్తూ ఆటబొమ్మలా విసిరివేయగల వ్యక్తులు మనకు చాలా తక్కువమంది కనిపిస్తారు. రెండు సంవత్సరాల క్రితం అన్నారు ల్లాకుకు ఎవళ్లో అమెరికన్లు వచ్చారు. అందులో ఒకతను ఈమెను వెంటబెట్టుకొచ్చాడు. నేను అక్కడికి పనిమీద వెళ్ళాను. పరిచయమయింది. అది చాలా చిత్రమైన పరిచయం. ఒకరోజు

యిద్దరం కలిసి టి. బి. లో వున్నాం. వున్న కాసేపూ బయటి ప్రపంచంతో, గతంతో, వర్తమానంతో సంబంధం లేదనిపించింది. 'నువ్వు ఉండమంటే నీతో వుండిపోతాను' అంది.

'ఎన్నాళ్ళుంటావ్ ?' అన్నాను.

'నీకు విసుగు పుట్టేదాకా' అంది నవ్వుతూ. ఆ నవ్వులో జీవితం విచ్చి కరిగిపోతుందనుకో. ఆమెముందు యదార్థంగా జరుగు తున్న ప్రతి సంఘటనా ఒక చిత్రమైన కల. ఆమె ప్రక్కకు తొలగి పోయేవరకూ ఆ స్వప్నం అలాగే వుంటుంది. నిడలు మాట్లాడ తాయి. నవ్వులు మాట్లాడతాయి. చూపులు మాట్లాడతాయి. మౌనం మాట్లాడుతుంది. పీల్చి విడుస్తున్న గాలి పిచ్చి కథలు చెపుతుంది. కానీ, ఖర్చు మనిషి. అవసరం రాకపోయినా సర దాకు జీవితాన్ని నయాపైసగా మార్చి చాక్ లెట్ కొనుక్కుతిని చచ్చిపోగలదు. చాలా డబ్బు హారించుకు పోయింది. డబ్బుకోసం నేను బాధ పడుతున్నా ననుకొని బళ్ళో పంతులమ్మగా జేరింది అన్నారంలో. యింటికి తీసుకొచ్చాను. చిరుగాలిలా, పూల పరిమ ళంలా, రంగు పొంగుల ఇంద్రధనుస్సులా వచ్చింది. కాని ఎలా వచ్చిందో అలాగే వెళ్ళిపోయింది. ఎందుకు వచ్చిందో తెలియదు. ఏంచూసి నా సాంగత్యాన్ని ఆశించిందో తెలియదు. ఎందుకు ఆకస్మి కంగా అదృశ్యమై పోయిందో అంతకన్నా తెలియదు." అంటూ నిట్టూర్చాడు రాజారావు గతాన్ని పోల్చుకుంటూ, గతించిన అనుభ వాలను తలుచుకుంటూ.

"ప్రసూన గత చరిత్ర నీకు తెలుసా ?"

"తెలియదు."

"అడగలేదా నువ్వు ?"

"అడిగాను. చిలిపిగా నవ్వేది. మళ్ళీ అడిగితే చిరుకోపంతో కసిరేది. చుట్టూ ముళ్ళున్నాయని గులాబీని పారేయగలవా రాజా ? - అనేది. నేనెవరైతే నీ కెందుకు? - అనేది. నిన్నేమన్నా

బాధ పెడుతున్నానా ?- అంటూ లాలించేది. యింక ప్రయోజనం లేదని ఎన్నడూ అడగలేదు ఆమె విషయం. అది సరేగాని, నీకెలా తెలుసు ప్రసూన ?"

"అదొక పెద్ద కథ - పది సంవత్సరాల క్రితం -" అంతటితో సంభాషణ ఆగిపోయింది. ఉప్పరిగూడెంనుంచి ఎవరో వచ్చారు పరుగులు తీసుకుంటూ.

"రాజారావుగారూ! మీ అమ్మగారు కదలడం లేదటండీ!" అన్నాడు ఆ ఆసామీ.

రాజారావు వెళ్ళిపోయాడు.

కరుణాకరం అతన్ని అనుసరించాడు.

# ఇరవై ఆరు

ముసలమ్మ వెళ్ళిపోయి వారం రోజులయినా ఆ విచార భారం నుండి యింకా రాజారావు కోలుకోలేదు. జరగవలసిన విధంగా ముసలమ్మ కర్మకాండలు జరగలేదు. అయినవాళ్ళెవరూ రాలేదు. అన్నగారుకూడా. రాజారావు అన్నగారికి కబురుచేశాడు. ప్రయోజనం లేకపోయింది. కడుపుమండి తిట్టాడు. "ఆయన్ను ఎందుకలా తిడ్తారు? ఆడపిల్లల్ని కన్న తండ్రి. మనలాంటి కులంచెడిన వాళ్ళ గడప తొక్కితే వాళ్ళకు పెళ్ళిళ్ళుకావని ఆయన భయం." అంటూ మళ్ళీ మిషన్ కుట్టటంలో లీనమైపోయింది కల్యాణి. నెల రోజుల క్రితం ఒక పాత మిషను కొంది. దానిమీద అంత ఆదాయం వుంటుందని ఎన్నడూ ఊహించలేదు. పది రోజులు రాత్రింబవళ్ళూ కష్టపడి కుట్టుపని నేర్చుకుంది. రోజూ నాలుగైదు రూపాయలు సంపాదించగలుగుతూంది. పిళ్ళలోకం కొట్లో ఆరు గజాల పాప్లయిన్ తెప్పించి రెండు చొక్కాలు కుట్టింది రాజారావుకు. అతని కళ్ళు చెమ్మగిల్లాయి.

"ఎందుకు రాజా?" అంది కల్యాణి.

"నేను నీకు కొనవలసింది..." అన్నాడు రాజారావు.

"నువ్వూ నేనూ తేడా అనుకుంటున్నామా చెప్పు. అదీగాక రోజులు కలిసిరావాలిగాని నువ్వే సంపాయిస్తావు రెండు చేతుల్తో. కలిమిలేములు కావడికుండలంటారు - వినలేదూ? అంత సంపాదించిన కరుణాకరం ఏమయ్యాడు చెప్పు?"

కరుణాకరం గుర్తుకురాగానే యిద్దరూ బాధపడ్డారు. అతనికి అదృష్టం ఎలా కలిసివచ్చిందో అలాగే కరిగిపోయింది. ఇల్లూ, పొలం

అన్నీ మాయమయ్యాయి. చివరకు మిగిలిన డబ్బులో ముత్తెం బాకీ తీర్చి మిగిలిన మూడువేలూ ఇల్లు కట్టుకుంటానికి వరదాచార్యులవారికి యిచ్చాడు. గుండె పగిలిన వసంత మంచమెక్కింది. కరుణాకరం ఊరు వదిలిపోతాడని పుకారు బయలుదేరింది. కానీ యింకా వెళ్ళలేదు. ఈ వూరు రాగానే వరదాచార్యులగారి యింట్లో దిగాడు. చెల్లాయమ్మగారి చేతివంట తిన్నాడు. యిష్టమున్నా లేక పోయినా వసంత సాహచర్యం అనుభవించాడు. తిరిగి అదే పరిస్థితి కొన్ని తేడాలతో. ఆనాడు అతని పరిచయం కోసం అందరూ ఎగబడినవారే. ఈ నాడు తప్పుకు పోతున్నారు. ఈ మధ్య రామనాథం మాష్టారు రంగదాసు ప్రోత్సాహంతో 'బయటపడిన మోసం' అనే సాంఘిక నాటకాన్ని వ్రాసి గురవయ్యగారి పాకలో టిక్కెట్టు లేకుండా అందరికీ చూపెట్టాడు. 'అది కరుణాకరం కథ' అంటూ గుసగుసలుగా చెప్పుకున్నారు. రాజారావు చెవిన ఈ మాట పడటంతో సరాసరి బళ్ళోకిపోయి పదిమంది టీచర్లముందూ వందమంది పిల్లలముందు ఆయన చొక్కా పట్టుకొని కుర్చీలో ఎత్తి కుదేసి "చావాలనివుందా చచ్చుపీనుగా ?" అంటూ బెదిరించాడు. రామనాథం రెండు లెంపలూ ఛడేల్ మంటూ వేసుకుని "నాటక ప్రారంభంలో - ఈ కథ కేవలం కల్పితం. పాత్రలూ సంఘటనలూ ఎవరికీ సంబంధించినవి కావు - అని చెప్పామండీ." అంటూ సంజాయిషీ చెప్పుకున్నాడట.

కొన్నాళ్ళ తర్వాత —

ఆనాటి రాత్రి అన్నం వడ్డిస్తూ "కరుణాకరం - వసంతల సంగతి తలుచుకుంటేనే ప్రాణం తరుక్కుపోతూంది రాజా." అంది కల్యాణి.

"మనం ఏం చేయగలం చెప్పు? కుక్కకాటుకు చెప్పుదెబ్బంటూ ఢక్కామొక్కీలు తిని ఏటి కెదురీదటం నేర్చుకున్నాం మనం. కాని వాళ్ళిద్దరివీ వేలమనస్సులే. చిరుగాలికే కందిపోయే మనస్సులు. ఇన్ని దెబ్బలు తట్టుకోవడం మాటలా చెప్పు."

రాజారావు చెప్పింది నిజమే. మరో పది రూపాయలు ఎక్కువిచ్చి పురోహితుణ్ణి పిలిపించి శాస్త్రోక్తంగా కల్యాణిని భార్యగా స్వీకరించాడు రాజారావు. అంతటితో ఊరివాళ్ళ నోళ్ళు చాలావరకూ మూతపడ్డాయి. రెండు గేదెలు కొనుక్కొని వాటి పాలను సైకిలుమీద పోయి జంక్షన్‌లోని హోటళ్ళల్లో పోసి వస్తు న్నాడు రాజారావు. నయాపైసల్ని మూటకట్టి పెంచడమెలాగో రాజారావుకు నేర్పింది కల్యాణి. పూర్వ పరిచయాలనుబట్టి మళ్ళీ రెండు సీమపందుల్ని కొని వ్యాపారం ప్రారంభించాడు. కరుణాకరం బయటకు రావడంలేదు. పెట్టింది తినడం - ముసుగు పెట్టుకు పడుకోవడం - ఇదీ అతని దినచర్య. "ఆ బుచ్చిరామయ్యకు నకలుగా తయారయ్యాడు. వాడి మొహం - ఆహాఁ బావుంది. అదేదో సామెత చెప్పినట్లు - అమ్మి - నే చెప్తున్నా విను - నెత్తిన రూపాయి పెట్టి అమ్మితే ఈ వాజమ్మ రాగిదమ్మిడీకి మారదు..." - ఇత్యాది మాటలు వరదాచార్యులగారు భార్యతోనూ మహాజనంతోనూ బహి రంగంగా అంటున్నారని కల్యాణితో నీలాటి రేవులో చెప్పింది శాంత.

"ఇలాటి మాటలు చెవిన పడితే కరుణాకరం ఎంత నొచ్చు కుంటాడో నన్న జ్ఞానమే లేదే ఆ ముసలాయనకు, అన్నేళ్లు వచ్చాయి మళ్ళీ." అంది ఎంగిలెత్తుతూ కల్యాణి.

ఇద్దరూ తాంబూలాలు వేసుకుంటూ కూర్చున్నారు. ఆకులకు తొడిమలు తీసి సున్నం రాస్తున్న కల్యాణినీ, ఆమె కట్టుకున్న ఆకు పచ్చని చీరనూ అలాగే రెప్పలార్పకుండా చూస్తున్న రాజారావును

చూసి "ఏమిటి అలా కొయ్యబారిపోయారు?" అంది నవ్వుతూ కల్యాణి.

"ఈ జాకెట్ నువ్వు కుట్టుకున్నదేనా? రాణీగారికి ఫ్యాషన్లు తెలియవనుకున్నానే ఇన్నాళ్ళూ!" అన్నాడు ఆశ్చర్యం ప్రకటిస్తూ రాజారావు.

"ఓహో! అదా కథ - వెర్రి బాగా ముదురుతుందే కాసేపు దగ్గర కూర్చుంటే మీకు."

అలాగే చూస్తున్నాడు రాజారావు.

ఏమిటచెంగు వంటినిండా కప్పుకుంది కల్యాణి.

"చలిగా వుందేమిటి?" అన్నాడు రాజారావు.

"లేదు - ఆఁ ఆఁ కాస్త అసింట..."

"ఇశాకపట్నమేటి మంది?"

"కాదు, బొబ్బర్లంక."

ఇద్దరూ విరగబడి నవ్వుకున్నారు.

మళ్ళీ తలెత్తింది కల్యాణి.

అలాగే చూస్తున్నాడు రాజారావు.

"అదే వద్దంట."

"ఏది?"

"అలా చూడటం - ఆ కళ్ళల్లోనే వుంది పొగరుమోతుతనం."

ఇద్దరూ కాసేపు మౌనంగా కూర్చున్నారు తాంబూలం నములుతూ.

కొంచెంసేపయాక "ఏమిటి మళ్ళీ ఆలోచనలో పడ్డావు?" అంది కల్యాణి.

"నిన్ను ఒక ప్రశ్న చాలా కాలంగా అడుగుదామను కుంటున్నా కల్యాణీ !"

"ఏం ముహూర్తం యిప్పటికి కుదిరిందా ?"

"నువ్వేమన్నా బాధపడతావేమోనని..."

"ఫర్వాలేదు, అడుగు."

"ఆనాడు ఆ రామనాథాన్ని పెళ్ళి చేసుకుంటానికి నువ్వు ఎలా ఒప్పుకున్నావా అని ?"

"ఒప్పించారు."

"అందులో నీ దోషం లేదంటావా ?"

"దాన్ని దోషమంటావో మరింకేమంటావో నా మొహం చూసి అను రాజా."

"నిన్ను నిందించటం లేదు నేను."

"నాకు తెలుసు."

"విషయం తెలుసుకుందామని -"

"తెలుసుకొని ఏంచేస్తారు ? ఒక్క విషయం చెప్తాను రాజా. మనస్సు కలిసిందని ఆవలి మనిషిని మానవాతీత శక్తులు గల దేవతగా భ్రమపడే ప్రలోభం చాలామందిలో వుంటుంది. దానికి నువ్వు అతీతుడివి కాదు. అలాగే నీ బుర్ర ఎంత గట్టిదైనా పిడుగు వచ్చి మీద పడితే ఏం చేస్తావు చెప్పు. తలకాయలోనే దోషముందంటావా ? నే కోరే దొక్కటే. ఆలోచనలతో ఆవేదనలతో ఏదో జరుగు తుందనే భయాలతో మన సంసారాన్ని క్రుంగదీసుకోవడం నా కిష్టం లేదు. నీ కష్టసుఖాలు పంచుకుంటానికి నేనున్నాను. చుట్టూ అంధ కారం తప్ప, ఎటువంటి ఆశలూ కనుచూపుమేరలో లేని రోజుల్ని మనం అనుభవించాం. సూర్యోదయమో చంద్రోదయమో ఏదో అయింది. కాంతి కిరణాలు చీకట్లను చీల్చుకుంటూ మన జీవితాలలో

ప్రవేశించాయి. యింకా ఆ కాంతికిరణాలను మళ్ళీ చీల్చి, యింకా చీకటి మిగిలిందేమోనని అన్వేషించటంలో అర్థముందంటావా? జరిగిపోయిన కాలాన్నీ, కరిగిపోయిన రోజుల్నీ ఒక్కసారి గుర్తుకు తెచ్చుకో. ఈమాత్రం సుఖ శాంతులతో బ్రతకగలమని ఎన్నడైనా మనం ఊహించటం జరిగిందా?"

మెరుస్తున్న కళ్ళతో, ఆనందోద్వేగంతో కంపిస్తున్న పెదిమలతో కల్యాణి చెప్తున్న మాటలు వింటూ ఆమె వళ్ళో ఒరిగిపోయి పసిపాపలా కడుపుకు కరుచుకుపోయి "నన్ను బ్రతికించేదెవరు కల్యాణీ? నాకు తెలుసు. మనోబలం నీది. మనస్సు నీది. ఆశీస్సులు నీవి. నాకు నాదంటూ ఏముందంటావ్ ఈ లోకంలో నీవుగాక. పొరపాటే జరిగింది. క్షమించు. యింక ఎన్నడూ నిన్ను బాధించను." అంటూ కన్నీటితో ఆమె గర్భాన్ని క్షాళనం చేశాడు శైశవాన్ని గుర్తుకు తెచ్చుకుంటున్న రాజారావు. కల్యాణి సాన్నిధ్యంలో నిలవలేని మృత్యువు పారిపోయింది. ఎందరు పతివ్రతలు తమ భర్తలను యమపాశంనుండి రక్షించలేదు పురాణగాథల్లో! అవి కట్టుకథలనుకున్న తన అజ్ఞానాంధకారానికి సిగ్గుపడ్డాడు.మనోబలాన్ని మించిన మహాశక్తి లేదన్నారు మానవజీవితానికి. ఆ మనోబలం అందరికీ లభించేది కాదు. ఆత్మవిశ్వాసం అంటే కల్యాణికి మారుపేరు. నీ గొప్పతనం లోకానికి నీపై గల అభిప్రాయంమీదకంటె, నీపై నీకుగల అభిప్రాయంమీద ఎక్కువ ఆధారపడి వుంటుందేమో!

రాజారావుకు అర్ధరాత్రి మెలుకువ వచ్చింది. నిద్రపోతున్న కల్యాణిలో ప్రసూన పోలికలు కనిపించాయి. కొనతేలిన ఆ గడ్డాన్ని కొంచెం సవరిస్తే ఇద్దరిదీ నుమ్మూర్తులా ఒకటే పోలిక. కరుణాకరానికి ప్రసూన ఎలా పరిచయమో అర్థం కాలేదు. కథ మొదటి వాక్యం పూర్తికాకముందే అంతరాయం కలిగింది ఒకసారి. మరొక

సారి కరుణాకరం కలిసినప్పుడు ప్రసూన ప్రసక్తి వచ్చింది. "ఆమె ఋణం శక్తి ఉన్నంతవరకూ తీర్చుకున్నాను రాజా" అన్నాడు. అదొక భరించలేని సస్పెన్స్‌గా పరిణమించింది. ప్రసూన జీవితమే ఒక మిష్టరీ. కరుణాకరం దగ్గర పాతికవేలూ పుచ్చుకున్నాక అదృశ్యమై పోయింది అడ్రస్ తెలియకుండా. ఎప్పుడు ఎక్కడ మునుగుతుందో ఎక్కడ తేలుతుందో అంతుచిక్కని విచిత్ర వ్యక్తి. 'ఈమె వృద్ధాప్యం ఎలా గడుస్తుందో ?' అనే అనుమానం కలిగేది అనేకసార్లు. తన తల్లి పండిపోయేదాకా బ్రతికుంది. కన్నకొడుకు గనక తాను భరించాడు అనిర్వచనీయమైన ఆత్మ సంతృప్తితో. అదే ప్రశ్న అడిగాడు ప్రసూనను ఒకసారి. "అంత ముసలితనం వచ్చేదాకా నే బ్రతికితేగదా బాధపడవలసింది ?" అంది. విశృంఖలంగా బ్రతికే వయసులో వున్న మనుష్యులు చాలామంది ఈ మాటలు అనగా విన్నాడు. కాని ఆ మాటలు ఎన్నడూ నమ్మలేకపోయాడు. ప్రసూన చెప్పినప్పుడు ఎందుకో నమ్మాలనిపించింది.

మర్నాడు "సాయింత్రం సీతారాముల ఆలయంలో గోవింద యతీంద్రులవారి భజన సంకీర్తన ముంద"ని చెప్పింది కల్యాణి.

"వెళ్ళు." అన్నాడు కుడితి కలుపుతున్న రాజారావు.

"నువ్వు రాగూడదా ?"

"నేను వస్తే ఊరుకుంటారా పరమభక్తులు."

"చూద్దాం. యతీంద్రులవారు ఏం తీర్పు చెప్పగలరో చూద్దాం. నువ్వుమాత్రం కయ్యానికి కాలుదువ్వకూడదు."

"ఒకరికి యిష్టముండదని తెలిసీ మన మెందుకు వెళ్ళాలి ?"

"ఊళ్ళో బ్రతుకుతున్నాం గనక."

"ఎవరిమీద ఆధారపడి తింటున్నాం మనం ?"

"ఒక వ్యక్తితో మనకు పని లేకపోవచ్చు. ఎవరి తిండీ మనం తిని బ్రతకక పోవచ్చు. కాని లోకాన్ని అంతా కాదని ఎదురు తిరగలేం రాజా. అదీగాక ఎంతసేపని యింట్లో యిలా కూర్చుంటాం?"

ఇల్లు తగలబడింతర్వాత వరదాచార్యులవారి ఉధృతం కొంత తగ్గడంతో ఊరు కొంత చల్లబడింది. ఆ భగవంతుడిమీదనూ, యతీంద్రులవారిమీదనూ కూడా ఆచార్యులవారికి నమ్మకం చాలా తగ్గినట్లుంది. కనీసం స్వామివారిని దర్శించటానికికూడా రావడం లేదు. కల్యాణి వెనకనుంచి దోవ చేసుకుపోయి శాంత ప్రక్కన కూర్చుంది. రాజారావు ముందుకు పోవడానికి యిష్టంలేక అరుగుమీదనే నిలబడ్డాడు. ఆ ప్రక్కనే కరుణాకరం కనిపించాడు. ఇద్దరూ అరుగు దిగి కొంచెం వెనకకు నడిచి కబుర్లలో బడ్డారు. ఆనాటి రాత్రి తమ యింట్లో భోంచేయమని పిలిచాడు కరుణాకరాన్ని రాజారావు. ఆ పిలుపుకోసమే ఎదురుచూస్తున్నట్లు "సరే" నన్నాడు కరుణాకరం. రాత్రి తొమ్మిదిగంటలకు సంకీర్తనం పూర్తయింది. ముగ్గురూ మసక వెన్నెలలో నడుచుకుంటూ యింటికి జేరుకున్నారు. రాజారావు యింట్లోవచ్చిన మార్పును చూసి సంతృప్తిగా "ఎటువంటి యిల్లు ఎలా మార్చిందో చూశావా కల్యాణి?" అన్నాడు కరుణాకరం.

"యిల్లేకాదు, వళ్ళుకూడా." అన్నాడు రాజారావు.

"వళ్ళేకాదు, మనస్సుగూడా." అంది కల్యాణి.

బిగ్గరగా నవ్వేశాడు రాజారావు. సన్నగా నవ్వుతూ క్రింది పెదవి కొరికి కరుణాకరాన్ని చూసి సిగ్గుపడింది కల్యాణి. క్షణకాలం నివ్వెరపోయి తానూ నవ్వాడు కరుణాకరం.

"ఎలా గడుస్తున్నాయి రోజులు?" అన్నాడు కరుణాకరం యింకేమనాలో తెలియక.

"సుఖంగానే వుందిలే. ఇద్దరు గెజిటెడ్ ఆఫీసర్ల జీతం సంపాదిస్తున్నాం యిద్దరం కలిసి - అనాడు - అది సరేగాని - ఎవరో వచ్చారు నీకోసం పొద్దుగాటి కారులో ? బోద్దింక మొహం వాడూనూ ! ఎవరేమిటి ?" అన్నాడు రాజారావు.

"నా లతులుచూసి నాతో పరిచయం చేసుకున్న మనిషి. ఏదో ఫ్యాక్టరీ పెట్టాలనీ, ఆ బిజనెస్‌లో కోట్లు గడించవచ్చుననీ, నన్ను పెట్టుబడి పెట్టమనీ, హైదరాబాద్‌లో వుండగా రోజూవచ్చి శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం పాడి నిద్రలేపేవాడు. ఈమధ్య వారానికి ఆరేసి ఉత్తరాలు రాశాడు. జవాబు రాక తానేవచ్చి నా పరిస్థితి చూసి పాము ముట్టుకున్న మనిషిలా నల్లబడి నురగలు కక్కుకుంటూ - ఈ హంబగ్ మనిషి హెంత టోపీ వేశాడ్ ? పెట్రోలూ ఖరాబ్ - అంటూ వెళ్ళిపోయాడు ఆ చమన్‌లాల్ దత్తారాం."

"కబుర్లలో పడ్డట్టున్నారు. యింక భోజనాలకు లేవండి బాబూ, ప్రొద్దుపోయింది." అంది కల్యాణి వచ్చి పమిట చెంగుతో చేతులు తుడుచుకుంటూ.

"అప్పుడే అయిందా వంట ?"

"సరే - ఈయనగారికి ప్రొద్దు కూకకుండానే కావాలి వంట. అందులోనూ గుళ్ళోకి బయలుదేరాలి గదా అని మరింత పెందరాడే చేసుకొని బయలుదేరాం."

భోజనం కలుపుకుంటూ "అది సరేకానీ కరుణా! యిలా ముగ్గురం ఒకచోట కలుసుకుని ఎన్నాళ్ళయిందంటావ్ ?" అన్నాడు రాజారావు.

"గుర్తులేదు - బాగా చిన్నతనం గదా ?"

"మగవాళ్ళు ఏ విషయమైనా ఎంత తేలికగా మరిచిపోతారు!" అంది కల్యాణి వ్యంగ్యంగా.

"ఆడవాళ్ళు ప్రతి చిన్న విషయాన్నీ ఎంత ప్రాణప్రదంగా గుర్తు పెట్టుకుంటారు!" అన్నాడు రాజారావు చురకవేస్తున్నట్లు.

"అబ్బా! నీతో మాట్లాడటం నా తరంకాదు బాబూ." అంది కల్యాణి చిన్న మూతిని యింకా కుదిస్తూ.

"దీనితో వచ్చిన చిక్కు ఇదేరా బ్రదర్. కోపం ముక్కు మీదనే కాపరం చేస్తుంది. ఎలా గడుపుకొస్తున్నావ్ రోజులని అడగబోకు. అహాన్ని చంపుకుని, అభిమానాన్ని తరిమేసి కొంగు పుచ్చుకు వంతపాట పాడుతూ గడుపుకొస్తున్నా రోజుల్ని. ఒక్కమాటలో చెప్పాలంటే దాసోహమన్నానోయ్. నీదగ్గర దాపరిక మెందుకు ?"

కరుణాకరం ఆలోచనలో మునిగిపోయాడు.

"ఏమిటి ఆలోచనలో పడ్డావ్ కరుణా ?" అంది కల్యాణి.

"చిన్ననాటి సంగతులు ఒకటొకటే జ్ఞాపకం వస్తున్నాయి. ఆ రోజుల్లో నీపేరు చెపితే ఆమడదూరం పరిగెత్తేది కల్యాణి." అన్నాడు కరుణాకరం.

"కాదు కరుణా! రాజా యిప్పుడున్నాడుగానీ పచ్చి రౌడీ కాదు - ఛీ - పాడు. తలుచుకుంటే సిగ్గు. అన్నీ పోకిరీ పనులే. ఓసారి చింతచెట్టుమీంచి దూకి జడపుచ్చుకు లాక్కుంటూ చెర్లో ముంచాడు." అంది కల్యాణి నవ్వుతూ.

"మనిద్దరం ఎప్పుడూ ఒక జట్టుగా ఉండేవాళ్ళం." అన్నాడు కరుణాకరం.

"ఆఁ దొందూ దొందే అన్నట్లు." అంటూ నోటనిండా నవ్వాడు రాజారావు.

కావాలని వసంత విషయం అడగలేదు రాజారావు. కాని ఉండబట్టలేక "వసంతకు ఏమిటి జబ్బు కరుణా ? మంచం దిగడం లేదట ?" అని అడిగింది కల్యాణి.

"ఏం జబ్బని చెప్పమంటావ్. అన్నం తినదు. నీళ్ళు తాగదు. స్నానం చేయదు. బట్ట విప్పదు. ముసుగు తలనిండా వేసుకుని కదల కుండా పడుకుంటుంది. పుల్లలా మారిపోయింది. ఏదో సామెత చెప్పినట్లు - పోనీలే ఆ గొడవలెందుకు ? బిజినెస్ ఎలావుంది రాజా ?"

"చెప్పానుగా బాగానే వుందని."

రాత్రి కరుణాకరం యింట్లో అడుగు పెట్టుంటే గడియారం పన్నెండు గంటలు కొట్టింది. ముందు వసంత గదిలోకి వెళ్ళాడు. దీపం పెద్దది చేసి చూశాడు. ఆమె మేలుకునే వుంది.

"ఎలావుంది వసంతా వంట్లో ?"

"ఇప్పటికి వదిలిపెట్టిందన్న మాట."

"ఏమిటి ?"

"ఇంత రాత్రి జరిగితేగాని యిల్లు గుర్తు రాలేదన్నమాట."

"వసంతా ?"

"అరవకండి. అరుపులువినే ఓపిక పోయింది. ప్రాణం పోవడం లేదు. కాని - కాస్త ఓపికపట్టండి."

"అందుకే ప్రాధేయపడుతున్నాను వసంతా. నీ ఆరోగ్యం బావుండలేదు. దానికి కారణం నీ మనస్సు. దాన్నింకా పాడుచేసు కోకు. కల్యాణి నువ్వనుకున్నంత నీచురాలు కాదు."

"పోనీ చెప్పండి. ఎంత నీచురాలో ? మీరు చెప్పిందీ నిజమే. అర్థరాత్రన్నా వదిలిపెట్టింది పెళ్ళాం బ్రతికుందో లేదో చూసిరమ్మని. కొంత నయం." అంటూ గోడవైపు తిరిగి పడుకుని తలనిండా ముసుగు పెట్టుకుంది వసంత. కాసేపు నిలబడి ఆమె మంచంమీద కూర్చున్నాడు వీపును చేతితో నిమురుతూ. భర్త చేయి విదిలించు

కుంటానికి ఒకటి రెండుసార్లు ప్రయత్నించి, తర్వాత కదలకుండా పడుకుంది వసంత.

అలాగే కూర్చున్నాడు. తెల్లవారుఝాము నాలుగు గంట లయింది. వరదాచార్యులవారు ఆ గదిలోకివచ్చి మంచంమీద కూర్చున్న కరుణాకరాన్ని చూసి "అలా బ్రతకనీబాబూ దాన్ని, పోయి పడుకో." అంటూ సీసాలో మందు ఔన్సుగ్లాసులో పోసి ఆమె గొంతులోపోసి వెళ్ళిపోయాడు.

నిష్క్రమించిన నీడను చూస్తున్న కరుణాకరం ముఖం నల్ల బడింది.

"వసంతా!" అన్నాడు నుదిటిమీద చమటను తుడుస్తూ కరుణాకరం.

"చెప్పండి."

"నువ్వు అనుకుంటున్న ఏ తప్పూ నే చేయలేదు వసంతా - నన్ను అపార్థం చేసుకొని నువ్వు హింసపడుతూ నన్ను హింసిస్తు న్నావ్."

"నేను చాలా పాపాలు చేశాను."

"అలా అనలేదు నేను."

"మరేమంటారు?"

"మనస్సు బావుండక యతీంద్రులవారి భజన సంకీర్తనానికి వెళ్ళాను. అక్కడ రాజారావు కనిపించి భోజనానికి పిలిచాడు. వెళ్ళాను రవ్వంత మనశ్శాంతికోసం."

"దొరికిందా?"

"కాదు. అక్కడ నేను చూసిన అద్భుతదృశ్యం..."

"ఏమిటది?"

"ఐశ్వర్యం లేకపోయినా, ఆరోగ్యం లేకపోయినా, లోకం చిన్నచూపు చూసినా ఆలుమగల మనస్సులు కలిసినప్పుడు ఆ యింట్లో యెటువంటి జ్యోతులు ఎంతటి కాంతిపుంజాలను విరజిమ్మగలవో చూశాను."

"ఆ అదృష్టం అందరికీ రాదు. మీ మనస్సు నాదికాదు." మూల్గింది వసంత.

"కాదు - కాదు వసంతా - కథంతా చెప్తాను. నీ మనస్సులో గూడు కట్టుకున్న అనుమానాలు, అపోహలు, లోకంలో చెల రేగిన అపనిందలు, చిందిన అసూయలు, రగిలిన ద్వేషాలు - అన్నింటికీ అర్థం తెలుసుకుందువుగాని. విన్నతర్వాత చెప్పు నా మనస్సును నువ్వు నమ్మగలవో లేవో. నమ్మగలిగితే నాతో వద్దువుగాని - ఒకటి మాత్రం నిజం. ఈ వూరు నాది - అనుకుంటూ వచ్చాను. కాని పొరపడ్డాను. ఉండు, కాస్త ఓవల్టిన్ కలుపుకువస్తా. చాలా కథ చెప్పాలి."

# ఇరవై ఏడు

కరుణాకరం చెప్తున్నాడు. తలకు మఫ్లర్ కట్టుకుని పమిట చెంగు వళ్ళంతా కప్పుకొని కూర్చొని వసంత వింటున్నది.

"తలుచుకుంటే నిన్నగాక మొన్న జరిగినట్లనిపిస్తుంది. అమ్మ పోవడం, ఆస్తిపోవడం, నాన్నకూడా ఆకస్మికంగా కన్నుమూయడం, మా మేనమామవచ్చి నన్నుతీసుకువెళ్ళడం-అంతవరకూ నీకుతెలుసు. ఈ వూళ్ళో అందరికీ తెలుసు. మామయ్యా నన్నుతీసుకుపోగానే వాళ్ళ వూళ్ళో స్కూల్లో జేర్పించాడు. కొత్తబట్టలు కుట్టించాడు. కొత్త చెప్పులు కుట్టించాడు.మామయ్యా ఎంతో దయగా చూస్తున్నాడు.కాని అత్తయ్యకు యిది యిష్టంలేకపోయింది. నా మూలంగా ఆ యింట్లో పొరపొచ్చాలు బయలుదేరాయి. తరచుగా అత్తయ్యా - మామయ్యా కొట్లాడుకోవడం జరిగేది. ఎంత చిన్న వయస్సయినా ఆ యింట్లో నా పరిస్థితి నాకు అర్థమయింది. చిలికి చిలికి పరిస్థితులు గాలివానగా పరిణమించాయి. క్లుప్తంగా చెప్పాలంటే ఆ యింట్లోంచి వెళ్ళి పోవాలని నిశ్చయించుకున్నాను. ఒకనాడు స్కూలుకు వెళ్తున్నట్లు బయలుదేరాను. జీతం కట్టమంటూ ఇరవై రూపాయలిచ్చాడు మామయ్యా. ఎవరితో చెప్పకుండా ఏలూరు వచ్చి రైలెక్కి హైదరా బాద్ వచ్చాను. ఆ మహానగరాన్ని చూడటం అదే మొదటిసారి నేను. బ్రతుకుతెరువుకోసం అనేక మార్గాలు ఆలోచించాను. నా ప్రసక్తిలేకుండా నగరం అంతవరకూ బ్రతికింది. దానికి నా అవసరం లేదు. కాని నాకు అది కావాలి. పేవ్‌మెంట్లమీద పడుకున్నాను. ఈ విశాల ప్రపంచంలో అన్నిరకాల మనుష్యులకూ స్నేహితులు దొరుకుతారు. నాకూ నాలాంటి అనాథ మరొకడు దొరికాడు.

అంతకుముందతడు ఏదో హోటల్ సర్వర్‌గా పని చేశాడట. ఉద్యోగం పోయిందట. మరొక హోటల్ కోసం వెతుకుతున్నాడట. ఇద్దరం కలిసి నాలుగు రోజులు పాటు జంటకవుల్లా తిరిగి చివరకు ఒక క్రొంగొత్త హోటల్లో ఉద్యోగం సంపాదించాం. అక్కడ నెలరోజులు పనిచేశాను. ఏదో దొంగతనం జరిగిందట. అనుమానంమీద అయిదారుగుర్ని తీసేశారు. అందులో నేనూ ఒకణ్ణి. రోడ్లమీద గమ్యం లేకుండా దారం తెగిన గాలిపటంలా తిరుగుతున్నాను. అంతకు ముందే సన్నని తుప్పర పడుతూంది. కొంతదూరం నడిచాను. గాలివానగా మారింది. ఒక పెద్ద బంగళాముందు కిటికీని ఆనుకొని నిలబడ్డాను. రెట్ట పడినట్లు నెత్తిన ఏదో పడింది. ఉమిసిన తాంబూలమది. తలెత్తి చూస్తే మేడమీద కిటికీలోంచి ఒక తల కనిపించింది. వళ్ళు మండిపోయింది. మూడోకన్ను తెరిచి ఆ మేడనూ, ఆ దుర్మార్గుణ్ణీ భస్మం చేయాలనిపించింది. కాని ఆశక్తిలేక, మొహం తలా తుడుచుకుంటూ మరో రెండడుగులు వేశాను. ఎవరో పిలుస్తున్నట్లనిపించింది. నన్ను కాదనుకున్నాను. మరో రెండడుగులు ముందుకు వేశాను. మళ్ళీ పిలుపు వినిపించింది. వెనక్కు తిరిగి చూశాను. ఒక ఆకారం నాకు దగ్గరగా వచ్చి 'అయ్యగారు పిలుస్తున్నారు' అంటూ పిలవడం జరిగింది. ఒక క్షణం తటపటాయించి అతన్ని అనుసరించాను. నామీద ఉమిసిన పెద్దమనిషి వరండాలో కుర్చీలో కూర్చుని 'ఏవూరు బాబూ?' అన్నారు.

చెప్పాను. యింకా చాలా వివరాలు అడిగారు. అన్నీ చెప్పాను. రెండు రోజులుగా తిండిలేదని చెప్పాను. ఆయనకు జాలి కలిగింది. 'మా యింట్లో కొలువు చేస్తావా?' అన్నాడు. వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లనిపించింది. ఒప్పేసుకున్నాను. నా జీవితం ఒక చిత్రమైన మలుపు తిరిగింది. ఆయన నేను ఊహించినంత దుర్మార్గుడు కాకపోగా దయామయుడనిపించింది. ఆ యింట్లో నేను

చేయవలసిన పనులు ఏమిటో నాకర్థంకాలేదు. రెండు జతలు కాకీ బట్టలు కుట్టించాడు. ఆయనకు ఒక కూతురుంది. విపరీతమైన అల్లరి చేసేది. ఆయనకు ఆ బిడ్డంటే ప్రాణం. ఆమెకు కోపంవస్తే అన్నీ పగలగొట్టేది. అందరిచేతనూ గుంజీలు తీయించేది. ఆయనచేత గూడా. అంత భారీ శరీరంతో బిడ్డ ఆజ్ఞ శిరసావహించి రొప్పుకుంటూ ఆయన గుంజీలు తీస్తుంటే ఆమె విరగబడి నవ్వేది. చెవులు పిండేది జుట్టు పీకేది. ఆ బిడ్డను ఎన్నడూ ఆయన దండించేవాడు కాదు. కాని ఒకసారి అదీ చూశాను. ఇంటిదగ్గర ఓ పంతులమ్మ ట్యూషన్ చెప్పేది. ఆమెనుకూడా గుంజీలు తీయమంది. నెలకు వస్తున్న వందరూపాయలూ పోతుందని ఆమె గుంజీలు తీయడం ప్రారంభించింది. అది ఆయన చూశాడు. ఆ నెలరోజుల్లో ఆయనకు కోపం రావడం మొదటిసారి చూశాను. పంతులమ్మను చివాట్లుపెట్టి పాపను వళ్ళు హూనమయేలా కొట్టి మేడమీదకు వెళ్ళిపోయాడు. ఒక గంట తర్వాత నేను కాఫీ కలుపుకు తీసుకుపోయాను. కుర్చీలో కూర్చున్నాడు తల వంచుకొని. ఆయన కళ్ళవెంట నిర్నిరోధంగా నీళ్ళు కారుతున్నాయి.

'బాబుగారూ, కాఫీ !' అన్నాను.

'ఇది బాగుపడదబ్బాయ్. ముమ్మూర్తులా వాళ్ళమ్మ పోలిక. తల్లిలేని బిడ్డని ఎంత గారాబంగా చూస్తున్నా గుండెలమీద కుంపటిలా తయారయింది.' అంటూ వాపోయాడు నాయుడుగారు.

ఆయన పేరు ప్రభాకర నాయుడు.

ఏమైనా నా జీవితం మటుకూ సుఖంగానే నడుస్తూంది. ఆయనకు డయాబెటిస్ వుండేది. రెండుపూట్లా యిన్సులిన్ యింజక్షన్ యివ్వడం నాకు నేర్పాడు. రకరకాల మందులు టైం ప్రకారం యివ్వడమే నా డ్యూటీ. నేనంటే ఎంతో అభిమానంగా వుండేవాడు.

ఈ విధంగా రెండు సంవత్సరాలు గడిచాయి. ఆ పాప పెద్దదయింది గాని బుద్ధులు మారలేదు. ఆకతాయితనం తగ్గలేదు. నేనంటే మాత్రం సదభిప్రాయంగానే వుండేది. ఆమె మెట్రిక్ పరీక్షకు వెళ్తూంది. కాని ఎన్నడూ చదివిన పాపాన పోలేదు. పంతులమ్మ పాఠం చెప్తున్నంతసేపూ - పీడ ఎప్పుడు విరగడౌతుందా - అన్నట్లు బుంగమూతి పెట్టుకు కూర్చొనేది. రోజూ సాయంత్రం తండ్రితో కలిసి కారులో షికారు వెళ్ళటం ఆమె కలవాటు. అది మాత్రం తప్పటానికి వీలుండేదికాదు. కొన్నాళ్ళ తర్వాత ఆయన ఆరోగ్యం పాడై, వెళ్ళేవాడు కాదు. నన్ను వెంట రమ్మనేది. 'నాన్నగారికి మందులివ్వాలిగదా నేనొస్తే ఎలా ?' అంటూ సమాధానం చెప్పాను. కోపంవచ్చి తిట్టి 'ముందొచ్చిన చెవులకంటె వెనకొచ్చిన కొమ్ములు వాడిట - అతి వినయం ధూర్త లక్షణ మంది పంతులమ్మ అందుకనే' అంటూ కేకలు వేసుకుంటూ డ్రైవర్ సింగ్‌ను వెంట బెట్టుకు వెళ్ళిపోయింది. ఆమె పుస్తకాలు నేను చదువుతూండే వాణ్ణి. పంతులమ్మ చెప్పింది శ్రద్ధగా వినేవాణ్ణి.

ఒకనాడు ఏదో కాగితంమీద నేనేదో రాసుకుంటున్నప్పుడు వెనకనుంచి చూసింది ఆ అమ్మాయి. ఆశ్చర్యం నటిస్తూ 'నాకంటె ఎక్కువ చదువు నీకే వచ్చులావుందే ! నీ ప్రయోజకత్వం మా నాన్నకు చూపెట్టు - నీలాంటి వాళ్ళంటే ఆయనకు నచ్చుతార్లే. లాంతరు స్తంభాలదగ్గర చదివి కలెక్టరు నయ్యానంటూ రోజుకు వందసార్లు చెపుతూంటాడు. నీకు యింగ్లీషుకూడా వచ్చేమిటి ?' అంది.

'కొద్దిగా...' అన్నాను.

ఆమె అంటే చాలా భయంగా ఉండేది.

'అలా అయితే నా హోంవర్కంతా నువ్వు చేసిపెట్టు. ఆ పంతులమ్మ ఏడుస్తూంది.' అంటూ పురమాయించింది. పంతులమ్మ పుణ్యమా అని పాత చదువు వెళ్లావున్నా నాకు ఉపయోగపడింది బాగా.

మెట్రిక్ పరీక్షలకు దగ్గర సెంటర్ విజయవాడ. నాయుడు గారి ఆరోగ్యం బావుండలేదు. అసలు మేడమీదనుంచి క్రిందకు దిగటంలేదు. 'పాపతో నువ్వొ వెళ్తావా విజయవాడ తోడుగా ?' అన్నాడు నాయుడుగారు.

'నేనూ వెళ్ళాలండీ.'

'ఎందుకు ?'

'నేనూ మెట్రిక్ పరీక్షకు కట్టాను.'

నాయుడుగారు ఆశ్చర్యపోయాడు. 'ఎప్పుడు చదివావ్ ?' అన్నాడు. 'పంతులమ్మగారు అమ్మాయిగారికి పాఠాలు చెబుతుంటే విన్నానండీ. తీరికవేళల్లో అమ్మాయిగారి పుస్తకాలు చదివాను గూడా. పాసవుతాననే ధైర్యం వుందండీ.' అన్నాను బెరుకుగా.

'పరీక్షఫీజు కట్టావా ?'

'కట్టానండీ.'

'డబ్బెక్కడిది ?'

'మీ రిచ్చిన జీతం అంతా అలాగే వుందండీ.'

నాయుడుగారు తిడ్తారని భయంవేసింది. కాని అలా జరగలేదు. భుజం తట్టాడు. 'వెళ్ళుబాబూ, భగవంతుడు నీకు మేలు చేస్తాడు. మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తున్నాను.' అన్నాడాయన.

కారులో విజయవాడ వెళ్ళాం. ఒక మిత్రుడి యింట్లో వుండమని సిఫార్సు ఉత్తరం యిచ్చాడాయన. కాని ఆ వూళ్ళో కాలుపెట్టగానే 'హోటల్‌లో దిగుదాం.' అంది పాప. ఆమె మాటకు తిరుగులేదు. పరీక్షలున్నాయనే అభిప్రాయమేలేని మనిషిలా ఎంతో నిర్లక్ష్యంగా తిరిగింది ఆ నాలుగు రోజులూ. సింగ్ ప్రవర్తన నాకు నచ్చలేదు. ఆమెతో చాలా చనువుగా ఉండేవాడు. పరీక్షల రిజల్ట్స

వచ్చాయి. యూనివర్శిటీ ఫస్ట్‌రాంక్‌లో నేను పాసయ్యాను. పాప తప్పింది. నాయుడిగారి ఆరోగ్యం యింకా పాడయింది. కాని నా విజయానికి ఆయనెంతో అబ్బురపడిపోయారు.

'నీ యిష్టం వచ్చినంత చదువుకో బాబూ. శ్రద్ధగా చదువుకుంటే అమెరికా గూడా పంపిస్తాను. డబ్బులోటు మాత్రం నీ కుండదు.' అని చెప్పారాయన. కాలేజీలో జేరాను. రెండేళ్ళు అలా జరిగిపోయాయి. ఒకనాడు నన్ను పిలిచి 'పాప ప్రవర్తన నాకు నచ్చలేదు బాబూ, దాన్ని దోవలో పెట్టుకోవలసింది నువ్వే.' అన్నాడు. ఆయన మాటల్లోని ఆంతర్యం వెంటనే నాకు అర్థం కాలేదు.

'నా మాటమీద ఆమెకు లక్ష్యం లేదండీ' అన్నాను మరొక నాడు నాయుడుగారు అలాగే మాట్లాడినప్పుడు.

'ఆ మూడుముళ్ళూ పడితేనన్నా దానికి బుద్ధివస్తుందేమో!' అన్నాడు నాయుడుగారు. కొంత అర్థమయింది. చిత్రమైన భయంతో శరీరం వణికింది. ఆమెను భరించగల శక్తి నా కుందనే నమ్మకం నాకే లేకపోయింది. రోజులు గడుస్తున్నకొద్దీ ఆయన పరిస్థితి మరీ దిగజారటం ప్రారంభమయింది. చివరకు ఆ రోజు వచ్చింది. ప్లీడరును పిలిపించి ఆస్తి అంతా నా పేరిట విల్లు వ్రాశారు. పాపను వివాహం చేసుకుని కంటికి రెప్పలా చూసుకుంటానని నా చేత ప్రమాణం చేయించారు. విల్లులోగూడా పాపను నేను వివాహం చేసుకోవడం చివరికోరికగా సూచించారు. నిజానికి ఆయన చివరి ఘడియలలో పాప దగ్గరలేదు. సింగ్‌తో కలిసి మరి ముగ్గురు పిల్లల్ని వెంటబెట్టుకొని నాగార్జునసాగర్‌కు విహారయాత్రకు వెళ్ళింది. ఆమె వచ్చేసరికి అంతా అయిపోయింది. వివాహ విషయంలో పాపకు నచ్చచెప్పవలసిన బాధ్యత వకీలు రామారావుగారి మీద పెట్టాడు

నాయుడుగారు. విల్లుసంగతి రామారావుగారు చెప్పగానే ఎగిరి పడింది పాప. కప్పులూ సాసర్లూ ఫ్లవర్ వాజులూ విసిరికొట్టింది.

'ఆయనకు బుద్ధిలేకపోతే ఆ చలిమిడి ముద్దకు ఎందుకు లేదు రామారావుగారూ ?' అంది కోపంగా అరుస్తూ.

'అతన్ని వివాహం చేసుకోవాలని మీ నాన్నగారి ఆజ్ఞ' అన్నాడు వకీలు.

'చేసుకోకపోతే ?' అంది రెట్టిస్తూ.

'మీకు ఆస్తిలో చిల్లిగవ్వ భాగం రాదు.'

'ఏలా రాదో చూద్దాం.'

'పాపా ! ఈ విషయంలో నువ్వు ఎటువంటి భ్రమలూ పెట్టుకోవద్దు. ఆ స్తి ఆయన పిత్రార్జితం గాదు. స్వార్జితం. ఏం చేసుకున్నా చెల్లుతుంది.'

పాప మాట్లాడలేదు.

'అర్థమయిందా ?' అన్నాడు వకీలు.

'ఆలోచించుకోనివ్వండి' అంది పాప.

వారం రోజులు గడిచిపోయాయి. రోజూ సాయంత్రం సింగ్‌తో షికారు పోతూనేవుంది. మొదటినుంచీ సింగ్‌మీద నాకు సదభిప్రాయం ఎన్నడూ లేదు. నల్లగళ్ళ చారల టీషర్టులు వేసేవాడు ఎప్పుడూ. ఏ యింట్లోనూ డ్రైవర్ ఆ విధంగా ప్రవర్తించడు. నన్నుకూడా చాలా చులకనగా చూసేవాడు. 'నువ్వు' అంటూ ఏకవచన ప్రయోగం చేయడం అతని కలవాటు. నాయుడుగారు పోయింతర్వాత, చట్టరీత్యా ఆ ఇంటికి నేను యజమానిని అయినతర్వాతగూడా ఆ అలవాటు మానలేదు. నేను అతనితో మాట్లాడటం మానుకున్నాను. అతనూ నా లెఖ్ఖలేనట్లే సంచరించసాగాడు.

ఒకనాడు అతన్ని పిలిచి 'మీరలా షికారు వెళ్ళగూడదు' అని చెప్పాను. నా కేసి కొరకొరా చూసి 'అమ్మగారు వద్దంటే నే నెందుకు వెడ్తాను ?' అన్నాడు కటువుగా.

'చూడు సింగ్, యికనుంచి నువ్వు వినవలసింది నామాట.' అన్నాను.

'ఎవరు చెప్పారు ?'

'నేను చెప్తున్నాను.'

'నువ్వెవరివి చెప్పటానికి ?'

'ఈ యింటికి యజమానిని నేను.'

'అలాగా ! ఆ సంగతి నాకు తెలియదులే.'

ఆ రోజుకూడా వాళ్ళు షికారుకు వెళ్ళారు. ఏంచేయాలో తోచక వారంరోజులు తల బ్రద్దలుకొట్టుకున్నాను. పాపమీద నాకు అంతకుముందు ఎటువంటి అభిప్రాయమూ లేదు. వ్యామోహం అసలే లేదు. నాయుడుగారి కిచ్చిన మాటనుబట్టి ఆమెను మార్చ టానికి వకీలుగారు ఏ విధంగా ప్రయత్నించారో నేనూ అదే విధంగా ప్రయత్నించాను. కాని ఆమె ఎదురు తిరిగినకొద్దీ, నిర్లక్ష్యం చేసిన కొద్దీ నా పట్టుదల ఎక్కువయింది. నాకు తెలియకుండానే ఆమె మీదకు నా మనస్సు పరిగెత్తుతున్నదా అనే ఆలోచన కలిగింది. దానికి కారణం వుంది. ఆమెలో మన కల్యాణి పోలికలు చాలా వున్నాయి - కాని..."

మాటకు అడ్డంవచ్చి వసంత వెర్రిగా చూస్తూ "అయితే దాని మీద మీకున్న మనస్సు ఈనాటిది కాదన్నమాట" అంది.

"అలాక తినంగా మాట్లాడకు వసంతా. నీ దగ్గర కొన్ని రహస్యాలు దాచడం వలననే యింత జరిగిందనీ, యికముందు అట్టు

వంటి అపార్థాలు రాగూడదనీ మనస్ఫూర్తిగా నీ దగ్గర ఉన్నదున్నట్లు చెప్తున్నాను."

"ఊఁ చెప్పండి. కల్యాణి పోలిక లున్నాయి గనుక, కల్యాణి ఎదుట లేదు గనుక అదేదో సినిమాలా మీ మనస్సు పాప మీదకు మళ్ళింది. అంతేకాదూ ?" మాట్లాడటానికి ఓపిక లేకపోయినా కోపం వల్ల వచ్చిన బలంతో మాట్లాడింది వసంత.

"ఇంక నీకు చెప్పడం అనవసరం." అన్నాడు కరుణాకరం నిట్టూరుస్తూ.

"చెప్పండి. చేసింది లేంది చెప్పటాని కేముంది ?"

"ఆడవాళ్ళను అర్థం చేసుకోవడం చాలా కష్టం వసంతా ? మూర్ఖత్వంపాలు వాళ్ళలో ఎక్కువేమో !"

"ఆ తర్వాత ఏం జరిగింది ?"

"సింగ్‌ను ఉద్యోగంలోంచి తీసివేశాను."

"వెళ్ళిపోయాడా ?"

"వెళ్ళిపోతే కథ యింకొక రకంగా వుండేది."

"పాప మీకు దక్కేదంటారు ?" అంది వసంత వ్యంగ్యంగా.

"ఏమో ! ఏం జరిగేదో ఎలా చెప్పగలను. విధి వ్రాతను ఎవరు తప్పిస్తారు వసంతా ? సింగ్‌ను మాన్పించే అధికారం నాకు లేదంటూ పోట్లాటకు వచ్చింది. వ్యామోహం హద్దుమీరి వివేకం నశించిన మనిషితో ఎవరు వాదించగలరు ? ఎంత వాదించినా ఎదుటి వారి మాటను వా రెంతవరకు అర్థం చేసుకోగలరు ? నోటికి వచ్చినట్లు తిట్టింది. మోసగాడి వంది. అతి వినయంతో నాటకమాడి నాన్నను మోసం చేశావంది. నాకూ పట్టుదల హెచ్చింది. అసలు కారు బయటకు తీయడానికి వీలు లేదన్నాను. వకీలుగారి మాటకు విలువ

ఆ యింట్లో ఏనాడో పోయింది. ఆయనకు మాత్రం నా మీద నమ్మక ముండేది. కర్తవ్యం తోచక చివరకు ఆయన చెప్పినట్లే నడవడం మొదలు పెట్టాను.''

"మనిషి చెడిపోయిందని తెలిసీ, యింకా పెళ్ళి చేసుకోవాలని పెనుగులాడుతూనే వున్నారన్న మాట." అంది వసంత.

"అంతదూరం ఆలోచించలేదు వివరంగా. ముందు ఆ సింగ్ సాహచర్యం మాన్పించడం అవసరమనిపించింది. ఒకనాడు కారు బయటకు తీయవద్దని కఠినంగా చెప్పి, మేడమీదకు వెళ్ళిపోయాను. కొంచెం సేపయింతర్వాత కారు పోతున్న సవ్వడి వినిపించింది. కిటికీ లోంచి చూశాను. ఎప్పుడూ వెనకసీటులో కూర్చొని బయలుదేరే పాప, ముందుసీటులో అతని ప్రక్కనే కూర్చొని వెనక్కుతిరిగి నన్ను చూసి నవ్వుతూ 'టాటా' చెప్పింది. వకీలుగారిని పిలిపించాను. ఆయన చెప్పిన ఉపాయం నచ్చింది. యిల్లు బేరం పెట్టాను. కారు గేరేజ్‌లో పెట్టి తాళం పెట్టాను. పాపచేతికి డబ్బు అందకుండా చేశాను. నాలుగురోజులు వాళ్ళిద్దరికీ సంకెళ్ళు పడ్డాయి. ఒకనాటి ఉదయం ఆమెతో మాట్లాడుదామని పడకగదిలోకి వెళ్ళాను. యింటినిండా మంచంక్రింద సిగరెట్ పీకలు కనిపించాయి. స్టాండ్ మీద నల్లచారల టీషర్టు కనిపించింది. దానికేసి చూస్తున్నాను.

'ఏమిటి అలా చూస్తున్నావ్ ?' అంది పాప.

'ఆ టీషర్టు ఎవరిదో తెలుసా ?' అంది.

'తెలుసు.'

'తెలిసే కథ సాధిస్తున్నావన్న మాట'

'ఈ యిల్లు అమ్మేశాను.'

'నాకు తెలుసు.'

'సోమవారం ఖాళీ చేస్తున్నాను.

'మంచిది.'

'ఏమాలోచించావ్ ?'

'ఏమిటి ?'

'మా వూరు వెళ్ళిపోతున్నాను. నువ్వూ వస్తే మంచిది.'

'ఎందుకు ?'

'మీ నాన్నగారి నడుగు ?'

'చచ్చింతర్వాత ఏ నరకంలోనో ఆయన ఎదుట పడితే చెవులు మెలేసి అడిగి వెయ్యి గుంజీలు తీయిస్తాను.'

'నాతో రావన్నమాట ?'

'రాను.'

'ఎక్కడుంటావ్ ?'

'నా యిష్టం.'

'సింగ్ నిన్ను ఎల్లకాలం చూస్తాడా ?'

'ఆ మాట నే అన్నానా ?'

'చేజేతులా పాడుచేసుకుంటున్నావన్నమాట జీవితాన్ని.'

'నువ్వు బాగుచేసుకున్నావుగా. వెళ్ళు బాబూ - రాత్రంతా నిద్ర లేదు. కాసేపు పడుకోవాలి' అంటూ వళ్ళు విరుచుకుంది పాప. ఆ మనిషిని ఇంక ఏంచెయ్యగలను చెప్పు ? 'పాపా ! నీ డబ్బుమీద నీకు ఎప్పుడూ అధికారం వుంది. కాని దాన్ని తగలబెట్టి నువ్వు తగలబడటానికి కాదు. ఇది నా అడ్రస్. నువ్వు బాగుపడ్డావని నమ్మకం కలిగిననాడు, దీన్ని రెండింతలుచేసి నీ కప్పగిస్తాను. అంత వరకూ నేను మీ ఎస్టేటుకు ధర్మకర్తను మాత్రమే.' అన్నాను. అప్పటికే ఆవలించి నిద్రపోయింది. నా మనస్సు చాలా పాడయింది. విషాదాలన్నింటిలోనూ దుర్భరమైన దేమిటో తెలుసా వసంతా ?

కావాలనుకున్నది దొరక్కపోవడం దురదృష్టమే. కాని జీవితంలో ఏం కావాలో తెలియకపోవటం అంతకంటే దౌర్భాగ్యం కాదంటావా? అదీ అప్పటి నా పరిస్థితి. మర్నాడు తెల్లవారేసరికి పాప యింట్లో లేదు. ఇనపపెట్టె తెరిచి, ఉన్న కొద్ది డబ్బూ తీసుకొని వెళ్ళిపోయింది. మద్రాసులో కనిపించిందని వకీలుగారికి ఎవరో చెప్పారట. వెంటనే వెళ్ళాను. ఎక్కడని వెతకను? తర్వాత బెంగుళూరు గుర్రపు పందాల్లో నల్లకళ్ళజోడు పెట్టుకు గంతులేస్తుంటే చూశామని ఎవరో చెప్పారు. అక్కడికీ వెళ్ళాను. ప్రయోజనం లేకపోయింది. మతి పోయినట్లయింది. ఎంతో తిరిగాను. పట్టుకుందామని ఎంతో డబ్బు ఖర్చుపెట్టాను. ప్రాణం విసిగిపోయింది. చివరకు నిరాశ చేసుకుని కూలబడ్డాను. పదిమందీ పదిరకాలుగా చెప్పుకోవడం మొదలుపెట్టారు. రోడ్డుమీద నడుస్తుంటే వేలెత్తి చూపెట్టేవారు. ఎక్కడ చూసినా గుసగుసలు వినిపించేవి. ఎవరు మాట్లాడినా వారి మాటల్లో వ్యంగ్యం ధ్వనించేది. మనుష్యులంటే భయం పట్టుకుంది. ఒంటరితనం - దుర్భరమైన ఒంటరితనం నన్ను హింసించ ప్రారంభించింది. మన వూరు గుర్తుకు వచ్చింది. నిజం చెప్తున్నా వసంతా - కల్యాణి గుర్తుకు వచ్చింది. కల్యాణికోసం పాపమీద వ్యామోహం పెంచుకున్నానని నాకు తెలియకుండానే. అలాగే పాప పారిపోయిందని కల్యాణిని వెతుక్కుంటూ వచ్చాను. ఇదొక విషవలయంలా పరిణమించింది. ఒక పీడకలలా జరిగింది. ఇక్కడికి వచ్చిన కొద్దికాలానికే కల్యాణి మనస్సు పరాధీనమైందని - కనీసం నాది కాదని అర్థమయింది. కట్టుకున్న ఊహాసౌధం కూలిపోయింది. మన మొకటి తలిస్తే దైవమొకటి తలుస్తాడంటారు యిందుకనే."

ఇద్దరూ మౌనంగా చాలాసేపు కూర్చున్నారు.

వరదాచార్యులవారొచ్చి తొంగిచూచి ఏమనుకున్నారో వెళ్ళిపోయారు.

"నిజమే - మీరు చెప్పింది అక్షరాలా నిజం - మనం నమ్ముకున్న వాళ్ళ మనస్సు మనది కాదని తెలిసినప్పుడు జీవితమే కూలిపోతుంది. ఈ కథ బాగానేవుంది. మీ దగ్గర మెరుపులా వచ్చి ఆ పాతిక వేలూ దోచుకుపోయి మన సంసారానికి మంగళహారతి పాడిన ఉత్తమయిల్లాలెవరో చెప్పారు కాదు?"

"ప్రసూన - ఆమె పేరు - తెలుసా?"

"తెలుసు, కొంతకాలం రాజారావు నుద్ధరించింది."

"ఆ ప్రసూన ఎవరో తెలుసా?"

"మీకే తెలియాలి."

"నాయుడుగారమ్మాయి - పాప - ఆమే ఈ ప్రసూన."

నివ్వెరపోయింది వసంత.

# ఇరవై ఎనిమిది

ముత్తెం కేకపెట్టటంతో బయటకు వచ్చాడు కరుణాకరం. పది రోజులుగా ముత్తెం జాడ లేదు. ఊరు వెళ్ళేరన్నారెవరో.

"మీకో మాంచి శుభవార్త మోసుకొచ్చాను బాబూ !" అన్నాడు మాంచి హుషారుగా ముత్తెం.

"ఏమిటోయ్ ?" అన్నాడు కరుణాకరం నవ్వుతూ. నిజానికి చాలా రోజుల తర్వాత నవ్వాడు కరుణాకరం. మనస్సులో ఎంతో కాలంగా పెనవేసుకుపోయిన బాధల బరువు తొలగిపోయినట్లనిపించింది.

"బంగారంలాంటి పొలాలండీ. మా మేనమామ కొన్నాడు ఎకరం యాభై కి. యిప్పుడు మూడొందలయింది. నాగార్జునసాగరం నీరొదిలితే మూడువేలు కాగలదు. కొనేశాను బాబూ. మీకు పదెకరాలు, నాకు పదెకరాలు. నాకు తెలుసు గదా - పూలమ్మిన ఊళ్ళో కట్టెలమ్మగూడదని మా తాత చెప్పినాడండీ. మీరూ నేనూ కలిసి లక్షణంగా చేసుకుందాం యవసాయం. పదేళ్ళదాకా ఎరువవసరం లేదంటే నమ్మండి. సమస్తం పండుతయ్. అమావాస్య వెళ్ళాక పున్నమినాటికి అక్కడ జేరాలండీ" అన్నాడు.

"నీ ఋణం ఎలా తీర్చుకోగలను ముత్తెం ?" అందామనుకున్నాడు. గొంతు పెగిలింది కాదు.

"ఏమై బాబూ ! మాట్లాడరూ ?" అన్నాడు కొంచెంసేపు ఆగి ముత్తెం.

"నేను వ్యవసాయానికి పనికొస్తాననంటావా ముత్తెం ?"

"అంతా నేను చూసుకుంటాగదండీ."

"నీ రెక్కలకష్టం తింటూ కలకాలం బ్రతకమంటావా ?"

"అలా ఆలోచించకండి బాబూ. భగవంతుడున్నాడు పైన. రోజులంటూ కలిసిరావాలిగానీ, యివన్నీ సర్దుకుంటానికి ఎంతకాలం పడుతుందంటారు చెప్పండి. చిన్న పాకలు రెండేసుకుందాం. నుయ్యి తవ్విద్దాం. బారెడు తవ్వితే కొబ్బరినీళ్ళు జలగా పడుతున్నాయండీ. చిన్న ఆయిలింజను కొనుక్కుంటే చాలండీ. మా మామ ఆరెకరాల్లో పచ్చిమిర్చేసినాడు. అంతా డబ్బే అనుకోండి. మున్సబుగారు కబురెట్టారంట. నే వస్తాను బాబూ." అంటూ వెళ్ళిపోయాడు ముత్తెం.

ఇంట్లోంచి మాటలు వినిపిస్తున్నాయి. రెండడుగులు వేశాడు లోపలికి. వసంతనూ, చెల్లాయమ్మగారినీ కూర్చోపెట్టి మహోపన్యాసం చేస్తున్నారు వరదాచార్యులవారు. ఆయనది మంచి పటుత్వమున్న నాలుక. భగవద్గీత శ్లోకం చదివి పాతిక అర్థాలు ఎటుపడితే అటు తిప్పిచెప్పగల ప్రజ్ఞాశాలి. ఆ ప్రజ్ఞకు అనర్గళమైన వాగ్ధాటి తోడైనప్పుడు, ఎదుటివారి మనస్సులను మైనపు ముద్దలుగా ఎందుకు మార్చలేడు ? ఆయన మాటలు వింటున్నకాసేపూ అలాగే అనిపిస్తుంది. ఈ పుణ్యాత్ముడు ఏం నూరిపోస్తున్నాడో వసంతకు ? కొంచెం సేపయితేగానీ తెలియదు. వసంత తనతో రాగలదా ? అనుభవం లేని మనిషి. ఏమీ తోచక అలా బయటకు నడిచాడు. రామనాథం యింటిమీదుగా వెళ్తున్నప్పుడు పద్యాలు వినిపిస్తున్నాయి. లోపలికి నడిచాడు. మాస్టారు హార్మోనియం వాయిస్తున్నాడు. కరుణాకరాన్ని చూసి సన్నగా నవ్వాడుకానీ ఆహ్వానించలేదు. కూర్చోమని కుర్చీ చూపెట్టలేదు. "హరిశ్చంద్ర ప్రాక్టీసు చేస్తున్నామండీ" అన్నాడో కుర్రాడు. "మాస్టారే హరిశ్చంద్రుడు వేస్తున్నారు"అన్నాడు మరొక

నటశేఖరుడు. "డి. వి. సుబ్బారావుగారు పోయాక ఈ హరిశ్చంద్ర నాటకం మూలపడిందండీ - అందుకే దాన్ని పునరుద్ధరించాలని కోరుకున్నాను. అసలు నేను మరొక పంథాలో హరిశ్చంద్రుణ్ణి తీర్చి దిద్దుతున్నా. 'మాయామేయ జగంబె నిత్యమని' పద్యం ఆయన కదం త్రొక్కుతూ గుర్రం పరుగెత్తుతున్న పద్ధతిలో పాడేవాడు. ఎందుకు ? పిచ్చి జనంచేత వన్స్‌మోర్లు కొట్టించుకుంటానికి! ఆ ఘట్టం ఏమిటి ? దురదృష్టాలు ఒకదానిమీద ఒకటి వచ్చి మీదపడుతున్నాయి. రాజ్యం పోయింది. అయినవాళ్ళంతా పోయారు. కాటికాపరి అయాడు. కట్టుకున్న భార్యనే శిక్షించవలసి వచ్చింది. అక్కడ భాసించవలసిన భావం ఏమిటి ? వైరాగ్యం - పద్యం ఎలా చదవాలి ? కదం తొక్కుతున్న గుర్రంలాకాదు. విషాద నీరదాలతో నిండినా, విచిత్రమైన నిర్లిప్తత ప్రదర్శిస్తూ 'ఇదిగదా ఈ మిథ్యా జీవితం' అని స్ఫురించేలా భావయుక్తంగా చదవాలి - చూడండి" అంటూ పద్యం చదివాడు. తననుగురించే చదువుతున్నట్లనిపించింది. పురాణ వైరాగ్యంలాంటిది మనస్సును కలిచివేసింది. నిజమే. అద్దెకొంపలాంటి జీవితంకోసం - ఎన్నిబాధలు, ఎన్నిరకాల తపనలు - ద్వేషాలు - రోషాలు - వంచనలు - నయవంచనలు——

"ఒక టిక్కెట్టు కొనండి కరుణాకరంగారూ" అన్నాడు చంద్రమతి వేషం వేస్తున్న కుర్రాడు మెలికలు తిరుగుతూ. మౌనంగా బయటకు నడిచాడు కరుణాకరం. యతీంద్రులవారు గుర్తొచ్చారు. స్వామివారిని దర్శించా లనిపించింది. వెళ్ళేసరికి శ్రీవారు ధర్మ సూక్ష్మాన్ని గురించి ఉపన్యసిస్తున్నారు.

"ఈ లోకంలో ధర్మానికీ - అధర్మానికీ, నీతికీ-అవినీతికీ, వెలుగుకూ- చీకటికీ, త్యాగానికీ-స్వార్థానికీ-నిరంతరంగా నిర్విరామంగా ఘర్షణ జరుగుతూనే వుంటుంది. కాని అంతకంటె జటిలమైన సంఘర్ష

ణలు కూడా జీవితంలో ఎదురుపడటం జరుగుతుంది. ఆ సంఘర్షణ ధర్మానికీ - అధర్మానికీ మధ్య కాదు. ధర్మానికీ - ధర్మానికీ మధ్య! కర్తవ్యానికీ - కర్తవ్యానికీ మధ్య! లౌకిక జీవితానికి సంబంధించిన ఒక కథ చెప్తాను. అతడొక బందిపోటు దొంగ. హత్యలు - దోపిడీలు - ఇదీ అతని జీవితం. ఎవరికీ పట్టుబడకుండా తిరిగినంతకాలం తిరిగాడు. పట్టుబడ్డాడు. మరణదండన విధించాడు రాజు. ఉరికంబం ఎక్కించారు. 'నీ చివరి కోరిక ఏమిటి?' అన్నాడు రాజు.

'నా భార్యను చూడాలి.' అన్నాడు బందిపోటు.

'ప్రవేశపెట్టండి.' ఆజ్ఞాపించాడు రాజు.

వెంటనే రాజభటులు ఒక స్త్రీ మూర్తిని ప్రవేశపెట్టారు. బందిపోటు చివరిసారిగా ఆమెను గాఢంగా కౌగలించుకున్నాడు. మొలనున్న బాకుతో బలంగా గుండెల్లో పొడిచివేశాడు. ఆమె అతని పేరే స్మరించుకుంటూ మరణించింది. నెత్తురు మడుగు కట్టింది. ఆమె మృత శరీరాన్ని చూసి నెత్తిమీద పెద్ద బరువు దించుకున్నట్లు శ్వాస వదిలాడు బందిపోటు. అందరూ నివ్వెరపోయారు.

'ఎందుకు చంపావ్?' అంటూ గర్జించాడు రాజు.

'అది ప్రాణంకంటె ఎక్కువగా నన్ను ప్రేమించింది.'

'అందుకని హత్య చేస్తావా?'

'అది నే లేకుండా బ్రతకలేదు. బ్రతికినా ఆ బ్రతుకును భరించలేదు. అందుకని చంపాను.' అన్నాడు బందిపోటు తృప్తిగా.

రాజు గుండె కరిగింది. బందిపోటును క్షమించి వదిలిపెట్టాడు. ఆ బందిపోటు స్వామీ పరమానందగా మారి బదరీనాథ్ వెళ్ళి పోయాడు. ఈ సంఘటనలో హత్యానేరం అతనికి ఎంత పాపాన్ని

పులిమింది ? అంటే ఏం చెప్పగలం ? ఆ మహనీయుని ఆశ్రమం యిప్పటికీ వుంది బదరీలో."

భక్తులంతా మంత్రముగ్ధులై వింటున్నారు. కరుణాకరం స్వామివారికి నమస్కరించాడు. ఆశీస్సు లందించారు స్వామివారు. మళ్ళీ వరదాచార్యులవారికి ఆకస్మికంగా భక్తి కుదిరినట్లుంది. యతీంద్రులవారి పాదపద్మాలముందు మూర్తీభవించిన ముముక్షువులా కూర్చున్నారు. కరుణాకరాన్ని తలెత్తి చూసి మళ్ళీ తల దించుకున్నారు.

"కూర్చో కరుణాకరం." అన్నారు సాదరంగా స్వామివారు.

కూర్చున్నాడు కరుణాకరం. స్వామివారి ఉపన్యాసం వింటున్నప్పుడు మనస్సు ఎంతో ప్రశాంతంగా ఉన్నట్లనిపించింది. 'జీవితం మిథ్యా ప్రతిబింబం' అంటున్న స్వామివారి వాక్కు సృష్టి సత్యంలా గోచరించింది. ఆయన ముఖంలో అతి నిర్మలమైన గభీర ప్రశాంతత ప్రస్ఫుట మౌతున్నది. బ్రహ్మతేజస్సువంటి దివ్యజ్యోతి వెలుగుతున్న ముఖమండల మది. తానుకూడా ఆశ్రమ స్వీకారం చేస్తే ఎలా వుంటుంది ? అనే ఆలోచన కలిగింది కరుణాకరానికి. వసంత గుర్తుకొచ్చింది.

"ఇంక ఈ భక్తి ప్రచారం మాని బదరీ వెళ్ళిపోతున్నాను బాబూ. ఆ శ్రీకృష్ణపరమాత్మను ధ్యానించుకుంటూ ఆ పరాత్పరుని పాదాలకు జీవిత శేషాన్ని కైంకర్యం చేయాలని సంకల్పం." అన్నారు యతీంద్రులు నిశ్చయంతో.

"మరి నామాట ఏంచేశారు స్వామీ ?" అన్నారు వరదాచార్యులవారు.

"జీవితంలోని బంధాలన్నీ త్రెంచుకుపోవడం అందరికీ సాధ్యం కాదు. మనస్సు పరిపక్వం కావాలి. ఆ శ్రీకృష్ణపరమాత్మ కరుణా కటాక్షం ఎవరిమీద ఎప్పుడు ప్రసరిస్తుందో చెప్పలేంగదా ?"

"నన్ను నమ్మండి స్వామీ! నిజంగానే ఈ జీవితంమీద నాకు విరక్తి కలిగింది." అన్నారు వరదాచార్యులవారు.

"అందుకే వద్దంటున్నాను. నీ శత్రువుయొక్క శత్రువు నీకు మిత్రుడు అనే సామెత వుంది. కష్టాలు భరించలేక జీవితంమీద విరక్తి కలగడం, సన్యాసాశ్రమం స్వీకరించడానికి ప్రేరణ కాగూడదు. జీవితం మీద వ్యామోహం నశించాలి. దుర్బలుడు పాటించే అహింసా వ్రతంలో ఎంత నిజాయితీ వుందంటారు? ఇదీ అంతే."

యతీంద్రులవారు సభ చాలించారు. అందరూ ఒకరొకరే శలవు పుచ్చుకు వెళ్ళిపోతున్నారు. చివరకు కరుణాకరం మిగిలాడు. స్వామివారు లోపలికి వెళ్ళబోతూ పాముకోళ్ళు వేసుకుంటూ తలెత్తి కరుణాకరాన్ని చూశారు. దగ్గరకు వచ్చి "ఏం బాబూ?" అన్నారు.

"బదరీ ఎప్పుడు వెళ్తున్నారు స్వామీ?"అన్నాడు కరుణాకరం.

"ఈ నెలాఖరుకు మద్రాసు వెళ్ళాలని సంకల్పం. శిష్యబృందం అక్కడ సప్తాహం జరిపించాలని ఆహ్వానించారు. వారి కోరిక మన్నించి, ఆ తర్వాతనే హిమాలయాలకు నిష్క్రమించాలని అనుకుంటున్నాం."

కరుణాకరం ఏదో అడగబోయాడు. అలాగే స్వామివారిని చూస్తూ ఆగిపోయాడు. "నీ మనస్సు బావున్నట్లు లేదు నాయనా" అన్నారు యతీంద్రులు.

"ఔను స్వామీ! ఎంత ఆలోచించినా ఈ జీవితానికి అర్థమేమిటో కనిపించడంలేదు. చిక్కుపడిన దారపుండలా వుంది స్వామీ."

"తప్పదు నాయనా! ఈ ప్రపంచంతో బంధం పెట్టుకున్న ప్రతి జీవితమూ అంతే. నిబ్బరంతో చిక్కుల్ని విడదీసుకుంటానికి

ప్రయత్నించాలి. ఒక్క విషయం గుర్తుంచుకో. ఏ కష్టంలోనూ గూడా మన మూహించినంత దుఃఖభార ముండదు. సుఖమైనా దుఃఖమైనా సగం మన మనస్సుల్లోనే వుంటుంది. కొంత మనోనిబ్బరాన్ని అల వాటు చేసుకోవాలి బాబూ. ఈ చిక్కులన్నీ ఉన్నదానికంటె పదింతలుగా కనిపించటానికి కారణ మేమంటావ్ ? మనమీద మన కున్న విపరీతమైన ప్రేమ. మన జీవితంమీద మనం నిలుపుకునే వల్లమాలిన వ్యామోహం."

యతీంద్రులవారు ప్రశాంతంగా నవ్వి వెళ్ళిపోయారు లోపలికి. కరుణాకరం వెనక్కు తిరిగాడు. వసంతమీద జాలి కలిగింది. ఇంటికి వెళ్ళాడు. వసంత లేచి తల దువ్వుకుంటున్నది. చెంపలు పలచబడ్డాయి. కళ్ళు లోతుకు పోయాయి. ఆ కళ్ళల్లో ఏదో దిగులు నల్లటి మేఘంలా తొంగి చూస్తున్నది. చెల్లాయమ్మగారు భోజనం పెట్టింది. ఆ వూరు వచ్చిన కొత్తల్లో వరదాచార్యులగారింట్లో భోజనం చేసిన రోజులు గుర్తుకొచ్చాయి. లేడిపిల్లలా ఛెంగున గెంతుతూ మెరుస్తున్న కళ్ళతో క్రీగంటి చూపులు చూస్తూ కూనిరాగాలు తీసుకుంటూ తిరిగేది వసంత. "ఎంతలో ఎంత మార్పు !" అనుకుంటూ భోజనం కలుపుకున్నాడు. వసంత స్వయంగా వడ్డించి చాలా రోజులయింది. ఆలోచనల వరదల్లో కొట్టుకుపోతున్న మనిషికి ఏం తింటున్నదీ అజకురాలేదు. సాయింత్రం మళ్ళీ ముత్తెం కనిపించాడు చెరువు గట్టుమీద.

"ఇలా చేశారేంటి కరుణాకరంగోరూ ?" అన్నాడు.

"ఏం జరిగింది ?"

"మీరు వస్తారని ఆ భూముల విషయం - సెటిల్ చేసుకున్నాం గదా - మీరు రావడం లేదట ?"

"నేనా! ఎవరు చెప్పారు ?" అన్నాడు ఆశ్చర్యంగా కరుణాకరం.

"కాలవదగ్గర మిల్లులో మీకు నౌకరీ వేయించాడట వరదాచార్లుగారు ?"

"ఎవరన్నారు ?"

"అందరూ అనుకుంటున్నారు."

"ఎవరో ఏదో అనుకుంటే నేనేం చెయ్యగలను. కానీ మనం వెళ్ళటం విషయంలో అనుమానం లేదు." అన్నాడు నిశ్చయంగా కరుణాకరం.

ఇంటికి వస్తుంటే దోవలో పోష్టుమాన్ కనిపించాడు. ఒక ఉత్తరం, ఒక రిజిష్టర్డ్ బుక్‌పార్శిల్ యిచ్చాడు. ఉత్తరంమీద దస్తూరిని చూసి ఎవరు రాసిందీ పోల్చుకోలేకపోయాడు. మద్రాసు ముద్ర కనిపించింది.

"నిన్నరాత్రి ప్రసూన జనరల్ హాస్పిటల్‌లో పోయింది. ఆమె కోరిక ప్రకారం ఆమె డైరీ మీకు పంపుతున్నాను.

మీకు తెలియని -
మీ ఆత్మీయుడు
బాబ్జీ."

మౌనంగా యింటికి నడుస్తూ అనుకున్నాడు. మహాయోగుల్లా అన్నమాట నిలబెట్టుకుంది. ధన్యురాలు. 'ముసలిదాన్నయేదాకా బ్రతకనని శపథం చేసింది.' ఆ రాత్రి ఆమె డైరీ చదువుతూ కాలక్షేపం చేశాడు. అతను ఎన్నడూ ఊహించని కొన్ని సంగతులు తెలిసాయి. ప్రసూనకు తనమీద మనసున్న విషయం ఎన్నడూ గుర్తుపట్టలేకపోయాడు! తన దౌర్భాగ్యాన్ని ఏమనాలి? పిశాచాలూ, ఆడపిల్లలూ పలకరించేదాకా మాట్లాడరట! డైరీ చదువుతూంటే

కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. మొదటినుంచీ చదవాలనుకున్నాడు. అది ఒక క్రమంలో లేదు. అసలు కొందరి జీవితాల్లోనే క్రమం అంటూ వుండదు. కొండ శిఖరంమీదనుంచి విరిగి పడుతున్న జలపాతం గుర్తుకొస్తుంది ప్రసూనను చూస్తే. ఆ చిన్న గుండెల్లో అన్ని మలుపుల వెలిక లుండటం తలుచుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. 'ఏ మహాసముద్రం లోతన్నా కనుక్కోగలం - ఆడదాని గుండెలను మాత్రం శోధించలేం.' అనుకున్నాడు కరుణాకరం. అక్షరాలకు మలినం పులిమి, పశ్చాత్తాపంతో దహిస్తున్న మసకతెరలను చీల్చు కుంటూ, గతంలోకి జారిపోతూ వెనక్కు పరుగెత్తుతున్న మనస్సుకు గేలంవేసి పట్టుకుంటానికి ప్రయత్నిస్తూ చదువుతున్నాడు ప్రసూన చెపుతున్న మాటల్ని - రాసిన అక్షరాల్ని - పరిచిన జీవితాన్ని - విప్పిన గుండెల పీటముడిని- కాలి బూడిదైన నిప్పురవ్వలాంటి ఆడది- అమృతం పనుకొనల్లో నిల్చుకుని గూడా కాలనాగులా పడగెత్తి బుసకొట్టిన విచిత్ర భయానకమూర్తి.

ఆమె డైరీలో ఒక పుట—

"ఆ రోజు యింటికి వచ్చేసరికి కరుణాకరం కనిపించాడు. అప్పటికి పేరుగూడా తెలియదు. ఎగిరి గెంతుతూ పరుగు తీస్తున్న దాన్ని ఒక్కసారి ఆగి నివ్వెరపోయి అతన్ని చూస్తూ నిలబడి పోయాను. ఆ చింకిరి జుట్టు - పాలబుగ్గలు - ఎవరికేసీ చూడని అమాయకంగా కనిపించే పెద్ద కళ్ళు - నెత్తుటి బుగ్గలమాదిరి పండి నవ్వడం అలవాటు చేసుకోని పెదిమలు - నవ్వితే బావుణ్ణనిపించేది అతన్ని ఎప్పుడు చూసినా - 'మొగుడూ - పెళ్ళాం' ఆట పక్కింటి అయ్యరుగారి మనవడితో ఆడుతూంటే నాన్న కూకలేశాడు. ఇతనితో ఆడితే బావుండుననిపించింది."

"... ... ... ... ..."

"... ... ... ... ..."

మరికొన్ని పేజీలు తిప్పాడు కరుణాకరం. నవ్వుతూ విరగబడి మాటలు చెప్తున్న ప్రసూన కనిపించింది.

"తలంటుకుంటూ పంపు దగ్గర, కంటినిండా కుంకుడు పులుసు పోసుకుని కసరత్తు చేస్తున్న కరుణాకరాన్ని చూస్తుంటే నవ్వాగ లేదు. ఆ రోజు బాత్‌రూంలోకి రెక్కపుచ్చుకు లాక్కెళ్ళి బయట తలుపు తాళం పెట్టాను. పాపం! కిమ్మనలేదు. నాలుగు గంట లయాక అక్కడకు వెళ్ళి స్టూలు వేసుకుని కంతలోంచి చూశా. ఏడుస్తున్నాడు పాపం. తలుపు తీశాను. జాలివేసి 'కోపం వచ్చిందా?' అన్నా.

'ఎందుకలా చేశావ్ ?' అన్నాడు.

'అది మా బాత్‌రూం. మా నాన్న యిల్లు తెలుసా?' అన్నా.

తల వంచుకొని వెళ్ళి వరండాలో బల్లమీద పడుకున్నాడు.

'కోపం వచ్చిందా ?' అన్నాను మళ్ళీ.

'మీకే వచ్చింది.' అన్నాడు కళ్ళు తుడుచుకుంటూ.

'నాకెందుకు కోపం ?' అన్నాను నవ్వుతూ.

'ఇది మీ యిల్లు. ఆ బాత్‌రూం మీది. నేను వెళ్ళకూడదు.'

'ఛా ! ఉత్తినే అన్నానులే, ఈ యిల్లు మనందరిదీ.' అన్నాను.

మామూలు మనిషి అనుకున్నాను. పంతులమ్మ నాకు చెప్తున్న పాఠం అతని చెవిన పడుతుంటే, ఆ పాండిత్యంతో పరీక్ష రాసి ఆంధ్రా మెట్రిక్ యూనివర్శిటీ ఫస్ట్‌గా పాసయ్యాడు. పలక రించినా పలకడు. భయపడతాడు నన్ను చూసి. షికారు రమ్మన్నా బీచ్‌కి. రానన్నాడు. వళ్ళుమండి డ్రైవరు సింగ్‌తో వెళ్ళిపోయా. కోసినా మనిషి వంట్లో అసూయ అన్నది లేదు. 'సింగ్ దగ్గర సిగ

రెట్ల వాసన. గరుకు మనిషి. ఎలుగుబంటో అడవికోతో గుర్తొచ్చేది ఆ సింగ్‌ను చూస్తే. సింగ్‌తో ఎంత చనువుగా వున్నా, కరుణాకరం తెల్లబోయి చూసేవాడేగాని మనిషిలో చైతన్యం కనిపించేది కాదు. ప్రాణంలేని బంగారు ప్రతిమలా నిలబడేవాడు రెప్పలార్పక చూస్తూ. 'ఎందుకలా దయ్యంలా చూస్తావ్ ?' అని తిట్టాను. తలవంచుకు వెళ్ళిపోయాడు. అతనితో పోట్లాడి ఓడిపోయి ఏడవాలనిపించేది. ఎంత రెచ్చగొట్టినా కదలని రాతిబండ. ఆ అమాయకత్వం నటననిపించింది. ఆ అనుమానం బలపడింది పక్కింటి గిరిజ చెప్పిన మాటలతో. కాలేజీలో చదువుతున్న కుర్రాడికి కాస్తో కూస్తో ప్రేమ గొడవ లెందుకుండవ్ ? పైకి చెప్పకపోవచ్చు. ఒకనాడు కరుణాకరంమీద కసి పుట్టింది. మళ్ళీ కుంకుడుకాయ పులుసు బలవంతంగా కళ్ళల్లో పోయాలనిపించింది.

'నీ నాటకాలు నాకు తెలియదనుకున్నావా ?' అన్నాను.

'ఏమిటి ?' అన్నాడు భయంతో వణికిపోతూ.

'రేణుకతో చాలా కథ నడుపుతున్నావట !'

'ఎవరు ?'

'మీ క్లాస్‌మేట్ రేణుక.'

'ఏం చేశాను ?'

'నీకు తెలియదా ? మగపిల్లలు ఆడపిల్లల్ని ఏం చేస్తారో ?'

'నేనేం చేయలేదు.'

'ప్రేమించావట ? వరదల్లా పొంగుతూందిట నీ గుండెల్లోంచి ప్రేమ ?'

'నాకు తెలియదు.'

'మరలా ఎందుకు చేశావ్ ?'

'ఏం చేశాను ?'

'నోట్లు అడిగితే యిచ్చావట ?'

'యిచ్చాను.'

'అందులో ఉత్తరం పెట్టావుకదూ ?'

'లేదు.'

'కాదు. ఆ గిరిజ తిరిగివస్తూ అందులో ఉత్తరం పెట్టిందికదూ ?'

'లేదు.'

'ఆ ఉత్తరం నే చూశాను.'

'నాకు తెలియదు' అంటూ వెళ్ళిపోతున్న కరుణాకరాన్ని ఆపి 'మరి నీ కేంతెలుసు ?' అన్నాను.

'నా కేమీ తెలియదు.' అంటూ కఠినంగా విదిలించుకు వెళ్ళిపోయాడు.

ప్రసూన డైరీలోని మరికొన్ని పేజీలు తిప్పాడు కరుణాకరం.

"కరుణాకరం రోజురోజుకూ మారిపోతున్నాడు. ఆరునెలల్లో బాగా ఎదిగి సాగి సన్నబడ్డాడు. నసగటం మాని స్పష్టంగా మాట్లాడటం నేర్చుకున్నాడు. ఒకసారి గదిలోకి వచ్చాడు ఉదయం తొమ్మిది గంటలకు. ఆలస్యంగా నిద్రలేవడం అలవాటైపోయింది. వళ్ళు విరుచుకొని ఆవలించి లేద్దామనుకుంటుండగా అతని అలికిడైంది. నిద్ర నటించాను. మోకాళ్ళదాకా తొలగిన పరికిణీ సవరించుకునే సమయం లేకపోయింది. చూస్తూ నిలబడ్డాడు ఒక క్షణం. ఏంచేస్తాడో చూద్దామని కదలకుండా పడుకున్నాను. సన్నగా కనులు తెరిచాను. అతని చూపులు ఎక్కడో చెదిరిపోయాయి. కళ్ళల్లో వ్యాకులత కనిపించింది. ప్రశాంతమై సంద్రం మహోద్ధృతమైన ఉప్పెనలో ఒక్కసారి కల్లోలితమైనట్లు కనిపించింది. ఆకస్మికంగా వెళ్ళిపోయాడు వెనక్కు తిరిగి. ఆ నాడు కాలేజీకి వెళ్ళలేదు. అడిగాను కొంచెం సేపయాక. వంట్లో బాగుండలేదన్నాడు వింతగా చూస్తూ.

'నాకు తెలుసు ?' అన్నాను.

'ఏమిటి ?' అన్నాడు కలతగా.

'నిద్రపోతున్న ఆడపిల్లల్ని దొంగచాటుగా చూస్తే ఏమౌతుందో ?'

'పుస్తకం తెరిచి మాట్లాడకుండా అందులో తల దాచుకున్నాడు. వ్యక్తిత్వం రాని మనిషనిపించింది. శరీరంతోపాటు ఎదగని మనస్సు. అతన్ని చూస్తున్నకొద్దీ చిరాకనిపిస్తూంది. పోట్లాడి కాఫీ సాసరు నేలకేసి కొట్టాను."

మరికొన్ని పేజీలు తిరిగాయి——

"రేణుక ఒకసారి మా యింటి కొచ్చింది గిరిజతో కలిసి. అంతకుముందు నే నెప్పుడూ చూడలేదు రేణుకను. కాలేజీలో డాన్సులు చేస్తుందిట. సన్నగా రివటలా వుంది. ఎటుపడితే అటు మెలికలు తిరిగే వళ్ళు - పైన మెరుస్తున్న కళ్ళూను. కాఫీ యిస్తూ చేయి గిల్లి 'మా నిద్రమొహం కాలేజీలో హుషారుగానే వుంటాడట ?' అన్నాను.

'ఇంట్లో నిద్రపోతూంటాడా ?' అంది తెలివిగా.

'కాదులే - నోట్లో వేలుపెట్టినా కరవడం చేతకానట్లు అమాయకత్వం నటిస్తాడు.'

'ఎప్పుడన్నా పెట్టావా నోట్లో వ్రేలు ?' అంది రేణుక.

'లేదింకా' అనేశాను.

ఆ తర్వాత గిరిజతో అందిట 'మీ ప్రసూన చాలా మోటు మనిషే బాబూ' అంటూ. నాకు వళ్ళు మండిపోయింది. నా బాధ తనకేం తెలుస్తుంది ?"

ఏసంత కదిలింది. తలెత్తి "ఏమిటి యింకా పడుకోలేదా ?" అంది.

"లేదు, చదువుకుంటున్నా." అన్నాడు కరుణాకరం.

"ఏమిటి అంత ముంచుకుపోయింది, పడుకోండి."

కరుణాకరానికి నిద్రపట్టక గతంలో బ్రతుకుతున్నాడు. తన జీవితమే తనకు నీడలా కనిపించి మూలిగింది. తను పొందింది ఏమిటి ?

మరొక పేజీ—

"శరీరం మండిపోయే చలి. కోర్కెలను చీల్చివేసే ఆకలి. వ్యామోహం గాలి విసరగా రేగిన ద్వేషాగ్ని. క్లియోపాత్ర కథ గుర్తుకొచ్చింది. చిత్రమైన అమృతంలాంటి హాలాహలం దాచుకున్న బుల్లి పాముల్ని పాపాయిల్లా పెంచుకుని, ముద్దు పెట్టుకుని మద్యం లాటి మత్తులాంటి కైపు కమ్మిన దుప్పటి నిద్రలో కడసారి కన్ను మూసిన సౌందర్యాల దురదృష్టం - ఏడ్చిన ప్రపంచం నైలు నదిలా పొంగిందట."

చివరి పుటలు—

"మనుష్యుల్లో బ్రతకలేని, ఊపిరి పీల్చలేని మనిషి ననిపించింది. ముసలిదాన్నయిపోతాననే భయం - రోగం పీడిస్తుందనే బాధ - బుద్ధుడు జయించాననుకొని భ్రమపడ్డ సృష్టి శక్తులు - మాతృ గర్భంలోని పసిగ్రుడ్డులా, కన్నీటి జలపాతాలు రూపం వెతుక్కొని బయట పడటానికి అన్వేషణ ప్రారంభించకముందే క్లియోపాత్రాలా కన్ను మూయాలనుకున్నాను. చివరిసారి కరుణాకరాన్ని - ఏం చేయాలి ?"

"స్వేచ్ఛగా ఇంద్రియాలను పందెపు గుర్రాల మాదిరి వదిలి విశృంఖలంగా తిరిగి నలిగిపోవడం నేర్చుకున్నాను. ఎంతసేపని చూడను అతని కేసి - అతనికి తెలియకుండా? ఎప్పుడు ఏ వెచ్చదనం గుండెల్ని మలినం చేసినా కరుణాకరం గుర్తుకు వచ్చేవాడు. కసిగట్టి పగబట్టి ఆ జ్ఞాపకాన్ని జయించటానికి పోరాటం సాగిస్తున్నాను ఓడిపోతానని తెలిసీ -"

ప్రసూన డైరీలో చివరి వాక్యం—

"ఓడిపోయాను."

# ఇరవై తొమ్మిది

మర్నాడు కరుణాకరం నిద్ర లేచేసరికి బాగా ప్రొద్దుపోయింది. కళ్ళు తెరిచి చూసేసరికి ఎదురుగుండా ప్రసూన డైరీ చదువుతున్న వసంత కనిపించింది. కోపంవచ్చి "వసంతా!" అని పిలిచాడు కఠినంగా.

వసంత రవ్వంత కంపించి "అంత ప్రేమించిందన్నమాట మిమ్మల్ని ప్రసూన పాపం" అంది.

"ఒకళ్ళ డైరీలు చదవడం చాలా నీచమైనపని వసంతా."

"మీరెలా చదివారు?"

"చదవమని పంపించింది గనక చదివాను."

"అంత ఆత్మీయులు పాపం! కాని తగలబడుతున్న సంసారంలో యింకా స్తే పెట్రోలు జల్లాలని పంపించిందన్నమాట యిల్లాలు."

"వసంతా! పిచ్చిగా మాట్లాడకు. ప్రసూన యిప్పుడు లేదు."

"ఎవరితో లేచిపోయిం దీ సారి?"

"ఛీ! నువ్వు మనిషివికాదు. చచ్చిపోయింది."

వసంతకు మరొక ఆశ్చర్యం. కాని కొంచెంసేపాగి "చావుతో చేసిన పాపాలన్నీ తీరిపోతాయా?" అంది తీక్షణంగా.

కరుణాకరం ప్రాణం విసిగి "నన్నిప్పుడేం చేయమంటావ్- ?" అన్నాడు.

"మీరింక చేయగలిగిందేముంది?"

"అందుకని వేయించాడా మీ నాన్న నాకు ఉద్యోగం ఆ రైస్ మిల్లులో."

"మీ చదువుకు అంతకంటె గవర్నర్ ఉద్యోగం దొరుకుతుం దనుకున్నారా? ఆకలితో మాడి చేజేతులా ప్రాణం తీసు కుంటామా?"

"ఈ ఉద్యోగం నే చెయ్యను."

"ఏం చేస్తారు?"

"ముత్తెం పొలం కొన్నాట్ట. నాగార్జునసాగరం క్రింద వ్యవ సాయం చేసుకు బ్రతకాలనివుంది."

"యిక్కడా చేశారుగా వ్యవసాయం ఇన్నాళ్ళూ!"

బాణంలా గ్రుచ్చుకుంది ఆ మాట. మళ్ళీ అంది వసంత "అసలీ ఉద్యోగమన్నా మా నాన్న ముఖంచూసి యిచ్చారు. మీరు ఎంత ద్వేషించినా పిల్లనిచ్చాడు గనుక కడుపుకోత తప్పకపోయింది."

భార్యాభర్తల మధ్య చాలా తర్జన భర్జన జరిగింది. "వసంతా! చివరిసారి చెప్తున్నాను. ఈ వూళ్ళో మాత్రం నే వుండను. నా నిశ్చయం మారదు. నువ్వూ బయలుదేరడం మంచిది."

"ఈ వయస్సులో అమ్మనూ నాన్ననూ వదిలి నే రాగలనను కుంటున్నారా?"

"నీ యిష్టం."

"అంతేగాని మీ నిర్ణయం మారదంటారు?"

"మారదు."

"కానీండి."

"రేపు సోమవారం ప్రయాణం."

"మంచిది."

సోమవారం వచ్చింది. జంక్షన్‌కు వెళ్ళి బస్సెక్కాలి. ఒంటి గంట నుంచీ సర్దుడు ప్రారంభించాడు కరుణాకరం. సామాను

ఎక్కువగా వెంటతీసుకు వెళ్ళాలనిపించలేదు. పంటంతా పాడైన రైతుకు పరికమీద ఏముంటుంది వ్యామోహం? సూట్ కేస్‌లో నాయుడుగారు సపరివారంగా తీయించుకున్న గ్రూప్ ఫోటో కనిపించింది. నాయుడుగారు! నిన్నగాక మొన్న పోయినట్లుంది. ఎంత తొందరగా తిరుగుతుంది కాలచక్రం! సింగ్-ఆ నల్ల చారల టీషర్టుతో, ఆకురాయిలా గ్రుచ్చుకునే గరికల్లాంటి తలకట్టుతో ఎలా వున్నాడో! ఎక్కడ వున్నాడో యిప్పుడు? మిలటరీలోకి పోయాడన్నా రెవరో! చైనా యుద్ధం చూసుంటాడు. ప్రసూన! శైశవం యింకా విప్పుకోని పాలబుగ్గల పసితనం గుర్తుకు వచ్చింది. తన ముఖంలో గూడా యింకా పసితనం విడిపోలేదు -

పసితనం! కనిపించకుండా కరిగిపోయిన శైశవ మాధుర్యం!. పాపాలకూ తాపాలకూ కోపాలకూ శాపాలకూ దూరంగావుండే పూల మొగ్గలాటి పసిడి హృదయం స్పందిస్తుంది పసిపాపలో. మాలిన్యంలేని ముత్యాల్లాంటి కన్నీళ్ళు చెక్కిళ్ళపై కారగా, కాలుష్యంలేని చిరునవ్వు పెదవులపై కరగగా, ద్వేషంలేక కళ్ళల్లో మెరిసే చిరు కోపంతో మనసారా నవ్వుతూ, కడుపారా ఏడుస్తూ దివ్యత్వంలోని వెలుగుకు మెరుగునిచ్చే శక్తి పసితనం - అమ్మ గుర్తుకొచ్చింది. చిత్రం! ఆమె మూర్తి గుర్తుకు రాలేదు. ఏ నాడో పంచభూతాల్లో లీనమైపోయిన మాతృమూర్తి - కాని, ఏదో అనుభవం - చిన్ననాటిది-మనస్సులో మెదిలింది. రక్తాన్ని పంచి, మాంసకండరాలను చీల్చి, తనను వెలుగులోకి తెచ్చిన తల్లి-సగం శరీరం విడిపోయిందనే అర్థంకాని ఉద్వేగంలో గుండెలకు హత్తుకొని, బిడ్డ భవిష్యత్తును ఊహించుకుంటూ, ఆ తలపుల మలుపుల కావల కనిపించని తన భావిజీవితాన్ని పోల్చుకుంటూ, అరక్షణం ఆదమరచి కన్నుమూసి ఊహాల కలల అలల్లో ఆమె నవ్విన చిరునవ్వు తనకు గుర్తులేదు. ఆ క్షణాన తాను ఏ విధంగా కళవళ పడిందీ తనకు స్ఫురణకు రాదు.

కెరటానికి చిరుకెరటం కదిలినట్లు, బింబాన్ని చూసి ప్రతిబింబం నవ్వినట్లు, ధ్వనికి ప్రతిధ్వని మారు పలికినట్లు, తా నెలా కేరింతలు కొట్టిందీ, ఎంత నిండుగా బ్రతికిందీ, ఎంత నిర్మలంగా గాలి పీల్చిందీ తా నెలా పోల్చుకోగలడు? స్వర్గలోకం జారి, అమృతం కురిసి, దివ్యత్వం రాలి, ఆ మాతృమూర్తి గాఢ పరిష్వంగంలో, కమ్మని వెచ్చదనంలో తన కెలా ఆయువును పోసిందో ఎలా గుర్తుపట్టగలడు? కాని అమ్మ కలిసిపోయింది కాలంలో. తనను ఒంటరివాణ్ణి చేసి - కాలంతో పాటు తరలిపోయింది పసితనం - గుండెలు విచ్చుకున్న శైశవం - కుబుసం విడిచిన పాములా పడగ విప్పింది. తెరలు తొలగి, రెక్కలు మొలచి ఆద్యంతాలు లేని విశ్వంలో అనాధలా నిలిచి ఎన్నెన్ని వింతలు చూశాడు వళ్ళంతా కళ్ళుచేసుకొని? చీకటిలాటి వెలుగులో ఎన్నిరకాల నీడలు? సగంసగం పడుపులు- పెదవులు విప్పని నవ్వులు- ఆదరణల అసూయలు - అహంకారాల ఆత్మీయతలు - మురికినీటి వంటి కన్నీళ్ళు - స్వార్థాల త్యాగాలు - గుసగుసలు - దిగేదాకా తెలియని ఊబిగల గోతులు-కాలేదాకా తెలియని బూడిద కప్పుకున్న నిప్పు రవ్వలు! ఏం పోగొట్టుకున్నాడు తను? ఏం పొందాడు?

ఒంటెద్దుబండి వచ్చింది - సామాను సర్దుతూ "వసంతమ్మగారిని పండగెళ్ళాక తీసుకెళ్ళాంలెండి" అన్నాడు ముత్తెం. వరదాచార్యులవారు జామచెట్టు క్రింద నులకమంచం మీద పద్మాసనం వేసుకు కూర్చొని తిట్టిపోస్తున్నారు ప్రపంచంమీద పెట్టి తనను. "తొందరపడుతున్నావేమో ఆలోచించు నాయనా!" అంది చెల్లాయమ్మగారు.

కరుణాకరం మాట్లాడలేదు.

"మనం ఏం చెప్పినా ఆయనకు విషంగా వుందమ్మా. మన పొడ గూడా గిట్టటంలేదు ఏ పాపం చేశామో! అంత యిష్టం లేనప్పుడు ఎవరినీ కట్టి ఆపుచేయలేమమ్మా!" అంది వసంత.

"వెళ్తున్నానండీ !" అన్నాడు వరదాచార్యులవారి దగ్గరకెళ్ళి కరుణాకరం.

"సగం చచ్చిన పాముని. నడుం విరిగిందని నీకూ తెలుసు. నాతో చెప్పాల్సిన అవసరముందంటావా?" అన్నారు వరదాచార్యుల వారు.

బండి కదిలింది—

చెరువుగట్టు మలుపుదగ్గర వెనక్కు తిరిగి చూశాడు కరుణాకరం. మసకగా కనిపించింది 'మామ' గారిల్లు. ఆ మసక తెరల్లో లీలగా కనిపించింది వసంత కట్టుకున్న ఆకుపచ్చని చీర. ఊరు దాటి పోయింది బరువులున్నా బాధ లెరుగని ఒంటెద్దుబండి.

*                *                *                *

కరుణాకరం కనుచూపుమేర దాటిపోయాక, ఒక్కసారిగా మంచంమీద మొదలు నరికిన మంచిగంధపు చెట్టులా విరిగిపడింది వసంత.

కాని—

అంతలో - లేచింది

ఆమె గుండెల్లో పొగలురేపిన ఆభిజాత్యం ఆవిరై అదృశ్యమై పోయింది చేతికందిన బట్టలు, కనిపించిన పెట్టెలో సర్దుకుంటున్న వసంతను చూసి వరదాచార్యులుగారు "ఎక్కడికమ్మా ?" అన్నారు పగిలిన గొంతుతో.

"బండి పిలిపించండి నాన్నా !" అంటూ వసంత తల్లితో చెప్పటానికి వెళ్ళింది.

కరుణాకరం ఎక్కవలసిన రైలుబండి ఆనాడు అరగంట లేటు!. కాకపోతే వసంత అతన్ని కలుసుకోగలిగేది కాదేమో!!

*                *                *                *

మనిషీ !

ఎంత చిత్రమైంది నీ మనస్సు ?

నిన్ను నీవే ఆరాధిస్తావు.
దైవాన్ని శంకిస్తావు - దగాచేస్తావు !
నింగినంటే సౌధాలు నిర్మించుకుంటావు.
ఊహాలరెక్కలు కట్టుకొని ఎగిరిపోతావు -
ఎప్పుడూ వాడని పువ్వు కావాలంటావు -
ఎంతసేపైనా సంజవెలుగు నిలిచే వుండాలంటావు -
ఆవిరి కారాదని యౌవ్వనాన్ని కాల్చి చలిమంటలు వేసుకుంటావు -
ఆరని ఆకలిని అందాలు త్రాగి చల్లార్చుకున్నాననుకుంటావు-
కాగి ఎర్రబడిన బుగ్గలపై నీ నీడను చూసుకోవాలంటావు -
కాదంటావా నీ జీవితం ఒక స్వప్నం ?
నిలకడలేని నీరు గుర్తుకు రాదా నీ మనస్సును తలుచుకుంటే?
అహంగాక ఏముంది మనిషీ ఆలోచించు నీలో ?
కావలసిన గమ్యాన్ని పరిగెత్తి చేరినా -
కాసేపట్లో విసిగిపోతావు !
కామాన్ని అలంకరించి ప్రేమంటావు !
అహాన్ని నాటి వ్యవసాయం చేసి పండిస్తావు స్వార్థాన్ని !
నవ్వుతావు అరక్షణం -
ఏడుస్తావు మరొక క్షణం -
నీ నవ్వుకూ ఏడుపుకూ శిఖరం ఏమిటి చెప్పవ్ ?
కళ్ళనుంచి రాలి పతనమయ్యే నీళ్ళుకాదూ ?
నీ మాటలకూ చేతలకూ ఎన్ని వున్నాయి అర్థాలు ?
కాకపోతే -
ఎందుకు ప్రేమిస్తావు ?
ఆ ప్రేమించిన హృదయాన్ని తడిగుడ్డలా పిండి వత్తులుచేసి ఎందుకుచేస్తావు గాయం ?